ఉ తుంబురుండు శా, గౌళవరాళి నాటలను గాయవరూఢికి నాటి చూపినన్ ... శ్రీరం మా 4 153

ఉ. భైరవినాటతోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా, గౌరిబిళావహురి లలిత కన్నడ గౌళముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరిబేగడా, యారభిరామకల్లి మొదలై తగు రాగము లింపు మీఱఁగాన్. చెన్నబ 2. 238.

సీ .. సలలి, త్రిబిలహారి కురంజి ధన్యాసి పూర్వ గౌళవరాళినాట భల్లాతకి. హంస 5 123

2 శోకము, ఏడుపు.

క అడుగక మెల్లిగ వరాళి కారంభించెన్ పార్వ 3. 74

వరాళి (సి) నం వి ఇ పుం ముదుగుబట్ట

వరాసనము నం వి అ న 1 శ్రేష్ఠమైన పీఠము, కుర్చీ మొ సింహాసనము 2 ముఖ్యాసనము, గౌర వాసనము 3 జపాపుష్పము

వరాననుఁడు నం వి. అ పుం 1 ద్వారపాలకుఁడు 2. విటుఁడు, ప్రియుఁడు

వరాహకందము నం వి అ పుం ఒక జాతి యాహార యోగ్యమైన దుంప

వరాహకర్ణము నం వి అ పుం. బాణ విశేషము, ఒక విధమగు బాణము.

వరాహకల్పము నం వి. అ పుం విష్ణువు వరాహావ తార మెత్తిన కాలము

వరాహకాంత నం వి అ స్త్రీ ఒకజాతి యాహార యోగ్యమగు పెండలపు దుంప

వరాహకూర్చము నం వి అ పుం న. (వా వరా కట్ట) అడవిపంది వెంట్రుకలతో కట్టబడి ఆభరణ ములను తోముటకు వాడుకొనుకుంచె (బ్రౌ ని)

వరాహక్రాంత నం వి అ స్త్రీ సోఁకుడు మునుఁగు చెట్టు, అత్తపత్తిమొక్క (వృ వి)

వరాహద్వాదశి నం వి ఈ స్త్రీ విష్ణుప్రీతికై మహో త్సవము చేయఁబడెడు మాఘ శుక్ల ద్వాదశి

వరాహమిహిరుఁడు నం వి అ పుం. బృహత్సం హితా గ్రంథకర్తయగు ప్రసిద్ధజ్యోతి శ్శాస్త్రవేత్త విక్రమార్కువి సభలో నుండిన నవరత్నములలో నొకఁడు

వరాహము నం వి అ 1 పంది, అడవిపంది. 2 పొట్టేలు, గొఱ్ఱపోతు 3 ఎద్దు 4 మేఘము 5 మొసలి 6 పంది యాకారముగా నేర్పఱుపఁ బడిన సేనా వ్యూహము 7 పరిమాణ భేదము, ఒక విధమైన కొలత (మే ని) 8. పదునెనిమిది పురాణములలో నొకటి వరాహపురాణము 9 పెండలమువంటి యాహారయోగ్యమైన యొక జాతిదుంప 10 ద్వీప విశేషము పదునెనిమిది ద్వీప ములలో నొకటి

వరాహుఁడు నం వి అ పుం 1 విష్ణువు, వరాహావ తారుఁడు

2 వరాహమిహిరుఁడు.

వరి వి 1 శాలిసస్యము

సీ చామల కెందు నీ సరసత గలదె తొయ్యలి యన వరియింపు నిలిచి చూడు రసి 1 58

2 శాలి ధాన్యము.

సీ పీడెంపు బలుకెంపు విరిసి వెన్నెల గాయ వరి గింజ నొకటఁ బల్వరుసఁ దోమ ... ఆము 1 60.

జ. వరి మడి, వరి వంటకము

వరి నం వి. ఈ స్త్రీ 1 సూర్యుని భార్యయగు ఛాయాదేవి 2 శాఖా వరి (వృ వి)

వరి(యి)ంచు నం స. క్రి 1 పరిగ్రహించు

ఉ. వి, ఖ్యాతుఁ బురోహితప్రవరుఁగా వరి యించిరి భక్తితో భార ఆది 7 157

గీ అసుర కింకర కోటిచే నతులకవశ, శిబిక లందుఁ దెప్పించిన విబుధ కన్య, లందఱను వృష్ణివృద్ధుల యనుమతమున, దాను వరి యించి నాఁడయ్యెఁ దత్క్షణంబ హరి ఉ 4 218

2 అడుగు, వాంఛించు, ప్రార్థించు

ఉ నావిని వటునాథుడు దనవశాధుఁజూచి మెచ్చితిన్ సుకృత వర్ధన- వేడు వరం బొసంగె దన్, వావుడతండు. నిన్నువరింప నద్దియున్ జాహ్నవి 2 34

వరిగ వి (నం. వరకః) 1 సస్యవిశేషము

వ. వరిగె వెరిగె కాశీ 3 23

ద్వి. వరిగలు కొఱ్ఱలు పాలు నేతులును, విరివిగాఁ దెప్పించి వివిధరూపముల ... ప్రభు, 4. 162

సీ గోధుమల్ వరిగలు కొఱ్ఱలు నెయ్యిని గొని.
రెట్టమతము 3 42

వరిబీజము వి వృషణవ్యాధివిశేషము, ఒక ప్రక్క వాచిన వృషణము. (శ ర., బ్రౌ )

వరిమడి వి (వరి+మడి) కేదారము, వరిపండు భూభాగము

సీ వాహినీ నాథుతో వరిమళ్ళ కాలువ వ్యాళి నాయకునితో వానకట్టె చెన్నబ 5 71

వ తిరుమలం మంగారి చెర్వుక్రింద వరిమడి
కా శా 702.

వరిమము నం వి న్. పుం ప్రాశస్త్యము, శ్రేష్ఠత

వరివంటకము వి (వరి+వంటకము) శాల్యన్నము

ఉ పుట్టుగు దెల్పుకొన్న గతిఁబూని సఖుండవని చూడ వచ్చినన్, వట్టి ప్రియంబులాడి వరి వంటక మించుక పెట్టెఁగాని నా, యొట్టనలేమిఁ జూచి తడి యొత్తుల దోవతియైన యీఁడయే, పట్టునఁ బేదవారలకు బాంధవు లెక్కడివారు చూడఁగన్ పద్మ 10 246

వరివసి(స్త్రి)తుఁడు నం విశ (అ ఆ అ) పూజింప బడినవాఁడు, గౌరవింపఁబడినవాఁడు

వరివస్య నం వి ఆ స్త్రీ 1 పూజ, అర్చన 2 సేవ, ఉపచారము

వరిష్ఠము నం విశ (అ ఆ అ) 1 శ్రేష్ఠమైనది, మిక్కిలి ప్రశస్తమైనది 2 మిక్కిలి పెద్దది. 3 మిక్కిలి విశాలమైనది 4 మిక్కిలి బరువైనది. 5 అతి హీనమైనది, అతిదుష్టము

వి అ పుం 1 ఒకజాతి కముజు 2 నారింజ చెట్టు. (వృ వి ) 3 తిత్తిరి పక్షి, తీతువు,

న 1 రాగి, మిరియము

వరీయము నం విశ (న్. యసీ న్ ) 1 ఒక దాని కంటె మేలైనది. ప్రశస్తతరము 2 మిక్కిలి మంచిది 3 ఒక దానికంటె పెద్దది, ఉరుతరము, విశాల తరమైనది

వి న్ పుం (జ్యోతి) విష్కంభాది 27 యోగము లలో నొకటి

వరీవర్దము—బలీవర్దము నం వి అ పుం వృషభము, ఎద్దు

వరుఁడు నం వి అ పుం 1. పెండ్లికుమారుఁడు. 2. భర్త, పెనిమిటి 3. తన్నుఁ బెండ్లాడుమని కన్నెను గోరువాఁడు ప్రార్థయిత 4. అల్లుఁడు. 5 విషయాసక్తుఁడు. భోగలంపటుఁడు 6 విటుఁడు. 7 జారుఁడు, ఉపపతి 8 ప్రభువు, ఱేఁడు.

ద్వి వరుఁడు లోపల నమ్మవారితో వంతి, పురమున వేకాంతమున నున్నవాఁడు ద్వి పరమ. 3 189 పా 5 పం,

ద్వి ఇంకొంద నీ కార్య మెఱిఁగింపకున్న, వరు నిచే వడి నాజ్ఞ వచ్చుఁబొమ్మనుచు ద్వి పరమ 3 180 పా 18 పం

వరుగు వి 1. తఱిగి యెండవేసిన కాయదినుసు, ఎండిన మాంసపుముక్క మొ

గీ మనసు శుష్కశలాటు నామంబు పట్టు, వరు గనంగను ఆం. భా 2 39

గీ చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము, దానఁ గీడెంత పుట్టినఁ దగిలెనాకు, ననుభవింపక పోవునే యక్కటకట, వరుగులో దాఁగరయు నెండవలసివట్టు ఉ హరి 4 54

గీ శ్వాపదంబుల పదహతి ప్రవస్రవలచు, వరుగు దఱచగు ముకుత్రోవ పరిగి యెదుట . .. ఆము. 6 17.

(ఇట నొకజాతి గ్రద్దయర్థమని శ. ర )

2 చమురులో వేయించి పొగపిన యెండిన కాయ ముక్క.

చ . నాలుగేన్, పొగపిన కూరలున్ వడియ ముల్ వరుగుల్ పెరుఁగున్ ఘృతప్లుతిన్ . . ఆము 1 80.

సీ వగవగకూరలు వరుగు లప్పడములు నొలుఁపు బప్పును మించుటోగిరములు ఉ రా. 6 122

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయ శ్రేష్ఠుఁ డా, హరి కర్పించుటఁ బావనంబులగు శాలన్నంబులున్ నేతులున్, వరుగుల్ చేరులు పప్పులప్పడములున్ దాలింపులుం బాపముల్ , పరమాన్నంబులుఁబెట్టు నెట్టన భుజింపం దల్లికిం దండ్రికిన్ పాండు 2 24

విశ పారహీనముగునది, బలహీనముగునది.

గీ. నవనక్రౌతంబులడఁగిన నవసినవసి, వానవాదికు వర్ష్యులు వరుగులై జగల్లశామూల కందంబు గమలనాభుఁడున్నకడ కేగి యాదశ విన్నవింప వరాహ, 7. 52,

ఆ వరుగుఁ జేఁప.

**వరుగుఁజేఁప** వి (వరుగు+చేఁప) శుష్క మత్స్యము; ఎండుచేఁప

సీ. అలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప.

సీ. అలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప నా వరుగుఁ జేఁపన . భా 1 160.

**వరుజు** వి మడియొక్క గనిమ, మడికిఁజుట్టును నేర్పఱచిన చిన్నకట్ట

క వరుజు బడి రొంపిఁద్రొక్కన్, జరణంబులఁ జెనఁగి పసిఁడి చాయకడుపులన్, బోరి నీరు కట్టె లమరెను, బిరుదులు పోలికులు దున్నఁ బెట్టరొయనఁగన్ ఆము 4 125

**వరుటు** అ క్రి కృశించు, చిక్కిపోవు.

సీ. అశ్వగోమహిషరూప్య సువర్ణ వస్త్రంబులెన్ని హెచ్చించిన నేమిఫలము, సంతతంబును గృచ్ఛ్ర చాంద్రాయణాదుల వరుటుచునుంట యెవ్వరికి మెచ్చు భీమ 4 32

సీ అరరాగ్ని నెల్లను జల్లార్చి మిక్కిలి వరిటినాఁడు మహోపవాసములను కుచేల 1. 27

సీ మిగుల వరిటిన కొకికి మేనివాఁడు, మన కుచేలుఁడు కుచేల 3 11

**వరుడము** నం వి అ పుం నీచ జాతి భేదము, నిమ్న జాతులలో నొక తెగ.

**వరుణదైవతము** నం వి అ న శతభిష న్నక్షత్రము

**వరుణపాశము** నం వి అ పుం 1 మత్స్య భేదము, సొఱచేఁప 2 వరుణుని చేతనుండెడి పాశము

**వరుణము** నం వి అ పుం 1 సముద్రము 2 ఖగోళము 3 వరుణవృక్షము, ఉలిమిరి 4 నీరు (శే. ని) 5 అష్టాదశ ద్వీపములలో నొకటి 6 పగటి పదునైదు భాగములలోఁ బదున్నాలవ భాగము పేరు

**వరుణాత్మజ** నం వి ఆ స్త్రీ వారుణి, మద్యము (సముద్రమునఁ బుట్టినది)

**వరుణాని** నం వి ఈ స్త్రీ 1 వరుణుని భార్య

**వరుణాలయము** నం వి అ పుం సముద్రము ఇక్లే వరుణావాసము.

**వరుణుఁడు** నం. వి అ పుం 1. మిత్రునితోఁ గలసి యుండు రాత్ర్యభిమానియైన అదిత్యుఁడు 2 పశ్చిమదిగధిపతియు సముద్రాధిపతి యునగు దిక్పాలకుడు. 3 సూర్యుఁడు

**వరుత్రము** నం వి అ న ఉత్తరీయము, పైబట్ట,

**వరుమానము** వి రాఁబడి, ఆదాయము (శ ర , వా)

**వరువట్టు** వి (వట్టు+వట్టు) అధికముగాఁ దడియారుట

సీ వలవంత వరువట్టువట్టిన నాలుక తలముద్దు మాటల మెలఁగియాడ కు సం 5 684

క విరులుఁ జిగుళ్లుమ జొరువుగ, సిరిగంధ పుటన లొకింత చిలచిలమనివే,గిరమ వరువట్లు గొనఁ గడుఁ, బొరలెడు తరలాక్షి తాపముం గని కలఁకన్ కళా 6 255.

ద్వి. తటితటి తనువులఁ దాపంబు దోఁప, వరలుచు నధరముల్ వరువట్టు పట్ట పండితా మహిమా 280 పా.

ద్వి వావిరి నూతులు వరువట్లు పట్టె .. బస. పు . 7 889

**వరువరువులు** వి 1 బ (వరువులు + వరువులు) మిక్కిలి వరుగులు, అధికముగ ఎండినవి

క ఎరవలి వట్టిన కొండల, కురువడిఁ జనికాకి మూఁక లొక్కటఁ గొఱవుల్, వరువరువులైన పిడకలు, తఱిఁ గైకొని పోయి ధీరతన్ దరి కొల్పన్ వేం పంచ 3 297

**వరు(ఱు)వాత** వి (నం ప్రభాతః) ప్రాతః కాలము

సీ కంపించి శేషునికడ కేగియో భోగికుల నాథ యీ యద్రికూట మొకటి, వైనవే యీ మహా వాతూల వరువాత వరువాత నినుఁ బ్రతివాన రంబుఁ, దలఁచి యేము భుజించెదము గాని... రామా 8 82

క వరువాతలేచి యీ బుధ, వరువరవుడుఁ బోల్పఁ దగిన వారివలన శ్రీ, వరుఁ గీర్తింపుచు వాకిలి, వరుసన్ ముంగిళ్ళు దుడిచి వారని భక్తిన్ ఘటికాచల 2 20

క. వఱువాత లేచి నీతగు, కొఱగాములు చక్కఁ ద్రోచికొనఁ బోయెదినం, బఱుగు వడిపోయె నీ పను, లఱజాతివి నిన్ను నేమి యవనేర్తు నుశా. హరి పూ 5 239.

"కొట్టు" అరువు వరువు పుట్టి 1 ట్టికి చి 6 ద. శా 4 1884.

జ . వరువరువులు

వరుస వి 1 క్రమము

గీ. మణిమయమ్ములుఁ గలధౌత మయములును సువర్ణ మయములు నాదిగా వలయునట్టి, యడ్డ పొళులు గలవు నా కఖిమతముగ, వానిఁగొని పోయిచూపుదు వరుసతోడ భార విరా 1 72

చ వరుసను బ్రాహ్మణోత్తముఁడు వర్ణచతుష్టయ జాతికన్యలం, బరిణయమౌట ధర్మమని పల్కుదు రాది మునీంద్ర ముఖ్యులు . విక్ర 1 155

గీ విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలము లకుఁ బాశపాణి వేల్పులకు నింద్రుఁ, డసుర కోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృ సమూ హంబునకు నధిపతులు వరుస హరి పూ 1 92

2 పంక్తి.

ఆ వార లట్లు సేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడి పళ్లెరములు పన్నికొనఁగ హర 6. 116

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగ, గరములు క న్నావి యవుడు కఱచినసుమువా, తెరమీఁదఁ గాన వగు వలు, వరుసయనన్ వనలు పల్లవము పై మొనసెన్ పారి 3 48, ఆము 1 60.

క పలువరుస చక్కఁదనమే, పలువరుస న్మెచ్చు వచ్చు బాలామణికిన్

3 వంతు

సీ ఇందుల శాఁపుల వందఱఁ దొల్లి యిల్వరుస మ్రింగుచు మన్న . భార ఆది 6 264

క తనకు నెలవరుస వచ్చిన, నినరథవహనమున కాతఁడేఁగినవాఁడు భార శాం. 6 566

సీ వరుసలు వెట్టి దువాళింప సుడివడి వెలిమావు మోపడు వెనుక కాలు . వరాహ 10 15

క తరుణీశతకము బింబా,ధరమాధుర్యంబు లాను తటిఁ దమలోనన్, బరమేష్ఠినాల్గు మోములు వరుసలు వెట్టుకొనుఁ జెప్పవశమే కూర్మిన్ కాశ. 2 19

4 పరంపర

క నిరతంబు బ్రహ్మమొదలుగ వరుసన యొకతెళక యిట్లు ... భార. ఆది. 4 221.

సీ. వరుస వేనుంగులు గురిసిన దానధారావళిదగు కలయంపిగాఁగ భార విరా 74

5 బంధుత్వక్రమము

క అరుదెంచి పలికె నిట్లని, గురువుల సతివెట్టు వేసి కొంటివి నీకున్, వరుసా కటకటదోషా,కర యీ పాతకము సేయఁగాఁ గాదు సుమీ వరాహ. 7 25

చ మిమ్మువంటి పెద్దలె తగు వావియున్వ రుస వర్పిచరించిన నమ్మచెల్లగా ఉ రా 4 205.

6 పర్యాయము, తడవ

క పదియగు వరుస వినిన య,భ్యుదయఫలమునకు గొలంది యూహించి నిజం, బిదియన హరి. ఉ 1౧ 309

7. సామ్యము, సాటి, తుల్యత

సీ . గోవు సద్విప్రునకు నీగిత ద్రోమనికర సంఖ్య, ఆ వరుస నాకలోకవాసంబు గావించు . భార అను 5 191

చ తనరు నిజాన్వవాయగురుధర్మదవృత్తి నరుంధతీ సువా,సిని వరుసమ్మతుల్ బుధ విశిష్టసభం గను నట్టి సద్గుణై,కనిధినిజాగ్రభార రాఘవ 1 43

గీ వాఁడు నిషధేశ్వరుండు మా వరుసవాఁడు, కలి మహారాజ మన్నింతుగాక వాని .నైష 7.105

8. నియమము

గీ వర్ణములు నాశ్రమంబులు వరుసఁ దప్పె, వేద ములు నాగమంబులు విన్నఁలోయె కాశీ 6 86

9 (రాగముల) వరుస, పాటలోని స్వరముల భేదము

సీ తాన వరుసలు పెంచు గంధర్వగాయ,కులను జతగూడు వట్టువకులము వారి దశా. 1 264

10 విధము, రీతి.

క. నరనారీ సంబంధము, వరుసగదా పురుషునకుమ ప్రకృతికి నన్యో,న్యరమణము... భార శాం. 6 25

సీ .. యవ్వసుదేవుఁ డుండెడు విధమును నర యుచు నయ్యింతియంటకుండ, వాడెడు వరుసలు నాథానసమయంబు మొదలుగా గర్భంబు మోచు నెలలు, నెఱిఁగి హరి. పూ 5 94

౫ మల్లురుచేయు సాధన విశేషము

వ .. సురటిపల్లటి మొదలగు లాగు వరుసలును శాలసంగడపు వరుసలును పింటాిఁపు మొదల గుగాతాము వరుసలును మల్లుపు 3 69

విశ మంచిది, యుక్తము

క అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనశేషణ యిట్లు వలుక వరుసయె వ్రతులై, దినములు గడపెడు విప్రుల, జనునె కామింపమది విచారము వలదే మనుచ 2 52

జ వ్రుసగొను, వరుస మొగ్గరము

**వరుసగొను** అ క్రి (వరుస+కొను) బారుదీరు, పంక్తిగా నేర్పడు

వ. . . నిండారఁ బూఁచిన కనక చంపక శాఖల వైఖరిని వరుసగొని బిలుసులు మెఱుపు నెఱ పఁగొడిగొని వలుగడల తెగక నిగిడించు బహు విధ కౌతుకాగ్ని యంత్రచిత్రంబులకు ఐక్ష్మ వి 5 74

**వరుసము** వి (సం వర్షః) సంవత్సరము

ద్వి వేయేండ్లు ధరియించి వెనదానిఁ బుచ్చి, నా యతి నా కిచ్చెనట నేను వేయు, వరుసముల్ ధరియించి వారకయున్న తఱినీవు పుత్ర సంతా నేచ్ఛ వన్నుఁగుఱిచి వేఁడితి గానఁ గోర్కి దైవాఱ రం రా ఉ 92 పొ 10 పం

**వరుస మొగ్గరము** వి (√ వరుస) దండవ్యూహము, పంక్తులుగా నేర్పడిన సైన్యము (శ ర)

**వరూథము** సం వి అ పుం రథమును గాపాడుటకై వ్యాఘ్ర చర్మాదులతో నిర్మించిన రథముపైకప్పు, రథగుప్తి 2 కోకిల 3 సమయము, వేళ

న 1 కవచము 2 డాలు, కేడెము. 3 సమూహము, గుంపు 4 ఇల్లు, గృహము

**వరూథి** సం విశ. (న్ ని న్) 1 కవచధారి, కవచము గలవాఁడు 2 కప్పుగలది (రథాది) 3. సంరక్షిం చునది, కాచునది 4 సేవచేఁ బరివేష్టింపఁ బడినది 5 రథము మీఁదనున్న వాఁడు, రథికుఁడు.

వి న్ పుం 1 సారథి 2 అపాయమునుండి రక్షించు పురుషుఁడు

**వరూథిని** సం వి ఈ స్త్రీ, సేన

**వరే** అవ్య "కదా" అనునర్థము నిచ్చును, ప్రశ్నార్థకము

క మీకింత వందికంద ళ,యాకులతం బొంది నిర్గతైశ్వరు లరై, రాకకుఁ గారణమేమిత్రి,లోకాహిత దనుజ తతికి లోబడరు వరే కు సం 4 365

**వరేణ్యము** సం విశ (అ ఆ అ) 1 కోరఁదగినది. అభిలషింపఁదగినది 2 శ్రేష్ఠమైనది, ప్రశస్తమైనది 3 ప్రధానమైనది, ముఖ్యమైనది,

వి ఆ న కుంకుమ పువ్వు

**వరేణ్యుఁడు** సం విశ (అ ఆ అ) ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు (శ ర, ప్రౌ)

**వరోటము** సం వి అ పుం మరువము (వ్య. వి)

న మరువక పుష్పము, మారువపు పువ్వు

**వరోరువు** సం వి (ఉ. ఊ) స్త్రీ, ప్రశస్తమైన తొడలుగలది సుందరాంగన, అందకత్తె

**వరోలము** సం వి అ పుం ఒక జాతి కందురీఁగ.

**వర్కరకర్కరము** సం వి అ పుం తోలు, వాఱు, తోలుత్రాడు మేకపిల్లనుగాని గొఱ్ఱెపిల్లనుగాని కట్టెడు తోలుత్రాడు.

**వర్కరము** సం వి అ పుం. 1 పశు శాబకము (గొఱ్ఱెపిల్ల, మేఁకపిల్ల, జింకపిల్ల, లేఁగదూడ మొ) 2 మేఁక 3 వినోదము, క్రీడ, ఉల్లాసము 4 పరిహాసము, వేళాకోళము

**వర్కరాటము** సం వి అ పుం 1 ఓరచూపు 2 నఖక్షతము 3 పూర్వాహ్ణమందలి సూర్యకిరణము.

**వర్కుటము** సం వి అ పుం 1. కొయ్యచీల, అడ్డుగడియ

**వర్గఘనఘాతము** సం వి అ పుం

(గణిత) ఒక వర్గమును ఆ వర్గమూలముయొక్క ఘనముచే గుణింపఁగా వచ్చిన మొత్తము, ఉదా 4×8=32

**వర్గఘనము** సం వి. అ పుం (గణిత) ఒక వర్గమును ఆ వర్గముచేత ముమ్మాఱు గుణింపఁగా వచ్చు సంఖ్య

ఉదా $4 \times 4 \times 4 = 64$

**వర్గణ** సం వి ఆ స్త్రీ (గణిత) గుణనము గుణకారము, హెచ్చవేయుట

**వర్గపదము**=**వర్గమూలము** సం వి అ న

**వర్గప్రకృతి** సం వి ఇ స్త్రీ (గణిత) బీజగణితము నందలి ఒకవిధమగు గణనము

**వర్గము** సం వి అ పుం 1 సజాతీయ సమూహము, సంఘము 2 పక్షము, వైపు 3 తరము, పురుషాంతరము 4 ఒక గుంపుగాఁ జేర్పఁబడిన పదముల సమూహము (మనుష్య వర్గము, వనౌషధి వర్గము మొ) 5 వర్ణసమామ్నాయమున సవర్ణములగు హల్లుల సమూహము (ఉదా కవర్గము చవర్గము మొ.) 6 గ్రంథభాగము, అధ్యాయము 7 ఋగ్వేదమున నధ్యాయమునందలి భాగము 8 (గణిత) ఒక సంఖ్యను దానిచేతనే గుణింపఁగా వచ్చు సంఖ్య (ఉదా $2 \times 2 = 4$ 9. బలము శక్తి. 10 మండలము, గోళము. 11 త్యాగము, విడుచుట

**వర్గమూలము** సం వి అ న (గణిత) ఒక సంఖ్యను ఆ సంఖ్యచేతనే గుణింపఁగా వచ్చిన సంఖ్యవర్గము ఆ వర్గమునకు మూలము (మొదలు) యినట్టి సంఖ్య. ఉదా 9 కి 3 వర్గమూలము, 16కు 4 వర్గమూలము

**వర్గవర్గము** సం వి అ పుం (గణిత) ఒక వర్గమును ఆ వర్గముచేత గుణింపఁగా వచ్చిన సంఖ్య ఉదా $2 \times 2 = 4$, $4 \times 4 = 16$.

**వర్గాంత్యము** సం వి అ న కవర్గాదుల తుదివర్ణము, అనునాసికము

**వర్గి** సం విశే (న్ ఇ న్)
ఒక జాతికి సంబంధించినవాఁడు, ఒక పక్షమునకు సంబంధించినవాఁడు

**వర్గించు** సం స క్రి వర్గముగా నేర్పఱుచు.
వ. మరణభాజులగు భూభుజుల శ్వర్గంబులగు నగర్హిత స్వర్గంబులు వర్గించి దివిజపతి విభజించుచున్నాఁడు హరి పూ 8 121.

**వర్గీణము** సం విశే (అ ఆ అ) వర్గమునకు సంబంధించినది ఒక జాతికి లేక ఒక పక్షమునకు సంబంధించినది.

**వర్గీయుఁడు** సం విశే (అ ఆ అ) 1. ఒకజాతికి సంబంధించినవాఁడు 2 ఒక తరమునకు సంబంధించిన వాఁడు
వి అ పుం సజాతీయ పురుషుఁడు

**వర్చ(వు)** సం వి (ఉ పుం న) సమూహము,గుంపు.
క ఇది దేవస్వ్ది దీపిం, జదివిన వ్రాసినను వినిన జనులకు నిత్యా భ్యుదయమ్ము లొసఁగు చుండును, వదలక కాశీనివాస వాసుఁడు పేర్మిన్ ...ఆం సం దేవ 42
క నవముగథరలో నీమూ, నవవర్చవు వేడ్కఁ జది వినను వ్రాసిన మూ,నవులకు ననవరతంబును, శివుఁ డవిముక్తేశ్వరుఁడు చెలువం బొసఁగున్. . ఆం సం. మూన 81

**వర్గోత్తమము** = **వర్గాంత్యము** సం. వి అ న. (జ్యోతి) పుం నవాంశభేదము

**వర్గ్యుఁడు** సం విశే (అ ఆ అ) సజాతీయుఁడు, సమానజాతివాఁడు
వి అ పుం 1 సజాతీయుఁడు 2 సహాధ్యాయుఁడు, సహపాఠి

**వర్చస్కము** సం వి. అ న 1 ప్రకాశము, తళతళకాంతి 2 శక్తి, బలము, వీర్యము 3 మలము, పురీషము

**వర్చస్వి** సం విశే (న్ ఇ న్) 1 శక్తిగలవాఁడు, బలము గలవాఁడు, చురుకైన వాఁడు. 2 ప్రకాశముగలవాఁడు, కాంతిగలవాఁడు.

**వర్చస్సు** సం వి న్ న 1 బలము, శక్తి 2 తేజము, కాంతి, ప్రకాశము, తళతళమను 3 రూపము, ఆకారము 4 మలము, పురీషము. 5 శుక్రము, వీర్యము

**వర్చోగ్రహము** సం వి అ పుం రోగవిశేషము,మలబంధము, విరేచనము కాకపోవుట

**వర్జకము** సం విశే (అ ఆ అ.) 1 చేరకుండఁ జేయునది, త్రోసివేయునది బహిష్కరించు వట్టిది 2 విడుచునది. తప్పించుకొనునది (సమాసమునందుత్తర పదముగానే యుండును)

**వర్జనము** సం వి అ న 1 విడుచుట, వదలిపెట్టుట. 2 వినాయించుట. 3 గాయపఱుచుట 4 హాని కలిగించుట 5 చంపుట

వర్జనీయము నం విశే (అ ఆ. అ) వర్జింపఁదగినది

వర్జము నం వి అ పుం విడుచుట, వీడుట

వర్జించు నం స క్రి విడుచు, పరిత్యజించు

గీ విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ, దొడరి వర్జింపదఁగు సుమీ దుర్జనుండు, చారు మాణిక్య భూషితశ స్తమ స్త, కంబయినపన్నగము భయంకరము గాదె భ ర్తృ 1. 43

వర్జితము నం విశే (అ ఆ. అ.) 1. వర్జింపఁబడినది, విడువఁబడినది 2 నిషాయింపఁబడినది 3 మానబడినది 4 బహిష్కరింపఁ బడినది, 5 లేకుండఁ జేయఁబడినది

వర్జ్యము నం విశే (అ. ఆ అ) 1 విడువఁదగినది, వర్జింపఁదగినది. త్రోసివేయఁ దగినది లేకుండఁ జేయఁదగినది

వి అ న చాంద్రమాన ప్రకారము నక్షత్ర కాలమున కార్యారంభమునకు విడువఁదగిన కాలము

వర్ణక నం వి అ స్త్రీ 1 వేషము 2 హరిదళము. 3, చిత్తరువు వ్రాయుట కుపయోగపడు రంగు 4 సిందూరము 5 ఇంగిలీకము 6 మేలిమి బంగారము 7. ఉత్తరీయము, పై బట్ట 8 మంచి గంధము 9 పిండి 10 స్త్రీలుపయోగించు పరిమళ ద్రవ్య విశేషము.

వర్ణకము నం వి. అ పుం 1 నటుని వేషము, వేధము. 2 చిత్తరువు వ్రాయుట, చిత్తరువు వ్రాయుట కుపయోగించెడి రంగు 3 రంగు పదార్థము 4 సిందూరము 5 చందన వృక్షము, మంచి గంధపు చెట్టు 6 అక్షరము, వర్ణము 7. (ఆం వ్యాక) ప్రత్యయము, డు ము. వు.

న 1 చాయ, వన్నె, రంగు 2 చందనము, మంచి గంధము 3 అధ్యాయము, గ్రంథములో భాగము 4. గోళము, మండలము

వర్ణకుఁడు నం వి అ పుం స్తోత్ర పాఠకుఁడు, బట్టు.

వర్ణకూపిక నం. వి అ. స్త్రీ మసిబుడ్డి, సిరాబుడ్డి

వర్ణక్రమము నం వి అ. పుం 1 బ్రాహ్మణాది వర్ణముల క్రమము, 2 రంగుల క్రమము 3. అక్షరముల క్రమము

వర్ణచారకుఁడు నం. వి. అ పుం చిత్రకారుఁడు, ముచ్చి.

వర్ణజ్యేష్ఠుఁడు నం వి. అ పుం బ్రాహ్మణుఁడు

విశే (అ ఆ అ) తన వర్ణముకంటె పైవర్ణమునకు సంబంధించిన వాఁడు

వర్ణతూలి నం వి ఇ ఈ స్త్రీ లేఖిని, పేనా, కలము, రంగులు వేయుకుంచె

వర్ణతూలిక వర్ణతూలి, నం. వి ఆ స్త్రీ

వర్ణదము నం విశే (అ ఆ అ) రంగు గలిగించునది రంగు నిచ్చునది

వి అ. న కాలీయకము నల్ల అగలు, లేక పీత చందనము

వర్ణదాత్రి నం వి ఈ స్త్రీ పసుపు (వ్య వి)

వర్ణదూత నం వి అ పుం (అక్షరరూపమగు దూత.) 1 జాబు, వార్తా పత్రిక 2 లిపి (వాచ)

వర్ణదూషకుఁడు నం విశే (అ. ఆ అ) వర్ణభేదముల నుల్లఘించు వాఁడు

వర్ణధర్మము నం వి అ పుం. బ్రాహ్మణాది వర్ణముల కేర్పరుపఁబడినధర్మము

వర్ణన = వర్ణనము నం వి ఆ స్త్రీ

1. చిత్తరువు వ్రాయుట 2 వర్ణించుట, ఒక యంమును వివరించి చెప్పుట. 3. వ్రాయుట. 4. చెప్పుట 5 స్తోత్రము.

వర్ణనకెక్కు అ క్రి (వర్ణనకున్ + ఎక్కు) ప్రసిద్ధి నొందు

సీ వర్ణనలెల్లచో వర్ణన కెక్కంగ రసములు దలుకొత్తి రాలు పాలు కు సం 1 36.

వర్ణనము నం వి అ న 1 చిత్తరువు వ్రాయుట 2 ఒక యంశమును వివరించి చెప్పుట 3. వ్రాయుట 4 చెప్పుట 5 స్తోత్రము

వర్ణపాతము నం వి అ పుం అక్షరము లోపించుట

వర్ణపుష్పము నం వి. అ పుం. వన్నెచెట్టు (శ ర)

వర్ణమాత నం వి. ఋ స్త్రీ లేఖిని, కలము

వర్ణమాతృక నం వి. ఆ స్త్రీ సరస్వతి.

వర్ణమాల నం వి ఆ స్త్రీ 1. అక్షర సమామ్నాయము.

2. (మంత్ర) అంతర్యాగమునందు పంచాశ ద్వర్ణాత్మకమైన వర్ణ రూపాక్ష మాల.

**వర్ణము** నం. వి. అ పుం 1 నీలాది వర్ణము. వన్నె 2 చిత్తరువుల రంగు, చాయ 3 కాంతి, దేహచ్ఛాయ, ఒడలిరంగు 4 బ్రాహ్మణాద్యాదిజాతి (చాతుర్వర్ణ్యము) 5 రకము, విధము 6 అక్షరము 7 పదము 8. ప్రఖ్యాతి, కీర్తి 9 మంచిగుణము, సుగుణము 10 స్తుతి, పొగడ్త 11 అలంకారము 12 ఆకారము, రూపు. 13. ఉత్తరీయము, పైబట్ట 14 మూఁత, కప్పు 15 సంగీత క్రమము 16 శీలము, స్వభావము, లక్షణము 17 మత సంబంధమైన కర్మావరణము 18 తెలియని పరిమాణము, తెలియని మొత్తము. 19. ఏక సంఖ్యకు సంకేతము. 20 అంగరాగము, ఒడలికి పూసికొను పరిమళద్రవ్యము 21 బంగారము 22 తాళ భేదము (వాచ.)

న 1 కుంకుమపువ్వు 2 రంగుగల యంగరాగము 3 రంగుల తైలము

**వర్ణరే(లే)ఖ** నం వి ఆ స్త్రీ కఠిని, బలపము.

**వర్ణవర్తి** నం. వి. ఇ స్త్రీ 1 రంగువేయుకుంచె 2 లేఖని, పేనా, కలము

**వర్ణవర్తిక**=వర్ణవర్తి వర్ణవర్తి, నం వి ఆ స్త్రీ

**వర్ణవిపర్యయము** నం వి అ పుం వర్ణవ్యత్యయము, అక్షరముల తారుమారు

**వర్ణవిలాసిని** నం. వి ఈ స్త్రీ పసుపు. (వృ వి.) ఇట్లే వర్ణవతి

**వర్ణవిలోడకుఁడు** నం వి అ పుం 1. కన్నగాఁడు. 2 శ్లోకముల నపహరించు వాఁడు, చోర కవి.

**వర్ణశ్రేష్ఠుఁడు**=వర్ణజ్యేష్ఠుఁడు నం.

**వర్ణసంకరము** నం వి అ పుం 1 వివాహముల ద్వారమున భిన్న వర్ణములు కలియుట, జాతుల సాంకర్యము

2 రంగులు కలియుట

**వర్ణసమామ్నాయము** నం వి అ. పుం అక్షరమాల, వర్ణమాల.

**వర్ణస్థానము** నం వి అ న అక్షరముల యుచ్చారణ స్థానము (కంఠాది)

**వర్ణహీనుఁడు** నం. విశ. (అ ఆ అ.) 1 జాతి భ్రష్టుఁడు. 2 తక్కువ జాతివాఁడు

**వర్ణాంక** నం వి. ఆ స్త్రీ లేఖని, కలము, పేనా

**వర్ణాటుఁడు** నం. వి. అ పుం 1 చిత్రకారుఁడు. 2 గాయకుఁడు 3. స్త్రీకృతాజీవుఁడు, భార్య సంపాదనచే జీవించువాఁడు 4. వల్లభుఁడు, ప్రియుఁడు (విల్యమ్సు)

**వర్ణాపేతుఁడు** నం విశ (అ ఆ అ) వర్ణమునుండి తొలఁగిన వాఁడు. జాతిబాహ్యుఁడు

**వర్ణార్హము** నం వి అ పుం ముద్గము, పెసరు (వృ వి) (శా ని)

**వర్ణి** నం విశ (న్ నీ న్) (సమాసాంతమునందు.) 1 రంగు గలది 2 జాతికి (వర్ణమునకు) సంబంధించినది

వి న్ పుం 1 చిత్రకారుఁడు 2 వ్రాయసకాఁడు, వ్రాతగాఁడు. 3 బ్రహ్మచారి 4 బ్రాహ్మణాది చతుర్వర్ణములలో నేవర్ణముననైనఁ బుట్టిన వాఁడు

**వర్ణించే** నం న క్రి స్తుతించు, పొగడు

క అనఘా పరువిందించుట, దనువర్ణించుకొనుటనుచితము లెయ్యెడలన్ ... భాగ వాం. 5 453

శా వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వంబసాధారణం, బాచోద్యం బతిలోక మప్రతిమ పర్యాయంబు వర్ణింపఁగా, నీ చెల్వంబు శ్రీ కాళ 2 13

**వర్ణిక** నం వి ఆ స్త్రీ 1 నటుని వేషము 2 రంగు, చాయ 3 మసి, సిరా 4 లేఖని, కలము 5. కఠిని, బలపము

**వర్ణితము** నం విశ (అ ఆ అ) వర్ణింపఁబడినది 1 రంగువేయఁబడినది 2. వివరముగాఁ దెలుపఁబడినది 3 స్తుతింపఁబడినది

**వర్ణిని** నం వి ఈ స్త్రీ పసుపు (చూ వర్ణి),

చ అనుడు బ్రలంబ వైరికి మురాంతకుఁ డిట్లను సిగ్గిరిప్రవణం,బను నగరంబు గాచికొని యాహవనీయము మండుచుండు న,య్యనలము చాయఁ జూపె మనమందఱము న్వరవర్ణినీ ఘన, స్తనవర వర్ణినీద్యుతికిఁ దావల మైతిమి ప్రీతి మీఱఁగన్, ఉ హరి 6 30 (రెండర్థములకు నిదియే యుదాహరణము)

**వర్ణిలింగి** నం వి న్ పుం ఉదరపోషణమునకు బ్రహ్మచారివలె వర్తించువాఁడు, కపట బ్రహ్మచారి.

**వర్ణువు** నం వి. ఉ పుం. 1 సూర్యుఁడు 2 ఒకానొక నదము (వాచ)

**వర్ణ్యము** నం విజ (అ ఆ అ) 1 వర్ణింపఁదగినది 2 అలంకార శాస్త్ర గ్రంథములయందు 'ప్రస్తుతము' అను నర్థమునఁ బ్రయోగింపఁ బడును

వి అ న కుంకుమ పువ్వు

**వర్తక** నం వి ఆ స్త్రీ వెలిచె పిట్ట.

**వర్తకము** వి వాణిజ్యము, క్రయ విక్రయ వ్యాపారము

(శ ర. దీనిని సం. గా గ్రహించెను)

మ తమకుం జాలివర్తకం బతనిచేతం గామి నోశంఖ పద్మమహాపద్మములర్థపున్ విడిచి ప్రేమం దత్పురివైశ్యస్తములం జేరెననంగ. కవిరా 1 72

అ పైరువలన మనము బ్రతికెడు వారము, గాము విపణివర్తకంబుచేత, జీవనంబునడప మావులే దైవంబు, లనుచునుండు వారమగుటఁజేసి వి పు 7 22

**వర్తకము** నం విజ (అ ఆ. అ) 1 జీవించుచున్నది. 2 అభినివేశము గలది

వి అ పుం 1 వెలిచెపిట్ట 2 గుఱ్ఱపుడెక్క 3.వాణిజ్యము, వణిగ్వ్యాపారము

అ పైరువలన మనము బ్రదికెడువారము, గాము విపణి వర్తకంబుచేత, జీవనంబునడప మావు లేదైవంబు లనుచునుండు వారమ గుటఁజేసి వి పు. 7 229

న లోహవిశేషము

**వర్తకుఁడు** నం. వి అ పుం వణిజుఁడు, క్రయ విక్రయ వ్యాపారము చేయువాఁడు

(వ్యవ) ఈ యుద్ధకాలమునఁ జాలమంది వర్తకులు మంచిలాభమును పొందినారు

**వర్తనము** నం విజ (అ ఈ అ) 1 వసించుచున్నది. జీవించుచున్నది ఉన్నది 2. స్థిరమైనది, నిలకడ కలది, చలనము లేనిది

వి అ న (ఇది చరిత్రాదులలోనిది కావున మువర్ణకలోపము వైకల్పికము)

1 జీవనము, బ్రదుకు 2 ఉనికి, స్థితి 3 వృత్తి, జీవిక, వ్యాపారము 4 జీవనాధారము, జీవనోపాయము 5 గుఱ్ఱము ధూళిలో దొర్లుట, గుఱ్ఱము దొర్లెడు తావు (విల్యమ్సు) (కే ని) 6 చుట్టుచుట్టుకొనుట 7 ఏర్పఱుచుట, పని పెట్టుట 8 నడవడి, ప్రవర్తనము, నడచు పద్ధతి 9 బత్తెము, జీతము, కూలి 10 వాణిజ్యము 11 నూలువడకు కదురు మొదట నమర్చెడు బిళ్ల, తర్కుపిండము 12 గోళము, మండలము 13 తలచు పలుకు మాట (కే.ని)

**వర్తని** నం. వి ఇ పుం 1 భరతఖండమునఁ దూర్పువైపు దేశము, తూర్పుదేశము ?. (మంత్రరూప) స్తోత్రము

ఈ స్త్రీ 1 బాట, మార్గము, కాలిజాడ. 2 పక్ష్మము కనుఱెప్ప వెంట్రుకలు 3 చక్రము పోయినజాడ 4 పేషణము, నూరుట, చూర్ణీకరణము (వాచ) 5. నూలు వడకెడు కదురు బిళ్ల

**వర్తముఁడు** నం వి అ పుం మఱుగుజ్జువాఁడు, వామనుఁడు

**వర్తనుఁడు** నం విజ (అ అ అ) 1. పొట్టివాఁడు 2 వర్తించువాఁడు (శ ర)

**వర్తమానము** నం విజ (అ అ అ) 1 ఉండునది 2 జీవించియున్నది 3 చుట్టు తిరుగుతున్నది 4 నివసించుచున్నది

వి అ పుం 1 (వ్యాక) జరుగుచున్న కాలము ప్రారబ్ధాపరిసమాప్త క్రియాశ్రయమగు కాలము 2 వృత్తాంతము, సమాచారము

చ. విను మిటులుండంగాఁదిమిరవేణి కుబేరుఁడు కమ్మ పంపఁగా, దినదిన చీటులందుగడిదేరు జయంతునివర్తమానముల్, విని వలకూబరుండు . . కువల 4 159.

న సాన్నిధ్యము

**వర్తము** నం వి అ పుం (ప్రాయికముగా సమాసాంతమున నుపయుక్తము ఉదా కలవ్యర్తము) జీవిక, జీవనాధారము

**వర్తరూకము** నం వి అ పుం 1 పల్వలము, పడియ, నీరుగల చిన్నగుంట 2 నీటి సుడి, జలావర్తము. 3 కాకిగూడు 4. ఒకానొకనది

**వర్తరూకుఁడు** నం వి అ పుం ద్వారపాలకుఁడు.

**వర్తి** సం విశే (న్ సీ న్) (ప్రాయికముగా సమాసాంతమున నుండును)
1 నివసించుచున్నవాఁడు, ఉన్నవాఁడు. 2. ప్రవర్తించువాఁడు
(క.) వెళ్లుచున్నవాఁడు
(చ.) పనిచేయుచున్న వాఁడు ప్రవర్తించుచున్న వాఁడు
(ట.) ఆచరించుచున్న వాఁడు
వి ఇ ఈ స్త్రీ 1 చుట్టచుట్టుకొనిన వస్తువు, చుట్ట 2 పలువిధములగు సువాసన ద్రవ్యములతో తయారుచేయఁబడిన అంగరాగము, మేపూఁత 3 అంజనము 4 దీపపు వత్తి, 5 బట్టయంచు, బట్ట చివరజాలరు, వస్త్రాంచలముగా నుండు దారము 6 పాత్రముల అంచు 7 ఇంద్రజాల సంబంధమైన దీపము 8 శస్త్రవైద్యమునం దుపయోగించు సాధన విశేషము 9. రేఖ, గీఁత 10 కంఠమువాపు 11 లోపలఁ బగులుటచే పైని వాచుట

**వర్తించే=వర్తిల్లు** సం అ క్రి 1 ఉండు.
గీ నేల నాలుగుచెఱఁగుల నృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ, యగ్గలించి నా యెదుర బాహాస్ఫాలించి, కడఁగఁజాలెడు మల్లుఁ గాన నెందు. భార విరా 2 7
2 నడచు, సంచరించు
వ కౌంతేయులంగానక సంకేత స్థలంబు నంగూడి కొని మావర్తించిన తెఱంగుదేవరకు నెఱింగించి . భార విరా 3 87

**వర్తిక** సం వి ఆ స్త్రీ 1 చిత్తరువు వ్రాసెడి కుంచె 2 దీపపువత్తి 3 రంగు 4 మీలవల్లంకి పిట్ట 5. జుట్టుపు మొక్క (రా. ని)

**వర్తిధూపము** సం వి అ పుం అగురువత్తి (శ ర)

**వర్తిల్లు=వర్తించు** సం అ క్రి 1 ఉండు
వ శుక్ర మతంబునఁ బంచమోపాయంబైన యుపేక్ష వర్తిల్లుదానిం బ్రయోగించు భంగి యుం జెప్పెద భార శాం .2 417
2 సంభవించు, కలుగు
క అగుదేశ కాలబలయుత, ముగఁ జేసిన పోర నర్థములు మోఱకులై, తెగఁబాటి తమ్ము నెదిరిని వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుదిన్. భార విరా 4 208
3 నిలఁబడు, ఆధారపడు.
ఆ వార్తయందు జగము వర్తిల్లుచున్నది, యదియు లేని నాఁడ యఖిలజనులు, నంధకార మగ్నులగుదురు . భార సభా 1 50

**వర్తిష్ణు(డు)వు** సం విశే (ఉ) వర్తించు స్వభావము గలవాఁడు, వర్తనశీలుఁడు

**వర్తులము** సం విశే (అ ఆ అ) గుండ్రనిది, వట్రువైనది
వి అ పుం 1 ఒక విధమగు కాయధాన్యము, బటాణి. 2 కందుకము, బంతి.
న 1 మండలము, గోళము 2. వెల్లుల్లి (వృ వి)

**వర్తులాభరణము** సం వి అ న (బవిర) వర్తులాకారమైన కర్ణాభరణ విశేషము

**వర్త్మని** సం వి ఇ. ఈ స్త్రీ మార్గము, బాట (వాచ)

**వర్త్మపాతము** సం. వి అ పుం త్రోవ తప్పుట

**వర్త్మబంధ(క)ము** సం వి అ పుం కను ఱెప్పల జబ్బు, ఱెప్ప లంటుకొనుట

**వర్త్మము** సం వి. న్ న 1 మార్గము, బాట. 2 పద్ధతి, వాడుక, మామూలు 3 అవకాశము, సందు, ఎడము 4 పక్ష్మము, కనుఱెప్ప వెండ్రుక. 5 అంచు, అంచలము

**వర్ధకము** సం విశే (అ అ అ) 1 వృద్ధి పఱుచునది, పెంచునది 2 నిండించునది 3 నఱుకునది, ఖండించునది
వి అ పుం బ్రాహ్మణయష్టిక, గంటు భారంగి (వృ వి) (వాచ.)

**వర్ధకి** సం వి ఇ న్ పుం వడ్రంగి

**వర్ధకుఁడు=వర్ధకి** సం వి అ పుం.

**వర్ధనము** సం విశే (అ ఉ అ) 1 పెరుగునది, వృద్ధిపొందునది 2 వృద్ధిపొందించునది, పెంచునది
వి అ పుం 1 పంటిమీదఁ బుట్టెడి రెండవ పల్లు, దొంతరపండ్లలోఁ బైది
న 1. పెరుఁగుట, వృద్ధిపొందుట. 2 అభ్యుదయము 3 ఔన్నత్యము, ఉన్నతి 4 ఉత్సాహము 5 విద్య నేర్పుట 6 పోషించుట

7. ఖండించుట, త్రుంచుట, ఛేదనము, నాభివర్ధనము. 8. బలకరమైన మందు. 9 నిండించుట.

**వర్ధని** సం వి ఈ స్త్రీ 1 చీపురుకట్ట 2. పాడె, శవవాహనము 3 మూతి సన్నముగా నుండెడి యొక విధమయిన పాత్రము, జారి

**వర్ధనుఁడు** సం వి అ పుం 1. ఐశ్వర్యమిచ్చువాఁడు, అభివృద్ధి గలిగించువాఁడు 2 శివుఁడు 3. విష్ణువు

**వర్ధమాన** సం. వి. అ. స్త్రీ ప్రకృతము బర్ద్వాన యనఁబడెడి మండలము

**వర్ధమానకము** సం వి అ. పుం శరావము, మంటిమూఁకుడు.

**వర్ధమానము** సం. వి (అ ఆ అ) పెరుఁగుచున్నది, వృద్ధిపొందుచున్నది

వి అ పుం 1 ఆముదపుఁజెట్టు 2 గూఢప్రశ్న, ఒక విధమైన పొడుపుకథ 3 ప్రకృతము బర్ద్వాన యనఁబడు దేశభాగము

**వర్ధమానుఁడు** సం వి అ పుం 1 విష్ణువు 2 అర్హతులలో (జైనమతావలంబులలో) నొకఁడు

**వర్ధము** సం. వి. అ పుం 1 నఱకుట, ఛేదించుట 2. వృద్ధిపొందించుట, వృద్ధి పొందుట 3. వృద్ధి 4 నిండించుట.

న 1 సీసము 2 సిందూరము

**వర్ధాపనము** సం వి అ న. 1 ఛేదనము, ముక్కలు చేయుట 2 నాభిచ్ఛేదము, బొడ్డుకోయుట 3. జన్మదివసోత్సవము, పుట్టిన దినము పండుగ 4 అభివృద్ధి కాముఁడై హోమాదికము చేయు సంస్కార విశేషము.

**వర్ధితము** సం విణ (అ ఆ అ) 1 పెంపఁబడినది వృద్ధిపొందింపఁ బడినది 2 విరివి చేయఁబడినది 3 ఖండింపఁబడినది 4. నిండింపఁబడినది

**వర్ధిల్లు** సం అ క్రి వృద్ధిపొందు

క. క్రేపులు వర్ధిల్లుటయును, నోపి పసులు పాలు గురియుచునికియు నన్నంబె సారమునకుఁ గలిమియు, నా పరమేశ్వరుని యోగి యని యెఱుఁగుమనా హరి పూ 7. 127

**వర్ధిష్ణువు** సం విణ (ఉ) అభివర్ధన శీలమైనది, వృద్ధి పొందునది

**వర్ధ్రము** సం వి అ న 1 తోలు 2 సీసము

**వర్ధ్రి** సం. వి. ఈ స్త్రీ తోలువాఱు, టఁగువాఱు

**వర్ధ్రిక(=వర్ధ్రి)** సం వి ఆ స్త్రీ

**వర్మణము** సం వి అ పుం నారింజ (వృ వి)

**వర్మము** సం వి న్ న 1 కవచము, బొందలము. 2 కాపు, రక్షణము 3 చెట్టుపట్ట

పుం 1 క్షత్రియుల నామాంతమునఁ జేర్పఁబడెడి పదము.

ఉదా ఇంద్రవర్మ, సింహవర్మ మొ

**వర్మహరుఁడు** సం విణ (అ ఆ అ) 1 కవచధారి, కవచము ధరించువాఁడు 2 కవచము ధరించుటకుఁ (అనఁగా యుద్ధము చేయుటకు) దగిన వయస్సు గలవాడు

**వర్మి** సం విణ (న్ ఈ న్) కవచి, కవచము ధరియించువాఁడు

వి ఇ పుం ఒక జాతిచేఁప.

**వర్మితుఁడు** సం విణ (అ ఆ అ) 1 సన్నద్ధుఁడు, చేయఁబడ్డ సన్నాహము గలవాఁడు 2 ఉద్యుక్తుఁడు, పూనుకొన్నవాఁడు

**వర్య** సం వి ఆ స్త్రీ 1 తనంతట మగని వరించునట్టి కన్యక 2 పెండ్లికానిది

**వర్యుఁడు** సం విణ (అ ఆ అ) 1 వరింపఁదగినవాఁడు, ఎన్నుకొనఁ దగినవాఁడు 2 శ్రేష్ఠుఁడు, ప్రశస్తముఁడు 3 ముఖ్యుఁడు

(కడపటి రెండర్థములయందును సమాసాంతమునఁ దఱచుగా నుపయుక్తమగును)

వి అ పుం మన్మథుఁడు

**వర్వటము=బర్బటము** సం వి అ పుం రాజమాషము, బొబ్బరలు

**వర్వణ** సం వి ఆ స్త్రీ నీలమక్షిక, నల్ల ఈఁగ

**వర్వర** సం. వి ఆ స్త్రీ 1 మక్షికా భేదము, ఒక విధమైన యీఁగ 2 ఒక విధమైన తులసి, నల్ల తులసి

**వర్వరము** సం విణ (అ ఆ అ) చుట్టలు చుట్టలుగా నున్నది

వి అ పుం 1 ఉంగరాల జుట్టు. 2. ఆయుధములు ఒకదాని కొకటి తగులుట వలనఁ గలిగిన శబ్దము 3 నాట్యవిశేషము 4 కృష్ణార్జక వృక్షము

న 1 పీతచందనము పచ్చ మంచిగంధము 2 సింధూరము 3 కాలెంత బోళము

వర్వరి=వర్వర సం వి ఈ స్త్రీ

వర్వరీకము సం వి అ పుం 1 చుట్టలుగాఁ జుట్టు కొనిన జుట్టు 2 తులసీ భేదము, ఒక విధమైన తులసి 3 ఒక జాతి మొక్క, గంటుబారంగి (వృ వి) 4 వాయింట మొక్క (వాచ)

వర్వరుఁడు సం విణ (అ అ అ) 1 నత్తిగా మాట లాడెడి వాఁడు 2. అరణ్యకుఁడు, అనాగరకుఁడు, మోటువాఁడు 3 బుద్ధిహీనుఁడు, మూర్ఖుఁడు 4 జాతిభ్రష్టుఁడు, వర్ణభ్రష్టుఁడు

వర్వుపని=వరవుడుపని వి దాస్యము

సీ శ్రీ వాక్సుచీసురసిద్ధ విద్యాధరదనుజాంగనల వర్వుఁ బనులు గొనఁగ . కు. సం 7 882

వర్ష సం వి అ స్త్రీ (సంస్కృతమున బహువచనము) 1 వానకాలము, వర్ష ఋతువు

వర్షకరి సం వి ఈ స్త్రీ ఇలకోడి, కీఁచుఱాయి.

వర్షకోశము సం. వి అ పుం మాసము, నెల (వాచ)

వర్షకోశుఁడు సం వి అ పుం జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు.

వర్షగిరి సం వి ఇ పుం వర్ష పర్వతము

ప్రపంచమున వేఱువేఱు భూభాగముల నొక దానితో నొకటిని విభజించు సరిహద్దు కొండ ఇవి యేడు

1 హిమవంతము 2 హేమకూటము 3 నిష ధము 4 మేరువు 5 చైత్రము 6. కర్ణి 7 శృంగి అనునవి

శ్లో. హిమవాన్ హేమకూటశ్చ నిషధో మేరు రేవచ, చైత్రః కర్ణీచ శృంగీచ సప్తైతే వర్ష పర్వతాః.

వర్షణము సం వి అ న 1 వర్షించుట, కురియుట, వర్షము 2 పుష్పములు మొ చల్లుట 3 ధారా ళముగా నిచ్చుట

ఉదా ద్రవ్య వర్షణము.

వర్షణి సం వి ఇ స్త్రీ 1 వర్షము, కురియుట, వాన. 2 యజ్ఞము, యజ్ఞక్రియ 3. కార్యము, పని. 4. వర్తనము, ఉనికి (విల్యమ్సు)

వర్షధరము సం. వి అ. పుం 1 మేఘము 2 వర్ష పర్వతము

వర్షపర్వతము=వర్షగిరి సం వి అ పుం

వర్షపాకి సం వి న్ పుం. 1 మారేడు (వృ వి) 2 ఆమ్రాతకము. అంబాళము. (వృ. వి)

వర్షప్రతిబంధము సం వి అ పుం. అవగ్రహము, వాన లేమి, వఱపు

వర్షప్రియము సం వి అ పుం. చాతకపక్షి

వర్షము సం వి అ పుం న. 1. వాన, వాన కురి యుట 2 (పుష్పాదులను) చల్లుట (ఉదా) శర వర్షము, శిలావర్షము, లాజవర్షము మొ 3 వీర్య స్రావము, శుక్రము కాఱుట 4 ఏఁడాది, సంవ త్సరము. 5 ప్రపంచ భాగము (కురు, హిరణ్మయ, రమ్యక, ఇలావృత, హరి, కేతుమాల, భద్రాశ్వ, కిన్నెర, భారతములను తొమ్మిది వర్షములు) 6 జంబూ ద్వీపము, భారత వర్షము (మే ని) 7 మేఘము మబ్బు.

వర్షవ(ధ)రుఁడు సం వి అ. పుం నపుంసకుఁడు, కంచుకి, అంతఃపురపుఁ గావలివాఁడు

వర్షవృద్ధి సం వి ఇ స్త్రీ జన్మదినము, పుట్టిన దినము

వర్షాంగము=వర్షాంశము సం వి. అ. పుం

వర్షాంబుదము సం వి అ పుం వర్షించు మేఘము.

వర్షాంబువు సం వి ఉ న వాననీరు

వర్షాంశ(క)ము సం వి అ పుం మాసము, నెల

వర్షాకాలీనము సం విణ (అ అ అ) వర్షాకాలము నకు సంబంధించినది వర్షాకాలమునఁ బుట్టినది

వర్షాప్రభంజనము సం వి అ పుం ఝంఝూ మారు తము

వర్షాభువు సం వి ఊ స్త్రీ 1. ఆఁడుకప్ప, చిన్నకప్ప. 2 గజ్జెరుపల్లిక (వృ వి)

పుం 1. కప్ప. 2 ఆరుద్ర పురుగు 3 ఎఱ్ఱ, వాన పాము

వర్షాభ్వి సం వి ఈ స్త్రీ ఆఁడుకప్ప, భేకి

వర్షామదము సం వి అ పుం నెమిలి, మయూరము

వర్షారాత్రము సం. వి అ పుం 1 వానకాలపు రాత్రి. 2. వానకాలము

వర్షార్చిస్సు సం వి స్ న అంగారక గ్రహము.

వర్షావసానము సం వి అ న శరత్కాలము

వర్షాశనము సం వి అ న రాజులు మున్నగువారు పండితులు మొదలగు వారికి సంవత్సరమున కొక మాఱిచ్చెడి సంవత్సర గ్రాసద్రవ్యము

**వర్షించు** సం. అ. క్రి కురియు

సీ. ఎచట నెవ్వరుఁగోర నచటనే వర్షించుఁ **బడు** గింజలనె పండుఁ బుడమి యెల్ల .. దళా 4. 121

ద్వి గడలతాఁకుల మౌక్తికములు బిట్టెగసి, వడిఁ దదంగణ భూమి వర్షించుచుండ . . ద్వి. వరమ. 3 144

**వర్షితము** సం వి అ న వర్షము, వాన

**వర్షిష్ఠుఁడు** సం విణ (అ ఆ. అ) అందరికంటెఁ బెద్ద వాఁడు.

**వర్షీయుఁడు** సం విణ న్ (యస్) న్ 1 ఒకని కంటె ఎక్కువ యేండ్లు గడచినవాఁడు 2 మిగుల వృద్ధుఁడు

**వర్షుకము** సం విణ (అ ఈ అ) వర్షించునది, కురియునది.

**వర్షోపలము** సం వి అ పుం. వడగల్లు

**వర్ష్మము** సం వి. న్ అ న 1 శరీరము, ఒడలు 2 చక్కని రూపము, మనోజ్ఞరూపము 3. ఎత్తు, ఉన్నతి 4 వైశాల్యము

**వర్స** వి. "వరుస" యొక్క రూపాంతరము

1. క్రమము. వర్సవెంబడి ద్ర వంతుల ప్రకారముగా, క్రమానుసారముగ

గీ రాజకులవర్యుఁ డాత్మభార్యాచతుష్క, నియముల వర్సవెంబడి నిద్ర నలుపు కు 3 540

2. పంక్తి

ద్వి తెలుపారి మెఱుఁగెక్కు పలువర్సఁ దలఁచు . పండితా పురా 123 పా

ద్వి ఇలువర్స దప్పుట యెగ్గు బొమ్మనక పండితా దీక్షా. 43 పా

**వర్హణము = బర్హణము** సం వి అ న.

**వర్హము = బర్హము** సం వి అ పుం న

**వర్హి = బర్హి** వి బర్హిన్ సం వి ఇ పుం న్ పుం

**వర్హిణము = బర్హిణము** సం వి అ పుం

**వర్హిస్సు = బర్హిస్సు** సం వి స్. పుం

**వఱ** వి (క వరె త వరై) మేర, హద్దు

సీ. ఈ వఱకును సామియిచ్చలోఁ జరియించు మన్ననఁ బురుషులు మాన్యచరితు, లలభరద్వాజ కశ్యప గౌతమ మాత్రికౌశిక జమదగ్ని వసిష్ఠమునులు ... ఘటికా. 2 99.

**వఱకు** అవ్య. దనుకన్.

క. దేవరకంటెను మించువొ, దేవఁకు సమానుఁడగునొ తెలియఁబడదు మే, మీవఱ కావిధుఁ బోలిన, భూవరుఁ గని యెఱుఁగ మనిన బుద్ధి చలింపన్. ఉ. రా 3. 226

కొన్ని తావులఁ బర్యంతార్థమున దనుక దాఁక శబ్దములతో చేరియుఁ బ్రయోగింపఁ బడుచున్నది.

క కావరమునఁ గానవు నీ, కావర మెఱిఁడిచ్చె ననుచు నది చెల్లెను నీ, కీవఱకును విడువు మింకన్, నీవరదర్పము నణఁగ నేఁడు మృగాంకా. శశాం 5 61.

జ వఱగొడ్డెము

**వఱగొడ్డెము = ఒఱగొడ్డెము** వి. (వఱ + గొడ్డెగము) మర్యాదమీఱిన మాట, వంకర మాట

సీ వరునితో నేఁప్రొద్దు వఱగొడ్డె మాడుట భర్త మర్మంబు లెల్లఱచు చుంట . భల్లా 4. (శ ర)

**వఱడు**[1] వి ముదినక్క, నక్క

క ధృతరాష్ట్రు నగ్నిహోత్రా, యతనంబున నఱచె వఱడు లగ్నులు శాంత, ద్యుతులయ్యెఁ గాంధారి, తద్బ్రాదయము లధికశోక తప్తము లయ్యెన్ భార సభా 2. 251.

బ వఱడులు, వంగ్లు

క వఱడులు మన చేరువఁ బెల్లఱచుట బెట్టెదురుగాలి యడరుట గ్రద్దల్, తఱచయి యాడుట విస్మితపు, టఱపులతో రేఁగికాకు లఱచుట గంటే

భార కర్ణ 2 116 ఆం భా 2 83

గీ అశ్వశకరికలభాదుల యందుఁ గానఁ, బడుగ వంకుల వాపోవుఁ బట్టపగలు, మొగి వఱడ్లు మహోత్పాతములకు శాంతి, చూడనద్దేవి మరలఁ బుచ్చుటయ లెస్స భా రా యు 84

క వఱడు లఱచె నుల్కలు వడె, నెఱిచెడి సురగాలి విసరె నిలువక పెలుచన్ ఉ హరి 2 24

చ ఇనుఁ డుదయంబు సేయ వఱ దెవ్వనికై యెదురేఁగు నిష్ఠుర, ధ్వని సెలఁగఁగ వాఁడు యమాలయగామి భూవరా . మార్క 3 351

ద్వి. వయసెల్ల దిగజాఱి వఱదు చందమున, భయపెట్టు పెంపుడు పడుచుల తోడఁ, గలహించి కొన్ని వెక్కసము లాడినను . సారంగ 2 68 పా 16 పం

**వఱదు²** స క్రి మఱాముచేయు

వ వహించి నీరు వఱడిన కొ(ము)ల వెంజామరలు 2 ఝ దా శా 11 90

**వఱద** వి ప్రవాహము

గీ వఱదఁ గాష్ఠముల్ గూడిన వడువబంధు, సంగమంబవి సాసిన చాడ్పు తద్విఁ, యోగము భార శాం 4 56

మ నెఱయం బున్నమచందురుం జెనయునీ . వఱదంద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁ జొత్తున్ సుతా . భార ఆర 7 842

ఆ పఱవ పఱద వఱద పఱతి పఱత వట్టు నాఁగ నిటు ప్రవాహనామ మొప్పు ఆం భా. 1 156

**వఱదఁగలియు**—1. చెడు

సీ జడియక కాసేపు జాబిల్లి నీరూపు పదియాఱు తునియలై వఱదఁగలియ . . కలువాయిళ 14

2 వ్యర్థమగు

సీ నిష్ఠించి యిళ్ళంగి నీ కేము సెప్పిన వాక్యంబు లెల్లను వఱదఁగలసి, పోయెనే భార అశ్వ 1 12.

**వఱదఁగలుపు**=పాడుచేయు (వఱదన్+కలుపు )

గీ తవకు నదనైన మెయిమెయిఁ జనఁగనిచ్చు, నయ్య యితరుల ననఁగ నయ్యవనివిభుని, వ్రతము లన్నియు గొనిపోయి వఱదఁ గలిపి, చిత్తమంతయు గసిబిసి చేసి విడిచె భోజరా 7. 100.

**వఱదఁగూర్చిన చింతపండగు**=చెడు, నశించు.

సీ చింతింప వఱదఁ గూర్చిన చింతపండయి నీటఁ గూడె హిమాంశు నేర్పులెల్ల ... చంద్ర. 2 168

**వఱదగొను** అ క్రి (వఱద+కొను) ప్రవహించు, వఱదవాఱు.

లయవిభాతి తఱుచు రుధిరచ్ఛటలు వఱద గొనఁ గుంభములు పఱియలయి కుంజరము లొఱలుచుఁ బడన్ భా. రా యు 661

**వఱదపాలగు**=నశించు

సీ నాయెల్లి నీడననరలోక మేలుదు ననులావు వఱదపాలయ్యె నన్న ... ఉ హరి. 4. 300

సీ వర్షాశనంబులు వఱదపాలై పోయె మలవతీలను ప్రజల్ మాసి చనిరి .. రామలిం. 89

**వఱదపాల్ చేయు**=పోగొట్టు, చెఱుచు

ద్వి అరయంగనగు సూర మవ్వక యనఁగ, సాధుమార్గమున నిచ్చట నుండియుండి, వైధవ్యవర్తనల్ వఱదపాల్ చేసి...పండితా దీక్షా 39 పా

**వఱదఁబోవు**=పోవు (వఱద+¹పోవు)

సీ విడువమా యిన్నాళ్లు విడిచిన నది పోయి యేటికిఁ జిత్రాంగి యింట వ్రాలె, వ్రాలిననది యట్టె వఱదఁబో నిమ్మని యూరక యేమిటి కుండనైతి. సారంగ 2 145

జ , వఱదగుడి, వఱదవాఱు, వఱదలుగట్టు.

**వఱదగుడి** వి (వఱద+గుడి) సూర్యాదిపరివేషము (శ ర )

**వఱదవాఱు** అ క్రి (వఱద+పాఱు) ప్రవహించు

ఆ త్రిప్పి నేలవైవ డిగ్గన రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ... భాగ 10 పూ 1363

గీ అంత నచ్చట రాచూలి వంత బెరయఁ, దోడఁ బుట్టువుగాఁడిన తూపు వెఱికి, వైచి క్రొవ్వేఁడి కన్నీరు వఱదవాఱఁ, బలు తెఱంగుల నిట్లని పలువరించె . అచ్చ రా యు 391.

**వఱదలుగట్టు** అ క్రి (వఱదలు+కట్టు) వఱదలు వాఱు, ప్రవహించు

చ మఱియు బహుప్రకారముల మర్మము లెత్తుచు నత్తదిట్ట ని,వ్వెఱఁగువ నాశ్రమ స్థలము వెల్వడి సత్వరయానలీలఁ గ్రి,క్కిఱిసిన చన్ను దోయిచలియింపఁగ వచ్చె దృగంబుపూరముల్, వఱదలు గట్ట నేడ్చుచు విలాసవతీమణి పుట్టినింటికిన్ వరాహ 2 186

**వఱపు** వి వానలేమి, అవగ్రహము

సీ వహ్నియు భయమును వఱపును గఱవును నాది గాఁగల యెగ్గు లడఁగెఁ బుడమి భార సభా 1 2 71.

క వఱపున సస్యము లొదవమి, నఱిముఱి దైవంబు చెద్ది నాఱేఁడులు పెన్, కఱవైన భూమిఁ గల ప్రజ . దశకు. 10. 75, నా పంచ. 2 144

**వఱల** వి. వృద్ధతపప్పి అ ప్ర (శ. ర)

**వఱలు** అ క్రి 1 ప్రకాశించు, ఒప్పు.

సీ. మెఱుపునుం బోలెను వఱలు నుత్పలగంధి బహుతరతను సౌరభంబు గలుగు . భార ఆది 7 159

సీ వంది కందిన నింత వఱలెడు ముఖరోచు లెల మిన నెంత సల్లలిత మగునొ ... కు సం. 7 838 హరి పూ 1 131.

2 ప్రవర్తించు

క. గుఱు తెఱిఁగి వస్తుచయమున, కొఱఁగెడు నా దీపవర్తి యనుబోలె నిజం, బెఱిఁగి కృత వస్తు సమితికి, వఱలఁగ మదినెఱుఁగు విబుధ వర్గముఁ దలఁతున్ కు సం. 1 26.

సీ పలుమఱుఁ జలువశాఖలఁ జేరి పొరలుచు వంకర నడలచే వఱలియరిది. అచ్చ. రా బాల. 106.

3. వ్యాపించు

క ఉఱుములతో మెఱుములతో, వఱచెడు పెను గాలితోడ వడగండులతోఁ, దఱచగు పిడుగుల తోడను, వఱదలపై వఱద లెగయ వర్షము గురిసెన్ పరమ 1 81.

4 కొన్నిపట్ల వాక్యాలంకారము.

క ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁ గనలు గడలఁ బడ నవారిత వృష్టుల్ భార ఆది 8 270. భార , ఆది. 6 114., భార. సభా 1 211

**వఱువట్లు** వి బ (వట్టులు + వట్టులు) మిక్కిలి యెండుటలు

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె . . భార విరా 2 88

సీ. వాతెఱ తడిలేక వఱువట్లు వట్టంగఁ బెదవులు దడుపుచు బెదరి చూచు విజ్ఞా వ్య కాం. 45

క. విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగందపుటప లొకింత చిలచిలమని వే,గిరము వఱువట్లు గొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముంగని కలఁకన్. కళా 6 255

**వఱువట్లుగొను** అ. క్రి (వఱువట్లు + కొను) మిక్కిలి యెండు

క విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగంద పుటప లొకింత చిలచిలమని వే,గిరము వఱువట్లుగొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముం గని కలఁ కన్ కళా 6 255. (శ. ర)

**వఱ్ఱియ(ఱ్ఱె)** వి టీటిక (శ ర)

**వఱ్ఱు** వి జౌ అనౌ ప్రవాహము, వెల్లి

ఉ. . ప్రేటులఁ గ్రీడసల్పి పృథివిం బడు వీరులఁ ద్రొక్కికొంచు నెౘచ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱుసేయుచున్ భార విరా. 3 163

క హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసి తుది వగచు నతులప్రజ్ఞా, సానుమదారూఢుఁడు వగ, మానఁడు దురితమనువఱితి కోడక యునికిన్ భార. శాం 3 352

వ మిన్నేటి పెన్నీటి వఱ్ఱున మునుంగ కుండ ... మనుచ. 3. 9

విశ అధికము, మిక్కుటము

ఉ గొఱ్ఱెలు పాడిపైరములు కోకలుదూకలు ముందు ముందుగా, వఱ్ఱుగనిచ్చి వచ్చి తల వాకిలిఁ గాతురు రేతిరింబగల్, గుఱ్ఱ వయస్సు మల్లరపుఁగోఁడెలు సైరికరాట్కుమారకుల్. వైజ 2 72

క పూనివడిఁ దిగిచి యష్టమ,హా నాగమ్ములను మిద్దియలుగా ప్రేళ్ళన్, మానుగఁ గొందఱు దాల్తురు, వాని ఫణామణుల రుచులు వఱ్ఱుగఁ బ్రమథుల్ శివతత్వ 336 ప

**వఱితిపాలు** = ప్రవాహాధీనము, వ్యర్థము

ఉ సీదుసం, భావన లన్నియున్ వఱితి పాలుగఁ జేయుట నాకు మంచిదే, జీవిత కాంతు గాదు .. భా రా యు 1619

**వఱుతఁగలయు** = ప్రవాహమునఁ బడిపోవు, చెడు, నశించు

క కనుఁగొని సింహద్వీపా, వనినాథుఁడు తన తపంబు వఱుతం గలయన్, మనసిజభీషణ సమ్మోహనబాణపరంపరాభిహతమానసుఁడై వరాహ 8 123

క మున్నొనరించిన పాపము, లగ్నియుఁ బెను వఱుతఁ గలయు నవగాహన సం,పన్నులకు. విక్ర 2 214

జ వట్టేఱు, వట్టోడి, వట్టోడు

**వట్టేఱు** వి (వట్టు+పఱు) మంచి ప్రవాహముగల నది

ద్వి ఒరవంగ వట్టేట నోడ యుండంగ, వద రూఢి నట్టు లీవసుమతిలోన బస పు 201 పా 20 పం

ద్వి చక్కడ్చి రారోటఁ ద్రొక్కి దేహంబు, గ్రక్కున వట్టేటఁ గలువంగఁ జూచు .. పండితా పురా 144. పా

**వట్టొడ(డ్డి)=వట్టోడి** వి ప్రవాహము

ఉ వారణ దానవాహినులవట్టొడిఁ దేలుచు నున్న వాఁడు. కు సం 11. 671

ఆ అతిరయమునఁ బఱచు నయ్యేటివట్టొడి, పోఱు దవ్వగాఁగ ఘూర్ణిఘుండు మార్క. 5 230

**వట్టోడి=వట్టొడి** (√ వట్టోడు) ప్రవాహము

సీ. బెడిదంపు వట్టోడిఁ బడిన పేరడవి చందంబున ఒహుల పదాతిచయము.

గీ వికటముగఁ ద్రెళ్లె నలుగడ విచ్చె నొక్క, పెట్ట వెస డొల్లెనిఱఁ జాఁపకట్టుబడియె భార ద్రోణ 3 62

గీ విలసితోత్తుంగశశికాంతశిలలఁ గదిసి,యరుగు శశిఁ గని శిలలెల్లఁ గరంగి పెరిగి, తెరలి పర తెంచు వట్టోడిఁ దేలిపాఱు, నుడుగణేశుండు వెండి పేరోడవోలె. కు సం 3 253., భార అను 2 446, భార. శాం 3 307

**వట్టోడు** అ. క్రి (√ వట్టు) ప్రవహించు

క తేనియముసురో యమృతపు, వానయొ పుండ్రే క్షురసము వట్టోడిన పెల్లో నాఁ దుంబురునారద, గానరసం బతవు నోలగంబునఁ బర్వెన్ కు. సం 9. 235.

**వల[1]** వి (క బలె త బలై) 1 జాలము, చేఁపలఁ బట్టు సాధన విశేషము

(దీని భేదములు—అనుకువల, ఎడవల, డొంకవల, త్రోపుడువల, దాఁటుడువల, మెడవల, సన్న వల మొ (శ ర.)

ఆ వానినెల్లఁ ద్రుంచి వల ద్రవ్వికొని లీల, నిగుడు చోఱవోలె వెగడు వడక, తఱిమి రక్తనదులు వఱపె భార కర్ణ 3 158

క నీవలకుఁ జిక్కె లోకము, లీవల నీవలకుఁ జిక్కదే జలరాశిన్ దశా 1 160

2 గాలము.

ఉ ధీవరులార గాలము తుదిం బదిలంబుగ నెఱ్ఱ గ్రుచ్చి మీ,రీ వగవై చివం దగులనేటికి నాకిది వింత మాంసముం, గావలె నంచు వచ్చితిని గావున నీవలనేఁడు మీహాయ, గ్రీవుని గ్రుచ్చి వైవుఁడు దశా 1 280

3 మృగములు పక్షులులోనగు వానిని పట్టెడు వాగుర, ఉచ్చు

క వెలివాఱును గాలురులును, వలలుఁ దెరలు దీమములును వడిఁదీరిన కు,క్కలు నారెగోలలును నుం,డల గ్రోవులు వేఁట కారడంబుఁ బెను పఁగన్. ఉ హరి 4 22

ఆ ... మూతి నరప మీసముల బోయముదుసళ్లు, పంది వలలు మోచిపరచిఅపుడు మనుచ. 4 36

4 మాయ

క నీ వలకుఁ జిక్కె లోకము,లీవల నీ వలకుఁ జిక్కదే ... దశా. 1 160

**వలలఁబడవైచు** = మోసముచేసి వశపఱచుకొను.

గీ తరుణులందెల్ల సముఁడైన దక్షిణుండు, నేర ములుచేసి పెక్కు నివారణంబు, లొందియును జేరుధృష్టుండు సుందరులను, వలలఁ బడవైచు వాఁడెందు వెలయు శరత. గంధ. 1 180

జ వలత్రాడు, వలరాయఁడు[2], వలవాఁడు.

**వల[2]** వి కామము, వలపు

క కాదంబరిఁ ద్రావింతును, ఆఁదంబాడింతు వలలఁ జొక్కులఁ బెట్టం, బైదలుల నియోగింతును, వైదర్భతనూజమీఁది వలపుడిగింతున్. నైష. 7. 120.

క వ్రాలని నీ చన్నులతో, వ్రాలెడు జక్కవలు సరియె వలలం బెట్టం, జాలెడు నీ కన్నులతో, జాలకి సదృశములె వలలఁ బడు మత్స్యంబుల్. క్రీడా 1 91

క ఈ రీతిఁ గొంతకాలం, బారామమహా మహీధ్ర రారణ్యములం,దారామవలలఁ దగిలి వి,హారము సలుపంగ గర్భమై తటియగుడున్. మనుచ 6 37

జ. వలకాఁడ, వలకాఁడు, వలకారి, వలకాటి తనము

వల³ విశే కుడి, అపసవ్యము.

(వలనుశబ్దమునకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము)

చూ వలకన్ను, వలకేలు మొ

వలంబము = అవలంబము నం వి అ పుం.

వలఁకు = వలను వి 1. దిక్కు.

క నాలుగువలఁకుల నవఘన, జాలంబులు వ్రాలి కురిసె ఝుంఝానిలవే, గాలోలములై బహుళ, స్థూలపయోధార లోలిఁదుములంబులుగాఁ భార. అర 4. 135

చ కొలఁకులు దేఱెఁ బద్మినులకుం గనువేఁదురు దీఱె మేఘముల్, వలఁకులఁ జేఱె డొంకలను వంకలఁ బంకములాఱె ... కృ. శకుం 1 44

క పొంకించుఁడు మీ యిట్టులఁ, గొంకుల పీసంపుగుండ్లఁ గొమ్ములు మరులం, బొంకించి దిగువ గాలివలంకుల బండంగి బండ్లు వఱ పుండనుచున్ ... కకు. 4 73.

2. పార్శ్వము

ద్వి వలఁకుల వ్రాసిన వన్నె చిత్రములు, దలలు గదల్పఁ జైతన్యముం బొరసి .. ద్వి హరిశ్చ పూ 972

3 ఒప్పిదము

చ వలకుఁగ మిన్ను మానికపువంగడపుం దొర లెన్నఁడేనిఁ బాఱుల యెడ వల్లబోదురె యెఱుంగ మినైన బెడంగుడాల్గనీ .. అచ్చ రా. బాల. 205

వలఁకువు వి వలఁకు, దిక్కు (శ ర)

వలఁతి విశే 1 ప్రవీణుఁడు, నేర్పరి.

మ హిత మిఛ్ఛంగిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నంచేను నీ, మతి బోధింప వలంతినే... భార ఉద్యో 3 80

ఆ. వలఁతివి నా తోడ, నాడు మనిన భాగి యను మతమున దశకు 5 68

2. సమర్థుఁడు, సమర్థురాలు.

మ కురువీరాగ్రణి బాహ్లికుం డలిగినం గోదండ పాండిత్య మెవ్వరుఁ జూపంగవలంతులే. ఉ హరి 4. 128

గీ ఇతని కియ్యాగమునకు విను మేనచుప్పె, వలఁతి శుశ్రూష సేయంగ వత్స భార ఆశ్ర 1 148

3 అనుకూలము

గీ వరుణునకు డాఁగికొనఁ జోటు వలఁతియగుట మదధి నాయక భావంబు నుపకరించె హరి 5 12

జ వలఁతితనము, వలఁతియీఁటె

వలఁతితనము వి (వలఁతి+తనము) ప్రావీణ్యము, నేర్పు

గీ . అజ్జన్నిగట్టుఁ, గొలము తలమానికము తన వలఁతితనము, గనఁబడఁగ నిట్టులని తెల్పఁగాఁ దొడంగె ...

వలఁతియీఁటె వి (వలఁతి+ఈఁటె) ఒక విధమగు ఈఁటె, కుంతవిశేషము

గీ. వలఁతియీఁటెలు ధరియించి వచ్చి రలర, రక్షకులు శాతతరముల ప్రాంతవారు పి శకుం 1 113

వలకట్టు స క్రి (వలను+కట్టు) అనుకూలపఱచుకొను

వ. అతఁడు దాను విద్యాధికుండు కాకుండుటం జేసి నిజగౌరవశైథిల్యభయంబున నితరులగు విద్యాధికులకు రాజగృహంబునఁ బ్రవేశంబులేక యుండ దౌవారికాది సకల పరిజనచక్రంబును వలకట్టుకొని యుండుటయు.. కళా 6 155

వలకడ వి (వలను+కడ) దక్షిణపు దిక్కు. (శ. ర)

వలకన్ను (వల³+కన్ను) కుడికన్ను, దక్షిణ నేత్రము.

సీ పచ్చవార్వపుజోదు పచ్చవార్వపుజోదు వలకను కొడుకునై వలపు గులుక అచ్చ రా జాల 3

**వలకాఁక** వి (వల$^2$+కాఁక) మన్మథాగ్ని, విరహతాపము

సీ సకియనుం గెమ్మోమ్మవిచక్కెర ల్జుల్లక వలకాఁక పెనుదప్పి వదలు కెట్లు . నీలా 2 36

**వలకాఁడు** విజ (వల$^2$+కాఁడు) కాముకుఁడు (శ ర )

**వలకారి** విజ (వల$^2$+కారి) కాముకుఁడు, వలపించువాఁడు, వలపించునది.

వ .. నారులంబు నారతరంబులకు వెలయించి కొనిపోవువలకారుల జారుకొప్పుల దొరఁగు విరిగుత్తులతో .. వసు 4 23

సీ ఎఱుగు నాయనఁ గూడ దివ్వుడివ్వుడు కొంత గడిదేఱలే వలకారి వగల ... కువల 3 99

గీ తలిరులకటారి వలకారి ఘాటిఘోటి, చిలుకచిలుకలకొలికి ముంగలను నిలిచె అచలా 2. 94

సీ వక్ర భావంబులు వలకారి బాగులు వలసియొల్లములును వట్టిపసలు పాండు 3 43

**వలకారితనము** వి (వలకారి+తనము) కాముకత్వము

సీ పలుమాఱుఁ దన్రమోల కలికి చేఁతుల కోడివలకారి తనమున వన్నెఁ బెట్టు ... వి పు 6 19

**వలకేలు** వి (వల$^3$+కేలు ) కుడిచేయి

మ వలకేల్దాపలికిం గుచస్తబక సేవాలోలతం బోవ కళా 1 3

**వలక్షము** సం విజ (అ అ అ ) తెల్లనిది, శుక్లము వి అ పుం తెలుపు, శుక్లవర్ణము

**వలగండ** వి. శూద్రులలో నొక తెగ

వ వెలమ వేకరి పట్రగొల్ల బలిజ కుమ్మర వలగండ బెస్తల చిప్పె తొగట గాండ్ల వారును... హంస. 3 29

**వలగాక** అవ్య (వలనగు ధా. వ్యతిరేకక్త్వార్థకము) వలమపడక, పీలుపడక

మ దనుజాధీశ తపోనలంబు త్రిజగద్దాహంబుగావింప నెం,దును నిల్వవ్ వలగాక వచ్చితిమితోడ్తో వహ్నివారింపుము .. దశా 4 76

**వలగొను** స క్రి (వలను+కొను ) 1 ప్రదక్షిణించు, చుట్టుతిరుగు

క వినయంబున మ్రొక్కి బంధువితతిం బ్రీతిన్ భా రా సుందఁ 20

క వలగొని యాలింగనముల, నలరించుచు వారిచేత నాశీర్వాదం, బులు గై కొనుచును. భా రా సుంద 21

చ చెలఁగి వివాహ వైభవముచేకొని రాముఁడు సీతయున్ శిఖన్, వలగొని వచ్చి సప్తముని వందనమున్ గురువృద్ధబంధు మం,డలయుగ పత్ప్రణామము నొనర్చి పరస్పరలజ్జలాత్సరం, బిలఁ దగువారితోడుత భుజించిరి బువ్వమునన్ వధూవరుల్ రామా 4 127

క అని పలికి యపుడ యనలము, ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందన్, దన వల్లభుఁ దలఁచుచు వల,గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్ .. భార శాం 3 335

2 చుట్టుకొను, పరివేష్టించు

సీ ప్రతిరోధి వరణవర్గముఁ ద్రోచి తన్మహా భోగశాలి క్షేత్రములు హరించు, వలగొన్న బహురాజ వంశ గుల్మంబులఁ బలుదెఱంగుల గ్రుచ్చి పాఱవైచు . వసు 1 68

సీ మినువాఁక వలగొన్నగొనబువిన్గొప్పుపైఁ గలిగి కొన్నెల వంక వెలయువాఁడు పె శకుం 1 13

క చెలువెల్లఁ దల్లడిల్లుచు, వలగొని దరినిలిచి యకట వలవంత నెకల్, బలువయ్యె ... నీలా 3 31

**వలగొల్పు(లుపు)** స క్రి (√ వలగొను) వలగొను, వలగొనఁజేయు, వలయాకారముగ ముంచు

చ ఉవిద తదుక్తి కంత చెవియొగ్గక పోఁబెనఁగన్విభుండు కేల్దవిలిచి చుట్టునించుక యొడన్ భుజముల్ వలగొల్పి పొమ్మనవ్, సువదన వెల్విడందిరుగ శ్రోణిభుజస్తన వేణికాభర, శ్రవణకపోలముల్ వతిని సారెకు సోఁకుచుఁ దేల్చెఁ దృష్టి వులవ్ ప్రభా. 5 41

**వలగ్నము=అవలగ్నము** సం వి. అ పుం. న. మధ్యము, నడుము

**వలచు**[1] స అ క్రి (సం. వల్) 1. అపేక్షించు. కోరు.

క వేవురఁబోలెడు వాని మహావీర్య గుణాఢ్యు నొక్క యాత్మజుఁ బడయం గా వలతు నపేత గుణుల్, వేవురు సుతులయ్యు నెందు విఫలము కాదే . భార అర 2 350

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు, జెల వీకుఁ జెప్పనేల వలసె భార సభా 2 228

గీ నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య, రహిత చిత్తులు మగవారు రాజు దీనిఁ, దలఁచి భయ మంది నిన్ను నీ వలఁచు నెడకు, నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె .. భార విరా 3. 69

వలచు, కోరు, ఇచ్చించు దీనికి వ్యతిరేకార్థము లందు 'ఒల్ల' అనునది విభాష నాదేశం బగును

ఉదా. వలవఁడు=ఒల్లఁడు

చ ఉరవడిఁ బోరికై కవచమొల్లరు మంత్రము లందుఁ దక్క ఆము. 2 34

చ .. పవినయత్వము ధైర్యము చిత్రమయ్యె నీ, వలచినకోర్కులిత్తు వనివార్య బలోజ్జ్వల వేఁడు మిచ్చెదన్ . బ్రహ్మోత్తర 4 289

చ వలచినయేని నభ్యువనవంద్యునకున్ శివయోగి నేతకున్, బోలకయుగారవం బయిన పుత్రకుఁ డొక్కఁడ .. హర. 2. 68.

2 కామించు, మోహించు.

క. సుందరి మా యిద్దఱలో, నం దెవ్వరి వలతు సెప్పుమా యనవుడు .. భార ఆది 8. 110.

చ తన మది వల్చుభామినికి దక్కిన నిక్కఁపు మోహిఁ బోలెనే, మనుజుఁడు బుద్ధి నిల్పు మురమర్దన దివ్యకథానుభూతిపై, వనిశము మత్ప్రియుం డతఁడ యట్లగుటన్ వినుపింతు నీకునేఁ, గని వినియున్న గోప్యమున గమ్యమునైన యథఃప్రపంచమున్. పాండు 2 219

మ తొలుతన్ మేనకొన కింతసేపు పెనఁగున్ దోడ్తోడ నాసక్తిమై, నలుపున్ సిబ్బితి వల్పియున్ వలవమిన్ సైరించి యంతన్ ధృతిన్, దొలగించున్ బ్రియముప్పతిల్ల రతులన్ సొక్కించి, మల్లభూ 2. 24

చ .. వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్ పారి పీఠి 22

ద్వి ధర్మమూ జగతిలోఁ దనయుని వలచు, దుర్మార్గురాలని దూషించువారు . సారంగ. 3 107 పౌ 1 పం

అ క్రి 1 తగు, యుక్తమగు

గీ వనమునకు వచ్చి నవయంగవలవ దుడుగుఁ డనిన నుడుగక మీతోన యరుగుదెంతు, మనిరి, బ్రాహ్మణుల్ భార అర 1 36

క వలవని ప్రేలరిమాటల, నలిగింపకు నన్ను నేమి యాడిన నింకం, దల ద్రెవ్వ వేయుదున్ భార ద్రోణ 5 370

చ. వలవదు తల్లి నీకుఁ దగువాని వయోగుణ రూపవంతు నీ, వలచిన వానిఁ జేసెద నవశ్యము నీవు దపంబు సేయఁ బోఁ, దలపకు మమ్మ ... కు సం 6 664

2 అక్కఱయగు, ఆవశ్యకమగు

వ్యతిరేకములందే యీ యర్థమున దీనికిఁ బ్రయోగము

క ... ఇందులకై, నీయత్నము వలవ దవల నేను న్నాఁడన్ ... ఆము 2 93

సీ గజరాజగమనసింగారంబుఁ గనుగొనవలవదే కన్నులు గలుగు ఫలము .. దశా 2 307

క ఇక్కడ నిను వీఁ డెవ్వఁడో, యిక్కరణిన్ మోపవుచ్చి యేలుకొనంగా, నక్కట వలవని శంకల, నక్కడనే పాడుకాపు లాగతిమంటిన్... కళా 3 260

3. సమర్థుఁడగు

ఆ ద్రోణకర్ణశల్యదుర్యోధనులుఁ గృప, బాహ్లికులును జముఁడు పట్టికొన్న, వానినైనఁ గావ వలతురు వలచిన, నొల్లకున్న నెట్టులోకొ యెఱుంగ ... భార ద్రోణ 2. 290

(వలఁతులు భా ల వ్యా. పా)

సీ మనలోన నెవ్వరే మాత్రంబు దాటఁగా వలతురో కనుఁగొన వలయు దశా. 9 10

4. ప్రియపడు.

గీ. చాల వలచితి నతనినే సత్యమిదియ ... నైష 2 26

గీ వలతునే భక్తకోటికి పారిజాతము, లలన యా భక్తకోటియు వలచు నాకు పార 2 13

ఒల్లనయ్యెద అ క్రి ఒప్పనైతి.

చ. అన్నవచనవృత్తి నాదగు మనంబున నెక్కొని యున్కిఁ జేసి యాహవమున కొల్ల నయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్ భార అశ్వ 4 7

ఐ వల², వలదొర, వలపించు, వలపు¹, వలపు గొలుపు, వలపుకత్తియ, వలపుకాఁడు, వలపు కీలు, వలపుటిక్క, వలపుదేవర, వలపు రాయఁడు, వలపులరాచజోదు, వలపులరాజు, వలపులఱేఁడు, వలపులాఁడి, వలరసము, వల రాకటారి, వలరాచపని, వలరాచరాచవాఁడు, వలరాచలచ్చి, వలరాచవాఁడు, వలరాజు, వల రాచెక్కము, వలరాయఁడు, వలఱేఁడు, వల వంత, వలవంతతనము

వలచు²(లుచ్చు) అ. క్రి 1 (వాసన) గొట్టు

క పాలవలచు నేమికిడొకొ, కలిగెడు వని తలఁచి మనసు గలఁగఁగ . భార శాం 3 500

తరలము తనువు మీన్పొల వల్చు జాలరి దాన నట్లును గాకయే, ననఘ కన్యక .. భార ఆది 3 40

సీ. పటిచుంచుఁ దలలును ..

ఆ . . గదురు వలచు కంపుగాలిమచ్చాయయుఁ, గలుగు నెఱుకు ముసిఁడి గనిరి సతులు ... కు సం 6. 694

చ. . లే జవరాలు చెక్కుగీఁ,టిన వసవల్చు శాల కుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే నైష 1 17

సీ ... త్రోళ్లు త్రేలాడెడు తుంటిపై బ్రహ్మ కమ్మల చింపి దోవతి ముఱికి వలవ,

గీ. ముసలిబ్రాహ్మణుఁడై వేదములు చదువుచు . . వరాహ 6. 17

వల్పమి వి వల్చుధా వ్య భా.

ద్వి కాయధూపం బొందుగంపు వల్పమియుఁ, గాయంబుతోడన కైలాసమునకు ... అరుగు చెంతయును జోద్యము గాదె ... పండితా. పురా. 137 పొ

2 పరిమళించు, సువాసన గొట్టు

గీ వలచుఁ గస్తూరి నిగరాల తలుపు దెఱవ, గాజు టోవరిలో ధూపగంధలహరి ... నైష. 7 154

సీ కనటువో బీఱెండఁ గరఁగి కట్టల వంటి గమగమ వలచు చొక్కపు జవాజి . మను చ 2 55

ద్వి .. బుగ బుగ వలచు కర్పూరంబుఁ బునుఁగు ద్వి హరిశ్చ పూ 683. పం

3 దుర్వాసనవేయు, దుర్గంధముఁగొట్టు

గీ పదహతి బ్రస్సివలచు, వరుగుఁ దఱచగు ముఖుబ్రోవ వరిగి యెదుట, .. ఆము 6. 17.

వ వలపు², వెఁపురాల్పరి, వలపుమోపరి, వలపు కొండ.

వలచుట్టు న క్రి (వలను+చుట్టు) పరివేష్టించు, చుట్టు కొను

క. సురకామిని దన నయనము, లరుదుగ వల చుట్టి వచ్చునను టనిజముగాఁ, దిరుగుచుఁ బరిమండలి తాం,బరపల్లవయై నటించె మరుగొడుగు క్రియన్ ద్వా. 1 134

(వృత్తిని వర్ణలోపము)

ద్వి అలమౌనిసుతుఁ డున్నయట్టి కుంజంబు, వల చుట్టియుండిరి వలచుట్టినట్లు . ద్వి పరమ. 2 66 పొ. 15 పం

అ క్రి

ఉ నావలచుట్టి హర్షకలనావలమానమనోంబుజం బుతో, నావలనైరిఁ బల్కు వచలాగ్రణి ... వసు 5 26

ద్వి చనుదెంచి యాహస్తిశైలవాసునకు, వలచుట్టి రాఁగ యాళ్వందారు వారిఁ, దెలియంగఁ గన్గొని .. ద్వి పరమ 8 591, పొ 5 పం

వి వలగొనుట. (శ. ర)

వలచూడ్కి వి (వల³+చూడ్కి) కుడికన్ను

సీ అలిగి బలారి సౌరాష్ట్రంబు నిగిడింప నదిశౌరి వలచూడ్కియందు డించె ... పారి. 5. 30

వలచే=వలచేయి వి. (వలను+చే) కుడిచేయి.

చ. ... అడరుచు నట్టహాసముఖుఁడై వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్ ... భాగ. 10 ఉ 916,

క అశరువుమచ్చులగుదిక్కర్ణి కానువర్ణంబు మధు
పనికరముగలత, మిన్నక విలసంచి దివస వైశ్య
కులాగ్రణి వాయిగట్టె సంధ్యావేళన్ వరాహ
4 138

**వాయిదకాఁడు** విశ (వాయిదము + కాఁడు) వాద్యము వాయించువాఁడు
ద్వి. కరమర్థి వాయిదకాండ్రు ముంగలిని, బిరుదుకాళియలచేఁ బెల్లు నాదింప .. ద్వి పఁమ 7 551 పా

**వాయిదకారి** విశ (వాయిదము + కారి) వాద్యమొనర్చువాఁడు, వాయించువాఁడు
చ అరుదుగ వాద్యవిద్య బిరుదందినవాయిదకారులత్తఱిన్, కరములురెండు నొక్కసరిగా మురజంబులు ముట్టి దిమ్మనన్, మొరయఁగఁజేసి . వైజ 1 128

**వాయిదము** వి (నం వాద్యమ్) వాద్యము
వ . నీరుపోరులాతనికి మేలివాయిదంబులనగు సంతసం బలవడఁజేయ) అచ్చ తె భార వి 2 31 పు.
సీ. ... పలుదెఱుంగుల కోరుకలుగు వాయిదములు గడితంపుటుఱుము చేష్టడులుగాఁగ అ రా బాల 164., నీలా 3 48
జ వాయిదకాఁడు, వాయిదకారి

**వాయిదార** వి (√వాయి) (త వార్యాశై) వంకలు గల కత్తి.
సీ వాయిదారవఁబడు వంకలుగలకత్తి . ఆం భా. 2 218

**వాయివిళంగము** వి. (√వాయి) క్రిమిఘ్నము, విడంగము (వృ వి) (చి ని శ. ర., వా,)

**వాయుకేతువు** నం వి ఉ పుం ధూళి, దుమ్ము

**వాయుగండము** నం వి అ పుం (ఽజీర్తిచే) కడుపుబ్బుట

**వాయుగుల్మము** నం. వి అ పుం 1 తుపాను, పెనుగాలి 2 జాలావర్తము, నీటిసుడి

**వాయుగోచరము** నం వి అ పుం వాయువు సంచరించెడి ప్రదేశము.

**వాయుజాతుఁడు** నం వి. అ పుం 1.హనుమంతుఁడు. 2 భీముఁడు
(ఇట్లే వాయుతనయుఁడు, వాయుతనుజుఁడు మొ )

**వాయుడుప్ప** అ త్రి (వా+ఉడుపు) నోరుగట్టు
క ఏ యెడఁ బతిఁ బొడగానక పలుమఱు, వాయుడుపక చీరు నేడ్చువడివాపోవున్ కు సం 5 547

**వాయుదారువు** నం వి ఉ పుం గాలిచేఁ జీల్పఁబడునది మేఘము, మబ్బు (వాచ.)

**వాయునిఘ్నుఁడు** నం విశ (అ అ అ) 1 వాయువుచేఁ బాధింపఁబడినవాఁడు 2 స్థిర బుద్ధిలేనివాఁడు, వెఱ్ఱివాఁడు

**వాయునివృత్తి** నం వి ఇ స్త్రీ 1 శాంతి, నిశ్చలత. 2 వాతరోగము మానుట.

**వాయుపురాణము** నం వి అ. న. పదునెనిమిది యుపపురాణములలో నొకటి (చూ ఉపపురాణము. సూ ని )

**వాయుఫలము** నం వి అ న 1 వడగల్లు, వర్షోపలము 2 ఇంద్రధనుస్సు

**వాయుభక్షణము** నం వి అ పుంసర్పము, గాలిమేపరి, (ఇట్లే, వాయుభక్షము )

**వాయుభక్షుఁడు** నం వి అ పుం గాలి యాహారముగాఁ జేసికొని బ్రతుకుచు తపస్సుచేయు ఋషి. (ఇట్లే, వాయుభక్షకుఁడు )

**వాయుభుక్కు** నం వి క్ పుం. 1 వాయుభక్షుఁడు 2. వాయుభక్షణము.

**వాయువర్త్మము** నం వి న్ పుం న వాయుపథము, ఆకాశము

**వాయువాహము** నం. వి అ. పుం పొగ, ధూమము

**వాయువాహిని** నం వి. ఈ స్త్రీ శుద్ధరక్తనాళము, శరీరమందలి వాయుసంచారము గల నాడి.

**వాయువు** నం వి ఉ పుం 1 గాలి. 2 వాయుదేవుఁడు. (పశ్చిమోత్తర దిక్కుల మధ్య దిక్కున కధిపతి). 3 ప్రాణవాయువు (ప్రాణాపానవ్యానోదాన సమాన భేదమునఁ బంచవిధనగు వాయువు.) 4 రోగసంబంధమైన వాయువు, వాతధాతువు చెడుట

**వాయుసఖుఁడు** నం వి అ పుం అగ్నిదేవుఁడు

**వాయుసమము** (నం విశ. అ. అ. అ) వామాన్యంపమైనది, వాయువేగము గలది

**వాయోడు** అ [క్రి (వా+ఓడు) 1 పలుకవెఱచు, మాటాడవెఱచు

క. .. మాయయ్య పెద్దకొలువున, వాయోడక యిట్టనంగవలయుంజుమ్మీ ... భార ఉద్యో 1 369.

సీ పదిరి యేఁగోపింప భయము నొందు, భర్జించినను మాఱు పలుకక వాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధిసెప్పు భాగ 4 స్కం 815

2. సంకోచించు, వెనుదీయు

సీ గి విరహిజనముల పాలింటి వేఱువిత్తు, దురితముల కేల వాయోడుఁ దుహినకరుఁడు. వి శకుం. 3 182.

**వాయ్వాస్పదము** నం వి అ న గాలి సంచరించు తావు, ఆకాశము

**వార** 1 ఎనిమిది పుంజముల మూల 2 (శ ర, [బ్రౌ)

(పన్నులోని) కొలఁత (చి ని)

సీ న్యాయంబు కేలు తప్పని కోరువారి తీర్పులవల్ల వచ్చు ధాన్యములు సువర్ణాదాయములును .. ఉ హరిశ్చ 1. 67

2 తారతమ్యము, హెచ్చుతగ్గులు (శ ర ,[బ్రౌ)

**వారంగము** నం వి అ పుం 1 కత్తిపిడి, ఖడ్గముష్టి. 2. పిడి యమర్చుట కేర్పరచిన సన్నని కొన

**వారక** అవ్య. (√ వారు) 1 మిన్నక, ఊరక.

క. ఈరాజకుమారుఁడు దను, గారవమునఁ బెనుపఁ బెరిఁగి కడుఁ [గొవ్వికదే, వారక వాఁడిటు చేసెను, మీరిమొద లెఱుఁగ రివియె మీదు విమర్శల్ భోజరా 5 302

2 తప్పక, అవశ్యము.

క. : బృం, వారక యువతీలోచన, వారులు వెననింకుఁగాక వారక యుంకన్ హరి ఉ. 4, 101

3. అడ్డు లేకుండఁగా

ఉ. వారల బాణవర్షములు వారక నిల్పుచుఁదాము వారిదు,ర్వారశర [పతానపరివారిత దేహులఁగా నొనర్చున్, వారిజనాభుఁడు . హరి. ఉ 3. 143

4 ఉడుగక, నిరమింపక

చ ఉచిత మనోనురాగదహనోష్ణభరంబున నాలతాంగికిన్, హృదయమునందు జొబ్బిల వహించిన చందనకర్దమంబు బు,స్బుదముల నీనెఁగల్పితవిభూషణ జాలమృణాలవల్లరీ, వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్. నైష 2 114

ఉ ... వి,శ్వాసము భక్తియు న్నీతము శాంతియు దాంతియు నొప్ప నంతరా,ధ్యాసితశంభులింగ సముదాయము వారక సంభజించుచున్ కాశీ 4 301

**వారకము** 1 దే వి లేని కాలమందు ఇతరులకు వాడుకొనుటకు ఇచ్చి కలిగిన కాలమందు మరలఁ బుచ్చుకొనెడు ధనాదికము.

క వారణఘోటకభాండా, గారంబులు మొదలు గాఁగఁగల ధనములతో, సూరిమత యుండఱము నీ, వారకములు గాఁగ మమ్ము నగవుము బుద్ధిన్ భార ఆది. 8. 152

ద్వి వలసిన జీతంబు వారకంబులును, కొఱఁది మీఱఁగ నిచ్చి కూడిక నుండు .. [ప్రభులిం 1. 4 26

([బ్రౌ. పా. వాడకంబులు ము[ద్రిపా.)

2 తాకట్టు

సీ. ... పలుకుల చెలువంబుఁ గలికి కింముల కు వారకం బిచ్చితే పవలగంధి.. వి[క 7. 62

సీ. తాకట్టు కుదువ యుద్దర వారకం బీడనంగను నాధి చెలంగుచుండు ... ఆం. భా 2 229

**వారకము** నం విజ (ఐ. రికా అ) అడ్డు పెట్టునది, ఆటంక పఱుచునది

వి అ పుం. 1 ఒకజాతి గుఱ్ఱము 2. గుఱ్ఱము. 3 అశ్వగతి విశేషము, ఒక విధమగు గుఱ్ఱపు నడక.

వ 1 నొప్పి కెట్టు చోటు, కష్టస్థానము 2 [హీబేరము, కురువేరు, ఒక దినుసు పరిమళ[ద్రవ్యము.

**వారకి** నం. వి. న్ పుం 1 ఎదిరివాఁడు, శ[తువు 2. సము[ద్రము. 3 మంచి లక్షణములుగల యొక జాతి గుఱ్ఱము 8 పర్ణాశనుఁడు, ఆకులు తినీ జీవించుచు తపస్సుచేయు బుషి.

**వారకీరము** సం వి అ పుం 1 బడబాగ్ని 2 దువ్వెన 3 పేను 4 పందెపు గుఱ్ఱము

**వారకీరుఁడు** సం వి అ పుం కీఁమువలెఁ జమత్కారముగాఁ బలుకువాఁడు 1 శ్యాలకుఁడు 2 భారవాహకుఁడు, బరువుమోయువాఁడు, కూలివాఁడు

**వారట** సం వి. అ స్త్రీ = వరట

**వారటము** సం వి అ న 1 క్షేత్రము, పొలము 2 క్షేత్రసమూహము కొన్ని పొలములగుంపు

**వారడ** వి (√ వారు) తాటాకు వారిన చివ్వ. (శ. ర.)

**వారడి** వి. నష్టి, లోపము

వ్యవ. ఆ వారడి యిందు కలిసివచ్చినది. (శ ర.)

**వారడు** స. క్రి. చాలించు (శ ర)

**వారణ** సం వి అ స్త్రీ చెలియలికట్ట (శ ర)

**వారణబు(షు)స** సం వి అ స్త్రీ కదళి, అరఁటిచెట్టు

**వారణము** సం. విణ (అ ఈ అ.) నివారించునది, అడ్డగించునది

వి అ న 1. నివారించుట అడ్డగించుట, అడ్డము 2 విఘ్నము, ఆటంకము. 3 ప్రతిఘటనము, ఎదిరించుట 4 పాలనము, రక్షించుట

పుం. ఏనుఁగు. పుం. న కవచము

**వారణవల్లభ** సం వి ఆ స్త్రీ కదళి, అరఁటిచెట్టు

**వారణసి** సం. వి ఈ స్త్రీ = వారాణసి

**వారణావతము** సం. వి. అ పుం న పాండవులు నివసించిన యొకానొక పట్టణము

**వారత్రము** సం వి అ న తోలువాఱు, తోలుపట్టె

**వారది** వి. (సం వారధిః) వంతెన చి ని ) (వారధి అని. శ. ర, ప్రౌ.)

**వారధి** సం వి ఇ పుం వంతెన

**వార(లు)పట్టు** స క్రి ఆచమించు, త్రాగు.

సీ ... గీ అమరనుతముగజారణ్యమది మదీయ, వసతి యిహసౌఖ్యమంతయు వారపట్టుఁ, నీ సొమ్ము నిజమని పలికి చనియె .. శేష 4 197

సీ. రథచక్ర నేమినిర్గత ధూరణోరాజివార్ధు లో కుక్కుమ్మడి వారపట్ట . . జై భా 5 3 (ఇట నించుక, అని భావము )

ఉ. వార లసంఖ్యకోటు లనివారితవిక్రమశీల వాలి పాథోరుహ గర్భసర్గము వధూమయమయ్యె వనంగ నిండి దే, వారి చమూ సమూహముల నాజిఁ ఒడల్పడఁ గొట్టి నెత్తురుల్, వారలు వట్టి రప్పుడు బలశయమైన రురుండు తెంపునన్. వరాహ 11 124

**వారపోయు** స. క్రి త్రాగుటకు పోయు.

వ్యవ. గ్రామ దేవతకు కల్లుఁ వారఁ బోయుట కొందఱ యాచారము

**వారబు(బూ)ష** సం వి ఆ స్త్రీ కదళి, అరఁటిచెట్టు

**వారము** సం వి అ పుం 1 మూఁత, కప్పు, ఆచ్ఛాదనము 2 సంఘము, సమూహము. 3. రాశి, ప్రోవు 3 మంద, పశువుల గుంపు 5 భాన్వాది వారము (భానువారము, సోమవారము. మొ.) 6. వంతు 7 తడవ, పర్యాయము 8 తటి, తరుణము, అదను 9 ద్వారము 10 నదియొక్క యావలి యొడ్డు

వ. 1 మద్య భాండము, కల్లుకుండ 2 జల సంఘము, నీటి మొత్తము

**వారముఖ్య** సం. వి ఆ స్త్రీ వేశ్యలలో ముఖ్యురాలు, పలువురు గారవించెడి వేశ్య

**వారయాత్రికుఁడు** సం. వి అ పుం పెండ్లి కుమారునితో వచ్చిన చుట్టము

గీ వార యాత్రికు లనుమోదవంతులగుచు, వలచి రుచియించి రోగిఁ బిండివంటకములు .. . నైష 6. 120

**వారల** సం వి ఆ స్త్రీ 1 కందురీఁగ 2 వరట, హంసి

**వారవాణము** సం. వి అ. పుం. న కవచము, యోధుల మైమఱువు

**వారవాణి** సం వి ఇ పుం 1. వాంశికుఁడు, పిల్లనగ్రోవి యూఁదు వాఁడు 2. గాయకుఁడు, పాటగాఁడు 3 న్యాయాధికారి, తీర్పరి 4. సంవత్సరము

స్త్రీ ఇ ఈ వేశ్య

**వారవిలాసిని** సం వి ఈ స్త్రీ = వారాంగన

**వారవృష** సం వి ఆ. స్త్రీ 1 ధాన్యము 2. అరఁటిచెట్టు

**వారవేల** సం వి అ స్త్రీ. భాన్వాది వారములందు వర్జ్యకాలము, దుర్ముహూర్తము శుభ కార్యారంభము చేయఁ గూడని కాల విశేషము

**వారసు** వి. (హిం వారిస్) జ్ఞాతి, దాయాదుఁడు
సీ చెవిటి రాయసమైన సేవకుఁడట్లయిన వారసుగాఁడు దివాను నయిన వేమ శ 46

**వారసేవ** సం వి అ స్త్రీ 1 వేశ్యావృత్తి లంజెటికము.

**వారాంగన** సం వి అ స్త్రీ సర్వజనమునకు సామాన్యాధి కారముగల స్త్రీ, గణిక, వేశ్య

**వారాంనిధి** సం వి ఇ. పుం సముద్రము

**వారాణసి** సం వి ఈ స్త్రీ – వరణ – అసి. అను నదుల నడుమనుండు పురము కాశీపురము

**వారాశి** సం వి ఇ పుం నీటి ప్రోవు – సముద్రము

**వారాహకందము** సం వి అ పుం పంది గడ్డలు (వ్య. వి)

**వారాహకల్పము** సం వి అ పుం బ్రహ్మమాన మున నొక మాసమునందు వచ్చు ముప్పది కల్పములలో నొకటి, శ్వేత వరాహ కల్పము
(కల్పములు — 1 శ్వేత వరాహ కల్పము. 2 నీల లోహితకల్పము. 3 వామదేవ కల్పము. 4. గాథాంతర కల్పము 5 రౌరవ కల్పము 6. ప్రాణ కల్పము. 7 బృహత్కల్పము. 8. కందర్ప కల్పము 9 సత్యకల్పము. 10 ఈశాన కల్పము 11 ధ్యాన కల్పము. 12 సారస్వత కల్పము 13 ఉదాన కల్పము. 14. గరుడ కల్పము. 15 కౌర్మ కల్పము 16. నారసింహ కల్పము 17 సమాధి కల్పము 18 ఆగ్నేయ కల్పము 19. విష్ణుజ కల్పము 20 సౌర కల్పము 21. సోమ కల్పము 22. భావన కల్పము. 23 సుప్త మాలి కల్పము 24. వైకుంఠ కల్పము. 25. ఆర్చిష కల్పము 26. వల్మీ కల్పము 27. వైరాజ కల్పము. 28. గౌరీ కల్పము. 29. మహేశ్వర కల్పము 30. పితృ కల్పము అనునవి ముప్పది ఒక్క కల్పము బ్రహ్మదేవున కొక దినము

**వారాహపురాణము** సం వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి, వరాహ పురాణము

**వారాహము** సం విశ (అ ఈ అ) వరాహ సంబంధి, అడవి పందికి సంబంధించినది.
వి అ పుం 1 పంది, అడవి పంది. 2 మహాపిండీతకము, నల్లరంగుగల పెద్ద మ్రంగ చెట్టు

**వారాహి** సం వి. ఈ స్త్రీ 1 ఆఁడు పంది. 2. భూమి 3 వరాహావతార మెత్తిన విష్ణుని శక్తి, సప్తమాతృకలలో నొకతె. 4 పరిమాణము, కొలత

**వారి** సం వి ఇ న 1 నీరు, జలము, ద్రవద్రవ్యము. 2. కురువేరు, హ్రీబేరము.
ఇ. పుం 1 ఖైది, చెఱఁబడ్డ వాఁడు. (విల్సన్సు).
ఇ ఈ. స్త్రీ. 1 ఏనుఁగును గట్టెడి చోటు. 2. గజశృంఖలము, ఏనుఁగును గట్టెడి గొలుసు లేక త్రాడు 3 ఏనుఁగును బట్టుకొనఁ ద్రవ్విన గొయ్యి, ఏనుఁగును బట్టుకొనెడు లోను 4 నీటికుండ. 5 సరస్వతి 6. మాట, వాక్కు.

**వారించే** సం స క్రి నివారించు, అడ్డగించు
అ ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁ జూచి వారు వెఱచి, లోని కెఱుక చేసి . భార శాం. 6 263
క మదిలోపలఁ దలకుచు, నభ్యుదయం బైనట్టి లగ్నమున గద్దియపైఁ, బదమిడు నెడ వారించుచుఁ, బదియాఱవ బొమ్మ భోజపతి కిట్లనియెన్ ద్వా. 7. 2

**వారికర్పూరము** సం వి అ పుం మత్స్య విశేషము, ఒకజాతి చేప

**వారికుబ్జము** సం వి అ పుం శృంగాటక వృక్షము.

**వారిక్రిమి** సం వి ఇ పుం. జలగ.

**వారిచరము** సం విశ. (అ. ఈ అ.) నీటిలోఁ దిరుగునది
వి అ పుం 1. చేప. 2 నీటి జంతువు, జలచర జంతువు

**వారిచామరము** సం వి అ. న నాఁచు, శైవాలము.

**వారిజము = వారిదము** వి. పారిభద్రకము (వ్య. వి.)
సీ ... వారిజే మంచనఁ బారిజే మంచన పారిభద్రాఖ్యమై మీఱు వెమ్మి...ఆం భా. 2. 48

**వారిజము** సం. విణ. (అ. ఆ. అ.) నీటిలోఁ బుట్టినది
వి. అ. పుం. 1 శంఖము 2 ఆలిచిప్ప, కప్పచిప్ప, శంబూక
న. 1 పద్మము 2 ఒక దినుసు లవణము (ద్రోణి లవణము) 3 గౌరి సువర్ణమను నౌకానౌక మొక్క 4 లవంగము

**వారిణము** వి. మత్స్య బంధన విశేషము, చిన్న చేప లను బట్టెడు సాధన విశేషము. (శ. ర.)

**వారిణ(ర్ణ)ము** వి. ఒకజాతి డేగ
క. మఱియు సాళువంబుల శని శరంబులు వారిణంబులు బేసడంబులు జలకట్టెలు తలుకుమించు మొదలగు డేగలం గరంబులంగల బెత్తంబుల హత్తించి ఇందు 2 60
గీ. వారిణంబును జలకట్టె బైరిగిద్ద, చంచడము సాళువము శనిశరము మించు, వేస్త్రిమును తలుకాదిగ వేలవేలు, నొప్పుడేగల జత గూర్చుకుండుటయును. ప్రబం 1 171.
సీ. వార్ణము భైరిజావశము సాళ్వము డేగగూడ జాతుల్లంగి కుందశేలు యాదియైన పతులతఁడు దీర్చు. హంస 3 18

**వారితస్కరము** సం. వి. అ. పుం. 1 మేఘము 2 ముస్త (వృ. వి.)

**వారితస్కరుఁడు** సం. వి. అ. పుం. 1 సూర్యుఁడు. 2 మేఘుఁడు

**వారిత్ర** సం. వి. ఆ. స్త్రీ. ఛత్త్రము, గొడుగు

**వారిదము** = వారిజము వి. కొండబూరుగు, పారిభద్రము
క. మదిఁగొలుకోలు నిగుడఁగ వ,ప్పది మొగముల జోడుజేనిపై నూఱ్ఱులుకుల్, చేద లద్రువ వేసి విరివా,రిదము తెలుంగొందఁజేసి వేల్మిడి నొంచెన్ అ. రా. యుద్ధ 504

**వారిదము** సం. వి. అ. పుం. మేఘము, మబ్బు న. ముస్త (వృ. వి.)

**వారిధరము** సం. వి. అ. పుం. మేఘము, మబ్బు

**వారిధి** సం. వి. ఇ. పుం. 1. సముద్రము. 2 కలశాదికుండ మొదలగునది.

**వారినాథము** సం. వి. అ. పుం. 1 సముద్రము. 2 మేఘము. 3. పాతాళలోకము.

**వారినిధి** సం. వి. ఇ. పుం. సముద్రము

**వారిపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. నాఁచు (వృ. వి.) (శ. ర.)

**వారిప్రవాహము** సం. వి. అ. పుం. సెలయేఱు, నిర్ఝరము, కొండ కాలువ.

**వారిబాలకము** సం. వి. అ. న. హ్రీబేరము, కురువేరు (వృ. వి.)

**వారిభవము** సం. వి. అ. న. సౌవీరాంజనము.

**వారిము(ముక్)చము** సం. వి. చ్. పుం. జలదము, మేఘము, మబ్బు.

**వారిరథము** సం. వి. అ. పుం. ఓడ, పడవ.

**వారిరాశి** సం. వి. ఇ. పుం. 1. నీటిప్రోవు, సముద్రము. 2 జలాశయము, మడుగు.

**వారిరుహము** సం. వి. అ. న. పద్మము, తామర

**వారివాహ(న)ము** సం. వి. అ. పుం. 1 మేఘము. 2 ముస్త (వృ. వి.)

**వారిశుఁడు** సం. వి. అ. పుం. నీటిపైఁ బరుండువాఁడు, విష్ణువు

**వారిసంభవము** సం. వి. అ. పుం. 1 లవంగము. 2 సౌవీరాంజనము 3 ఉశీరము, వట్టివేరు

**వారీశుఁడు** సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు. 2 వరుణుఁడు

**వారు** అ. క్రి. 1 ఉడుగు. (దీనికి 1. 2. అర్థములలో వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేకార్థక విశేషణ రూపములే కానవచ్చుచున్నవి)
ఉ. వారక వడ్డికిచ్చి కుడువన్వెర వారిన దానశీలు. భార. శా. 5 249.
ఉ. వారని మంచుపైఁ బొదివి వచ్చిన పోయిన చొప్పు మాసినన్, ఘోరినఖాగ్రముక్తమయి పొల్పగు ముత్తెపుఁ జాలు వెంటఁద, చ్చారణ లేఁగి కాంతురు హత ద్విపకేసరి వాద వేళలం, దారొక వాసికాంద్రు వలెఁ దక్కఁగ నూల్కొనఁ జేయుదానముల్ పి. శకుం. 2 105
ఉ. శ్రీ రఘువీర శేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కుచిల్క ముం,జే రహియింప సీతఁగని చెల్వరో పీయధరంబు బింబికా, శ్రీరసమొల్కఁగా చిలుక చేరెడు నంచునొ జిల్గునవ్వులన్, వారక మాటు సేసెదవు వంచవ సేతురె యాశ్రయించి వన్ ఉ. రా. 6 50.

2 తక్కువయగు

చ మహాధనరాశి వేల్మి వారిని విభవంబు తోడ ధృతరాష్ట్రుడు సేసె శతాశ్వమేధ ముల్ భార ఆది. 5 42

చ . వారని కృప నట్టు లిచ్చితి వ ంబని యాయము పల్కె నత్తఱిన్ కళా 4 166

చ. ... మన్మథభూ, వరుండు దగంగరాఁబనిచి వారని మన్నన నాదరించుచున్ . నిర్వ 1 2

౩ ఎతియ వ్యాఖ గంజి వారెను

న. క్రి. 1 (తెర మొ) పట్టు

మ కలధౌతద్రవచిత్రము ల్మెఱయముక్తాస్యూతమౌ మేచకాంచలపుం జెందెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ బెద్దలు వంపన్ . ఆము. 7 67.

(6 131 ప్రాంత ప్రతి)

క మెఱయంగా మధుపర్కము. కఱకంఠుని కిచ్చి వెనుక కమనీయముగా, మఱిఁగట్ట నిచ్చి కన్యకు, మఱుపుగఁ దెరవారఁ బంచె మహి తాత్ముఁడై. నిర 3 1 67

3. రెండు చేతులతో తాటాకు ఒరచిప్పుట (శ ర)

౨ పొట్ట, నొక్కు

సీ. ... సుత్తెనాటుల వారు తెత్త సొమ్ము సొం పలరించె నెవ్వాఁడు సాంబునకును ... రా వి. 1 7

౺ వారక, వారడ, వారుకొను, వారుచే

**వారుంతము** సం వి ఆ పుం సర్పశ్రేష్ఠము, మేలు జాతి పాము

పుం న 1 కంటిపునీ, నేత్రమలము 2 చెవిలోని గులిమి, శ్రోత్రమలము 3 ఓడలోని నీరు తోడెడి తొట్టి

**వారుఁడు** సం. వి ఆ పుం శివుఁడు

**వారుకొను** న. క్రి (వారు+కొను) రెండు చేతు లతో నాకర్షించు

వ. ... అరవిందబాంధవో పలబృందంబులఁ దిల కించి మందానిలస్పందిత గళితలలితమందార కోరకంబు లని వారు కొనంబోవు భృంగాంగ సుందరుల సాంద్రతర సంభ్రమంబుల కచ్చెరు వడి ఇందు. 1 157.

**వారుచే(ర్చు)** అ క్రి. ఆచమించు

క చనదు మిసినవార్చకునికి నతుతుఁడై వన్... భార అను 4 115

గీ. ప్రీతి మంచంబుపై నుండి పీఁట నుండి, చెప్పు పావలు దొడి తలచీరచుట్టి, నవ్వుచును మాట లాడుచు నడిచి నడిచి, వంగిశయనించి నిలు చుండి వార్చఁజనదు విజ్ఞా 1. 53

ఉ ... నవ్య వస్త్రంబు ధరించినప్డు దురితంబులు చూచినయప్డు పుణ్యకార్యంబుల యప్డు హేయముల నంటిన యప్పుడు వారు వందగున్ కాశీ 5 204

గీ చంద్ర పుష్కరిణీ తటస్థలిని దేవ, విభుని నిలబెట్టి శంకాని వృత్తిఁ నేర్చి, వచ్చి వారి చి మరఁగంగఁ బుచ్చుకొనగ, నొదిగి యుంతైనఁ గదలింప నోప లేక శేమ. 4 283.

వ క్రి. 1 (సంధ్యను) ఉపాసించు.

గీ స్నానమాడెను వార్చెనే సంధ్య యగ్ని, హోత్ర మొనరించెనే యింతి పుత్రుఁడనిన . కాశీ. 4. 86

చ ... జాహ్నవీతటమున సంధ్య వార్చి జప తత్పరుడై తగువాని యామినీ, పిటకుల శేఖరుం గొనుచు ... విజ 1 78

క వేదము చదివిన ఫలమున్, వాదించిన ఫలము సంధ్య వార్చిన ఫలమున్, బైదలి నీకు నొసం గెద శుక 1 408

2 ప్రక్షాళించు, కడిగికొను.

మ కలయం జేతులువార్చి యున్నతొడ బాగా లిచ్చి దశా 7 280.

క ఎంగిలి వార్చగ నిచ్చెదె, బంగరు నెఱగిండి తోడఁ బరువడిఁ గొక సారంగ విలోచనయా వృప, పుంగవులకు మదిని గూర్మి పొంగా రంగన్ . రసి. 1 77

క నవ్వినఁ గముఁగొని పొదవిన, నివ్వెర చేతులను వార్చి నృపవరుఁడంతన్, నివ్వటిలు సంది యంబున, జవ్వాదు మనంబుతో హజారము చేరెన్. శుక 3 231

3. ప్రతిఘటించు.

గీ అనఘ నారాక వార్చి నీవధిక నిష్ఠ, నిట్టులుని
కికిఁ గారణమేమి భార భాం 6 573

మ కలపం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కంబొల్లఁ
డెల్లప్పుడున్, జలకంబాడి మదాగమంబు
మదిలో నన్వార్పుఁ గంనుండు రా, తెలమి
న్మెచ్చిన గట్టు వాలిది యవన్ హరి వూ.
9 28

4 అపేక్షించు

ఉ. అతఁడు ముఖ్యజాతిగని నంతన పాయుచు నెండ
గాలి నెం, తో తడవుం బ్రసాద విని యోగము
వార్చి వసించుచున్ ఆము 6 7.

5. అభిలషించు, కోరు.

ఉ. ... మూవున నవ్నియు వచ్చెనేని సే, నక్కిలి
కేలి తక్కు కలమారయు మంతుకు శేయు
వేఁగినన్, బెక్కువగ న్మదిం బోడమి బిడ్డల
నేమము వార్తు భూవరా మార్కం 8. 66.

6. కెడయు, వీడు, ఎడయు

సీ. . వార్చె నాఁకడిగె నుపాసించెఁ గెడసె
నుద్దేశించె నాఁగను దేజరిల్లు ఆం. భా. 3 186.

**వారుచే(ర్చు)** న. క్రి. (' ' వారు) వడియజేఁయు
వ్యవ వంటలక్కగంజి వార్చెను.

జ . వాప్పు

**వారుణము** సం వి (అ ఈ అ ) 1 వరుణ సంబంధి.
2. వరుణునికి మీఁదు కట్టబఁడినది 3 వరుణున
కియ్యబడినది.

వి అ పుం భరతవర్షము నందలి తొమ్మిది భాగ
ములలో నొకటి.

వ. 1 జలము, నీరు, 2. శతభిష బ్నక్షత్రము

**వారుణి** సం వి. ఇ పుం 1 అగస్త్యుఁడు
2 భృగు మహర్షి.

ఈ స్త్రీ 1. పశ్చిమదిక్కు 2 మద్యము 3. శత
భిష బ్నక్షత్రము. 4. దూర్వా. గరిక (వ్య
వి ) 5. వరుణుని భార్య

**వారువపుజన్నము** వి (వారువము + జన్నము) అశ్వ
మేధయాగము

గీ. అనుచు నిటులొజ్జ చెప్పినయట్టు లతనిఁ, దోడు
కొని వచ్చి వేల్పులఁ బొలుమ దనియ, కాలు
లుగఁ కాలులనుగూర్చి వారువంపు, జన్న
మొనరించి యారాచమిన్న మఱియు అచ్చ
రా జాల. 58

**వారువము = వావురము** వి 1. గుఱ్ఱము

ఆ వారువంబు నొక్క వసుమతీ రుహామునఁ,
గట్టి నీడనొరగి కన్ను మొగిచె .. వరాహ.
8 66

క తోరపు లత్తుక చాయల, వారువములుగట్టి
మహిషవర కేతువు సె, ళ్వార సమకట్టి తేరా,
సారథి గొనితేర నెక్కి సంరంభమునన్ ఉ
రా 3 348.

సీ. గీ. .. వాయుజవములు తవితేరి వారువ
ములు .. కాశీ 3 10

2. వాహనము

ఉ తెల్లనిహాము పాముపును తెల్లని వార్వము
నెక్కు బిడ్డఁడున్, తెల్లని దివిపై విడిది తెల్లని
తమ్ముల మీరు కన్నులున్, తెల్లని మోము గుఱ్ఱ
మును తెల్లని మామయు తెల్ల కైదువున్,
తెల్లని కోడలుం గలుగు తెల్లని కూఁతురితండ్రిఁ
గొల్చెదన్ రుక్మాం 1. 60

చ. బలు తెలిపుల్గు వారువము బంగరు పీఠెయు...
నీలా 1 6

జ వారువపు జన్నము

**వారువు** సం వి ఉ. పుం. విజయకుంజరము,
యుద్ధపు టేనుఁగు

**వార్క్షము** సం విజ (అ ఈ ఆ.) 1. వృక్షములు
గలది. వృక్ష సంపన్నమైనది 2 వృక్షములచే
నేర్పడినది, వృక్షసంబంధి 3 చెట్టు పట్టతోఁ
జేయఁబడినది, నారది

వి అ న వృక్షసమూహము, అడవి.

**వార్ధికుఁడు** సం. వి. అ పుం బ్రాయపుగాఁడు, శేఖ
కుఁడు

**వార్త** సం వి ఆ స్త్రీ. 1. ఉనికి 2. వృత్తాంతము,
సమాచారము 3 జీవిక, వృత్తి 4 వైశ్యవృత్తి,
వాణిజ్యము, సేద్యము, కృషి. 5. అన్వీక్షక్యాది
విద్యలలో నొకటి, దీనియందు లాభాలాభములు
తెలియవచ్చును. 6. వంగ చెట్టు, 7. దుర్గ.
8. (అలం) వర్ణనావైభవము

వ. ... వార్తలేని కవిత్వంబు వోలెఁ జెన్నుదఱిగి...

(ఈ క్రింది యర్థము లాంధ్ర గ్రంథములయందు మాత్రమే కానవచ్చు చున్నవి )
1 ప్రసిద్ధి, వార్తకెక్కు = పేరుపడు
సీ తే తుంగభద్ర ప్రసంగ ముత్తుంగభద్ర, రాజి రాజిల్లు గౌతమి యోజ మటియు, వార్త కెక్కిన తీర్థప్రవర్తనముల, స్వామి వినిపించె వింధ్య సంస్థయితకు పాండురం 1. 148.
చ తెగిన మనోభవుం దిరుగఁ దెచ్చి కుజంబుల కెల్లఁ బ్రాయముల్, మగుడఁగనిచ్చి యన్య భృత మండలి మూగతనంబుపుచ్చి ము, జ్జగముల వార్తకెక్కిన వసంత భిషగ్వరుఁడాప్తుఁడయ్యు నుం, ద్రిదగుగతి మాన్పలేఁడ మఱి తఱిణ వాయువునందు జాడ్యముల్ కవిక 4 4
2 లోకోక్తి.
అ మోహమునకుఁ బోవ మొన లెత్తుకొనిపోయె, ననెడు వార్త నిక్కమగు నటంచుఁ, గ్రుంక వెఱతు రెవ్వరును ... విజ వి 2 43
ఆ. ఒక్కనక్క వల గతుక్కునఁ గొఱికి తా, నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము, వసుధ నక్కఁ గన్నవాఁడెల్ల వేటకాఁ, డనెడు వార్తనిక్క మయ్యె ననఁగ. శుక 1. 166
3. నీతి.
చ నిగమసుభాషితాఖ్యననిష్ఠలు గల్గిన పండి తోత్తముల్, మగువల పొందు నింద్యమని మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్ ... భర్త 2 71
నీలివార్త = అసత్యపు ప్రతీతి
**వార్తము** నం.విణ (అ ఆ అ ) 1 ఆరోగ్యవంతము, నెమ్మదిగానున్నది. 2 అసారము, దుర్బలమైనది 3. వృత్తి (జీవిక) ననుసరించినది
వి అ. న 1 క్షేమము, ఆరోగ్యము. 2. ప్రావీణ్యము, నేర్పు. 3 పొట్టు, ఉముక.
**వార్తాకము** నం. వి. అ. పుం. వంగచెట్టు.
**వార్తాకి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. న్. పుం. వంగచెట్టు.
**వార్తాకువు** నం. వి. ఉ. పుం. స్త్రీ. వంగచెట్టు.
**వార్తామాత్రము** నం. వి. అ. న. 1. కేవలము, వదంతి చెప్పుకొనుమటయే. 2. యేవిషయముఁలో పైపైన పైపై తెలివి, అల్పజ్ఞానము.
11
**వార్తాయనుఁడు** నం. వి అ. పుం. వార్తాహరుఁడు, దూత.
**వార్తారంభము** నం వి. అ. పుం వ్యాపారము, వాణిజ్యము.
**వార్తావహుఁడు** (నం వి అ. పుం ) దూత, రాయబారి.
**వార్తావృత్తి** నం వి ఇ. పుం కృషి వాణిజ్యముల వలన జీవించువాఁడు, వైశ్యుఁడు
**వార్తావ్యతికరము** నం. వి అ పుం సామాన్యవదంతి, అందఱు చెప్పుకొనుట
**వార్తాహరుఁడు** నం వి అ పుం. = వార్తావహుఁడు.
**వార్తిక** నం వి. ఆ. స్త్రీ. పక్షి విశేషము, మీలవల్లంకి పిట్ట
**వార్తికకారుఁడు** నం వి. అ పుం. కాత్యాయనుఁడు, పాణిని సూత్రములకు వార్తికము రచించిన ముని.
**వార్తికము** నం విణ (అ ఆ అ ) 1 వార్తకు సంబంధించినది, వృత్తాంత సంబంధమైనది 2 వార్తను దీసికొను వచ్చునది 3 వివరించునది, టిప్పణ రూపమైనది
న ఉక్తానుక్తదురుక్తార్థవ్యక్తికారి
సూత్రముల యందుఁ జెప్పఁబడిన యర్థయును వివరించునదియు నను క్తమగు దానిని చెప్పునదియు, దురుక్తము (భిన్నముగాఁ జెప్పఁబడిన దానిని) సరిగాఁ జెప్పునదియునగు సూత్ర ప్రాయమైన గ్రంథము
**వార్తికుఁడు** నం. వి అ పుం. 1 సందేశ హరుఁడు, దూత 2. కృషివలన వాణిజ్యమువలన జీవించువాఁడు, వైశ్యుఁడు.
**వార్త్రఘ్నుఁడు** నం వి అ పుం. ఇంద్రపుత్రుఁడు, అర్జునుఁడు.
**వార్దము** నం వి అ పుం. మేఘము, జలదము
**వార్దరము** నం. వి. అ న. 1 నీరు 2. పట్టు. 3. వాక్కు, మాట 4. గురివెందగింజ. 5 గుజ్జము మెడమీఁది సుడి. 6. దక్షిణావర్త శంఖము. (మే. ని.)
**వార్ధకము** నం. వి. అ. న. 1. ముదిమి, వృద్ధత 2. ముదిమి వలనఁ గలిగిన యశక్తి 3. వృద్ధ సమూహము. 4. వృద్ధునిపని.

వార్ధక్యము సం. వి అ. న. 1. ముదిమి. 2. ముదిమి వలనఁ గలిగిన యశక్తి.

వార్ధి సం. వి. ఇ. పుం. సముద్రము.

వార్ధిభవము సం. వి అ న సాముద్రము, సముద్రపు టుప్పు

వార్ధుషి సం. వి ఇ. న్ పుం వడ్డి వలన జీవించు వాఁడు, అన్యాయమైన వడ్డి కప్పిచ్చువాఁడు.

వార్ధుషికుఁడు సం వి అ పుం. = వార్ధుషి.

వార్ధుష్యము సం. వి అ న వృద్ధికై (వడ్డికై) అప్పిచ్చుట, అన్యాయమైన వడ్డి.

వార్ధ్రి సం వి అ స్త్రీ. వాఱు, తోలు పట్టె

వార్ధ్రిము సం వి. అ న =వార్ధ్రి

వార్ధ్రీణసము సం వి అ పుం 1 ఖడ్గమృగము. 2 పొడువైన చెవులుగల యడవి మేక

వార్పు(రుపు) వి (√ వారుచు²) 1 అన్న రసము. గంజి.

సీ .. వఱలు నన్నరసంబు వార్పు గంజి, యనఁ గాను ... ఆం భా 2. 25

2 ఆచమనము.

సీ. . . ఆచమనీయాఖ్య యలరు వార్పనఁగను... ఆం. భా. 2. 178.

3. (గంజి) వడియఁ చేయుట

సీ. వని వంటవార్పుల బాధలించుక లేక తీరిన మంచి సంసార మొదవె .. హంస 4 146

సీ. నిలనీని వంట వార్పులు వత్తమామల పోరును లేని కాపురము గలిగె ... శుక 3 600

వార్పటము సం వి. అ పుం మొనలి

వార్మణము సం వి అ న. కవచధారుల సమూహము, మైమఱువులు తొడిగిన యోధుల గుంపు

వార్ముక్కు(చము) సం. వి చ్ పుం మేఘము, మబ్బు

వార్యము సం. విశ (అ ఆ అ) 1. నివారింపఁ దగినది, అడ్డగింపఁదగినది. 2 వరింపఁ దగినది, కోరఁదగినది.

వార్యోకము సం. వి. అ. పుం. జలగ.

వార్వణ సం. వి. అ. స్త్రీ. మహిళావిశేషము, ఒకజాతి యీఁగ.

వార్వపుటగ్గి వి. (వార్వము+అగ్గి) బడబాగ్ని.

క. అగడితలోఁగెందామర, మొగడలు గనుపట్టెఁ జాల మూఁకై చూడన్,దగి మున్నీటం దేలుచు, బెగడని వార్వంపుటగ్గిపిల్లలు వోలెన్ యయా. 1. 80

గీ. అరయఁ దీవంచవార్వంపు టగ్గిపట్ల, నడుమ నడరొందు వాఁడెంపుఁ బుడమిఱేఁడు, శిల్లఁ గదలింపలేని యివ్విల్లు దునిమె, విప్పుడితని మగతనం బెన్నఁదరమె అ. రా బాల 184

(వార్వపుటగ్గి పట్టులు = సముద్రములు.)

వార్వము వి వారువము.

గీ. వఱలు నేనిక తిండి వార్వమును దొలుత, గాఁగఁ దానెక్కి .. కళా. 3. 62.

జ . వార్వపుటగ్గి

వార్షము సం విశ. (అ. ఈ అ) 1 వర్ష సంబంధి, వర్షాకాల సంబంధమైనది. 2. సంవత్సరమందైనది, ప్రతిసంవత్సరము వచ్చునది.

వార్షికము సం విశ. (అ ఈ అ) 1 వర్షముల సంబంధమైనది, వర్షాకాలసంబంధి 2. ప్రతిసంవత్సరము వచ్చునది 3. సంవత్సరమునకు వచ్చునది, ఏడాదికి సరిపోవునది

వి అ న ఒకానొక మందుదినుసు చెట్టు

వార్షిల సం వి అ స్త్రీ వర్షోపలము, వడగల్లు.

వార్షుకము సం విశ (అ ఈ అ) వర్షించునది, వర్షించు మేఘము.

మ. ... లవణాబ్ధి స్నీరము న్గ్రోలివార్షుకము ల్దియ్యనినీరముల్ గురియునే చోద్యంబుగా కెయ్యెడన్ .... దశా. 1. 88.

వార్ష్ణేయుఁడు సం వి. అ పుం 1 వృష్ణి సంతతి వాఁడు. 2. కృష్ణుఁడు 3 నలుని సారథి

వాఱంటువిల్లు వి (వాఱు+అంటు+విల్లు) రాళ్ళ వనివాంఁడ్ర వాఱుకట్టిన పెద్దవింటికోల. (శ. ర)

వాఱు వి. (త. వార్.) సన్నగాఁ గోసినతోలు.

సీ. ... హారంబు బరు వని యలయు లతాతన్వి వాఱుల నెట్టికై వడిధరించు .... చిత్రభా. 3. 111.

వ. ... కురువేరువాఱులను తమ్మితూండ్ల ప్రక్కల పల్లంబులును గల పచ్చటెక్కల వాలుమాయి నెక్కి ... సానందో. 5. 136.

జ. వాయింటువిల్లు, వాయికోల చంద్రా 2 38

**వాయికోల** వి (వాయి+కోల) కళ, కొరడా

వ ... గిలుకలుగదల్చి తగు వాయికోలలువైచిన వీథి వీథుల జగన్మోహనంబుగా నటించు నాహవంబుల మోహారంబులు చూచుచు. కుచేల 2 10.

**వాఱెన** వి. 1 వేఁట కుపయోగించు సాధనము

ఆ ఉరులుజిగురు గండెదెరలును లోసులు, వాఱు వాఱెనలును వసులు గసులు, మిఱ్ఱపలలు పేట్లు గోళ్లు దీమంబులు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు. పి శకుం 1. 116

2 ఒకవిధమైన పగ్గము, బలమైన త్రాడు.

ద్వి. భోరునమ్రోకులు గోరెవాఱెనలు, గోరె యనుచు వింత గూడ బెట్టుచును పండితా దీకా 40 పా

సీ. . బలజనాథుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి, వాఱెనయుఁ జక్రరథకద్వయముఁ ద్రుంచి, కల్లుబిల్లలుచేసి వెగ్గలమునవ్వె ఉ హరి 3 99

ఉ. పగ్గపుం, ద్రాడును మోకువాఱెనయుఁ దాలిచి ముందఱ వెన్కఁజుంగు ద్రేలాడఁగ. శేష 4 ఆ.

**వాఱెనపీఁట** వి (√ వాఱెన) పఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగానుండు కొయ్య (శ ర)

**వాల** సం వి ఆ స్త్రీ 1. కొత్విరచెట్టు. 2 పసుపు (వృ వి). 3 మల్లెతీఁగ. 4 త్రుటికాలము

**వాలంపఱ** వి (వాలు+అమ్ము+పఱ) బాణసమూహము

క కాలింగుని కరిఘటలం, గ్రాలి కలము దూల నడచు ఘనపవనమున, ట్లాలంబున వాలంపఱఁ, దూలించిరి దోర్విలాసదుర్దము లగుచున్. హరి. ఉ 3. 123.

**వాలకతనము** వి (వాలకము+తనము) మోసము.

గీ. వాలకతనంబుమాని నిర్వ్యాకులగతి, కోకిలా యేకడల నీడు కాకలివి, రావములరంగ నిభోజ రాజసహజ, వినయ మెనయంగఁ గొల్వుమీ వేడు కలర. ఇందు. 4. 59.

**వాలకము** వి. 1. వేషము.

సీ. .. ఒకవేళ మాయివాలకముతోనసి సహాయం బుగాఁ బరశోధనం బొనర్చు .. కువల. 1 98

గీ. వేషమగు వాలకమ్మువాఁగ, వేన మన. ఆం భా 2 149

ఉ ప్రాజ్ఞుఁడు తజ్జ్ఞుఁడుత్తముఁడు పావనమూర్తి మరుత్సుతుండు సర్వజ్ఞుఁడుగానిచోఁ దపసివాలకముల్ విలునమ్ము లున్న వంచజ్ఞత నమ్మకున్న పవనాత్మజు నమ్మఁగఁ బల్కి మమ్ము మాప్రజ్ఞ లెఱింగి సత్యమ్ముదుఖామల సంధి ఘటింపనేర్పునే సమీర 3 8.

వ ... ఇక్ష్వాకులు మనవాలకపు సొమ్ములందు నేమేనియు నపహరించుటకు వఞ్చాడుచున్నవారు ప్రభా. 1 107

2 మోసము

చ శుకుఁడను దూత పంక్తిముఖచోదితుఁడై చనుదెంచి కీశసైనికనికరంబు పెంపు ధరణీవరు తెంపును జూడవాని వాలకమొకవీర వానర లలాముఁడు కన్గొని పట్టితెచ్చి కానుకయిడ రాఘవుండు కృపనూల్కొనఁగా విడిపించి పంచినన్ రామా 7 162

జ వాలకతనము.

**వాలఖిల్యుఁడు** సం. వి అ పుం = బాలఖిల్యుఁడు, ఒకానొక ఋషి.

**వాలధి** సం వి ఇ పుం పసుఁగు, గుఱ్ఱము మొదలగు వాని తోఁక (శ. ర)

**వాలపాశ్య** సం వి ఆ స్త్రీ జడబిళ్ల, పారితథ్య (శ. ర)

**వాలము** వి. (సం వ్యాళః) బెబ్బులి, వ్యాఘ్రము.

క వాలమ్ముల దంష్ట్రాకర, వాలమ్ముల వెత్తి సెలసి వాలమ్ములపెం, జాలమ్ములఁ దగిలిన కిటి, జాలమ్ముల దూఁకె నింద్రజాలమ్మనఁగన్. సారంగ. 1 102

**వాలము** సం. అ పుం 1. ఆచ్ఛాదనము. 2. జుట్టు, 3 గుఱ్ఱము, పసుఁగు మున్నగువాని తోఁక వెండ్రుకలు. 4. తోఁక. 5. అయిదేండ్లఁ యీడుగల పనుఁగుగున్న. 6. గుఱ్ఱపుపిల్ల, 7. మత్స్యవిశేషము.

**వాలయించే = వాలాయించే** స. క్రి. నిర్బంధించు.

క ... ఏవారికి నిన్ను వాలయింపఁగ నేలా ....
భోజ. 5. 352

**వాలయిగుడు** వి (వాలు + అయిగుడు) వాలిఁడి
క్రోఁతి, తోకలేని క్రోఁతి (శ. ర)

**వాలహస్తము** సం వి అ పుం 1 వెండ్రుకలు గల
తోఁక 2 వెండ్రుకల సమూహము (శ ర.)

**వాలాయము** వి 1 నిర్బంధము, నిరోధము

శా త్రైలోక్యంబు భుజాప్రతాపమున నిర్వ
క్రంబుగా నేలుచున్, హేలావాంఛకృతిఁ గామ
గ త్రి నగరీప్వార్యప్రచారంబులన్, వాలా
యమ్మున మమ్ము వెట్టిగొనుచున్ వర్తింపు
చున్నారు మీ,రాలస్యం బొనరించిరన్ బ్రతుక
శక్యం బెట్లు మాబోంట్లకున్. భీమ 4. 119

శా రావై రాగ్యముఁబూని నీవు కడునిర్దాక్షిణ్య
చిత్తంబునన్, రావై తేజివిగాని యిందులకు
వాఁడాహారిగాఁబోరియే, లా వాలాయము
సేయఁగా బ్రతుకు నీవాచారమంతుండవై .
మను 3 94.

2. ఎల్లప్పుడు

శా .. కేళిం దేలఁగ నేను దుంబురుఁడు సంగీత
ప్రసంగంబులన్, వాలాయంబుఁ గరంగఁ
జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా భాగ
7. 102

విశ. 1 అనివార్యము

శా పౌలస్త్యాన్వయ చంద్రకూరులకు సౌభ్రా
త్రంబు బాంధవ్యమున్, వాలాయం బన
వచ్చునే . ఉ రా 2 227

సీ ... మతులు పుట్టిరయేని మతులకు మృత్యువు
వాలాయమై వెంట వచ్చెనేని, బ్రహ్మచేతను
వీఁడు పాపేమియును లేక యుండునే నదు
పాయ మొకటి లేదె .. భాగ. 10 పూ. 38.

2. అనుకూలము.

క. ఆలు పతిసౌఖ్యములకల, వాలాయంబైన దాని
యాలన వచ్చున్, అలాగువఁ గాకుండినఁ,
గాలుని పెనుదూత కదర కదియఁగ వేమా.
వేమ. 2. ఆ. 209.

3. నిరంతరము.

సీ. .... ఆ వేలుపు పేలికఁ జుట్టి రానేను చేతు,అ
వెదల్పు వేల వాలాయంబుగాఁ గన పూడ్పు
యల్కి భజించుచున్న జనుల, చేతఁ బూజలు
గొను బూతనా బూతవారి భర్త . పాండు.
5 67

4. యథావిధి, విధివిహితము

సీ. వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసి రన్న
సంప్రాశనం బర్భకునకు . కాశీ 4. 13

5. అవశ్యము, తప్పక

క. వేలం బాతిన నన్యుల, పాలవు ధనమొండె
ముచ్చు పాలవు ధరణీ, పాలునిపాలవుఁ
గావున, వాలాయముఁ గుడువ విడువ వలయు
న్ధనమున్ విక్ర 2 178

క. ఏ యెడ నవదలమెఱు వా,లాయము విన
వలయు దుర్బలప్రబలంరా,జా యన వినవే
ధరణీ, వాయకులకు నార్తరక్షణంబులె క్రతు
వుల్ మనుచ 4 74

క దూలాలు పెంకినుండిన, వాలాయము చేటు
వచ్చు వసుమతిలోనన్, లోలాక్షి విడిచిపెట్టిన,
మేలిమిగా బ్రతుకవచ్చు మేదిని వేమా వేమన
3. ఆ. 247

జ వాలాయించు.

**వాలాయించే** అ క్రి అభినివేశమూను, పట్టు పట్టు

శా. ... వాలాయించి యొనర్తురా జనులు దేవ
బ్రాహ్మణారాధనల్ ... విక్ర 2 145

క వాలాయించి వనమ్ముల, నేలమ్మ తపంబు
సేయ నిభకుంభకుచా ... వీర 2 223

స. క్రి = వాలయించే (√ వాలాయము )
నిర్బంధపఱచు

క వాలుంగంటి నిలువుమని, వాలాయింపంగ నేఁగ
వలయు ననుచు న,వ్వాలు మగఁడు మెఱుఁ
గారెడు, వాలునహాయముగ మగిడి వచ్చెం
బురికిన్. ద్వా 4 284.

వ. ... నీవు ప్రియంబుగూర్చి రమ్మని వాలా
యించెదు మదీయప్రకారంబు వినుము ...
ధనాభి 2. 72.

వ. .... వాలాయించి యడిగినప్పు డియ్యకొని
యిప్పు డిటుచేత నా భాగ్యంబ కాక మీ రేమి
సేయుదురు ... భోజరా. 7. 94.

**వాలారు** (వాలు+ఆరు.) విశే 1 దీర్ఘమయినది

సీ. తానిఁ గై్ౖరవాలినతమ్మి రేకులకంటి వాలారుఁ జూపులు ప్రోలుదేర . . విక్ర. 7. 102

శా. . వాలారుం గన్నుల మీఁదు చూచుతటి ... ఆము 5 11

మ అంభోజాక్షి వాలారు జూ,పులఁ దేలించుచుఁ బల్కు .. దశా 2 364

2. మనోహరము, ఇంపైనది.

మ జెరసె న్నేసిన నిగిడ్చినట్లు వళు లుబ్బెన్నుర్వు లాంగంబు లం,కురములూన్పావె రదంబు లంఘ్రుల వడంకు ల్దీజె వాలారులై, కరజంబు ల్పిగిరించె ... పారి. 5 48

సీ జలజసంహృతిశిఁగాఁ జనుదెంచు రయమునఁ దొరఁగిన చెమటబిందువు లనంగ, గహ్వరస్థలి విత్తఁగాఁ దెచ్చి నెఱపిన వాలారుఁజిలివిత్తనా లనంగ, లలి మించు కాంౕదలకన్నుఁ జాఱఁగఁ ద్రోలి లిఖియించు వరజయలిపు లనంగ ... చంద్రా 4, 55

3 వాఁడియైనది

సీ వలరాజు పాటించు వాలారుటమ్ములు గామినీ రూపంబుఁ గాంచె వొక్కొ . భా రా, అర. 2 86

మ మరువాలారుశరంబులం దొరఁగు కమ్మం దేనెతోఁ గూడి . నైష 2 99

శా వాలారుంగొనగోళ్ల నీ వలసత న్వాయించుచో నాటకు, న్మేళంబై నవిపంచి నివ్వ మొదలు న్నీ వంటమిం జేసి యా, యాలాపంబె యవేళఁ బల్కెడు . మనుచ 3 57

అ క్రి 1. ఒప్పు

అసంబాధ — వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్. వాలారున్ గోవిందవరదధ్రువ వాత్సల్యా, కాళిందీప్రాజేశమత నసగగ ప్రాప్తిన్, జాలాభాన్వద్విక్రమమునను వసం బాధల్. అప్పక 4 221

2. ఉపశమిల్లు, క్షీణించు

గీ డప్పి దీఱంగ మధురకాండంబుఁ గ్రోలి, కడుపు నిండంగఁ దూఁడుఁ దీఁగలు భుజించి, యెండ వాలారు నంతాకఁ నిండు కొలని, తీరమున మట్టినీడ నిద్రించెనతఁడు శివరా, 3. 27,

క వలిక సింగవ యచ్చో, సోలుచు విరహానలాప్తి ప్రుక్కి వగచుచున్, జాలింబొందుచు నేడ్చుచు, వాలారుచు నింక నేటి వల పనుకొనుచున్ .. చంద్ర. 2 85

**వాలార్చు** స క్రి (√వాలారు) 1 కత్తులు జళిపించు

సీ హరిరాజ సమమధ్య లంకించి వాలార్పఁ గరికుంభకుచలు వరాకుఁ జెల్ప వీర 1 126

2 పరీక్షించు

ద్వి వడిగొని దగ్గరి వాలార్చి చూచి బస పు 5 559 పం

**వాలి** సం వి ఇ. పుం న్ పుం. సుగ్రీవునియన్న. అంగదుని తండ్రి.

**వాలించు** సం క్రి (√వాలు) 1 వాలఁజేయు, నేలఁ గూల్చు, ఖండించు

మ అరుదారం బరగండభైరవుఁడు వీరాకారుఁడై వైరి భూ,వరుఁ దుండించి ఘృతాచికిం బ్రియునిగా వాలించు కావ్యా 2 113

సీ. కరము వాడిదు మామయురము వాలించు మొక్కరము వాఁడని మేలికరము వాఁడ ... ప్రబంధ 1 217

2 తర్జించు.

క. ప్రాలిన చెల్లాచెదరై, నేలం దిల లొలికెనంత నివ్వెఱఁగున న,న్నీలాలక చూచునెడన్, వాలింపక నతికిఁ బ్రాణవల్లభుఁడనియెన్. వేం పంచ. 2. 104

వి నేలఁ గూల్చుట

పీ తలతలతల మంచుఁ దలమించు వలిమించు వాలించు వలిప పావడలు గట్టి . రా వి. 3 117

(ఇట సామ్యదోతకము )

**వాలిఁడి** వి. (వాలు+ఇఁడి) తోఁక లేని కోతి

విశే. తోఁకలేనిది (శ. ర.)

**వాలిక** విశే (√వాలు). 1 దీర్ఘము, పొడుగు

మ ప్రకటస్నేహ మెలర్చ నాతనిపయిం బద్మావతీకాంత వా,లిక క్రొవ్వాఁడిమెఱుంగుఁ జూపులనిఘాలిం జెంగు వాలించుచున్. విక్ర. 8 24.

క. పనివూని శాశికింజని, వనరుహలోచనుఁడు
వెడఁద వాలికకమ్ములే, తనకుఁగల ఫలము
గనియెం,బనివడి తద్విశ్వవలక్షిఁ బరికించు
నెడన్ కాశి 6. 70.

క. వాలికలై విరిదమ్ములు, యేలికలై ఖావభవుని
యెలదూపులకుం, బోలికలై యుత్పలికల,
మాలికలై యబలఁ దాఁకె మటి నృపుచూపుల్.
పి శకుం 2. 88.

2. వాఁడియైనది.

సీ. వెడఁద యమ్మున నేసి వెండియు మూఁడు
వాలిక యమ్ముల లోఁడలఁ గీలించి . భార
భీష్మ 1 272

ఉ. వాలిక దొడ్డనారసము వజ్రము శైలముదాఁకు
కాకృతిన్, ఫాలము మీఁదఁ దాఁకిన(న్)
భార. ద్రోణ 1. 358.

సీ ప్రణతుల కాయువుల్ వ్రాయు తూలికనాఁగ
వాలికతూ పొక్క్రేల నమర .. వాల్మీకి
3 150

వాలికనడ వి (వాలిక+నడ) అశ్వగతి విశేషము

వ ఇట్లచ్చి యనిపి పోడియము జంగనడయు వాలిక
నడయునుం గలుగు వారువంబు వదలించి వాగె
వదలి జిరాగనగనం గదలించి తోలిన ద్వా
8 71.

వాలు అ. క్రి 1. విజృంభించు

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించిఁ బేర్చి
రౌద్రతం, గూలు గజంబులుం గెడయు గుఱ్ఱపు
తండము .. భార శల్య 1 155

చ. ... దేవ నీ,వలన వరంబు లిట్లుగొని వాలిన
దైత్యుఁడు మమ్ము నింక నే, క్రోలఁదుల నైఁ
చునే ... హరి పూ. 4 22.

సీ. . తిమిరారి దోఁచిన దినత పెంపునఁ దెమలిన
చీకటిగము లనంగ,

గీ వాలి చరియించుఁ బరి మదవారణములు,
దారుణాహవాంభోనిధితారణములు విక్ర
1 85.

2. అతిశయించు.

ఉ వావిరిఁ దెప్పఁగా వలసె వాలిన దుఃఖము
దాల్మిఁ గ్రాఁచివన్ ... భార. శాం 1 117.

చ మల్లి దేవఁ డ,చ్చెరు వగుచున్న పొత్తపియ
చెన్నగు పిడుగ వాలి పాకనాఁ, టిరువదియొక్క
వేయిఁ జననేలుచు ఆ. పా వ ప. 8.

ద్వి వాలిన తేజమ్ము వమ్ముగా జేసి, యేలయో
దీనోక్తు లిట్లాడ నీకు . రం రా అయో.
99 పొ 31 పం

క ఈలీల దుర వెునర్చఁగ, వాలినదర్పమున
బభ్రువాహనధరణీ పాలుండు తేరు గదియం,
దోలించి సురేంద్రతనయుతో నిట్లనియెన్ జై
భా. 5 178

3 (పక్షి) కాలూను, క్రిందికి దిగు

గీ ఈగ వాలిన నందంద యెలుఁగు లోనఁగు, వట్టి
నకినెల మంచములు మనుచ 6 3.

సీ ఇది మింటఁ బఱచు పక్షీంద్రుఁ జూపిన నీడబడి
వాలునందాకఁ బఱవఁజాలు మనుచ. 4. 31

4 ఒఱఁగు, కూలు.

వ్యవ మామిడికొమ్మ యింటిమీఁదికి వాలినది

సీ. సురపథం బొకవేళ సోలి వాలినఁ గాని క్షితిరాఁ
గయై యఱచేతనొడ్డు ... ఘటికాచల. 1. 50.

5 ప్రసిద్ధికెక్కు

చ అరుదగు చున్న జన్మసమయగ్రహయోగబలంబు
పెంపునన్, వరరుచియై దిగంతములవాలుఁ జతు
ర్దశ సంఖ్య విద్యలన్ . విక్ర 1 172.

క ఫాలాక్షుని చాపము బా, హాలఘుసత్త్వమున
విఱిచితని జను లెన్నం, బోలమహేంద్రాద్రిని
విని, వాలిన నీలావు చూడవచ్చితి నిటకున్ భా
రా బాల. 726

సీ హరిహరాబ్జజుల ముప్వురఁ దమూజులఁ జేసి
వాలిన యది పతివ్రతయ కాదె భోజరా
6 197

ద్వి నీలావు లావుగా నిఖిలలోకముల, వాలుదు
వెందు దుర్వారుఁడ వీవు రం. రా. యు.
539 పొ 2. పం

6 అనక్తమగు.

క భాగ్యమనై యిహపర పరి,భోగ్యార్థమనై యగ
ణ్యపుణ్యమనై వై,రాగ్య జ్ఞానోన్నతులగు,
యోగ్యతములపాల వాలియుండుదుఁ జుమ్మీ
పాండు 4 108.

7. ప్రకాశించు.

చ. ... బాహుబలార్జితశత్రుమండలో, జ్వలదన
వంతులై మహిమ వాలుదు రప్పురిరాజ సత్త
ముల్ భా. రా. బాల 81

చ. తల గడుగంగ మర్దనము ధౌతపటావరణంబు
సంస్కృతో, జ్వలకలమాన్నభోజనము చందన
చర్చ ప్రసూనదామకం,బును కపురం
పువీడ్యమును భూషణవంక్తులు కల్గి
నిచ్చలున్, బలుగడుగంగబడ్డ నునుముత్యము
బోలుచు వాలుచుం బురిన్ పాండు. 3 9

సీ. గీ కాక భూపాలుచే వాలు కలకువాలు,
కరివ శితకోటిశతకోటిగాఁ దలంచె, నేమొ ...
దశా 1 115

8 ప్రేలు.

సీ ప్రాయమింకిన వాలుపాలిండ్ల వెలయాండ్రు
పడుపు పుట్టక మూలఁ బడి కృశింప ... వేం.
పంచ 4 220

క. లోలయగులోలలోచన, వాలుంజమదోయిఁ
గేల వడిఁ బట్టుక ను,య్యాలో జంపాలోయని,
ప్రేలుం గృష్ణుండు పఖులు వికవికనవ్వన్.
దశా 8 195

9 ప్రవేశించు.

క ఇప్పుడు, వావలు వెలిసెను శరత్తు వాలఁగఁ
జొచ్చెన్ భా. రా కిష్కిం. 485.

("శరత్తు' అని ముద్రిపా )

10 పడు

ద్వి రాక్షసుండవు గాక రాజవానీవు, వాలు
వైరులమీఁద వాలునీవాలు, వాఁగంటులం
ద్రుంప వాలె యీవాలు .. ద్వి. హరిశ్చ ఉ
2484 పం.

వ క్రి వహించు

ద్వి వాలియు నేనును వడినొక్కవంశ, వాలితి
మొకవంక వాలినవారు, సురగరుడోరగాసుర
సిద్ధసాధ్య, వరు లందఱును క్షీరవారిధిఁ దరువ
రం రా కిష్కిం 203. పా 28. పం

వి (సం వాలః ) 1. కత్తి.

క. వాలుపయి నడచునట్ల, బ్బాలిక ... భార ఆది.
2 156

క పలశయు వాలును గాని ఈ,క్కలు గల పెఁను
బాముపగిదిఁ గవిసిన . భార భీష్మ. 2.191.

సీ శశికాంతి చెంగావి దళమలంచినకేల స్వర్ణ
త్సరువు వాఁడివాలు మెరయ . ఆము.
2 75

2 తీక్ష్ణత

సీ. మార్పెట్ట నోపని మ్రాఁకులేర్పుట యెంత వా
లగునవి వనవహ్ని నవ్వ . కం పం 10
526.

గీ పదివినుజాలు కనువాలు నిట్టికేలు, వేది తోళ్చిర
మెడచార యొముకకోర, యేది నెలకూన
పామేన నిడిన చాన,యితఁడు జేజేల దొరయని
యొటుల నందు. చెన్న. 3 53.

3. పటవాలుచోటు

క కైవాలు పండుపంటల, కైవాలు మొకమ్ము
లామికైవాలుటచో, నీవాలువ నీవాలున, నీవా
లున నీ ప్రశస్తి నెలపఁగవలయున్ ప్రబంధ
169

4. ప్రవాహము

వ పూఁదేనియ కాలువ వాళ్లసుళ్లంబడి వడి వడిం
దిరుగు మరునికెంపు బొంగరంబులుం బోని
మెటఁదామర మొగడలును .. యయా
4. 13.

5 తడవ, తూరి, పర్యాయము

చ ... బలాఢ్యులు రాత్రిచారు లె,య్యెడఁ దగ
దీరసంబు ఒలహీనులకున్ మనలోటి వారికిన్ .

క ఈ వాలువచ్చి రేవం, బావం,గానున్న వారిఁ
జంపెద రహితుల్, దేవా సంధియనూన శు,భా
వహ మొనరింపు మస్మదాదేశమునన్. వేం.
పంచ. 3. 18.

క ఆలమ్ముల వాలమ్ములు, గీలమ్ములఁ గప్పు
నసురఁ గినిసి యొకఁడు క్రో,ధ్వాలున నొక
వాలునఁ గర, ఖేలనమునఁ గేలుఁ గాలుఁ గీ
లెడలించెన్. లక్ష్మీ వి 2. 81.

6 దైర్ఘ్యము, పొడుగు (శ. ర )

విశే 1 దీర్ఘము

సీ. వాలుగాఁ గై ప్రవాలు వేలుపు పూబంతిచాలు
ఘైలైవ వాసనలు గుప్ప ... రాఘూ 1. 122.

సీ సొగసువాలు మెఱుంగుచూపు లాశావీథి కలఁ
గల్వ విరిమేలుక ట్లమర్ప ఉ రా. 2.124
సీ. . . ఎడఁదకాఁపురపుఁ బుత్తడి బొమ్మనిడు
వాలుకన్నులా యీ వాలుగన్ను లరయ
దశా. 1 164

2 అధికము
ఉ వాలుమగంటిమిన్ దమజవల్లభుఁ డల్క-
వహించి యెవ్వఁడో, శైలమునన్ గుణస్వనము
సల్పెను బాపురె వంటయిుటఁ గుం,దేలిది
చొచ్చె రక్తములు తీవ్రతఁ గ్రోలఁగఁ గల్గె
వంచు ను,త్తాలశరాననాంచిత గదాతురి కాసి
ముఖాయుధాఢ్యుఁడై రుక్మాం 5. 20.

3 క్రూరము
ఆ వాల్మృగములఘోరవన మని వగవక,
మఱచి యుండి రేమి మాడ్కి- యొక్కొ- .
భార అది 6 178
ద్వి ముదమొప్ప రాజ్యాంగములు పరీక్షించె, వద
లక నిర్జించె వాలుశాత్రవుల ... రం రా
బాల 58 పా 22 పం
సీ ... గీ ... వాలువైరులఁ జెండాడు వాలు
వాని పద్మనాభుని వీక్షించెఁ బద్మ యపుడు.
దశా 2. 257.
ఉ ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవులకెందు
లేదు ధా,త్రీతలనాథ యిప్పుడు ప్రదీప్తములై
సతతంబుఁ జేర్చి గో,వ్రాత భయంకరంబులగు
వాలు మృగంబులు సంచరించు మీ,కా తెఱఁ
గెల్లఁ జెప్పుటకునై యిటవచ్చితి నేను జెచ్చెరన్.
భార అర 5. 360

4 మనోజ్ఞము.
గీ గొప్పకన్నులు నిడువాలుఁ గురులఁ జెలఁగు,
కొను నీలా. 1 88
గీ. చూడ వేటికి నిడువాలు సోఁగమీల, సూడు
పట్టంగఁ జాలెడు చూపుఁ గొనల . . నైష
8 50
వ సోమ సూర్యాత్మకంబులగు వెడందనిడువాలు
కెఱ్ఱసెరలకన్నులం గెందమ్మిఱేకుల వెద
చల్లువాని . ఆము 6. 98
క. వారిద్దఱువాలమ్ములు, బారిం బడి యర్జునునకు
బ్రదుకవశమె . భార ఉద్యో. 4 191.

ఆ. అట్టియెడ శిఖండి యాపగానుతుమీఁద, వాలు
టమ్ము లేయ వానినేయ భార భీష్మ
3. 379
చ. కులిశసముజ్జ్వలద్విశిఖకోటులమాలికరాశిఁ ద్రుంచి
త,జ్జలదనిభాంగమున్ గదియ శార్ఙ్గి మెఱుంగులఁ
బోలువాలుఁ దూ,పులు నిగుడింపఁగా నవియుఁ
బోయి తదీయ శరీర రక్తమున్, బలువిడిఁ
గ్రోలెమున్న మృత పానము సేయు సురౌఘముం
బలెన్ ఉ రా. 2. 73
6 మృదువు.
(తారాది కామినులు.)
ద్వి వాలిగూలినమాట వజ్రమైతమదు, వాలు
గుండెలునాఁట వసుధపైఁ గూలి .
రం రా కిష్కిం. 214 పా. 12 పం
జాబిలినవ్వువాలు = చంద్రహాసము అచ్చ.రా.సుం
34
జ వాలంపఱ, వాలఱుగుడు, వాలారు, వాలార్చు,
వాలించు, వాలిండి, వాలిక, వాలికనడ, వాలుఁ
గంటి, వాలుఁగన్ను, వాలుకొంగ, వాలుగడుపు,
వాలుచు, వాలుచుక్క, వాలుచూపు, వాలుపు,
వాలుప్రొద్దు, వాలుమగఁడు, వాలుమీను, వాలు
మెకము, వాలురమ్ము

వాలుఁగ(ల్గ)ంటి వి (వాలు + కన్ను ) 1 దీర్ఘము
లైన కన్నులుగల యాఁడుది
సీ. . నాటితప్పునకు సీనవబోండ్లతో నాకు వర
వుడై యున్న దీ వాలుఁగంటి .. యయా.
4 57.
శా. వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛా
ప్రదానక్రియా, హేలాలోలుఁడు హరిశ్చ.
3 164
ద్వి రాజుమండవుగాక రాజవానీవు, వాలు వైరుల
మీఁద వాలువీవాలు, వాలుఁగంటులఁ ద్రుంప
వాలెయీవాలు . ద్వి హరిశ్చ ఉత్త 2484
ఉ వింటగుణంబుఁ గూర్చి రఘువీరుఁడు వంటవలంతి
నన్నవా,ల్గంటిఁ బరిగ్రహించు క్రియ
చంపూరా 3 109
మ .. ఆ, వలఁపుంగ్రొవపుదీవి యామగువ యా
వాల్గంటి సీకేతగున్ . నీలా 2 28.
2. భార్య

ఉ. ఇంటికిఁదెచ్చి యోగి పరమేశునకున్ వడిఘండు తాను వాఁల్గంటియు భక్తియున్భయము గౌరవ మున్వినయంబు నాత్మలో, నంటికొనన్ ... హర 2 89

**వాలుఁగ(ల్గ)న్ను** వి (వాలు+కన్ను) సోగకన్ను

సీ దీర్ఘలోచనములు వాలుఁగన్నులనంగ వఱలు చుండు ఆం భా 3 60

సీ .. అసమాన నీలోత్పల సమానరుచులొంది కలికిసోయగపు వాల్గన్నులలర ఉ రా 1 254

**వాలుక** నం వి ఆ స్త్రీ 1 ఇసుక. 2 చూర్ణము, పొడి 3. కర్పూరము. 4 ఒకజాతి దోస, నూఁగు దోస (వృ వి) 5 (వైద్య.) యంత్రభేదము. 6 కాలజ్ఞానమున కుపయోగించు యంత్రవిశేషము, వాలుకాయంత్రము

**వాలుకాత్మిక** నం వి. ఆ స్త్రీ శర్కర, చక్కెర.

**వాలుకాస్పర్శ** వి రత్నదోషము

ఆ ఏటియిసుకవంటి నెరుసులుగలిగియు, మహిని వెలుఁగునీల మణియునైదు, వాలుకాస్పర్శనా వరలుచునున్నట్టి, దానిఁబూన మేలు దొలఁగి పోవు

(ఈ పద్యమున యతిగణభంగము లు గలవు) రత్న పరీక్ష, 66

**వాలుకి** నం వి ఒకజాతిదోస, నూఁగుదోస (వృ వి)

**వాలుకొంగ** వి (వాలు+కొంగ) వక్కుకొంగ, బకము (శ. ర.)

**వాలుగ(గు)=వాలువ(వు)** వి చేఁప, మత్స్యము

క గాలపుటెర యిచ్చికవా, వాలుగలం దిగిచికొనుట వక్రరిపుఁడుదా, నేలోఁబడునంతకు బల,శాలి యుదాపంబుఁ జూపఁ జనునొక్కయెడన్ కవి 2 42

గీ అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్కఁ, బెనుచు వాలుగ మేలుగాఁ గనుచునవియె .. దశా 1 136.

ఉ. వాలుగమీలనేలు నిడువాలు కమంగవ మేలి జాలువా, డాలుగఅంచుమేను రసిక 3 55

సీ. దరహాసరుచి గాంగఝరిగేలుకొనవాలుగల లీల బెళుకు వాల్గన్నులలర ఉ. రా 6 181.

సీ. కేలిమైనొక్కట లీలఁగ్రేళ్లుటికెడు వాలుగు సోగల నేలుదెంచి ... భారి విరా. 2 63

గీ వాలసిప మోను వాలుగు వాలుగ యన . ఆం భా 1 159

జ వాలుగకంటి, వాలుగతెంకి, వాలుగడాలు, వాలుగగన్ను, వాలుగపాము

**వాలుగకంటి** వి (వాలుగ+కన్ను) మీనాక్షి, స్త్రీ

సీ బలిమివాసపుచెట్టు నులిమి వాకిటఁబెట్టు కలిమి వాలుగకంటి చెలిమివాని .. చంద్రా 1. 84

**వాలుగతెంకి** వి. (వాలుగ+తెంకి) మత్స్యవిశేషము (శ. ర.).

**వాలుగడాలు** వి (వాలుగ+డాలు) మన్మథుఁడు, మీనకేతనుఁడు (శ. ర).

**వాలుగ(ల్గ)డుపు** వి (వాలు+కడుపు) బొజ్జ (శ ర, బ్రౌ)

**వాలుగన్ను** వి (వాలుగ+అన్ను) 1 ఆఁడుచేఁప

గీ చంద్రుసైదోడు పూఁబోడి జళుకుతళుకు, వాలు గన్నుల బెళుకుల వైపుసూపు, వాలుగన్నుల వలపింపవలయు ననియె, దేవమాయవుమీన మైతివి పయోధి దశా 1. 212

2 ఆఁడు వాలుగచేఁప

సీ . స్త్రీ మత్స్యభేదముల్ దీర్ఘలోచనములు వాలుగన్ను లవంగ వఱలుచుండు ఆం భా. 3 60

**వాలుగపాము** వి. (√వాలుగ) మత్స్య విశేషము (శ. ర)

**వాలుచే(ల్చు)** స. క్రి (√వాలు) 1 వాలఁజేయు, వంచు.

ఉ బాలిక మోము మత్తవనబర్హికిశోర కలాస్య లీలఁబై, వాలిచి పచ్చ కప్పురపు వాసనతోడి ముఖారవింద తాం,బూలముమోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చు ధూర్త గో.పాలుఁడు ప్రోచుఁగావుత యపారకృపామతి మంత్రి యన్న నిన్ భీమ. 1 3

ద్వి వాలిన కిన్కమై వాలునీవాడి, వాలువజిహ్వాలు వాలుతు ననిన ... హరిశ్చ పూ 1042

వ. తలవాల్చి యేడ్చుచున్నం గనుంగొని ..., కృ నైష 4. 88

ఉ. తెప్పలు వాల్పకప్పుడమితేని మనోహరమూర్తి నిచ్చలుం, దవ్వక చూచిచూచి . . శృ. నైష. 1 67

2. ప్రవణము చేయు.

సీ. కాంత పుష్పాది భోగంబులిం పెసఁగిన వైరాగ్య విధిఁ దావాల్చుఁ జిత్త,(ము) . . శివరాత్రి. 2 18

3 అతిశయింపఁ జేయు

సీ ... గి కదియఁ గూర్చితి బ్రహ్మాండ శర్పరంబు, పరిధిగా వాల్చితిని మహావరణ జలము . శివ రాత్రి 1 75.

వాలుచే (ల్చె)క్క వి (వాలు+చెక్క) శుక్రుఁడు.

ద్వి అంత నిశాచరు లతిఖేద మొంద, వింతగ వాల్చెక్క వెడలియా వేళఁ, దెలతెలగాఁ దూర్పుదెస విస్తరిల్లె .. ద్వి శ. సా 3. 99. పా 2 పం

వాలుచూ(ల్చూ)పు వి (వాలు+చూపు) ఓరచూపు

సీ . ఏ ఛాయఁ జూచిన నిందీవర శ్రేణి వెల యించు వాలుచూపుల విలాస,(ము) . . దశా 2. 239.

సీ. వాలు చూపవఁ బొల్చు వక్ర దృష్టి ... అం భా 2 144

క. డాలా మెఱుఁగులు గ్రొంబొగ, డాలా నెత్తావి మోవిడంబులు కోదం,డాలా కనుబొమ లతమని,డాలా వాల్చూపు లన మిటారి రహిం చున్ హంస 2. 338

సీ ... కలువ తేకుల యేపు ఖంజనంబుల రూపు నిరసించు వాల్చూపు నీటుదాని . ఉ రా. 2 266.

వాలుడు వి వాకాలి (వృ వి )

సీ .. చీ సిగ్గు గాదొకో చేర మాకాటదియన్నఁ జెల్లెలు వావి యనెడు వారు ...

గీ. కోరి వాలుడు తైలంబుఁ గ్రోలువారు. కుములు కుంపటి శాకముల్ గోరువారు, నైరి యొక కొంద అచ్చలి వేం. పంచ 1 688

వాలు(ల్పు)పు వి. (√ వాలుచే) వాలుచుట, మోడ్పు

ఛ పులకల జగ్గునెమ్మి నెఱపుక జీగి నైమ్మోయి నిగ్గుఁ జెయ్యులన్, వలగొను సిగ్గు వింతయర వాలుపుఁ జూపుల కగ్గు . బిల్హ. 2 160

వాలుప్రొద్దు వి (వాలు+ప్రొద్దు) అపరాహ్ణము. (శ. ర.)

వాలుమగఁడు విశే. (వాలు + మగఁడు) శూరుఁడు

ఉ. . అ,వ్వాలు మగండు శాక్వరిశవంబుఁ దలంచుచుఁ గ్రౌర్య ధుర్యుఁడై భార సౌప్తి 1 157.

సీ. రాయఁడ విను మతికాయుండు మొదలగు వాలు మగల్పెక్కు వేలు రక్క,సుల తేని కొడు కులు అచ్చ రా యు 71

ఉ వాలుమగం డితం డనఁగ వాసికి నెక్కి దశాస్య శక్తిచే, వేలకు వ్రాలి మేల్కనని నిద్దుర నొందితి వయ్య తమ్ముఁడా . భా రా యు 1587.

వాలుమీకేశుఁడు మి వి. (సం వాల్మీకేశః) వాల్మీకి ప్రతిష్ఠితుఁడగు నొక దేవుఁడు.

ద్వి ఆవాలుమీకేశుఁ డాత్మఁ గలంగ ...బస. పు. 4. 763 పం

(ఇట్లే, "వాల్మీక దేవ దేవుఁడు," మొ )

ద్వి. దేవ మున్నెఱుఁగవే యీ వాలు మీక, దేవ దేవుఁడల సత్ప్రీతి దొలాకడ బస. పు 4. 736 పం

వాలుమీను వి. (వాలు+మీను) వాలుగ, ఒకజాతి చేఁప.

ఆ వాలు మీలఁబోలు వామాక్షి చూపులు, సోము సాముగోము భామమోము . . హంస 3 69

వాలుమృ(ల్మృ)గము మి వి (వాలు+మృగము )

1. పులి, వ్యాఘ్రము

ఉత్సాహ. వాఁడి మగఁడు నిద్రపోవు వాలు మృగముఁ బోలెనై, వీఁడె బాహ్లికుండు .. భార స్త్రీ 2. 98

శ్లో ప్రాతిపేయం మహేష్వాసం, హతంభీ మేన బాహ్లికం, ప్రసుప్తమివ శార్దూలం, పశ్య కృష్ణ మనస్వినమ్ ... సం. భార. స్త్రీ 22 5

2. క్రూర జంతువు

ఉ పూచిన తీఁగెలన్ మధురభూరి ఫలంబుల వ్రేగువన్ మహిన్, మోచిన కొమ్మలుం గలిగి మూఁకలు గట్టిన పోఁకమోకలన్, రాచిన్న

వాల్మీగంబులు దినంబడి వర్ణన సేయ నొప్పు
విం,ధ్యాచల పార్శ్వకానన మనన్యవనీవిభవోప
మానమై కేయూర. 3 10.

**వాలుమె(ల్కె)కము** వి. (వాలు+మెకము) వరాహము, అడవిపంది, క్రూరజంతువు.
సీ . వాలుమెకము
గీ పంది నలు గేకల మన్నఁ బరగు ఘృష్టి .. ఆం భా 2 82
క అల్లదె కంటే పొనపొన, తెల్లని గట్టుబుత మబ్బు దేఱెడు పొలమం, దెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ సీరాముసేన వాలు మెకంబుల్. మనుచ. 4. 16
క కైవాలు పండుపంటల, కైవాలుమెకమ్ము లామికై వాలుటచో, నీవాలున నీవాలున నీవాలున నీప్రశస్తి నెఱపఁగవలయున్ ప్రబం 1 169
ఉ . వేఁటలాడుకోఁ, జయ్యనఁ బోయి యా యడవి చాయలఁ గంటిమి వాల్మెకంబులన్ .. సారంగ 1 66
ద్వి వన్నెల పులుఁగులు వాల్మెకంబులును, వీఙింప వెఱపును వెఱఁగును గాఁగ . ద్వి హరిశ్చ పూ 516 పం

**వాలురమ్ము** (వాలు+అమ్ము) వి వాఁడిగలబాణము
తే వంక యెత్తిన మన్మథువాలురమ్ముఁ, బోలె నెమ్మోను చక్కనై పొలుపు మిగిలె ... హరి పూ 9 35.

**వాలువ(పు)**=వాలుగ వి. మత్స్యవిశేషము
సీ. వాలువముకురమ్ము పలె గండెర నత్తెగుజ్జు లేడిన జాతి కొఱుకు మడిన . వేం. పంచ. 1. 294
చ. వడిఁ బుటమెత్తి వ్రాలు నిడు వాలువ చాలుపు లింత వంతపై, నిడులెలిగుంచెలం దెలుప .. వేం. పంచ 4 133.
క కోలగతి వడిచి యెత్తినఁ, గేలొగిఁ దెగి యులుఁగుతోవ కేళ్లెగసి వడిన్, దూలె జల వాయ సంబా, వాలువుఁ గఱచుకొని దివికి వడి నెగయ క్రియన్ . కు సం 11 725
సీ కొఱ్ఱ మీనులఁ దండ్రి కొలువు లెంకల కిచ్చె ఫాలువులను సంగడీల కిచ్చె . . ద్వా 1. 221.

**వాలువగ్గము** విఱ మిక్కిలి వశమైనది
ద్వి ధైర్యంబు దూలి వెన్కయుముందుఁ దోఁచక మూల, గూలి నీ చెలులతోఁ గూడుక మరుని, వాలమ్ములకు వాలువగ్గమై పాట్లఁ, బడిపడి బెండై తీఁ బాలకి యనిన,నుడురాజ వదన నిన్నుడికించినట్టి, ఘనుఁడల్లమ విభుండె కాని కాఁడొరుఁడు ప్రభులింగ 2 46 పా 23 పం

**వాలూరు** అ క్రి అలస్యమగు.
ద్వి. పలిన పతికార్య మెదరైన యెడమ, వాలూర వటు చేయువాఁడు మధ్యముఁడు .. రం. రా యు కాం 279 పా 11 పం

**వాలెము** = వాలాయము క్రి విఱ 1. నిరంతరము, ఎల్లప్పుడు
క నీవార మనుచు నమ్మిక,తో వాలెము గొలుచు వారి దొనఁగుల పాలం,బోవిడిచి నిరాబారులఁ, గావించు చెనంటి వీవె కద పరికింపన్ .. అచ్చ రా యు 259
2 అత్యంతము
ద్వి దానికై వగరితో ధరణీశ్వరుండు, లేనిచోనైన వాలెము జంకు లేక . వి సారంగ 1. 13 పు. 3 పం
క పలినవాఁడను సింగఁడ, వాలెంబును దానిఁజూచి వలచివవాఁడన్ . చంద్రరేఖా విలా. 2. 104
3 అవశ్యముగా
చ నేలతాల్పయి,ప్పనిఁ దలఁబూని రక్కసుని జాలెము వాలెము జొచ్చి చేడియం, గనుఁగొని యుంగరం బొసఁగి క్రన్ననఁ దలమానికంబుఁ గై,కొని పఱతెంతు .. అ రా కిష్కిం 82.

**వాల్కము** సం విఱ. (అ. ఈ అ ) చెట్టు పట్టతోఁ జేయఁబడినది

**వాల్కలము** సం విఱ (అ. ఈ అ ) చెట్టుపట్టతోఁ జేయఁబడినది.
వి అ న నారబట్ట

**వాల్మీ(ల్మి)కి** సం విఱ పుం శ్రీమద్రామాయణము రచించిన ఋషి

**వాల్మీకుఁడు** సం వి అ పుం = వాల్మీకి

**వాల్లభ్యము** సం వి అ న వల్లభుని ధర్మము, ప్రేమ, అనురాగము, వలపు.

వాళి వి. 1. పసులు పోవుదారి (శ ర.)
2 వాడుక.
వ్యవ. ఈ పని మనకు వాళిలేదు
వాళించే స క్రి. వాడఁజేయు, మ్లానతనొందించు
క. లాలించి స్వామి బిరుదులు, పాలించితిరనుచు నపుడె వదరక యుంటిన్, వాళించి విడుతు గర్వము, చాలించి సనంగ దాని సరి వారు వగన్ వాల్మీకి 3 26.
వాళ్లుపఱచేలు విఙ (వాళ్లు+పరచుట) ముక్కఁజేయువారు, మ్లావత గల్గించువారు
ద్వి కుపితము లాలముల్ క్రూరముల్ వాళ్లు, పఱచులు వికృతముల్ భ్రమితలు ముచ్చులు ... పండితా పురా 116 పొ 21 పం
వావదూకుఁడు సం విఙ (అ ఆ అ) బహుభాషి, వదరుఁబోతు
వి. అ. పుం వాగ్మి, వక్త, ఉపన్యాసకుఁడు
వావాఁడి వి (వా+వాఁడి) వాక్పారుష్యము
క లోవాఁడియు వావాఁడియుఁ, జేవాఁడియుఁ గలిగి మిగుల సీమారామా, గ్రావాగ్రహార జనపద, దేవస్థానాటవులను ద్రిమ్మరుకతనన్. ప్రబంధ 767
వావాదము మి వి (వా+వాదము) వాగ్వాదము.
క. నా విని ధర్మాధికృతుల్, వావాదం బేలయేను వారము లెడ మీ,రే వివరము నాఱవనాఁ,డావిష్కృత బుద్ధిఁ దెలుపుఁ డరుగుఁడు మగుడన్. వేం పంచ. 1 725.
వావాదు వి (వా+వాదు) ఉపన్యాసము
సీ ... వావాదనంగను బరగునుపన్యాసము .. ఆం. భా 1 113
వావి దే వి శాస్త్రీయమైన సంబంధయోగ్యత, అనుకూలమైన సంబంధ యోగ్యత.
ఆ వావిగానియట్టివనితఁ బొందిన పాప, మాఱునెలలఁ బాయు నార్ద్రవస్త్రు, ధరణ శయనశయన పరతఁ బాటించుచు, నియతినుండెనేని నృపవరేణ్య. భా శాం 1 313.
గీ నీకునేనాటి తల్లిని నిజముచెపుమ, యమర లోకంబు వేశ్యలమైనమాకు, నిట్టితగవులు నడవ కహీనబాహు, వీర్య యిచ్చుట వావియు వెరవఁ జమునె. భార అర. 1 362.
ద్వి వావిఁ దమ్ముండఁగాని వాలి నీ కేను, నేవకుండ నుతుఁడఁ జెప్పనేమిటికి . రం రా. కిష్కిం 205 పు 10 పం.
చ. మఱది యటంచు బావయని మామ యటంచును నల్లుఁడంచు నందఱకును నన్ని వావులిడి తప్పనలన్ మటుమాయనుద్దులన్ దశా. 2 366
వావింట=వాయింట వి బర్బర, ఒకదినుసు కూరాకు మొక్క. (వ్య వి) (శ. ర)
వావిక వి కుత్తుక మొదటఁగల గుంట (శ ర, బ్రౌ)
వావిడుచే అ క్రి. (వా+విడుచు) 1 నోరెత్తు
క. అడిగితివే నిను నా క,వ్వడి భుజబల మెట్టిదని యవారణ నీవి,ప్పుడు నృపులెల్లను వినవా,విడిచి పొగడెదిట్లు పంది విధమున వతనిన్ భార కర్ణ 2 99
(వావిడిచి=బిగ్గరగా, అని భావము)
క, . . దానవ, వల్లభుఁడట్లఱచుచుండె వా విచిడి వడిన్ . నిర్వ. 4 94
2. దుఃఖించు
క దైవికములైన పనులకు, వావిడువఁ డవార్య ధైర్యవంతుఁడు. . వేం పంచ. 2. 25
వావిరి[1] వి. 1 క్రమము.
క ఆవల నాచేయంగల, యావిధమును మన్న యదియ యని మునుముట్టన్, వావిరి చెప్పఁగ నేలా, నావుడు వవ్విభుఁడు భీషణ స్ఫురణము నన్ హరి ఉ 1 163
క. కావున మనుజుఁడు సేయక, దేవుండీయంగలేఁడు తెగి యేమియు నా,నావిధధాన్యము లుండిన, వావిరి పండకయరిత్త పంటకమగునే. కుచేల. 1 91
క ఈ వరుసఁ ద్రయస్త్రింశ,ద్భావములకు లక్షణము లుదాహరణంబుల్, వావిరి నొనర్తు నీయెడఁ, గేవలశృంగారసూత్రకీలిత ఫణితిన్ నరస 3. 49
2. అనుగతి
క పోవఁగ న య్యగసాలియు, వావిరిఁ దోడరుగ నొక్కవన మధ్యమునన్, గేవల పక్వఫలంబుల, ప్రోవై యొక వెలగ యుండఁబొడగని వేడ్కన్. భోజరా. 5. 240.

ఉ కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ
మెయ్యెడన్, వావిరిఁ జేయకేలు భువనంబు భవ
త్కుల ధర్మరక్షివై భార శాం. 1 150.

3 ఆధిక్యము

ఉ. మనోరథభోగసౌఖ్యముల్, వావిరిఁ బొందు
చున్ నృపతివంద్యపదాబ్జము లొప్పనర్వథా, శ్రీ
వలయంబు నేలెదు భా. రా సుం 514

ఉ వావిరిఁ గమ్మ నీరు మృగనాభిరసంబున
మేళవించి నైష 3 102

విశే 1 ఉత్కృష్టము, గొప్పది.

చ వగవఁగ నేమియుం దగని వారికినై హృద
యంబు గుందఁగా, వగచెదు బుద్ధిమాటలును
వావిరి నాడెదు నీవు భార భీష్మ 1 195

చ వడిఁ ద్రిదశాలి నోర్చుడొక వావిరి వీరము
గాఁగ ... కు సం 10 561

ఉ మారుతసూతి నేను హనుమంతుఁడ రాముఁడు
పంపఁగాఁ బయో, వారిధి కేగుచో నొదవె వావి
రియై జలతృష్ణ నాకు . భా. రా యు 1684.

ద్వి రావణుండెంతయు రఘురాముమీఁద, వావి
రి యమ్ముల వానలు గురిసె .. రం. రా
యు. 525 పా 27 పం. (బ్రౌ)

2 ధూర్తుఁడు

చ వలదని యెంతచెప్పినను వావిరివై కడువేగ
పాటుమైఁ, బలుమఱు నెల్లెడం దొడరఁ
బాఱెదు భార విరా 2 260

(ఇట "అనుగంతుఁడు" అని (శ ర)

క ఆ వనిత చూచుచుండఁగ, వావిరియై పాఱు
వాతి వాడిశరమునన్, బావా మేలము సూయని,
ఈవులు గానతని తలగొట్టిగి పో విడిచెన్ వి
పు 8. 62

3 అత్యంతము

ఉ వావిరిఁ జెప్పగా వలసె వాలిన దుఃఖము
దాల్మిఁ గ్రాఁచివన్ . భార. శాం 1. 115.

చ. ... వర్మబంధముల్, ముఱియఁగఁ జాపముల్
దునియ ముద్గర తోమర శక్తులాదిగా, వరుస
ననేకము ల్మడియ వావిరిఁ బోరిచేలంబు పెంపు
వన్ ... హరి. ఉ. 2. 57

ఉ. వావిని సంతసిల్లి వటునాథుఁడు దానవనాథుఁ
జూచి నీ, పావనశీల సంపదకు భక్తికి నత్త్వవ
చోనిరూఢికిన్, వావిరి మెచ్చితిన్ సుకృతవర్ధన
వేడు వరం బొసంగెదన్, నావు డతండు వల్కె
సుజన ప్రియ నిమ్ము వరింప నెద్దియున్.
జాహ్నవి 2 34.

వావిరి[2] వి = వావిలి శేఫాలిక (వృ. వి)

సీ. వావిరి నిట్టూర్పు వావిరి నిడి యొడికంబుగ
నడితిలకంబుఁ జూచి ఇందు 3. 51.

ద్వి దేవదారువు కల్వె దేవ కాంచనము, వావిరి
రేలమువ్వంచు పంచాది ద్వి సారంగ 2
29 పా 21 పం

వావిలి వి. శేఫాలిక (వృ వి)

(దీని భేదములు – తెల్లవావిలి, నల్లవావిలి)

చ. వినఁగనరాని పల్లవిక వృత్తి మెయిం గెడఁ
గూడి యక్కటా, కనుగొన నయ్యె వావిలి
తగన్ మఱి దీనికి వావిలేదొకో . చంద్రాంగ
4. 223

క వలనుగ నమ్మద్దుం బై, దలి వలి నిట్టూర్పు
కమ్మ తావులచే వా, విలి వనిచెనవఁగ నిది
వే, ల్పులము న్నెవ్వారి వెట్లు పూజించె నొకో.
రసిక. 3 127

సీ . వావిలి యన సిందువార మమరు . ఆం
భా 2 51

వావురము = వారువము వి అశ్వము, గుఱ్ఱము

సీ పరఁగు నశ్వంబు బాబా వావురము వారువము
జక్కి త త్తడి మావు గుఱ్ఱము ఆం భా
2. 196

సీ గీ మురువు గలిగిన తొడుకు వావు ముసెక్కి .
వరాహ. 9 88.

స్రగ్ధర .. నయ్యంశుమాలిన్, వనమాలిన్ గీలిఁ
గేలిన్ వడి గడఁగి నగున్ వావురంబుల్ దినంబున్.
భోజసుతా 1 74.

వావృత్తము సం. విశే. (అ ఆ అ) వరింపఁబడినది
ఎన్నుకొనబడినది

వాశకము (సం. విశే అ శికా అ.) అఱచునది, ధ్వని
చేయునది.

వి. అ. పుం అడ్డసరము (వృ. వి.)

వాశనము సం వి. అ న. 1 అఱవు, బొబ్బరింత,
బొబ్బ 2. పక్షికూఁత. తుమ్మెదల రొద, ఝుంకా
రము.

**విఘాతి** సం. విశే. (న్. నీ. న్.) 1 తొలఁగించువాఁడు, నివారకుఁడు 2 నశింపఁజేయువాఁడు, నాశకుఁడు.

**విఘాతించు** సం. స. క్రి. 1 చంపు, సంహరించు

మ. మేదినికిన్ భారముడింప దైత్యుల విఘాతింపంగఁ గ్రీడార్థమై జనియించెన్ భవదీయసూనుఁడు.. హరి. పూ. 6. 15.

2 చెఱుచు (శ. ర.)

**విఘూర్ణితము** సం. విశే. (అ. ఆ. అ.) విశేషముగాఁ ద్రిప్పబడినది. (కన్ను)

**విఘృష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1 మిక్కిలి యొరయఁబడినది 2 మిగుల నూఱఁబడినది, మిక్కిలి మర్దింపఁబడినది 3 ఎక్కువగా రుద్దఁబడినది.

**విఘ్నకరుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) అడ్డుపెట్టువాఁడు విఘ్నము గలిగించువాఁడు

**విఘ్నకర్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) = విఘ్నకరుఁడు

**విఘ్నకారి** సం. విశే. (న్. ణీ. న్.) విఘ్నకరుఁడు

**విఘ్నధ్వంసము** సం. వి. అ. పుం. విఘ్నములు తొలఁగించుట

**విఘ్ననాయకుఁడు** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు.

**విఘ్ననాశనుఁడు** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

(ఇట్లే విఘ్ననాశకుఁడు)

**విఘ్నపడు** యి. అ. క్రి. (విఘ్నము+పడు) అడ్డిపోవు, విఘ్నితమగు

క. ఆ జాలియేల నిర్మల, బీజహావిస్తంత్ర మేను బ్రీతి నొనర్పం,గా జగతి వలవునం జెడు, నే జన్నము విఘ్నపడు నే యేఁటికీవగవన్. భార. అశ్వ. 4. 281

**విఘ్నము** సం. వి. అ. పుం. 1. అంతరాయము, అడ్డంకి, చెఱుపు. 2. శ్రమము, కష్టము 3. కరమర్దము, కలివెచెట్టు. (వాచ)

**విఘ్నరాజు** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

**విఘ్నవినాయకుఁడు** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

**విఘ్నహారి** సం. వి. న్. పుం. - విఘ్నములు పోఁగొట్టువాఁడు - విఘ్నేశ్వరుఁడు.

**విఘ్నితము** సం. విశే. (అ. ఆ. అ.) 1 విఘ్నములు కలిగినది, ఆటంకపఱుపఁబడినది 2. అడ్డుకొట్టఁబడినది.

**విఘ్నేశ్వరవాహనము** సం. వి. అ. న. ఎలుక.

(ఇట్లే విఘ్నేశవాహనము మొ)

**విఘ్నేశ్వరుఁడు** సం. వి. అ. పుం. గణపతి, ఈశ్వరుని పుత్త్రుఁడు, విఘ్నముల కధిపతి

(ఇట్లే విఘ్నేశానుఁడు, విఘ్నేశుఁడు. మొ)

**విచ(చి)కిలము** సం. వి. అ. పుం. 1 ఒక జాతి మల్లె. (వృ. వి.) 2 మదనవృక్షము, బ్రమంగచెట్టు.

**విచక్షణుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1 సూక్ష్మదృష్టిగలవాఁడు, దూరదృష్టిగలవాఁడు, వివేకశాలి 2 బుద్ధిమంతుఁడు 3 నిపుణుఁడు, నేర్పరి. 4 చదువుకొన్నవాఁడు, చదువరి.

వి. అ. పుం. పండితుఁడు, విద్వాంసుఁడు

**విచక్షించు** సం. స. క్రి. విమర్శించు దండకము..

ఇంతింబరీక్షించి బుద్ధిన్ విచక్షించి తన్మాత్రమాయాపరాభూత జామాత భోగినీ దండకము

**విచక్షుఁడు** సం. విశే. (స్) - విచక్షుష్కుఁడు.

1. కన్నులు లేనివాఁడు, గ్రుడ్డివాఁడు. 2 కలవర పడినవాఁడు, విమనస్కుఁడు, దుఃఖితుఁడు.

**విచయనము** సం. వి. అ. న. 1 వెదకుట. 2. పువ్వులు మొ. కోయుట (వాచ)

**విచయము** సం. వి. అ. పుం. 1 అన్వేషణము, వెదకుట 2 పరిశోధనము

**విచరించు** సం. అ. క్రి. విచారించు, సంతాపపడు.

ఉ. హైదరు జంగు పంపున మహాహవకేళికిఁ గోటచుట్టి బాహాదృఢవిక్రమోద్ధతిరయమ్మున సైన్యమువచ్చి నిల్చె నిమ్మీఁది విచారమెట్లనియమేయ పరాక్రమ రంగరాయ ధాత్రీదయితు స్మరించి విచరించిరి యచ్చటి పెద్దమానిసుల్. రంగా. 3. 27.

**విచరితము** సం. వి. అ. న. తిరుగుట, సంచారము.

**విచర్చిక** సం. వి. ఆ. స్త్రీ. పామ, చర్మరోగ భేదము, గజ్జి.

**విచర్చితము** సం. విశే. (అ. ఆ. అ.) పూయఁబడినది, రాచఁబడినది, రుద్దఁబడినది.

**విచలనము** సం. వి. అ. న. 1. మిక్కిలి కదులుట. మిగుల చలించుట. 2 మార్గము నుండి తప్పుట, తొలగుట. 3. చాంచల్యము, స్థైర్యము లేమి, 4. గర్వము, దురహంకారము.

**విచలము** సం. విణ (అ. ఆ. అ) మిక్కిలి కదలువది.

**విచలుడు** సం విణ (అ. ఆ. అ) దురహంకారము గలవాడు, గర్వి.

**విచారకుడు** సం వి అ పుం విచారించువాడు - 1. పరిశోధకుడు, పరీక్షకుడు 2 న్యాయాధికారి.

**విచారజ్ఞుడు** సం విణ (అ ఆ. అ) నిర్ణయింప సమర్థుడు, తీర్పరి.

**విచారణ** సం వి. ఆ. స్త్రీ 1 పరీక్ష, పరిశోధనము, సందిగ్ధమైన విషయమును తత్త్వ నిర్ణయమునకై ప్రమాణములతో బరిశీలించుట 2 ఆలోచన. 3. సంశయము, ఎటులును దోచనిస్థితి. 4. మీ మాంసాశాస్త్రము.

**విచారణము** సం వి అ. న. 1 విచారణ, పరిశోధనము, పరిశీలనము. 2. ఆలోచన. 3. సంశయము, ఎటులును దోచని స్థితి.

**విచారణీయము** సం విణ (అ. ఆ. అ) విచారణ చేయదగినది.

**విచారపడు** మి. అ క్రి (విచారము+పడు) సంతాపించు, చింతిల్లు. (శ. ర)

**విచారభువి** సం వి ఈ స్త్రీ 1 న్యాయస్థానము, న్యాయసభ. 2. యమసభ, యముని కొలువు

**విచారము** సం వి. అ పుం. 1. పరీక్ష, పరిశోధనము, సందిగ్ధ విషయమును తత్త్వ నిర్ణయమునకై ప్రమాణములచే బరిశీలించుట. 2. (అభియోగము) విచారించుట, సత్యము తెలిసికొనుటకై సాక్ష్యము మొది వినుట. 3. ఆలోచన 4. వివేకము, యుక్తాయుక్తపరిజ్ఞానము. 5. నిశ్చయము, నిర్ణయము. 6. ఎన్నిక, ఏర్పుకొనుట. 7. సందేహము, ఎటులును తోచనిస్థితి. 8. దూరదృష్టి.

**విచారముచేయు** మి. స క్రి ఆలోచించు, విచారించు.

ఉ. మజ్జన భోజనాదులకు మాపుశయించుటకు వ్యధూమణుల్, సజ్జనగేహ మొక్కటి విచారముచేసి యొనర్చి వాలిపెన్, సజ్జగొలంగి యచ్చటం బ్రసన్నత నిల్పిన లింగమున్ భవా, వజ్జలరాశికుంభజుని భక్తిభజింపగగలోపునంత టన్. కాశీ. 4. 86.

**విచారశీలుడు** సం. విణ (అ ఆ అ) 1. ఆలోచన గలవాడు, వివేకి. 2 దూరదృష్టి గలవాడు

**విచారస్థలము** సం. వి. అ న. 1 న్యాయస్థానము 2 యుక్తివాదము, యుక్తియుక్తమగువాదము.

**విచారి** సం. విణ (న్ ఈ న్) 1. తిరుగువాడు, త్రిమ్మరి. 2 తిరుగుబోతు, భోగలంపటుడు 3. ఆలోచన కలవాడు, వివేకి

**విచారించే** సం. స. క్రి 1 పరిశీలించే.

వ. . పంచబాణ శరంబులని ప్రమాణంబు విచారించు విరహ పరితాప పరిహారణనిపుణ పురంధ్రీ గణంబుల . ఉ. హరి 5. 136.

వ. మత్ప్రసాదంబున నతీతానాగతవర్తమాన దర్శియగుటం జేసి విచారించి పనుపుమనిన. మార్కం. 5. 154

2. పరామర్శించే.

మ. అగ్నిహోత్రమును నిత్యంబున్ విచారింతువే ... శశాం. 4. 8.

3. ఆలోచించే

గీ ఇవ్విధంబున దమతమ యెఱుగు తెఱగు, లందఱును జెప్పవిని కురునందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమి వారల గనుగొని యిట్టులనియె భార. విరా. 3 112

గీ. అమరులల్లోడి వాలఖిల్యాది మునులు, దారు గురునిపాలికి జని దైత్యవరుల, నోర్చు తెఱగు విచారించుచుండ వారి, కెలమి మిగుల బృహస్పతి యిట్టులనియె మార్కం. 2. 221.

సం. అ క్రి. సంతాపించే

వ . పుత్త్రి హత్యాది దోషంబును పుత్త్రి విహీనత్వంబును బ్రాప్తంబయ్యెనే యని విచారించి ... కాశీ. 2. 62.

**విచారితము** సం. విణ. (అ. ఆ అ.) 1. ఆలోచింపబడినది. 2. పరిశోధింపబడినది, పరిశీలింపబడినది. 3. నిశ్చయింపబడినది, పరీక్షింపబడినది, నిర్ణయింపబడినది. వి. అ. న. ఆలోచన.

విచార్యము సం. విశే. (అ అ అ) విచారింపఁదగినది.

విచి=వీచి సం వి. ఈ. స్త్రీ. తరంగము, అం. (వాచ)

విచికిత్స సం వి ఆ స్త్రీ. 1 సంశయము, నిశ్చయములేమి. 2. తప్పు.

విచితము సం. విశే. (అ ఆ అ) వెదకఁ బడినది, పరిశోధితము, పరిశీలింపఁ బడినది.

విచితి సం వి ఇ స్త్రీ 1 అన్వేషణము, వెదకుట 2 పరిశోధనము, పరిశీలనము.

విచిత్ర సం వి ఆ. స్త్రీ తెల్లదుప్పి

విచిత్రకము సం వి అ పుం వృక్షవిశేషము, కొండరావిచెట్టువంటి యొకచెట్టు

న ఆశ్చర్యము, వింత

విచిత్రదేహము సం. విశే. (అ ఆ అ.) మనోజ్ఞమైన (ఇంపైన) దేహముగలది

వి అ పుం మేఘము, మబ్బు

విచిత్రము సం విశే (అ. ఆ. అ) 1. ఆశ్చర్యకరమైనది, వింత యైనది. 2. కర్బురము, నానా వర్ణములు కలది. 3. వివిధము, పలువిధములైనది. 4. మనోహరము, ఇంపైనది 5. చిత్తరువుగా వ్రాయంబడినది, ఆలేఖ్యము.

వి అ. న 1 శబలవర్ణము, చిత్ర వర్ణము. ఆశ్చర్యము, వింత. 3.ఒకానొక యర్థాలంకారము.

విచిత్రవీర్యుఁడు సం వి అ పుం చంద్రవంశపు రాజు (శంతనునికి సత్యవతి యందుఁ బుట్టినవాఁడు భీష్ముని తమ్ముఁడు ధృతరాష్ట్ర పాండు రాజులతని పుత్రులు)

విచిత్రాంగము సం. విశే (అ ఆ ఈ. అ.) చిత్రవర్ణమయిన శరీరముగలది

వి అ పుం 1 నెమిలి. 2. పెద్దపులి.

విచిన్వకము సం వి అ పుం 1 వెదకుట, అన్వేషణము 2 పరిశోధించుట, అన్వేషణము. 2. పరిశోధించుట.

విచిన్వకుఁడు సం. వి అ. పుం. వీరుడు.

విచీర్ణము సం. విశే. (అ. అ. అ.) 1. ఆక్రమింపఁబడినది. 2. ప్రవేశింపఁబడినది.

విచేతనము సం విశే. (అ. అ. అ.) 1. చైతన్యము లేనిది, ప్రాణము లేనిది, చచ్చినది. 2. జడము, మొద్దుపాటినది.

విచేతనుఁడు సం. విశే (న్) 1 చెడ్డమనస్సు గలవాఁడు, ఒరులకుఁ గీడుగు కోరువాఁడు 2 విరుద్ధమయిన చిత్తముగలవాఁడు అవివేకి, మూర్ఖుఁడు 3. దుర్మనస్కుఁడు, దిగులొందిన మనస్సు గలవాఁడు.

విచేష్ట సం వి ఆ స్త్రీ. 1 ప్రయత్నము, పూనిక, ఉద్యమము 2 ప్రవర్తనము, నడవడి, 3 నడక, గమనము

విచేష్టించు సం. స. క్రి మిక్కిలి చేష్టించు మిక్కిలి చేష్టలుగలదానినిగాఁ జేయు

సీ పురుషోత్తముం డెల్ల భువనంబులును దానయఖిల భూతాత్మకుఁడై విహారశీల విచేష్టించు భార ఉద్యో 2 138

విచేష్టితము సం విశే (అ ఆ అ) 1. చేష్టాశూన్యము చేష్ట లుడిగినది 2. యత్నింపఁబడినది 3 పరీక్షింపఁబడినది, పరిశోధింపఁ బడినది. 4 తప్పుగా చేయఁబడినది.

వి అ న 1. కృత్యము, పని 2. పూనిక, యత్నము. 3. కుట్ర,తంత్రము 4. అభినయము 5 వ్యాపారము, పని, చేష్ట. 6 తంత్రము, కుట్ర.

విచ్చ వి నాలుగు వ్రేళ్లకుఁ జుట్టితీసిన నూలిమట్టు. (శ. ర. ప్రా.)

విచ్చఁబాఱు అ క్రి (విచ్చన్+పాఱు స్వార్థమున) పాఱు, విచ్చు

సీ జంతమయూరమా యింత గఁవ్వాఁబఁచే విటిసిమై పొఱలెత్తి విచ్చఁబాఱ కలువాయి. శ 14

విచ్చలవిడి వి 1 స్వాతంత్ర్యము, స్వేచ్ఛాప్రవృత్తి.

క ఎచ్చోటనైన నధముఁడు, విచ్చలవిడి ముందు లేదు వెలి పించుకయున్ భార శాం. 4. 86

చ. . . విచ్చలవిడి నీకునాతనికి సంగతి చేకుఱు ... దశకు. 7. 76.

శ. అచ్చుగఁ బ్రయాగలోపల విచ్చలవిడిఁ దనదు మేను విడిచిన మనుజుం, డొచ్చెల్ల యేమి చెప్పుదుఁ, జెచ్చెఱఁ గను నిష్ట కామ్య సిద్ధి ధరిత్రిన్. భోజరా. 1. 182.

2. స్వేచ్ఛ.

వ. .. చందురుండు కందర్ప దిగ్విజయస్ఫూర్తియుం బోని యచ్చవెన్నెల విచ్చలవిడింగాయం దొడంగె ... కాశీ. 3. 23

వ. ... విచ్చలవిడిం దిరుగుబోటులును . నీలా. 3. 10.

క్రి. విశ. నిరాటంకముగా.

వ. . ఆకృశాంగి మరల కన్నుదామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడి యశ్రుజలధారా ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱ .. ఉ. రా 6. 276.

**విచ్చేలు** వి విచ్చేలవిడి

ఉ. అచ్చర మచ్చెకంటులకునై కడుహెచ్చిన మచ్చరంబుతో విచ్చలుగాను మెచ్చగు వివేకము లెల్లను వెచ్చఁబెట్టి పిరిచ్చటదొమ్మి గూడి కలహించిన తేరుగదేలఫట్టు నీ రచ్చల నొంపఁగావలయు రాయని యింద్రుఁడుచే యమర్చుచున్ అహల్యా. సం. 1 109.

**విచ్చేవిచ్చేలు** అవ్య. యథాయథలు. (శ. ర బ్రౌ.)

**విచ్చాయ** వి. (సం. విచ్ఛాయా) రత్నదోష విశేషము. (శ. ర )

**విచ్చికము** విశ. దుష్టము

తే. కక్కసపు వంకగోరులఁ ద్రొక్కి త్రొక్కి, కఱకుముక్కున నందంద కఱచికఱచి పూస యొకటయుఁ బోఁగువఁ బొందనీక, చెరిపె ముత్యాల పేరు విచ్చికపుఁబులుఁగు. పాండు 4. 239.

**విచ్చిలు(ల్లు)**=విచ్చు అ క్రి (√ విచ్చు) విడివడిపోవు

శా విచ్చితెం, గోలంబుల్ బెదరెంజమూరుగణ మాక్రోశించెఁ బంచాస్యముల్ తాలాంకావరజుండు మందరమహో ధాత్రీ ధరంబెత్తినన్ హర. 6 46.

**విచ్చు** అ. క్రి. 1. (పుష్పాదులు) వికసించు, విడుచు.

క. అచ్చొనవాసతోడను, ఱిచ్చపడక మొనసి తుదిని హెచ్చెత్తివడిన్, నిచ్చెంబంపక ముకుళము. చెచ్చెరమఱి నువ్వుఁబువ్వు స్నేహం బూనెన్. రసి. 2 85.

చ. వరుఁడిక వేమిపొమ్మడుగ వచ్చెనటంచును నల్గుదాన నా, సరసకటాక్షబాణములఁ జల్లగనుల్లము విచ్చఁజాడ నా చరణ సమీపభూములకుఁ జయ్యనఁజేరఁడె యేమిసేతు సుందరులకు నాథుఁడింతదయ దప్పిన నేమగు వామలోచనా. గంధ. 1 81

చ .. కైశికము రేవఁ బ్రభాతకళాంకు మోప వి.చ్చినవవహల్ల కాళిఁగయిసేసి .. ఆము. 2. 16

ఉ క్రచ్చఱఁ బారిజాత లతికావనదేవత జంభవైరిపై, మచ్చికఁ గూర్పఁగా వవసుమ ప్రకరఁబుల వేల్పుఁజేటిలో, విచ్చిన పైడితామరల వెంబడివచ్చిన కమ్మగాడ్పులన్ మెచ్చులరీతిఁ గోకిలసమీరణ దీవనలిచ్చె నొప్పుగన్. హర. 6 10.

2 చీలు, భేదిల్లు.

క. చొచ్చి చతురంగవితతులు, విచ్చునటులు సేయుటయును విప్పచ్చుఁడు వే,వచ్చితల పడినఁ బురికొని, యచ్చట నిరువాఁగునట్ట లాడంబోరెన్ భార భీష్మ 2. 394

క. తరువొకటి పెఱికిలాంగల, ధరుఁడుద్ధతిఁ 'బూంచి హయరథ ద్విపసుభటో, త్కరముల ద్రుగ్గింపఁగన, న్నెరవులు విచ్చుటయు మేదినీధరుఁ డలరెన్. హరి ఉ 3 93.

3 విరియు, విడిపోవు.

సీ సంపారజీమూత సంఘంబు విచ్చునే చక్రికాస్య ప్రభంజనము లేక .. భాగ 7. స్కం. 172

చ. ఖురముల నేలఁద్రవ్వుచు వకుంరితవాల సమీరణంబులన్, విరవిరఁబోయి మేఘములు విచ్చ విషాణము లొడ్డికొంచు దు,స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు .. భాగ 10. స్కం పూ. 1142

చ. తెలతెలవాఱెఁ దూర్పువలుదిక్కులవిచ్చెఁ దమంబుపతులుం, గలకలఁ బల్కె.. బిల్హ. 3 183.

వ. ... జవ్వనంపుఁ గ్రొవ్వుననివ్వటిల్లి మవ్వంపువాతెఱలు విచ్చనవ్వ ... పరిచారికా సహస్రంబును గూఁతునకు నరణంబుగా నిచ్చి మఱియును... మనుచ. 5. 101.

4. నశించు.

శా. తీవ్రతరాంగసంభవ శరశ్రేణీవిదాహ వ్యథల్, వివ్వం దీరని భక్తితోహృదయమావిర్భూత మోదంబునన్, నవ్వందీఁగయుఁబోలెఁ జూడ్కులొదవన్ నత్కీరుఁడుత్కంఠతన్ కాళ. 3. 180.

5. బ్రద్దలగు, బ్రీలు.

మ ధరఖర్వాటుఁ డొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుఁడై, త్వరతోడం బఱువెత్తి చేరి నిలిచెం దాళద్రుమచ్ఛాయఁద, చ్ఛిరముం దత్ఫల పాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాన్. భర్తృ. 1. 85

6. వికలమగు.

క జనులెట్టిది శత్రువిధం,బని చెప్పుదు రట్టిచంద మారయఁగా దుర్జనుఁడ వగునీకు నాయెడ, వినుముకలిగె దీనమనసు విచ్చెంగుటిలా భార కర్ణ. 2. 104

7. తెఱచియుండు

ఉ. ఏమఱుపాటఁ జూచినను నేటితటంబున దాన కాంతఁబే, రాముదపాకుచందమున హస్తము విచ్చియ యుండువానికిన్ . కాశీ. 7 234.

స క్రి 1 విప్పు, విడఁదీయు

వ. విన్నపంబుచేసి తమ తెచ్చిన విధ్వస్తోపకరణంబులు విచ్చిచూపి . ఉ హరి 1 111

వ ... తదలంకార చామరంబులు రెండును విచ్చ పుచ్చుకొని ... కళా. 1. 160.

2. విరియఁజేయు, వ్యాపింపఁజేయు.

చ. పతిఁగని .. వీక్షణా,యతసితదీధితుల్ గల యనద్రిజ విచ్చెమహేశుమీఁద .. కు. సం. 7. 901.

క. ఎఱకలు విచ్చుచుఁదుండము, తెఱచుచు ... భార. ఉద్యో. 3. 301

క అచ్చటనచ్చట నిడుపుగ, విచ్చిన గుసుమాస్త్ర శాస్త్ర వేదుల మనముల్, మెచ్చించుఁదెరల మంజిడి, పచ్చడములు చతురశీతి బంధంబుల తోన్ నైష 7. 155

8 తెరచు.

చ వెడవెడఁగన్నుమూయుఁ గనువిచ్చు నగుందల యూఁచు ... పారి. 1. 101.

ఉ. .. ఇంక నా,హారము గమ్మనాకని గుహాసదృశంబగు నోరువిచ్చినన్ ... భా రా. సుం 48.

4 వికసింపఁజేయు

చ అనవిని మోము విచ్చుచు మురాంతకు నిట్లనుఁ గుంతి పాండు నం,దనులకుఁ దండ్రియు న్గురువు దైవము నారయ నీవకావె . భార. ఉద్యో 3 207.

గీ. నవ్వినట్లల్ల విచ్చెఁ, గలయ మూఁతులు కేతకీ గహనతతులు . . ఆము 4 94.

5. చీలుచు, భేదించు

క వి త్తము సంసృతి పటలము, ప్రవృత్తముకామాది వైరి వర్గంబులనేఁ, డి త్తము చి త్తము హరికిని, జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్. భాగ. 7 249.

వ ఎడయిచ్చిన వజ్రంబును జను మఱగ్రుచ్చి వెనువిచ్చి చనలేక యచ్చటనే యున్నన్ ... దశా. 2 433.

6 విడిచిపెట్టు, త్యజించు

ఉ. సోరణగండ్ల రాఁగొదమ చుక్కలు పట్టసతు ల్కవాటముల్, చేరుప ... ప్రొద్దువోఁ,గా రతి డస్సిగాడ్పులకుఁ గాఁదెఱవం జను విచ్చి మేడలన్. ఆము. 2 13

7 విడఁగొట్టు, తొలఁగించు.

సీ పాలిండ్లు గదలంగఁ బసవు బయ్యెద విచ్చి నచలాధిపతి కూర్మియాఁడు బిడ్డ . కాశీ. 2. 52.

విణ. చీలినది, విడిపోయినది, విదారితము.

సీ. ... శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి నైపుణి జ్ఞాన చింతామణి కృతి .... ఆము. 1. 18.

వి. వికాసము.

సీ సకల సత్త్వపురాణ సారాంశముల హెచ్చు కైవల్యరమచేతికల్వ విచ్చు .... ఘటికా. 1 140.

జ . విచ్చఁబాఱు, విచ్చిలు, విచ్చుకత్తి, విచ్చుకొను, విచ్చుటాకు, విచ్చునొగ్గ.

**విచ్చుకత్తి** వి. (విచ్చు+కత్తి) ఒఱ దూసిన కత్తి.

చ. వెలువడి యొప్పుచెప్పు డరి వీరులఁ దాఁకు
దమంచు విచ్చుకత్తుల జెడఁగుం దళత్తళలతోఁ
దనముందట వచ్చుదేవ వీరులకును జేయి వీచు
టయు రోసముతోఁ జని దైత్యవీరులం, దలపడి
రా సురాసురులు దార్కొని రుగ్రతరాగ్ర
హంబునన్ ఉ రా 4 290.

మ. మొనకు న్వచ్చిన విచ్చుకత్తులసివే ము స్తీదు
మేల్ రౌతులం,దునుమాడంగను గల్గిపార్శ్వ
మున యందుం గ్రమ్మి నశ్వంబులం, దనబల్లె
మ్మునఁ గ్రుమ్మి క్రమ్మఱుచు వెన్కన్ దార
సిల్ జోదులన్, గని దూరంబు దొలంగఁ
జేయుఁ బటు దోర్గర్వం బఖర్వంబుగన్ కృష్ణ
3 34.

సీ .. విచ్చుకత్తుల వారు వెంటరా నందలంబున
నిబ్బరంబుగాఁ బోవ నిచ్చు . కువల 5 9

**విచ్చుకొను** స క్రి (విచ్చు + కొను) విప్పుకొను

క. వచ్చినఁ బొడఁగాంచి పెనల్, విచ్చుకొని కడుం
దలఁకి విసదారిగముల్, విచ్చునొగ్గయి కడ
లకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజకున్
అ. రా. యు 163.

**విచ్చుటాకు** వి (విచ్చు + ఆకు) 1. కర్ణపత్రము,
చెవ్వాకు.

సీ. శ్రీ విచ్చుటాకు చెవ్వాకన వెలయుఁ గర్ణపత్ర
నామంబు అం. భా 2. 148

2 విరిసిన యాకు.

సీ. బలితంపు విచ్చుటాకుల దుద్దుఁ గమ్మలు నిర్దంపుఁ
జెక్కుల నీడఁ జూడ క్రీడా 101.

**విచ్చునొ(మొ)గ్గ** విశే (విచ్చు + మొగ్గ).

1 చెల్లా చెదరైనది

క వచ్చినఁ బొడఁ గాంచి పెనల్, విచ్చుకొని
కడుం దలంకి విసదాలిగముల్, విచ్చునొగ్గయి
కడలకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లువీడెం బజ
కున్. అ. రా. యు. 163

శా. ... విచ్చునొగ్గ విరాలి మొగ్గయగుచున్
విచ్చేసిరయ్యంగనల్ తపతి. 4 69.

చ... ప్రమదొప్పక యింతయు విప్ప విచ్చు మొగ్గయి
మఱిపానిపోదురు సమస్త దిశాగతులైన యర్థ్య
గుల్ ... ఆము. 4. 131.

మ. కరుణం బ్రోచిన మిత్రుఁడేఁగెను గళంకం
బు ను చెల్లప్పుడున్, గురువిద్వేషి నిశాచరుండ
మమలోకుల్ నిందగావించు ని,ష్ఠుర భావుండరు
దేఱఁ గీడ్పఱచునంచున్ విచ్చు మొగ్గచనెన్,
జరితార్థాత్మకళత్ర వృత్తమగుచున్ జక్రద్విజ
వ్రాతముల్ భోజసుతా 5 10.

పీ .. ముచ్చు చేరువులకు విచ్చు మొగ్గ కలిజ
3. 81

వి 1 విఱియు మొగ్గ. 2 చెల్లాచెదరగుట

సీ . ఎలమిఁ బొల్పగు యూథికలకు సంతలకూట
ములకును మఱి విచ్చుమొగ్గలొదవె ఆము
4 123

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము )

**విచ్చేయు = విజయముచేయు** అ. క్రి 1 (పూజ్యులు)
వచ్చు

శా. . నిర్వాణదాన క్రియా,శీలుండైన పరా
శరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై. భార
ఆశ్వ 3 147

శా . వేదవ్యాసమునీశ్వరుండు గరుణన్ విచ్చేసె
నచ్చోటికిన్ .. హరి. ఉ. 9. 17

క. విచ్చేయుము తల్లికడుపు వెడలిముకుందా.
భాగ 10. 101.

2. (పూజ్యులు) వెళ్లు, పోవు

క. ఆసమయంబున రైభ్య మ,హాసంయమి యేఁగు
దేర నర్ఘ్యాదివిధుల్, చేసి వసున్నృపతి యెటు
వి,చ్చేసెదవు మునీంద్ర నాకుఁ జెప్పుమటన్నన్.
వరాహ 2 5

మ అడుగ న్నిమ్ము వరంబు వేగమ యహల్యా
జార విచ్చేయ నా, కుడురాజార్ధవిభూషణుండు
వరమీనున్నాఁడు యుష్మాదృశుల్, బడుఁగు
ల్యాఁచిత మీ సమర్థులె కాశీ 4 50.

సీ . పరమేశుఁ డతని సద్భక్తికి మదిమెచ్చి కల
లోన నొకనాఁడు గదిసి వరము, తే. వేఁడికొను
మన్న నిరుపుర వేఁడె సుతుల, శివుఁడు నిచ్చితి
నంచు విచ్చేసె నంత. ఉ. హరి 4. 7.

3. ప్రవేశించు, చొచ్చు.

తే రమణి హృదయంబునను మహారాజ నీవు, గరిమ విచ్ఛేసియుండిన కారణమున, దీని వక్షో రుహంబు లాలోన నుండ, నెడము లేకున్న మరికదా వెడలెవెలిక. నై ష. 8. 66.

4 కూర్చుండు.

క నిచ్చలు లోపలికాంతలు, మచ్చికఁ దన తోడ నాడుమాటలు నాకున్, ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడల మీఁదవిచ్చేసినృపా భాగ. 1. 371

ద్వి. ఇంతకంటెను భాగ్య మెయ్యది యనుచు, సంతసం బొదవ బాజారంబు మీఁద, విచ్చేసి యుండిరి ద్వి. పరమ 2. (చి ని.)

**విచ్ఛంద(క)ము** సం వి అ పుం. ఈశ్వర గృహ భేదము, అనేకభూమి కలుగు మేడ

**విచ్ఛర్దకము** సం వి అ పుం. = విచ్ఛందము.

**విచ్ఛర్దనము** సం వి అ న క్రక్కుట

**విచ్ఛర్దితము** సం విణ (అ. ఆ. అ.) 1. క్రక్కఁబడినది, బహిష్కరింపఁబడినది 2 అశ్రద్ధ చేయఁబడినది, నిర్లక్ష్యము చేయఁబడినది. 3. విడువఁబడినది, త్యజింపబడినది. 4 చెఱుపఁబడినది. 5. క్షీణింపఁ జేయంబడినది.

**విచ్ఛాయ** వి. రత్నదోష విశేషము.

క. తనజాడ మెరుగు వెలుగును, దనరక మలినంబు వెలయు దనకాంత వేలు, న్మణి విచ్ఛాయయు మేదిని, వొనరఁగ విడుచుదురు దీని ధీయుతు లెన్నన్. రత్నపరీక్ష, 68. ప

(ఈ పద్యమందు గణభంగమును విశ్రమభంగమును గలవు)

**విచ్ఛాయము** సం. విణ (అ ఆ. అ) పాలిపోయినది, వివర్ణమైనది, కాంతిలేనిది

వి అ పుం. ప్రశస్తమైన కాంతిగల రత్నము.

న. పక్షులగుంపు నీడ.

**విచ్ఛిత్తి** సం వి ఇ స్త్రీ 1. నఱుకుట, తునియఁ జేయుట, పగులఁగొట్టుట చీల్చుట. 2. విభజించుట, వేఱుచేయుట. 3 కనఁబడకపోవుట, లేకపోవుట. 4. ముగియుట, సమాప్తి. 5. రంగులతోఁ గాని సుగంధి తైలములతోఁగాని శరీరము పూయుట, మైపూఁత లలఁదుట 6 (ఇల్లు మొ. వాని) హద్దు 7 పద్యపాదమునందలి నిలుపు చోటు, విరతి. 8 వస్త్రములు నగలు సమృద్ధిగా లేకున్నను శరీర సౌందర్యము చేతనే మిక్కిలి యొప్పిదమును దోఁపఁజేసెడి స్త్రీల శృంగార చేష్టా విశేషము.

**విచ్ఛిన్నము** సం విణ (అ. ఆ అ.) 1. నఱకఁబడినది, ముక్కలు చేయఁబడినది. 2 చీల్పఁబడినది, పగులఁగొట్టఁబడినది, విభజింపఁబడినది 3 నిషేధింపఁబడినది, ఆటంకపఱుపఁబడినది 4 అంతమొందినది, ముగిసినది. 5. చిత్రచిత్రముగాఁ జేయఁబడినది. 6. దాఁచఁబడినది. 7. సుగంధి తైలాదికములతో పూయఁబడినది. 8. వంపఁబడినది 9. కుటిలమైనది.

**విచ్ఛురితము** సం విం. (అ ఆ. అ) 1. కప్పఁబడినది, ఆచ్ఛాదితము. 2. కాఁపఁబడినది, స్థగితమైనది. 3 పూయఁబడినది, రాచఁబడినది, రుద్ధఁబడినది

**విచ్ఛేదనము** సం. వి. అ. న = విచ్ఛేదము.

**విచ్ఛేదము** సం. వి అ. పుం 1. ముక్కలుగాఁ జేయుట, నఱుకుట. 2. విభజించుట, వేఱుపఱుచుట 3 పగులగొట్టుట. 4. విఘాతము, ఆటంకము 5 ఆఁగిపోవుట, అంతమగుట 6. తొలఁగించుట, నివారణము. 7. విరోధము, పగ. 8. గ్రంథ భాగ విశేషము 9. అవకాశము, తెఱపి, విరామము. 10. వంశపరంపర యొక్క భంగము, వంశమంత మగుట

**విచ్ఛేదించు** సం. స క్రి. ఖండించు

శా. సేనానిం బదహస్తమస్తములు విచ్ఛేదించి మోదించిరన్ . జై. 6. 141

**విచ్యుతము** సం విణ (అ ఆ. అ.) 1. భ్రష్టము, జారిపోయినది. 2. భ్రష్టముగాఁ జేయఁబడినది, తొలగింపఁబడినది 3 (మంచి మార్గము మొ వాని నుండి) తప్పినది, తొలఁగినది 4. పక్కుకట్టి రాలిపోయినది.

**విచ్యుతి** సం. వి ఇ. స్త్రీ 1. భ్రష్టమగుట. పడిపోవుట, జాఱుట, విడిపోవుట 2. క్షయము, క్షీణించుట, నాశము 3, (మంచి మార్గము నుండి) తొలఁగిపోవుట. 4. చెడిపోవుట (గర్భ విచ్యుతి మొ )

**విజననము** సం వి అ న 1 ప్రసవము. 2. ఉత్పత్తి, పుట్టుక.

**విజనము** నం. విజ (అ ఆ. అ) జనులు లేనిది, ఏకాంతమైనది, నిర్జనమైనది

వి. అ. న నిర్జనప్రదేశము, రహస్యస్థలము.

**విజన్ముఁడు** నం విజ (న్) వి పుం జారజుఁడు, పరపురుషునివలన జన్మించినవాఁడు

**విజపిలము** నం వి. అ. న బురద, పంకము (హ ది)

**వి(కుష్ఠి)జము** నం. వి. ఇ. పుం 1. పక్షి 2. పాచిక.

**విజయ** నం. వి అ స్త్రీ 1. దుర్గ. 2 దుర్గ యొక్క పరిచారకురాండ్రలో నొకతె. 3. విశ్వామిత్రుఁడు రాముని కుపదేశించిన విద్య 4 ఆశ్వయుజ శుక్ల దశమి. 5 గంజాయి చెట్టు. 6 ఉసిరిక చెట్టు 7. వావిలి చెట్టు 8 మంజిష్ఠ (వృ వి) 9 ఒక జాతి జమ్మి. 10 నెల్లిచెట్టు 11. విజయద్వాదశి, శ్రవణ నక్షత్రముతోఁ గూడిన శుక్లపక్ష ద్వాదశి.

శ్లో. యదాతు శుక్లద్వాదశ్యాం, నక్షత్రం శ్రవణం భవేత్, తదాసాతు మహాపుణ్యా, ద్వాదశీ విజయాస్మృతా.

**విజయం(యము)చేయు** మి. అ క్రి (విజయము + చేయు.) 1 వచ్చు, విచ్చేయు.

శ్లో. భవేద్విజయ తశ్శ్రేయు,ర్గతా కర్తృ ప్రపూజనే, మోరభంఁడో భవేద్బిందుర్వాత దంతస్యవేం విచా. (చి ని)

క. పాయక పెక్కుతపంబులు, సేయు తపోనిధుల కైనఁ జేర నశక్యం, బియరద మెక్కి విజయం, చేయుము జగతీశ తడవు సేయక యనినన్ విశ్ర 2 79

మ. అజరుద్రు ల్గని పోరు చూచుటకో యీ యాదాయ మాశించియో, విజయం చేసితి రయ్య మీరిచటికిన్ వేవెగ విద్వన్మణీ .. కళు 5. 165.

క విను డీఁదగుసఁబంధవు, కెనయిక్ఁగని మోచి తెచ్చి యిచ్చెననరె చు,ల్కని నరులుగాన మా పుర,మునకు న్విజయంబు సేయఁ బుత్త్రిక నిత్తున్. ఆము. 7 56.

2. పోవు, అరుగు

క. మనలితిరి విచిత్రకథా, రసవృత్తిం దడ వెఱుంగ రాక యనుష్ఠా,నసమయమయ్యె వళో మ,ధ్య సమీపంబునకుఁ దరణి యరదమువచ్చెన్, మ విజయంబు చేయుఁడు నావుడు న్నుములు .... నిర్వ 7 135.

వ అని వినుతించి గరత్మంతుండు దేవా యేను నీ తలంపులోనివాఁడ . ఇదె యాయితం బై తినెక్కు మెక్కడ విజయం చేసెద వక్కడ నడిచెద ననిన హరి ఉ 8 64

సీ ఆత్మ పట్టణమున కతివఁ దోడ్కొని విజయంబు చేసెను మహోహ్వ మొప్ప ... ఆము. 7. 71

**విజయంతుఁడు** నం వి అ. పుం ఇంద్రుఁడు. (చూ. వైజయంతము)

**విజయకుంజరము** నం వి అ పుం పట్టపుటేనుఁగు, రాజు అధిష్ఠించెడి యేనుగు, యుద్ధమున నుప యోగపడెడి యేనుఁగు.

**విజయచ్ఛందము** నం వి అ పుం ఏనూఱు పేటలు గల హారము.

**విజయడిండిమము** నం వి అ. పుం ఢక్క, ఒక విధ మగు చర్మవాద్యము (ఇట్లే విజయమర్దలము మొ)

**విజయదశమి** నం వి ఈ స్త్రీ ఆశ్వయుజ మాసశుక్ల పక్షదశమి

**విజయము** నం వి అ పుం 1 జయించుట, గెలుచుట 2 జయము, గెలుపు 3 దేవతా విమానము, దివ్యరథము. 4 ప్రభవాది సంవత్సరము లలో నొకానొకటి

**విజయసప్తమి** నం వి ఈ స్త్రీ ఆదిత్యవారమున వచ్చిన శుక్లపక్ష సప్తమి.

**విజయసిద్ధి** నం వి ఇ స్త్రీ గెలుపునొందుట.

**విజయి** నం వి న్ పుం జయశీలుఁడు, గెలుపు నొందినవాఁడు

**విజయించు** నం స క్రి గెలుచు

ద్వి వెనఁ గౌరవుల నేను విజయింప లేమి, వసు ధేశుఁ డేల యెవ్వరు నెఱుంగుదురు .. ద్వి. భార. విరా 4. 82 పా

**విజయుఁడు** నం వి అ పుం 1 అర్జునుఁడు 2 యముఁడు 3 విష్ణుని ద్వారపాలకులలో నొకఁడు

**విజయేశుఁడు** నం వి అ పుం శివుఁడు.

**విజయోత్సవము** నం. వి. అ పుం విజయ దశమి నాఁడు దుర్గాప్రీతికై చేసెడి యుత్సవము.

విజరము సం విణ (అ ఆ అ) ముదిమి లేనిది 1. ప్రాయమున నున్నది. 2 నూతనము, అభినవము.

వి అ. న (ఆకు మొ వాని) కాఁడ.

విజల్పము సం. వి అ పుం 1 ప్రేలుట, వదరు, వ్యర్థసంభాషణము. 2. మాట, సంభాషణము 3. కోపవాక్యము

విజల్పితము సం విణ (అ ఆ అ) 1. పలుకఁబడినది, చెప్పఁబడినది 2. ప్రేలఁబడినది, వదరఁబడినది.

విజాత సం వి అ స్త్రీ పిల్లలఁ గన్న స్త్రీ

విజాతి సం వి ఇ స్త్రీ. 1 భిన్నజాతి, వేరుజాతి. 2. మాఱురకము, వేఱువిధము

విజాతీయము సం. విణ (అ. ఆ అ.) 1 భిన్నజాతులకు సంబంధించినది, వేర్వేఱు విధములు గలది 2 భిన్నజాతికి (వర్ణమునకు) సంబంధించినది 3. సంకరజాతికి సంబంధించినది

విజాతీయుఁడు సం విణ. (అ ఆ. అ) వేఱుజాతికిఁ (వర్ణమునకు) జెందినవాఁడు, అన్యజాతివాఁడు, భిన్న ధర్మావలంబి.

విజాతుఁడు సం విణ (అ ఆ. అ) 1 నీచముగాఁ బుట్టినవాఁడు, పరపురుషునివలనఁ బుట్టినవాఁడు జారజుఁడు. (వాచ) 2. పుట్టినవాఁడు. 3. రూపాంతరము నొందిన వాఁడు.

విజానత్ సం విణ. (త్) = విజ్ఞుఁడు (దీనికి తెలుగున వ్యస్తప్రయోగము లేదు సమాన పూర్వపదముగా నే ప్రయుక్తము )

విజిగీష సం. వి ఆ. స్త్రీ 1 జయింపవలె ననెడి యిచ్ఛ. 2 స్పర్థ, పోటీ, ఒకనిని మించవలెననెడి యిచ్ఛ 3 పొట్ట పోసికొనుటకై నింద్యమైన కృత్యమునఁ బ్రవర్తించుట (వాచ.)

విజిగీషువు సం. విణ (ఉ) 1 జయించవలెనని కోరువాఁడు, జయాభిలాషి 2 ఒకనిని మించవలెననెడి కోరిక కలవాఁడు 3 పొట్ట పోసికొనుటకై నింద్యమైన కృత్యమునఁ బ్రవర్తించువాఁడు

వి. ఉ. పుం 1 వీరుఁడు, యోధుఁడు 2 ప్రతిస్పర్థి, ఎదిరివాఁడు, శత్రువు.

విజిత సం. వి ఋ పుం. 1. నిర్ణయించువాఁడు. 2. భాగస్వామి, పాటూదారు.

విజితాత్ముఁడు సం విణ. (న్) తన్నుఁ దాను లోఁబఱుచుకొనినవాఁడు, తన యాత్మను స్వాధీనపఱుచుకొన్నవాఁడు

విజితి సం వి ఇ స్త్రీ విజయము, గెలుపు

విజితుఁడు సం విణ (అ ఆ అ) జయింపఁబడినవాఁడు, లోఁబఱుచుకొనఁబడినవాఁడు.

విజిన(ల)ము సం వి అ పుం న. సరసవ్యంజనము, పలుచని పులుసు

విజిహ్మము సం విణ (అ ఆ అ) మిక్కిలి కుటిలమైనది, మిగుల వంకర యైనది

విజిహ్ముఁడు సం విణ (అ ఆ అ.) మిక్కిలి కుటిలుఁడు, మర్యాద లేనివాఁడు, ఆర్జవ హీనుఁడు.

విజులము సం వి అ పుం. బూరుగుచెట్టు ("శాల్మలీకందము" అని రా ని )

విజృంభణము సం వి. అ న 1. ఆవులించుట, ఆవులింత, జృంభ 2. (పుష్పము) విరియుట, వికసించుట 3 ప్రదర్శించుట, కనఁబఱుచుట, 4 వ్యాపించుట, వ్యాపనము. 5 వినోదము శృంగారక్రీడ

విజృంభించు సం అ క్రి 1. చెలరేఁగు.

వ ఇవ్విధంబున నమ్మహాదేవిచేత నిజసైన్యంబు నిరవశేషంబైన విజృంభించి యమ్మహిషాసురేంద్రుండు .. తదీయగణంబుమీఁదఁ గవిసి. మార్కం 6 104.

2. వికసించు. (శ ర)

విజృంభితము సం విణ (అ, ఆ అ) 1 ఆవులించినది 2 వికసించినది, విరిసినది 3. ప్రదర్శింపఁబడినది, కనఁబఱుపఁబడినది 4. గోచరమైనది, కనఁబడినది 5 విహరించినది

వి అ. న 1 ఆట, వినోదము 2 ఇచ్ఛ, కోరిక. 3. ప్రదర్శనము, కనఁబఱచుట 4. కృత్యము పని. 5 ఫలితము

విజ్జన(ల)ము = విజినము సం వి అ న 1. వ్యంజన విశేషము, పలుచని పులుసు మొదలైనవి 2 బాణము.

విజ్జి వి. తన్నుకొనుటయం దగుధ్వని కనుకరణము

సీ. .. చంపకప్రసవవాసన సోఁకి తేటిలఁదేఁటి కూలి విజ్జనఁ దన్నికొనియెనేని . . పి శకుం. 3. 190.

సీ. ... పల్యాణములఁ గ్రిందఁ బడినరాహుత్తులుఁ గూలి విజ్జనఁ దన్నుకొనెడి హరులు జై. భా. 5 192.

సీ. తే విజ్జివిజ్జనఁ దన్నంగ విడువ రెలమిఁ, గటకు టంఘుళ్ల నిలికించి గజ్జెగదల, గటికి నెటినెటికో లెమ్మకయును విఱుగ, విటిచె వడిఁ గైజా నొక పెద్దవేసడంబు మనుచ. 4. 85

అ క్రి వ్యాపించు, అలముకొను.

సీ కిసలయంబులతోడఁ గెంగేలు దడఁబెట్టి విరులపై నఖకాంతి విజ్జరాల్చి ... ఉ హరి. 5.50.

విజ్జులము సం. వి అ న దాల్చినచెక్క, లవంగపట్ట.

విజ్జులిక సం వి అ స్త్రీ చీకురువాయి, ఒకజాతి గలిజలము (రా ని)

విజ్జోడు విశ (వీడు+జోడు,) 1 జోడుకానిది, సరి రానిది

సీ శ్రుతులు విజ్జోడై నచోఁ దంత్రి బిగువుగాఁ బీడించు గిటగిట బిరుడఁద్రిప్పు ... వై జ. 1. 118

సీ మారేడుబుట్టలో మంత్రాక్షతంబులు పదముల విజ్జోడు పాదరక్షలు .. కుర. 2. 442.

2. ఎడఁబాటు నొందినది

శా. చూడంజాలక మిత్రబాంధవుల విజ్జోడై చనం జేయనో ... కవిరా. 3 131.

(చంద్రోపాలంభనము)

విజ్జోడు(ప)వడు అ క్రి. (విజ్జోడు+పడు) భేదిల్లు, భేదపడు

సీ . శారదావదన ప్రతిబింబాది నామకర్మ, కల్పనాకేళిప్రకార మాత్రములైన యవన్మదాఖ్యానక్రియాదికములు.

గీ తోడ నెందు నొకింత విజ్జోడువడక, సమమగుట యెట్లో యను విచారము గలిగియు. కళా. 5. 86.

సీ విజ్జోడుపడ నిడ్డ వెంద్రుకజంబెంబు వలిగుబ్బపాలిండ్ల కెలఁకు లొరయ ... క్రీడా, 1. 101.

విజ్ఞప్తము సం విశ (అ. ఆ. అ) 1. గౌరవముతోఁ దెలుపుకొనఁబడినది, మనవిచేసికొనఁబడినది 2. తెలుపఁబడినది

విజ్ఞప్తి సం వి ఇ స్త్రీ. 1 విన్నపము, మనవి, గౌరవముతోఁ దెలుపుకొనుట, ప్రార్థన 2 ప్రకటన, ప్రచురణము. (ఆ ని.)

విజ్ఞాతము సం. విశ (అ ఆ అ) 1 తెలియఁబడినది, గ్రహింపఁబడినది 2 ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది.

విజ్ఞానము సం, వి. అ న. 1 జ్ఞానము, తెలివి, గ్రహణశక్తి 2 ప్రజ్ఞ, సూక్ష్మభేదములను దెలిసికొను బుద్ధి. 3 నైపుణ్యము, నేర్పు 4 లౌకికజ్ఞానము, లోకానుభవమువలనఁ గలిగిన తెలివి (జ్ఞానము = బ్రహ్మజ్ఞానము విజ్ఞానము = తద్వ్యతిరేకజ్ఞానము.) 5. ఉద్యోగము, పని, వ్యాపారము (మే ని.) 6 సంగీతము 7 చతుర్దశవిద్యల జ్ఞానము. 8. (బౌద్ధమతమున) ఆత్మరూపజ్ఞానము

విజ్ఞానస్కంధము సం వి. అ పుం. బౌద్ధమతమునందలి పంచస్కంధములలో నొకటి

(స్కంధములు: రూపస్కంధము, విజ్ఞానస్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము అని యైదు.)

విజ్ఞానికుఁడు సం విశ (అ ఆ అ) = విజ్ఞుఁడు.

విజ్ఞానేశ్వరుఁడు సం వి అ పుం యాజ్ఞవల్క్యస్మృతికి మితాక్షరి యనువ్యాఖ్య రచించిన యతి.

విజ్ఞాపకుఁడు సం. వి. అ. పుం 1 విజ్ఞాపన చేయువాఁడు, తెలుపుకొనువాఁడు 2. బోధకుఁడు, ఉపాధ్యాయుఁడు.

విజ్ఞాపన సం వి. అ స్త్రీ 1. మనవి, విన్నపము, ప్రార్థన. 2 తెలుపుట, తెలియఁజేయుట 3 బోధించుట

విజ్ఞాపనము సం వి. అ న = విజ్ఞాపన

విజ్ఞాపించు సం స క్రి విన్నవించు.

వ కంపాపరాధంబుల ననురోధింపక తదుత్తర క్రియలకు ననుమతింపవలయునని విజ్ఞాపింపుమనిరి ... హరి. పూ. 9. 169.

మ్ ... కళ్యాణి నాకూర్మినందవ నీ నాత్మc దలంచి దేవరకు విజ్ఞాపింప నేతెంచితిన్ వరా. 6 34.

**విజ్ఞాపితము** సం విశ (అ అ అ) 1. మనవి చేయఁబడినది, గౌరవముతోఁ దెలుపఁబడినది 2 ప్రార్థింపఁబడినది. 3. తెలుపఁబడినది 4 బోధింపఁబడినది. విఱుకచేయఁబడినది

**విజ్ఞాప్యము** సం విశ (అ అ అ) మనవిచేయదగినది, విన్నవింపఁదగినది

వి అ న మనవి, విన్నపము ప్రార్థన.

**విజ్ఞుఁడు** సం విశ (అ. అ అ) 1 తెలిసినవాఁడు. చదువరి. 2 నేర్పరి, పనివాఁడు

వి. అ. పుం విద్వాంసుఁడు, పండితుఁడు

**విజ్వరుఁడు** సం విశ (అ అ. అ) 1 జ్వరములేనివాఁడు 2 సంతాపము లేనివాఁడు.

**విటంక(క)ము** సం వి అ పుం న 1 పావురపు గూఁడు, కపోతపాలిక 2. పర్వత శిఖరము, కొండకొన.

**విటంకితము** సం విశ (అ అ అ) గుర్తుపెట్టఁబడినది, ముద్రవేయఁబడినది

**విటకత్తె** మి వి వ్యభిచారిణి, వలపుకత్తె

గీ విటుని వలె హరి సొగసుగ వేస మెనగc, దాల్చి విటకత్తె వలె నుండుతరుణిఁగూడి, పాదుకల మెట్టికొంచు వాప్రథితయజ్ఞ, వాటిఁ దేరంగ జూచుచు వచ్చుచుండె వేం మా 1 126.

**విటకాఁడు** మి వి. విటుఁడు.

గీ తనదుప్రాయంబు నెటి చక్కఁదనముఁ దానె, కాంచి విటకానిబోంచు కేకారి పారలుc, బట్టఁ జాలని తమిదొట్టి గుట్టువిడక, హాళికుని కోడలౌ రార కాళితోఁడ ఉ. హరిశ్చ 4 18.

విటకాని మౌనిశయ్యం, దటుకునఁ గూర్చుండఁ బెట్టి తరుణీమణి చెంగట నుండె హారమౌక్తిక, ఘటితంబగు కుందనంపు గద్దియ మీదన్ మురా 107.

సీ. విట నామధేయమౌ విటకాఁడు వేడుక కాఁడు బొజుఁగు వన్నెకాఁడు లంజె,కాఁడనఁగ ... ఆం. భా. 2. 116.

**విటతటమార్చు** స క్రి (విటతటము+ఆర్చు),

1 తాఱుమాఱుచేయు

ద్వి విద్వేషవాదుల విటతట మార్చి బస పు. 6 193 పా. 21 పం.

2 తుత్తుమురుచేయు

ద్వి వెస జైనప్రతిమల విటతట మార్చి, వసదులన్నియు వ్రచ్చి వైపించెఁగాడె .. బస పు. 6 101 పం

**విటతాటనము**=వీటతాటనము విశ తాఱుమాఱు, వ్యత్యాసము

సీ మండితధ్వజదండమండలంబులఁ గిట్టి విట తాటనంబుగా విఱిచి విఱిచి . భార. విరా 5. 56

వ విటతాటనంబులగు హేమకుంభంబులును ఉ. హరి 1 58

సీ ఒక్కొక్కరథముతో నొక్కొక్క రథమును విటతాటనంబుగా విఱుఁగఁగొట్టి . మొ రా. సుం 141.

**విటతా(త)టమాడు** స క్రి (విటతటము+ఆడు)

1 తాఱు మాఱుచేయు

ద్వి వివిధాన్యసమయుల విటతాటమాడు ... పండితా వాద 205, పా 10 పం.

2 తుత్తుమురు చేయు

ద్వి. వెస జిన ప్రతిమల విటతాటమాడి, యెసఁగు వాఁడి జైను లెక్కడఁ జనిరి ... పండితా వాద 200 పా

**విటతా(త)టము** విశ తాఱుమాఱు, వ్యత్యస్తము.

ద్వి. అమరారులను నీరసావనీజములఁ, దమకించి తా విటతాటంబుసేయు, నని దరికొను విలయానిలుపగిదిఁ, దనరు విట్టూర్పులఁ దఱుచైన దాని రం రా యు. 338. పా 29 పం

క. పుట మెగసి తాళవృతము, చటులోద్ధతిఁబూని పెఱికి సారథి నవనిన్, విటతటముగఁ బడ వైచెను. బటుభుజసత్వంబు మెఱయఁ బవనజుఁ డల్కన్ మై. 3 82

ద్వి కర్మేంద్రియంబులు కమకని పాఱె, వికృతులాఱును లోన విటతాటమయ్యె, నికృతి సత్కృతి మతి నిందానమత్వ, మంతఃకరణముల కనుమతంబయ్యె ప్రభులిం. 4. 137. భా. 9. పం.

వి తుత్తుమురు.

వ. చక్రకుంతపట్టస ప్రాసకోదండ గదాదండ శూలాది సాధనంబులు విటతాటంబులు చేసియు ... వి. పు 8 59

గీ కీలు కీలుకు విఱుచుట గేరును విట, తాట మనఁగాను ... ఆం. భా 3. 39

జ విటతటమార్చు, విటతాటమాడు

**విటపము** సం. వి అ పుం. 1 కొమ్మ, శాఖ. 2. ఆకులు, చివుళ్లు మున్నగు వానిగుంపు, కొంపము. 3. నూతనాంకురము, క్రొత్త మొలక 4. గుంపు, తోఁపు 5. వ్యాప్తి, వ్యాపనము, విస్తరించుట. 6. స్తంబము, కాడ 7. పల్లవము, చివురు. (వాచ.) 8 ముష్కవంక్షణాంతరస్థానము, అండ ములకు గజ్జకు మధ్యప్రదేశము. (వాచ)

**విటపి** సం. వి న్. పుం. 1. వృక్షము, చెట్టు 2 మఱ్ఱిచెట్టు, వటవృక్షము

**విటపిమృగము** సం వి అ పుం. శాఖా మృగము, క్రోఁతి

**విటమాక్షికము** సం. వి. అ. న. ధాతుభేదము, ఒక విధ మగు ఖనిజము.

**విటము** సం. వి అ పుం 1 ఎలుక 2. ఖదిరము, చంద్రచెట్టు 3 నారింజచెట్టు 4. చిగురుఁగొమ్మ, 5 ఖనిజ లవణము, జాతియుప్పు.

**విటరాయఁడు** వి. విటశ్రేష్ఠుఁడు

క పటుతరమగు మద్వీణా,స్ఫుట మధురరవంబు చెవుల సోఁకిన మాత్రన్, విటరాయఁడైనగానీ, ఘటదాసుఁడు గాఁడె యొక్క ఘడియట లోనన్ రుక్మాం 2 126. (శ. ర.)

**విటలవణము** సం. వి అ. న. ఖనిజలవణము, జాతి యుప్పు.

(ఇది మందుల కుపయోగపడును.)

**విటి** సం. వి. ఇ. ఈ స్త్రీ. పీతచందనము, పచ్చేగంధము.

**విటుఁడు** సం వి అ పుం 1. పల్లవుఁడు, మిండఁడు, జారుఁడు. 2. విషయాసక్తుఁడగు మనుష్యుఁడు. 3. శృంగారనాయకుని యనుచరుఁడు.

(సంగీత సాహిత్య కవిత్వ శిల్పాదులయందు నేర్పరి యైన యీతఁడు నాటకముల యందు విదూష కుని వలె నుపయోగించును.)

4. శఠుఁడు, దుర్మార్గుఁడు.

**విటుకు** వి విలాసము. (చి. ని)

చూ. విటుకులాఁడి

**విటుకులాఁడి** వి (విటుకులు+ఆఁడి) విటురాలు, కులుకులాఁడి.

క అని చిలుక తేనియలు బోఁ,రని యెదు జడివాన వెలిసినటువలెఁ బలుకన్, తనయంత సె శా నిల్పిన, విని కోమటి విటుకులాఁడి వెనవిట్లని యెన్ శుక 2. 29.

("చిటుకులాఁడి" అని ముద్రి. పా)

**విట్కారిక** సం వి ఆ. స్త్రీ పక్షివిశేషము, ఒకజాతి పక్షి.

**విట్ఖదిరము** సం. వి. అ. పుం. వృక్షవిశేషము, వెలితుమ్మ. (వృ. వి)

**విట్చరము** సం వి అ. పుం. మలభక్షకము, ఊరఁబంది.

**విట్ఠ(ఠ్ఠ)లుఁడు** సం. వి. అ పుం పండరపురమున వెలసిన విష్ణుదేవుని యర్చామూర్తి.

**విట్టు** సం వి ష్. స్త్రీ 1 మలము, పురీషము. 2 వ్యాప్తి,విస్తృతి 3. కన్యక.

**విట్పణ్యము** సం వి. అ న సరకు, వాణిజ్య సామాగ్రి, సామాను.

**విట్పతి** సం వి ఇ. పుం 1 ప్రజానాయకుడు, రాజు. 2 అల్లుడు 3 పెద్ద వర్తకుఁడు, పెద్ద బేహారి

**విట్సంగము** సం. వి. అ పుం (విష్+సంగము) మలబంధము, విరేచనబంధము

**విట్సారిక** సం వి ఆ స్త్రీ పక్షివిశేషము, పీతిగోరు వంక.

**విడంగము** సం విశ (అ ఆ. అ.) నిపుణము, నేర్పు గలది

వి అ న కడుపులోని క్రిములను బోఁగొట్టుట కుపయోగించెడి యొకయోషధి, వాయు విళంగము

**విడంబన** సం. వి ఆ. స్త్రీ 1. అనుకరణము. 2 మాఱువేషము, కపటవేషము 3. వంచన, మోసము 4. వ్యసనపెట్టుట, దుఃఖపెట్టుట 5 బాధించుట. 6 అవాభంగము గలిగించుట 7. పరిహసించుట, పరిహాసము, వెక్కిరింత 8 తిరస్కరించుట, తిరస్కారము. (వా చ.)

**విడంబనము** సం వి అ న. = విడంబన.

**విడంబము** సం వి. అ పుం. 1. అనుకరణము. 2 బాధించుట, ఉపద్రవముచేయుట

**విడంబించు** సం స క్రి. 1 పోలు, అనుకరించు.

వ. ... వికచారవిందదీర్ఘికల విడంబించు రావులును. భార. విరా 3 236.

సీ. బాలార్కబింబ ప్రభాడంబరంబు విడంబించు పీతాంబరంబుతోడ .. వరాహ 1. 57.

2. మోసపుచ్చు (శ ర)

3 వంచించు.

మ. తరుణీచిత్తము భూసురోత్తముని మీఁదంజేర్చి లజ్జాతిరస్కరణీ గుప్తముగా నొనర్చి యిటు లేకాంతంబు దుర్దాంతదుర్భరచింతం బడఁ బంతమమ్మ మును వాక్ప్రౌఢిన్ విడంబింతుగా . విక్ర. 1 131

అ క్రి. అతిశయించు

క ... గోవర్ధనాద్రిఁ దాల్చిఁటి, రావుననిడి మహిమతో విడంబించుటయున్ వి పు 7 254

**విడంబితము** సం. విణ (అ. ఆ అ) 1 అనుకరింపఁబడినది. 2. పరిహసింపఁబడినది, ఎగతాళి చేయఁబడినది. 3. మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది 4. విసిగింపఁబడినది 5 భంగపఱుపఁబడినది, విఫలముగాఁ జేయఁబడినది 6 అధమము, నీచమైనది వి. అ న పరిహాసపాత్రము

**విడఁగొట్టు** స క్రి (విడన్ + కొట్టు) విడిచిపెట్టు, పరిత్యజించు

క. చిలుకలు కమ్మఁదెమ్మెరలు శీతమయూఖుఁడుఁ దేఁటులాదిగాఁ, గలవనవిల్తుసాధననికాయము లేలము పట్టులంగనా, కుల మటుగాన దాని విడఁగొట్టక తృప్తికదొట్ట వీత రాగుల మని విట్టివీఁగెదరు కొందఱుబోఁడలు నానగండలై పాండు. 1. 182.

**విడఁజిమ్ము** స క్రి (విడన్ + చిమ్ము) విడుచు.

సీ. వీని నెట్టులనైన విడఁజిమ్మిపోతొడ వంటి నాయకులను ... చెన్న. 1. 136.

**విడఁదన్ను** స. క్రి. (విడన్ + తన్ను) విడఁగొట్టు, పోఁగొట్టు.

సీ. దుర్వ్యాననలకెట్టు దొసఁగులు విడఁదన్ని యధ్యాత్మవాసన వలరుటొకటి . పాండు. 2. 85.

**విడఁద్రొక్కు** స క్రి (విడన్ + త్రొక్కు) విడివడఁజేయు, విడుచు (శ ర)

**విడఁద్రోచు** స క్రి. (విడన్ + త్రోచు) పరిత్యజించు. విడనాఁడు

చ పడఁబడఁ బాఱుచున్ వడఁకుపట్టిన తల్లిని దండ్రి నేల లో, వెడలనితమ్ముఁ గుట్టిల నవీనకులాంగన నోరులేని యీ, తొడుకులబంటుఁ బెదవిడఁ ద్రోవక ప్రోవఁగ నెందునీక పాల్పడి నది కర్ణునొఁదలనె భారతసంహిత విల్పుచాడ్పునన్ పాండు. 3 38.

**విడఁబడు** అ క్రి (విడన్ + పడు) విడువబడు.

ఆ. . విడఁబడె ననఁగను, దనరు విడువఁ బడియె నమటకభవ . . ఆం భా 3 116.

**విడఁబాఱు** అ క్రి (విడన్ + పాఱు) విడివడు, విడు

ద్వి విడువిడుమని చెయ్యి విడఁబాఱఁ దిగిచి, వెడమతి తనపాలి విధిఁ ద్రిప్పఁబోవ ... నవ 1. 59 పా 18. పం

ఉ .. మించునొయారమున్ గులుకు నెన్నడయున్ విడఁబాఱుకొప్పు నొక్కించుక జాఱు పయ్యెదయు నిట్టటుఁదూలెడు హారముల్ మిటారించుకుచంబులున్ జలదరించు వలగ్నముఁ బొల్పుమీఱఁగన్. కళా 2 17.

**విడఁబుచ్చు** స క్రి (విడన్ + పుచ్చు) విడుచు

ద్వి వీటిడిమాటలు విడఁబుచ్చి యనిన బస పు 193. పా 2 పం (ప్రాఁతప్రతి)

**విడనాడు** స క్రి (విడన్ + ఆడు) 1 విడుచు, త్యజించు

ద్వి. అంతట నృపతి భార్యను విడనాడి చింతించుచును గద్దె జేరకూర్చుండి ... ద్వి సారంగ. 489. (బ్రౌ. ని.)

చ. ... అఖిలభోగముల న్విడనాడి సత్క్రియా, నిరతిని బ్రహ్మచర్యనరణి న్మహనీయ తపోమహత్త్వముం, బొరసినయట్టియిట్టి ముని పుంగవు భావ మెఱుంగవేమియున్. విప్ర. 2. 77.

సీ. గీ చిలువ సొమ్ములు విడనాడిచెలువు మెఱయ, లలిత నవరత్నభూషణంబులు ధరించి ... జాహ్నవీ 1. 151.

2 పోఁగొట్టు

సీ. గీ. ఉచితబంధానుబంధత నుండియుండి, ననఁ గిపుంభావరీతుల ననఁగిపెనఁగ, దపసికిని నేర్పి యతని మౌగ్ధ్యంబునెల్ల, రమణి విడనాడె నతను ప్రౌఢిమ చెలంగ. విప్ర 3 90.

ఉ ఆ నెల దోఁటకేగిన విధంబు మునిం గనుఁ గొన్నచందముస్, వానికిఁ గాఁగఁ బన్నిదము వైచినమాటయు జేలువెట్టి య,మ్మౌని నిని దోడి తెచ్చిన క్రమంబుఁదమిన్ మొగమాటయొక్క- యిం,తైనములేక తల్లి విడనాడినచందముఁ జెప్పి వెండియున్ విప్ర 5 47.

**విదము** నం వి ఆ న. ఒక విధమయిన ఉప్పు.

**విదవలి** వి (నం. వీరణం) అవురు, వీరతరము (వృ వి) (శ. ర, శ్రౌ)

**విదాల(ర)ము** నం వి. అ పుం.=బిడాలము

**విడి** విశ 1. ఎఱ్ఱనిది, అరుణము

క. మలయానిలంబు సోఁకినఁ, బలిమిరి సొగయించి భూమిజంబులమొదళుల్, పులకించినట్లు విడి గుము, రులుగొని యీరికలు గడుమురువుగా నెగసెన్. కు సం. 9 294

సీ. ... గీ అక్కుఁ జేరిచి చేన్నిచ్చి చొక్కటంపు, గెంపు విడికెంపు జంపున సొంపునింపు, జాతిమగ జాల తొట్లహర్షమునఁ బెట్టి, రమణదాదులు పెనుప నారాచేపట్టి. చంద్రాం 2 3.

1. స్వచ్ఛము, నిర్మలము

గీ కళుకువిడికెంపు రవలచెక్కడపుమేడ, వలపట . దశా 4 102

సీ .. సిగపొందుగ నమర్చి చిన్నారివిడికెంపుకాయె ఘుల్ చుట్టి బుల్లాయివెట్టి ... శుక. 1. 116.

సీ. ... విడి కెంపుగముపింపు పెదవితోడ ... రాధికా. 1. 9.

ద్వి విడి రత్నములనొప్పు వేలి ముద్రికలు .... ద్వి. శ. పా. 1. 185. పం. (శ్రౌ పా.)

8. ప్రకాశమానము.

ఉ. శీలఁ బళిందుఁ డొక్కఁడు కళిందసుతోర్మి సరో జనీదళాం,బోళికతోకరేఖ తన తోరపు వల్లని

దీర్ఘబాహువై, హాలహలంబపోలె విడియ త్తె మునం దల యెత్తిచూచుబల్, సాళువమున్ పడిం జను శశంబు పయి న్విడిచెన్ మహోద్ధతిన్ మనుచ 4 56.

4 విడిపోయిన.

సీ .. విడికచ్చతో నుండు విడువకెపుడు కాశీ 6. 46.

5 ప్రత్యేకమైనది.

సీ విడిమేనులుగ నిల్చి వినువాఁక నీరాడు పన్న గాంగనలను బట్టి పట్టి సత్యభామా 2 29

(విడిమేనులు=దిగంబర దేహములు)

వ. ఒక విడిది పంతరించి విడియైదువలచుట్టరికంబు పొంకించి సత్యభామా 4. 35

(విడియైదువలు=లంజెలు)

క. నోరెఱుఁగని మేకములకై, జారెడుకై దువయుఁ బట్టఁ జాడియె యమచున్, దూఱు న్నము విడికేలున, దూరు న్నెకమున్న పొద యదూరుండగుచున్ చంద్రాం 2. 49

(విడికేలు=వట్టిచేయి, ఆయుధములేనిచేయి)

సీ. విడిగాలకౌరి తత్తడివెన్క వే తెంచె నగతులఁ చేఁబూని చారుచంద్రుఁ,డు . చంద్ర 5. 127

(విడికాలు=వట్టికాలు, పాదరక్షలు లేనికాలు)

6. విడువఁదగినది

ఉదా విడికథ. (శ. ర)

7 పనినుండి విడిచినది

ఉదా విడికోడె (శ. ర)

వి. 1 కెంపు కాంతి

సీ పద్మ రాగాభిధ పరగుఁ గెంపన .. తత్కాంతి విడియనఁ దనరుచుండు ఆం భా 2 278.

2 స్వచ్ఛత, నైర్మల్యము

క. విడిగల మానికముం బు,త్తడితోడం గూర్చి నట్లు ... వేం. పంచ. 3. 267.

రగడ. దొరయ నొక వరిపాటి దొరలకు దొరకనీ విడికెంపు మిన్నలు ... శుక. 1. 222. 10. పం.

8. (శ. శ. విడి.) విసర్జనము, విడుచుట.

సీ. ఉజ్జనమునఁగను ముజ్జగింపనఁగను విడియన విడు పన విడుదలయన ... అలరు విసర్జ నాహ్వయము ... ఆం. భా. 2. 178.

4. తడవ

గీ. శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ, గటము లదరంగ నొక విడిఁగాటులాడి, యొండొరుల మీఁద శాపంబు లుగ్గడించి, హ స్తములయందు సలిలంబు లందుకొనిరి. భీమ 4. 184

5. రీతి, విధము (రకము)

సీ గీ . చెవుల నెలరాల కామాకు లవటసీమ, సన్నవిడి గౌడరుద్రాక్షసరము లమర ... సారంగ 3 180.

గీ. జిలజిలను సన్నవిడిగఁ బట్టెలవు దీర్పు, దుడుము మగజాల మెలకువ తొలపు బొబ్బ, మెకము నెమ్మోము దమువున మించు గద్దె, సరిగఁ గూర్చుండుమని పోరి సురవరుండు. పార్వ 2 116

6. ప్రత్తి కాయలోని జెడ

గీ నింగి యనియెడి ప్రత్తి చేనికిని రక్త, బలియుడి రనంగ నెఱ సంజె తొలుత నమరఁ, దఱుచుగా దాన విఱిసిన మెఱుఁగుఁ బ్రత్తి, విల్లుణాఁ జుక్క లెంతయు మల్లసిల్లె. కళా 8. 12.

క్రి విశ ఒంటరిగా, విడిగా

క ఆసమయంబున భిక్షుని, వేసమున దశాననుండు విడిచనుదేరన్, భూసుత పూజయొనర్చి సు,ఖాసన మిడి మధుర ఫలము లర్పించి తగన్. అధ్యా అర 90 పా.

జ విడిగోలు, విడిదేలు, విడినీరు, విడియాకులు.

విడిగోలు వి (విడి+కోలు) మూలువు. శ. ర, బ్రౌ. విశ పనిలేనిది (శ ర)

విడిచిపెట్టు స క్రి. (విడుచు[1]+పెట్టు) వదలు, వీడు

వ. పట్టువడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదునని నేర్తునే ... నైష 2. 8.

గీ. విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టి .... ఆము. 3. 6.

విడిచివాటుగుదియ వి. (√ విడుచు[1]) భిండివాలము, ఆయుధవిశేషము. (శ. ర.)

విడిదల వి. (విడిది+తల.) 1. విడియుచోటు.

ఆ. వేఁట తోఁట యనుచు విడిదలఁ బడిపోవ, వలదు చరులఁ బనిచి వైరితెఱఁగు, లరసి గెలుచు నెర వులన్నియుఁ దలపోసి, విక్రమంబు గారవించు టొప్పు హరి. ఉ 5 124.

సీ. ఇదుగో మీవిడిదల కేనె వచ్చెద నంచుఁ దమ కించు యజ్వలఁ దాళఁ బలికి ... ఉ. రా. 4. 175.

2. సేనానివేశనము, దండు దిగిన చోటు.

వ. ... అతండు సైన్యంబుల నివర్తింప నియమించి నమస్తజనపరివృతుండై .

గీ. విడిదలకుఁ బోయె నపుడు . భార. భీష్మ 366.

క. పలుమాటల కిటుమఋమూ,టలు వలుకని కృష్ణుతో నడలు మది మొలవం, బలుకుచు ధర్మ సుతుని విడి,దల కరిగెను మోము వెల్లదనమున గదురన్ భార. ద్రోణ. 2. 231.

విడిదలపట్టు వి. (విడిదల+పట్టు) ఉండుటకుఁ దగిన చోటు.

ద్వి. విడిసిన సేనయు విడియు సేనయును, విడిదల పట్లను వెదకు సేనయును ... రం రా యు 328 పా. 7. వం

విడిది వి (√ విడియు) 1 సేన బసచేసిన చోటు, శిబిరము.

సీ. . . సంగీత వివిధవాద్యములతోన, కలయ విడిదిలో వీరమద్దెలలు ములిసె . కు సం 11. 620

సీ. వేలము పాళెము విడిదిపట్టు బిడారు విడిది యం చనఁగ నివేశమొప్పు ... ఆం భా 2. 194.

2 నివాసస్థానము, బస

గీ. విద్యకై వడి ముక్తికి విడిది యగుచు, నాత్మ విధము వానందమైనయిచట, నున్న సర్వేశు నౌదల విన్నచంద్రు, నవ్వుచున్నది గంగ ఫేన ముల చేత. ప్రబోధ 4 44.

క. వారీశ్వర భైరవులన్, బాలికలు భజించి భూత పతి నభవుని శ్రీ,కాశద్విపేశుమదిలోఁ, గీలిం చుచు విడిది యింటికిం జనిపిదపన్. కాశీ. 4. 94.

గీ. విట్టలాధీశుఁ దలఁచి తద్విపుల మహిమ నొడువుఁ బ్రాముఖ్య క్రీనిడ విడిది ప్రోడ ... పాండు. 1 213.

3. నివాసము, ఉనికి.
ఆ కృష్ణుకొంగు కేలఁ గీలించి నేఁడు మా యింట విడిదిచేసి యేఁగు డెల్లి, యనిన నేఁడు దీరదరుగుము నీవంచుఁ, బలికి. వి పు 7 38
సీ. తనయిల్లు విడిది సేయనటంచుఁ జల వట్టు కొడుకు చేతులు పట్టుకొనఁగ వలసె ... కువల 1 42

**విడిదిపట్టు = విడిది** వి (విడిది + పట్టు) విడిదిచోటు, బసచేయుస్థలము.
వ ... విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి . ఆము 6. 123.
సీ. గీ సకలసౌభాగ్యలక్షణస్వచ్ఛమైన, వీని నెమ్మేను లక్ష్మికి విడిదిపట్టు ... కవిరాజ 2 222.
వ . వీడెంబులు గంధంబులు గోకలు తొడవులు నిడి విడిదిపట్టుల నునిచె . నీలా. 3. 50

**విడిదేఱు** అ క్రి (విడి + తేఱు) ప్రకాశమానమగు
క విడువని తగు నిర్వార కీర్వాడుపున వసుశరణి నుభయ వస్త్రాంచలముల్, విడిదేఱు నక్షతలతో, ముడిఁబెట్టిరి పంచశరుఁడు ముడిఁబెట్టంగన్. వేం పంచ 4. 365.

**విడినీరు** వి. ఔ అనా (విడి + నీరు) ప్రత్యేక జలము, పతము మొ వానిచే తోడి పోయు నీరు
వ. విడినీరం బడ్డిన అయ్యపుట్టి 1 ట్టికి చి 8 జొన్న వేల పుట్టి 1 ట్టికి చి 8. ... దా. శా 1384

**విడిపట్టు**[1] వి (విడిది + పట్టు) 1 నివాసస్థానము, విడిది
క పడఁతీ శావులకున్ బై పడ నేఁటికిఁ బొగడలివియ పంచాస్త్రునకున్, విడపట్టుసతుల సిగ్గుల, విడిపట్టు గదా యటంచు వెఱతురు చేరన్. చిత్రభా, 2. 126
గీ. ... ఇట్లుగూడిన యొకిమీంద్రకెల్లఁ జెలిమి, మెఱయ విడిపట్టు లోనఁగె వమ్మిథిలఱేఁడు .. ● శా శాల. 165.
సీ. శూద్రులకును మెట్టు శూరుల విడిపట్టు మంత్రివర్యులకు మనికిపట్టు....శివ ధర్మోత్త. 1. 16.
2. పల్లె, పేఁట.
ద్వి. బిసనిశాయమున గంభీర తోయమున, వసనూనమైన యయ్యమున మార్గంబు, విడిచివఁగడతెంచి వేవేగ గొల్ల, విడిపట్టు నడునందు విడిపట్టు సొచ్చి. అ మ క. 1 22 పా. 14 పం
3. వి (విడియు + పట్టు) బసచేయుట, నివసించుట.
చ అమర విభుండు సేరి వినయానతుఁడై విడిపట్టునైజయంతమునను జిత్తగింపు మన నవ్వుచుఁ దద్వల దైత్య వైరి హ, స్తముఁ గయిదండ గొంచు .. పారి 3 40.

**విడిపట్టు**[2] వి (విడు + పట్టు) వీడునట్టిస్థానము
క. పడఁతీ శావులకు౯, బై పడనేఁటికి బొగడలివియ పంచాస్త్రునకున్, విడిపట్టు సతుల సిగ్గుల, విడిపట్టు గదా యటంచు వెఱతురుచేరన్ చిత్రభా 2. 126.

**విడిపించు** స. క్రి (√విడుచు) విడుచునట్లు చేయు
సీ. . , మొగి జరాసంధుచే నిగృహీతులై యుండు పృథివీపతుల విడిపించి చెలఁల . భార సభా 1. 214.
సీ. జడలు కంపలు వట్టి జరుగనీకున్నచో విడిపింప శిష్యుల వెదకువారు ఉ హరి 1. 102
మ. అని పౌలోమి మొగంబు చూచి విను మోయజ్ఞాస్య నీకింతమాత్రన విన్నంబడ నేల? పోదు విదె సత్యాగర్వభారంబు దివ్యనగంబు న్విడిపించి వత్తునని సాహంకారుఁడై లేచి చయ్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థుఁడై పారి 4 61
ఉ. . లీలావతి యున్న పెట్టె యనలంఘ్య తరంబగు తజ్జాలంబునం, బో విడిపించి ... శుక 1. 466.

**విడిమట్టు** వి (√విడియు ) 1 వాసస్థానము
సీ. గీ. ఎపుడుఁ గాయక యున్న మిన్నేఱు దవరఁ, బెన్మఁ గొండల ఱేఁడను పేరు మెఱయ, వేల్పుమల వింటి దేవర పొల్పుఁదాల్పు, జన్నపుందిండి విడిమట్టు చలువగట్టు. యయా. 2. 86
సీ. ... చిత్తనైర్మల్య సంస్థితికిని విడిమట్టు ప్రహ్లాదనమునకుఁ బట్టుఁ గొమ్మ ... విప్ర. 1. 84.
2. శాఁపురము.
సీ. విప్రాలయములందు విడిమట్టుగా నుండువాని మంటలలోన వైవలేదు ... రుక్మాం. 2. 7
3. విడిది.

వ. ... తుహినాచలేంద్రుండు తనకు నియమించిన విడిమట్టు ప్రవేశించియుండె ... పీర. 3 160

**విడిముడి** వి. ధనము

క. వడిగలతనాల నీగిని, విడిముడి పసc బ్రాభవ మున విజయనగరిలోc, గడు నెన్న నేర్పcగల మే,ల్నడకలc బెద వేంకటాద్రి వరవరుc డొప్పున్. రాఘవ పీఠి. 37.

గీ. పొగడకయి నిక్కి తమినోర్తు పూలుగోయc, లోకముడివీడc గని నెపంబునని బోటి, యడుగు విడిముడిగలదాన వమచు విరులు, తెలిసి తానీవి గల దౌట తెలిసె నదియు రామా. 1 194.

క. తొడవులు మానికములు విడి, ముడియున్నా డెంపుc బుట్టములు ప్రోవులుగా, మడుగరలు దెచ్చి యిడి య,య్యొడయని యడుగుల కెఱంగి యొప్పుగc బలికెన్. అ. రా కిష్కిం. 48.

క. విడిముడియన రొక్కమనcగ విత్తంబునకున్, బుడమిని నామములగు . . ఆం సం. స్థా 30.

2. వీడిన ముడి.

గీ. పొగడకయి నిక్కి తమినోర్తు పూలుగోయc, లోకముడివీడc గని నెపంబునని బోటి, యడుగు విడిముడిగలదాన వమచు విరులు, తెలిసి తానీవి గల దౌట తెలిసె నదియు. రామా. 1. 194

౩. విడిముడి పట్టు

**విడిముడిపట్టు** వి (విడిముడి+పట్టు) ధనగృహము

సీ. విడిముడిపట్టులు వేలిమి గావించి మల్లెసాలలు బెట్టు మండcజేసి ... అ. రా సుం. 172.

**విడియ** వి ధనము నించుసంచి, (రొక్కపు) జాలె.

ద్వి. విడియలతో రెండువేలమాడలును ... బస.పు. 5. 275. పం

(సం. వీటి) తాంబూలము.

ద్వి. అడికివమాడల విడియలుగాంచి .. బస. పు. 5. 291. పం. (292, 299, 311. పం చూ.)

**విడియము** = విడ్యము, విడెము, వీడియము, వీడెము.

వి. (సం. వీటికా) (క. బీడి. త. విడై యం) తాంబూలము.

గీ. ... కనక కలహంస కాబకాకారమైన, విడి యెపుం బెట్టc జూచి యుర్విధవుండు.... నైష. 3. 105.

సీ. ... గీ. ... అర్ధ్యగులు లాcచి యిడువిడియముల పేర ... ఆము 2. 58.

సీ. వెన్నుcడు కపురంపువిడియం బొసంగిన నొదిగి కైకొనక యుండెదవు సుమ్ము నీలా. 3 94.

గీ. సొగసు తెలివాలు మనుసోగసొం పుతళుకు, బెళుకు చికిలి యొయారంపుc బేరెముదుటు, సొలcపు విడియంపు దేలింపు చుఱుకుటోర, కలికి బెదరెప్పు చూపుల కలికిc జూచి. ప్రబంధ. 1 106.

**విడియాకులు** వి. బ (విడి+ఆకులు) భార్యాభర్తలు విడిపోయినట్లు వ్రాసికొనిన పత్రములు. (వా )

**విడియించు** స. క్రి. (√విడియు ) విడియcజేయు, బస చేయించు.

చ వడcతుక యేను రావణుcడ బాహుబలంబున నింద్రుపీటపై, నడచుచునుండి యిన్నగమునన్ విడియించితి సేన నిప్పుడి,య్యెడ కలవోకవచ్చి సొగయించు విధంబునc బోవుచున్ననిన్, బొడ గని కాము బల్మితకముల్ వను నిమ్మెయి పెట్టిc జేసినన్. నిర్వ 6 62.

గీ. యమున నిడుపెల్ల విడిదలయ్యె తలిర్ప, బలము విడియించి మగధభూపాలకుండు, మనుజనాథులc బిలిపించి మంతనమునc, గార్యమంతయు నూహించి కడcక మిగుల. హరి. ఉ 2 13.

క ధరణీశు లెల్లవచ్చిరి, వెరవున మన్నించి వారి విడియించితి ... భా రా. బాల. 108

**విడియు** అ. క్రి. 1 సేనలు బసచేయు, బసచేయు.

సీ. మడుcగుల పాండుల మ్రాcకుల నీడం బెబ పులc గనికని విడియువారు .. కు సం 11. 600.

క. సవరణల నొప్పి యనిc బాం,డవబలముల మార్కొనం గడంగుచు సత్కృ,త్సవమునc బేర్చిన సేనల, కవకాశములేదు విడియ హస్తిపురము నన్. భార ఉద్యో. 1 226

ద్వి కడు నొప్ప సేతువుగడచి యుబ్బంగి, విడిసె రాఘవుcడు సువేలాద్రియందు .... రం. రా. యు. 317. పా. 25. పం.

వ. బ్రాహ్మణుల బకాసురుండు బాధించుటయుc దమవిడిసిన యింటిబ్రాహ్మణునకైన యావ దయు ... భార. ఆది. 6. 277.

ఆ యజ్ఞవాటమున జనాధిపులకు ముని,వ్రాతము లకు విడియ వలయునట్టి, మందిరములు. భార. అశ్వ. 4 183.

గీ అమమఁ దద్విశేషంబు లత్యాదరమున, వర్ష కోటికిఁ జెప్పుచు వంబుజాతుఁ, డంతవట్టి వారలఁ దగనల్ల విడియఁ, బనిచెఁదగు ముహూర్తంబున మన మెలర్ప. హరి. ఉ 2. 106.

2. దండెత్తు.

ఆ. భక్తిఁగొలిచి రాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై, విడిసెఁ దత్పురమున విభుఁ డవంత, బలము తోడఁ బన్ని భగదత్తుఁ డేతెంచి, విజయుఁ డాఁకె సమరవిజయశాంతు. భార సభా. 1. 228.

క .... భూ,పాల జయమవశ్యము నీ, పాలిద నిక్కంబు లంకపై విడియు మిఁకన్ ... భా రా. యు 12.

చ. ... రసాతలంబుపై, విడియఁగ దండుడిగ్గిన ... ఆము 4. 128

3. (నీతి) షడ్గుణములలో నాలుగవదగు నాసనము నాశ్రయించు, సమయము ప్రతీక్షించు.

క. వడపునఁ గొల్పుచ్చఁగనగు, నెడయు విడిసి యుండి చెఱచు నిక్కయు నీ వేర్పడఁగను ... భార. ఆశ్ర 1. 69.

4. ప్రవహించు.

గీ. వడచి భగవంతు క్షేత్రంబు వడుమఁ జొచ్చి విరజయను సింధు వెచ్చోట విడిసియుండు, వృహరి ప్రత్యక్షమైయుండు నెట్టిచోట, నట్టి చోటను వైష్ణవి యనఁగఁ బరగు . పాండు. 2. 227.

5. వీడిపోవు.

వ అమటయు నమ్మునీంద్రులు విడియ జాడందలంచి యతనితోడ ... ఉ. హరి. 1. 98

సీ. ... ధర్మ, విముఖుఁగావింపుము విడియంగ జాడకు ధర్మమార్గైకతత్పరుని నితని ... కాశీ. 5. 319.

6. జోటు.

గీ. అర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి, విషముపెట్టిరి పెట్టిన విడిసివడక, గరముతోఁ గూడ నగరుండు ఘనుఁడు పుట్టి, వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. భాగ. 9. 202.

(శ. ర. పా. "విరిసివడక" ముద్రిపా )

జ . విడిదల, విడిదలపట్టు, విడిది, విడిదిపట్టు, విడి పట్టు, విడిమట్టు, విడియించు

**విడిపడు** అ. క్రి (విడి+పడు) 1 (నిర్బంధమునుండి) తొలఁగు.

క మెడ బిగియఁబట్టుకొని దిగఁ, బడిరొడి బాలకునిచేతఁ బర్వత నిభుచే, విడివడఁ జాలక వాఁడురి, బడిబెగడెడు ఖగము భంగి భయముం బొందెన్. భాగ 10 స్కం 274

క. పడుచున్ లేచుచుఁ బులిచే, విడివడిన కురంగిఁ బోలి విహ్వలు రాలై ... ప్రబోధ 3 74

సీ. ... గీ కుఱుల మబ్బున విడివడు మెఱుపు లటుల, కమ్మపౌజుల తళతళల్ క్రమ్మకొనఁగ, నధకుఁ జనుదెంచె వెయ్యాఱు సఖులు గొలువ, శ్రీలలితధామ చంద్రమతీ లలామ. ఉ హరిశ్చ. 2. 14.

2. (తెగనుండి) విడిపోవు, పీడు, వీడిపోవు

వ. ... సాలంకారధేను సహస్రంబులు విడివడు నిజవత్సంబులం బిలుచు నంభారవంబుల వల నన్ . పారి. 5 75

చ. కలఁగిన కొప్పుతోఁ జిటుల గందముతో విడివడ్డ తైకతో . . కళాం 4 74 (శ. ర. పా "విడఁబడ్డ తైకతో" ముద్రి పా )

వ. ఇట్లు దుర్వాసుం డాశీర్వాద పూర్వకంబుగా నొసంగిన కుమార పారిజాతమాల్యం బహల్యా జారుండగు సునాసీరుండు ... ఐరావణ కరటి కుంభ పీఠంబుపై .. వైచిన ... బ్రమత్తుని కైవసమగు రాజ్యలక్ష్మి విధంబున విడివడియు, డస్సియు, గ్రుస్సియు, నొగిలియు, బగిలియు దీనదశకు వచ్చినం గనుంగొని. హర. 6. 16.

3. నిరాతంకముగాఁ బ్రవర్తిల్లు.

చ. మడవక భీమసేనుఁడును మాగధరాజుఁ గడంగి బెబ్బులుల్, విడివడులీల నొండొరుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్ ... భాగ. 10, ఉ. 786.

చ. పర్వడ నమరేంద్రు బాహుదల పట్టిన రావణి రోష దీప్తుఁడై, విడివడి మించుమంచిపటువిక్రమ సంపద సొంపెలర్పఁగా.. భా రా యు. 444.

క. కప్పురఁపుతునకలలవడ, విప్పుగ విరితేనెవాన విడివడి కురియం, జొప్పడర హంస సురపతి, నెప్పెను హేమావతీకుశేశయ ముఖికిన్ హంస. 2. 73.

4. తెలివఁబడు.

సీ. . గీ బయిసి మాలింతుఁ దన పిన్న వయసు నాఁటి, పడపుసుద్దులు దల పెట్టి పాఁతజోలి నోరు విడివడ్డఁ బచ్చి బూతే రచించు, వివిధ, మాయామయోపేత వేశ్యమాత వై జ 2. 84.

5 జాఱు.

క పిడికిట నడఁగెడు నడుమున్, గడుఁదియ్యని మేనుశృంగ కలిత గుణంబున్, విడివడని కొప్పు నేర్పడి, పడఁతుక గతియయ్యె మించి పౌరుష వృత్తిన్ చిత్రభా 2. 85

6 ప్రసరించు

సీ .., అడుగు దమ్ములకాంతి విడివడి పగడంపుఁ జిగురుటాకుల మేలు చిందు సేయ... జాహ్నవి. 4. 21

7. బయలుపడు.

సీ. కరము సాఁచి నవాంబుకలశ మీ విడిపడ్డ కుంకు మాంకపు ముద్దుఁ జంక మెఱపు ... విజ. వి 2 141.

**విడిపాటు** వి (√ విడివడు) 1 ఏకాకిత్వము, ఒంటి తనము

ఉ. పట్టిన కార్యము ల్విడువఁ బాడియె పాడి యెఱుంగవోటు వేఁ,బుట్టిన నుక్కుచచ్చు విడి పాటున వాక్కుట గాలిఁబోవునేఁ, గొట్టిన పిండి వాఁడతఁడు ... చంద్రాం 3 60

2. విడివడుట.

మ. ... పెక్కుల్ రూకలున్ రెండుమూఁడు విడే లాకులు పోకలూని విడిపాటున్ గోడలై తక్కుటి, భవనప్రాంగణ సీమఁ ద్రిమ్మరుదు రంతః కుంభచేటి విటుల్. వైజ. 2 41.

**విడిపాటుబడియు** వి. విడిచిపాటు గుదియు.

సీ. ... గీ. భావభవుచేతి విడిపాటుబడియదుడ్లు ... కవిక 4. 94

**విడివేఁట** వి (విడి+వేఁట) డేగవేఁట.

గీ అపుడు విడివేఁట యిడుమని యానతిచ్చి, రాజు ముంగిలి కడకుఁ జేరంగవచ్చి, లగడు సాళ్వంబు డేగలోనుగను గల్గు, వేఁట పుల్గుల విడిచిన వింటి కెగసి. యయా 2. 23.

సీ ... తెగిన మెకంబులఁ దేలేదు విడివేఁట పిట్టల కును మేఁత పెట్టలేదు ... కాళ. 3. 76

**విడిపోవు** అ. క్రి (విడి+పోవు) వదలు, విడివడు. (శ ర )

**విడీనము** సం వి అ న పక్షుల గతిభేదము.

**విడు** స క్రి. త్యజించు, విడిచిపెట్టు.

మ. ... విడుకోవంబిరె శాంతిఁ గైకొనుము వాగ్వివాద మింతేటికిన్ .. హర 7. 59.

మ లలనా రత్నముగాన మాధురికి శైలంబుల్ గరంగెన్ మృగంబులు మేపుల్ విడిచూచు చుండె .. వాల్మీకి. 3. 133.

క. సమరము నిష్కారణ వైరముకం బాటిల్లె నెల్ల రాజులు భరతో. త్తములును మడిసిరి విడు కోపము దీర్ఘక్రోధుఁడైన పతి కి డొందున్. భార. శల్య 1 55

క ... నీ వింతయేల పెనఁగెదు, నేవిడ నా కమ్మ లావ నిమఁ గూడ కిఁకన్ ... సారంగ. 2 106

అ క్రి. 1 పోవు, అంతమగు.

క. నా చెప్పినట్లు చేసిన, నీ చెఱ విడునట్లుఁ గాక నిలుపోపక నీ,వేచంపి నన్ను నోఱను, వైచు కొనిన మానునే భవత్ కుత్తెల్లన్ . కేయూర. 4. 105.

2. వీడు, విశ్లిష్టమగు.

సీ ఓహో సరోజంబులొడి విడిపడియె పేరుకొనంగ వలెనని సకులఁ బిలిచి, ... వరాహ. 1. 5.

చ. ... ఇంచుక వాయి విడ్డ కామర మొఱపెట్ట పెట్ట పలుమాఱును శాకిలి దాఁటి యాఁగుచున్, మొరయ విపంచి మీటుగతి మ్రోసి యడుల్ పెడతెం గొలంకులన్ ... మనుచ. 3. 60.

మ. ... దం,తుర సంతోష హ్యాకంతుపై దిగధి కాంతుల్ చెంత చింతల్ విడన్ .. కువల. 3. 13.

3. వికసించు.

సీ ... అత్యన్యచేతో హలాకాశన వ్యజనంబు బుడుత తెమ్మెరకును విడినదంట, రత్యంత కాంత హ్యాద్రసపున స్థితికర్త చిదుమంగఁ దల కెక్కఁ జేయుదంట. (కర్త–క్రొవ్విరి.) రా. వి. 3 76

విడఁబల్కు=స్పష్టముగాఁ జెప్పు.

ద్వి. ఏ విడఁబల్కిన భావంబుఁ జూచి, భావజ్ఞుఁడ వయేని పోవంగ వలదె ... పండితా. పురా. 114 ఏ

చూ: విడఁగొట్టు, విడఁజిమ్ము, విడఁదన్ను, విడఁ ద్రొక్కు, విడఁద్రోచు, విడఁబడు, విడఁబాఱు, విడఁబుచ్చు, విడవాడు, విడిపట్టు, విడివడు, విడి వాటు, విడిపోవు, విడుగడ, విడుగర, విడుచు, విడుదల, విడుమర, విద్వరుచు, విప్పారు, విప్పు, విప్పుగంటి, విప్పువాఱు, విప్పుసేయు.

**విడుగడ** వి. (√ విడు) విడుదల, విముక్తి.

చ. ... జనుజాను మతంబున నా బలారికిన్, విడు గడసేసె . ని్వ. 7 13.

క. రాగాదిదోష దూషిత,మై గర్హితమైన చిత్తమది సంసారం, బాగతిఁ బరిభ్రమింపమి, వేగమెకవ బంధములకు విడుగడ గాంచున్. వాసిష్ఠ 2 148.

**విడుగర** వి. (√విడు) విడుదల, విమోచనము

క. ఉరిద్రెవ్వఁ గొట్టి యిప్పుడ, వె వారఁగ నీకు నేను విడుగర సేయం, దొరకొనుట నీకు భాగ్యం, బరిత్యము దొలంగి మైత్రి యలవఱుపుమదిన్. భార. శాం 3. 205.

ఆ. అనిన నట్లయగుట నాత్మ నెఱింగియు, కాదె సంధియైన నాదుబ్రదుకు, నీదు విడుగరయును నిజముగు టూహించి, నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చ యంబు, భార. శాం. 3. 208.

**విడుగు** అ క్రి. వికసించు.

క. ముడిఁగెఁ దొగలడఁగె చుక్కలు, విడిగెఁ బజ్జూ జమ్ము ఉడిగె వెన్నెలలు .... కుక. 1. 285.

**విడుచు[1]** స. క్రి. 1. త్యజించు, వదలు.

సీ గుణవంతు లగుచున్న కొడుకులు గలవాఁడు పాంచాలుఁడేల యప్పాండు సుతుల, వినయ సంపన్నుల విడుచువాఁడగు . భార. ఆది 8 25.

ఆ. బాల్య కేళిమీఁది భరముగ్రమంబున, విడువఁ గళలయందు వేడ్క సోనిపి, నయముతోడ వర్త నంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవ కాదె భార. విరా 1 251.

గీ వలునిదక్కంగ వొరునినేఁ దలఁతునెట్లు, విడువు సందేహ మోహంబు విహగరాజ ... నైష 2. 70.

2 (బాణాదులను) ప్రయోగించి

మ . శాస్త్రవుంగుఱిచి యాగాయత్రి వర్ణావళిం, బ్రతిలోమంబుగ నుచ్చరించి విడువన్ బ్రహ్మ స్త్రమై తాఁకి యా, ప్రతిపక్షుం డెగటార్చు నంగుళి శిఖాప్రస్ఫోట మాత్రంబునన్ కాశీ 3. 190

సీ కరినాదుఁబట్టు నక్రంబుపై విడిచిన సరసిజాక్షుని చేతి చక్రమనఁగ . బిల్హ. 2 19.

మహాస్రగ్ధర . కోపమ్మైన రోషమ్మయిన విడువు మెర్లునమేలింక నన్నున్ .. ఆము 3. 30

క. తుదినమురశక్తి వైచినఁ, గదనధురంధరుఁడు ఱేఁడు గైకొని పైపై, ప్రదరసహస్రము విడిచెం, బొదివడిచెఁ గటారిఁ బొడిచె బొమముడి ముడిచెన్. కకు 2. 143.

3 పంపు

సీ ... గీ పికిలి పిట్టలఁ గొట్లాటఁ బెట్టుచూచు, దిట్టతనమునఁ జెలులు పందెంబులాడు, డీకొనఁ గఁజేసి యనికిఁ బొట్టేళ్ల విడుచు, రంభచుట్టంబు వైభవ ప్రాభవమున. కువల 5 9

చ కాయము చిత్రవర్ణములు గల్గి మనోజవమైన యశ్వమే, ధీయహాయంబు వాగమువిధిన్ విడువం దగు ... జై. భా. 1 76.

4. దానముచేయు

క. నేలం దాఁచిన వస్తువుల, పాలవు ధనమొండె ముచ్చు పాలవుధరణీ, పాలుని పాలవుఁ గావున, వాలాయముఁ గుస్త్రుల విడువవలయున్ ధన మున్. విక్ర. 2. 178.

5. విడువఁజేయు, విడిపించు, త్యజింపించు.

సీ. . ఆ మాతనాతివంబు నును విదిమేలని, గోఁచి విడచి మృదుదుకూల మిచ్చి ... భాగ. 9 694.

6 (ఇదికొన్ని వట్ల విశేషార్థములేకయే క్త్వాంత మునకను ప్రయుక్తమగు)

సీ. కోపించెనా మేరుకుధరచాపునినైనఁ దృణముగాఁ జూచి మర్దించి విడుచు జాహ్నవీ. 1. 116

(మర్దించి విడుచు=మర్దించి తీఱును, మర్దనక్రియ పూర్తిగఁజేయును)

అ క్రి. 1 (ఊడలు, కొమ్మలు మొ) పుట్టు.

సీ. . గీ. . విసవుఁజెట్టున కూడలు విడిచినట్లు, ఆడలు జనియించి చెటిచె మస్తమున నీకు. చంద్ర. 8. 24.

2 ఎడతెగు.

క. విడువక మీగావము సాగ,విడుటయు మటిపాడుఁ డమట యొగ్గే ... అము. 5. 58.

విడిచిపుచ్చు=విడుచు.

ఆ. . . అనుచు నుల్లసంబులాడి ద్రుపదు, విడిచి పుచ్చెగురుఁడు భార ఆది 6 90.

వ . ఆ భూపాలుండు హస్త పల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండుమని విడిచి పుచ్చె ... నైష. 1 108

జ విడిచిపెట్టు, విడిచివాటు గుదియ, విడిపించు, విడుపరి, విడుపరితనము, విడుపు, విడువడు, విడ్పించు, విడ్పు, విడ్వఁబడు.

**విడుచు²** స క్రి (√విడు) 1. వీడునట్లుచేయు, విప్పు

క. నీముడిచిన ముడివిడువఁగ,నే మెవ్వరు నేరమింక నీ సౌభాగ్య, శ్రీ మహిమలిఁ బతిఁగూర్పం, గామిని నీ కంటెఁ దెలుపు కలరే చెపుమా. ఉ హరి 5 104.

ద్వి. పొడిచె నొక్కఁడు తూఁటు వోవఁగనెత్తి, విడిచె దోవతికట్టు వెసనొక్కరుండు ... ద్వి. హరిశ్చ ఉ. 954.

గీ కొదమగుబ్బలఁదావి కుంకుమపుఁబూఁత, విభుఁడు చెంగావిఱయికంచు విడువఁబోవ ... ద్విశా. 9 124.

క. అని పంచాంగము పుస్తకమును విడిచి కడం బ్రయత్నమున దిథివారా,దినిరీక్షచేసి వ్రేళ్లనిన్ని నిరూపించెన్ గ్రహాది నిఖిల బలంబుల్ కళా 7. 48.

2 విడిపించు, పోవునట్లుచేయు.

సీ ... సీతాయ యెరువున జిడ్డువిడిచి .... హర. 2. 107.

**విడుజట్లుగొను** అ క్రి. (విడు+జట్టులు+కొను) ప్రత్యేకమైన అమ్మకపు సరకుగాఁగొను.

వ. హరగిరిజ లొండొరుల చిత్తంబులు విడుజట్లు గొని తారనీహారాచలంబుల కరిగిరి ... కు సం. 7. 909,

(ఒకరి మనసు నొకరాకర్షించి యనిభావము)

**విడుత** వి తడవ, పర్యాయము

ఉ. మాలనిచేతనైన విసుమానిని దానములోలిఁ గొందు దు,శ్శీలతచే దురన్నము భుజింతున బద్ధములాడుచుందు నే,వేళల నేటిగట్టుకడ వ్రేలుచుఁ జేతులు చోతుఁగాసుకై, తాలిమి రెండుమూఁడువిడుతల్ గుడుతుం బరిఁదైత్య కాన్నముల్. జాహ్నవి 4. 116.

**విడుదల** వి. (√విడు) విమోచనము, విడుపు.

సీ. . గీ ... దొంగలకుఁ జిక్కితింక నే భంగినాకు, విడుదలౌనని చింతించువేళ నెదుట ... వరాహ. 9. 10

వ. వేఁటకాని లాఁగునఁ బరచమూరు శరభచమర కదళీపుండరీకషండంబులఁ బడఁగెడపుచుఁ జెలికాని చోడల్పనఁ జూచుచుఁ దూణంబురాణ వెనుదవిలిపోవుచుఁ బథికజనుండన వల్మీకవానలం జూచి మఱలుచు చంద్రా 6. 98

**విడుపరి** విణ (విడుపు+అరి²) త్యాగశీలుఁడు (చూ. విడుపరితనము)

**విడుపరితనము** వి (విడుపరి+తనము) త్యాగము, ఈవి

మణిగణనికరము—కలువలచెలి సెగకను గలిగిన య,బ్బలియుని బలుకుల పడఁతుకఁ దెలి గ్రొం,త్త లరుల వలమురినసమున నగుచున్, బలువునఁదగు విడువరితనపు బలి. యయా 5. 159

**విడుపు** వి. (√ విడుచు¹) 1. విడుచుట, త్యజించుట,

ఆ. కార్తవీర్య దశముఖ ప్రముఖులు జమదగ్ని తనయ రాఘవాదులైన, పురుష వరులచేతఁ బొలియరే సక్రోధ, వృత్తిఁగాన నలుకవిడుపు మేలు. భార శాం. 6 590.

సీ. అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్మతో విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ, హత్యఁబోలిన పాపమని చెప్పుదురు పెద్దలు భార. మహా. 55.

క. ... అతఁడు శుభమశుభం,బను భేదముఁ బొర యఁడు విడు,పున సమతామ యత్నముంగను చుండున్ భార శాం. 5. 327.

సీ. ఫణి విషవహ్నిఁ జెడ్పడియున్న శశిరేఖ వెలవిడుపునఁగాంతి వలలునట్లు ... కు. సం. 7. 397.

2. త్యాగము, దానము.

క లోకము చందము గనికొని, యీశానఁగనగు ధనాదులెల్లను గాల, వ్యాకులతఁ బొందఁ గల యవి, గాకుండమి యెఱిఁగి విడుపుగడుఁ జదు రెందున్ భార. శాం 4 37.

గీ. అ య్యయాతి గడఁగి వెయ్యమునఁబడమి, వేల్పులకుఁ బైఁడి నొసఁగెడు విడుపునీట, నిండి కొదవేమియును లేక యుండెఁ గడలి, యతని దాగంబు లిఁక వెన్నెలవి యగునె. యయా. 1. 95.

3. దిగుమతి

గీ. తురగమునకుఁ బలము పురుషున కరపణ, మాఁడుదానికైన వందునగము, వేఁగు ముట్టు వందు వేగు విడుపునకు, నోడకూలి గొనుట యుచిత మంత్రు. విజ్ఞా. ప్రా. 86.

విశే. త్యక్తము, విడవఁబడినది.

ద్వి. .. భూవరులు, నలులై జన్నముల్ సన్న ముల్ సేయ, విబుధుల కుడుపులు విడుపులై పోయె . అ. మ. క 1 14. పా. 22. పం.

విడుమర వి. (√ విడు.) 1. విడుదల, విముక్తి.

క. ఒకనాఁడేమును వావద,లకు విడుమరఁ గాంచి విప్రులం జుట్టలఁ బె,ట్టుకొని సుఖముండఁ బడ యుదు, మొకొ యిప్పుడెందుఁ గలదె ఘోరు లైన్యరికిన్. భార విరా. 1. 49.

క. గడగడ వడఁకుచు నద్రులు, వడియఁగఁ జెదోయి మొగిచి స్వామీ కోపం, బుడుగుము శాపంబునకును, విడుమర యెన్నఁడగుఁ జెప్పవే కృపతోడన్. భోజరా. 6 349

గీ అపుడు మాళవుచేతఁ బ్రహారవర్మ, పట్టు వడి వాని కరుణయ ప్రాపుగాఁగఁ, దనకు విడుమర గాంచి. దశకు 7. 10.

2. ఎడఁబాటు, వియోగము

సీ. గిరిజ నాడఁగూర్చి వరదుచే వరము వడియ, నోపుఁ బొమ్మని నమ్మి నే నున్నచోట, నెట్టి విడుమరవచ్చె నీ కెట్టిబావు, సంభవించెనె మన నిజ చక్రవర్తి కు సం 5. 552.

విడులము సం. వి అ పుం. వేతసము, ప్రబ్బలి (వృ వి ) (వాచ )

విడువడు అ క్రి (విడుపు+వడు) విడివడు, బయలు వడు

గీ. మేటి ఖాటి జనిత కాలకూటవిషము. చిచ్చు విడువడి యంతంతఁ జెచ్చు పెరుఁగ ... భీమ. 4. 61.

క. కావున నీమహనీయ, గ్రావంబున నంటు వడ్డ క్రతు సైంధవ మిం,కేవిధమున విడువిడిచను, నావిధ మెఱిఁగింపవే దయానిధి యనినన్. వై. భా 4. 84.

విడూరజము సం వి అ న. వైడూర్యము, రత్న భేదము

విడెము=విడియము, వీడ్యము వి (సం. వీటికా) తములము.

మ. . రెండుమూఁడు విడేలాకులు పోకలాలి విడివాటు న్గొడలై తత్కుటీ, భవన ప్రాంగణ సీమఁ ద్రిమ్మరుదు రంభః కుంభ చేటీవిటుల్ .... వైజ. 2 41

గీ. పొసఁగ విడెమీయ శతపత్ర పూగహారి...దశా. 2. 128.

సీ . మిత్ర విందకుఁ బుక్కిటి విడె మొసంగి ... ఉ. రా 1 44.

విడ్చు=విడుచు స క్రి (√ విడు) విడఁజేయు.

సీ .. దుశ్శాసనుండు, నెట్టిన ద్రౌపది గట్టిన పుట్టంబు సభలోనవిడ్చెనాశంక లేక భార. సభా 2 281.

చ. జనులు నుతింపఁగా సుకృత సంపదఁ జేసి యమ ర్త్యశాఖమును, గనియును జెంద కిట్టునికి శాశ్వమై ద్రౌపది భీమసేను న్నర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాకిలి చాలవయ్యో దీ,శుప కము విద్య ని తైఱఁగు సూరినుతుం డగు నీకు నర్హమే. భార మహా 56

ఉ ద్రౌపది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి పెంట్రుకల్, దా వల చేతఁ బూని . భార ఉద్యో 3. 114

విడ్డూరము వి (సం. విద్వరః) 1 మౌర్ఖ్యము. (శ. ర)

2 ఉపద్రవము.

ద్వి. విడ్డూరములు వచ్చె వేగ ప్రాణములకు ... పల్నాటి వీరచరిత్రము 338 పం. బ్రౌ

విణ మూర్ఖము. (శ. ర)

విడ్గ్రహము సం. వి. అ. పుం. మలబంధము, ఒక విధ మగు రోగము

విడ్పి(డిపి)ంచు స క్రి. (√ విడుచు) విడువఁజేయు, వదలించు.

శా. . గంధర్వున్ దర్పితుఁ జిత్రసేను ఖరునిన్ దండించి విడ్పించె .. రాఘ. 3. 117.

విడ్పు = విడుపు (విడుచు) విమోచనము. భార. అను. 1. (శ. ర.)

విడ్యము = విడియము, విడెము, వీడ్యము. వి. తము లము, తాంబూలము.

క. తెలనాకులు బాగాలును, నలమిన పెనిమిటులఁ గూర్చి యైదువ యెలనాగల కెల్లనిడిరి విడ్యః మ్ములు దగ నప్పుడమితేఁడు ముదితయుఁ గడఁ కన్. యయా. 4 119.

సీ. వలపుఁ గప్రపు విడ్యముల వెన్నెల బయళ్ల సైకతములఁ జల్వచప్పరముల ... కవిరా. 4 15

క. కావున మీరు దలంచిన, (శ్రీ)వారాహంబు మంచి కృతిమాపేరం, గావింపుఁడనుచు సుము ఖుండై విడ్యముఁ గప్పురంబు నర్పించుట యున్. వరాహ 1. 14

విడ్లవణము సం వి. అ. న. వైద్యమునకుపయోగిం చెడి యుప్పు.

విడ్వఁబడు (√ విడ్పు) స. క్రి. విడువఁబడు.

గీ. రమణియవశముచే నైన రామనామ, మమర వర్తింపఁ బడుచుండ నఖిలపాతకములచే విడ్వఁ బడుఁజుమ్ము సుమతి యపుడె, సింహామతి భీత మృగములచేతఁ బోలె. సీతారా. 1. 53.

విడ్వరము సం వి. అ. పుం ఉపద్రవము.

విడ్వరాహము = విట్చరము సం. వి. అ. పుం.

విడ్వఱచు (విడు+పఱచు) స. క్రి తారు మారు చేయు, మార్చు.

క. ఆ రసికుఁ డెఱిఁగి వచ్చిన, నీ రీతుల పడుమఁ గలిసి యెఱుకఁ పడఁగమా, చీరలు విడ్వఱచి తిమి వి,చారింపఁగ నేల నాదు జయమగుఁ గాదో. ద్వా. 11. 56.

విత = వితా విణ (సం. వృథా) వ్యర్థము (దీని యా మ్రేడితరూపము "వితవిత")

క. అతివల హృదయములారసి, రతికలనన్ దేల్ప లేని రట్టడికూపున్, జతురతయు జవ్వనంబును, వితయ చుమీ యడవిఁగాయువెన్నెల రీతిన్. శశా 3. 73

క. కొడుకులు పుట్టని మానిసి, కొడుకులు బల్మి యును నిండ్లుఁ దొడవులు మాపుల్, పుడమియు నెక్కుడు మెకములు, విడిముడియుం బట్టము లును వితగద తలఁచన్. అ రా. బాల 50.

గీ. వారితో నది యోయన్నలార కంట్రా విత వితగ నన్నింత బట్టుసేసి, కానె తొత్తుల కాంత మదంబుకతన, విల్లుపట్టక తిరిగెదు వివ్విధ మున. శుక. 2. 133.

వితండ సం. వి. ఆ. స్త్రీ. 1. నిరాధారమైన వాదము, శుష్కవాదము. 2. (తర్క.) ప్రతిపక్ష స్థాపనములేని జల్పము స్వపక్ష స్థాపనములేని పరపక్ష నిరాకరణ రూపవాదము. 3. కోపమును బుట్టించెడి విమర్శ నము. 4. గరిచె 5. శాంబ్రాణి. 6. గన్నేరు. (వృ. వి.)

వితండము సం. వి. అ. పుం. 1. ఏనుగు. 2. తలుపు గడియ.

వితండావాదము సం. వి. అ. పుం. స్వపక్ష స్థాపనము లేక పరపక్షమును ఖండించు వాదము; అడ్డదిడ్డపు వాదము.

(ఈ యర్థమునఁ దెనుఁగుననే ప్రయోగము గన్పడు చున్నది.)

క. ఉండుదు మీరిచోట్ల వితండా వాదములు మాని శాంతిమితో నిట్లుండంగ నోపరేనియుఁ, బోండిప్పుడు నిజనివాస భువనంబులకున్. వరాహ. 1. 14.

వితంతువు సం వి ఉ పుం. మంచి గుఱ్ఱము, స్త్రీ ముండమోపి, విధవ.

వితంత్రి సం వి ఈ స్త్రీ తంత్రులు (తీఁగలు) సరిగాఁ బొసఁగని వీణ

వితంసము సం వి అ పుం 1 పిట్టగూడు. 2. పశు లను మృగములను బంధించుట కుపయోగపడు త్రాడు మున్నగు సాధనము.

విततధన్వుఁడు సం విశే. (న్.) ఎక్కుపెట్టఁబడిన విల్లుగలవాఁడు.

విततము సం. విశే (అ ఆ. అ) 2. వ్యాపించినది, విస్తరించినది. 2. పొడిగింపఁబడినది, సాగఁదీయఁ బడినది, విశాలమైనది. 3. ఆచరింపఁ బడినది. 4. కప్పఁబడినది 5. చెదరినది, వీణ,తంబురా మున్నగు తీఁగలు గల వాద్యము, తతము.

వితతి సం. వి. ఇ. స్త్రీ 1. వ్యాప్తి, వ్యాపనము. 2. సమూహము, గుంపు. 3. పంక్తి, వరుస.

వితథము సం. విశే. (అ. ఆ. అ.) 1. అసత్యము, నిజము కానిది. 2. వ్యర్థమైనది, నిష్ప్రయోజన మైనది.

వితథ్యము సం. విశే. (అ. ఆ. అ) అసత్యము, నిజము కానిది.

వితనువు సం. విశే (ఉ.) 1. సుకుమారుఁడు. 2. మందరుఁడు (ఆ. ని.) 3. శరీరము లేనివాఁడు.

వితమరి విశే (వితము+అరి) కార్యదక్షుఁడు, కార్య పద్ధతి నెఱిఁగిన వాఁడు, పొలమరి.

కళి. ... నటిమి తటిమి చటిమి మఱుము వశ్రు గెల్చిన వితమరికిఁ గలచి బలచి యలచి పలచు కపిని బంపిన నచ్యుతునకు... అప్ప 4. 327.

వితము వి (సం. విధా.) 1 విధము.

గీ. వెల్ల గొడుగులు వట్టించు వితము మించు, వంచ గమి నిల్పియాచెఁ జా లగుచు దివిని. ఘటికా చల. 2 124.

ద్వి. ప్రతిమీఱు పంకల్ప శవకల్పలతిక, వితముశ నతులిత విభ్రమోన్నతియు ... విష్ణు. ఉ. 4. (శ ర.)

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, నచ్చుగఁ దొడఁగిన వితాన నబలవయి స్మితెచ్చుగఁ గోపంబిటులా, వచ్చునతపై నపై పవలయు నటించున్. కళా. 4. 21.

సీ. తెఱఁగు చందము పగిది విత మనంగను మీఱుచు నుండుఁ బ్రకారసంజ్ఞ . . ఆం. భా. 2. 308.

2. ఉపాయము.

చ ... ఉరువ్యథాభరా, నతమొక వృద్ధవిప్ర మిథునంబు మృతుండగు పిన్నపాపనిన్, విత మఱి కొంచు వచ్చి రమువీరుని వాకిట వైచి దీనతన్ ఉ రా. 7. 181

జ వితమరి.

వితరణము సం వి అ న. దానము, ఈవి

వితరణి సం వి ఇ పుం దాత, ఈవికాఁడు. విక్ర. 2 (శ ర.)

వితర్కము సం వి. అ పుం 1 యుక్తులతో నాలో చించుట. 2. ఊహ, ఆశయము, అనుమానము చేయుట 3. తలంపు, అభిప్రాయము 4. సంశ యము, విచికిత్స 5. సమీక్షణము, పర్యాలోచ నము.

వితర్కించు సం స క్రి 1 సంశయించు

క పలుమాఱుఁ గాంచు తమూజుల, కొలఁది విత ర్కించెదవు నిగూఢం బదియుం, దెలియంబలి కెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా భార. ఉద్యో 2 318.

వితర్కుఁడు సం. వి. అ. పుం. జ్ఞానోపదేశకుఁడైన గురువు.

వితర్ది సం వి. ఇ. ఈ స్త్రీ. 1. వేదిక, అరుఁగు, తిన్నె 2 మేడ ముందరి వసారా.

వితర్దిక = వితర్ది సం. వి. అ స్త్రీ.

వితలము సం. వి అ. న. సప్త పాతాళలోకములలో రెండవది.

వితస్తి సం. వి ఇ. పుం. జేన, పండ్రెండంగుళముల పరిమాణము

వితా = విథ (సం. వృథా) విశే వ్యర్థము.

చ. తపముల పాలి మృత్యువులు దైత్యులు వీరిల నున్న వాళ్లకుం, దపమని చేయఁగూడునొ వ్రతంబని పట్టఁగ శక్యమో వితా, యిపుడిది యేటి యత్నము వహించె వివేక విహీనుఁడైన యీ, నృపముని యంచుఁ గౌశికుపయిం గడు నేరము లెంచు వారలున్. చంపూరా. 2. 84.

**వితాకు** వి 1. సంతాపము

చ. ... కృతి సంతతి కన్యక కెన్న యోగ్యుఁడౌ, ధవుఁ డొకరుండు లేమికి వితా మదిలోన వితాకుఁ జెందుచున్ ... ఘటికాచల 1. 14

2. వరాకు.

చ. కరవము సేయవచ్చి భయకంపిత గాత్రుఁడవై వితాకుఁ జే,సెద విదియేమి రాత్రిచరశేఖర... ఉ. రా 4. 12

సీ. ఈ వితాకున మేఁత యుడనై తిరుగా క్రోధి గొర వంక కనుచుఁ దావరిగె నొకతె ... (శ ర.) యయా. 5 22.

3 పారవశ్యము.

చ గడె తడ వాతఁ డొక్కవనిగాఁ బనియింటికి రాకయుండినన్, దడఁబడు మీఁదెఱుంగదు వితాకున నుండును జిన్నవోవు .. శశాం. 2 78.

4 నిశ్చేష్టత. (శ ర)

విశే 1 వరవశుఁడు.

క. అనియిటు లుర్వీశ్వారెదు, మనమునఁ గొని యాడి యంతమావటవేళం, గనుఁ బ్రామి చొక్కుఁ జల్లిన, యమువున నందఱు వితాకులై యుండగన్ ... విజ. 1. 188.

2. విశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు.

చ. సొరుగుమ సొమ్మసిల్లు మదిఁజొక్కు వితాకగు .. ఇలా. 3 (శ. ర.)

జ: వితాకుఁడు, వితాకుపడు, వితాకురాలు, వితాకులవిత్తు.

**వితాకుఁడు** విశే. (√ వితాకు) విశ్చేష్టితుఁడు.

శా మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదములేదు నిండు సభలో నొక్కింత మాత్రంబు హే,మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాత శిసాములే, లా హీనాధిక భావముల్ తడవరాదంచున్ వితాకుండనై వరాహ 10. 8.

క. అనిబాష్ప వారిధారల్, గనుదోయిం జెమ్మ గింపఁగా వలుదిక్కుల్, గనుఁగొనుచు వితాకుఁడనై, చననేరక యుంటివన్నిశాసమయ మునన్. వేం పంచ. 4. 103

వ. ఇట్లు మూర్ఛావివశుఁడై నేలవ్రాలియున్న యన్నరనాథ కుమారుఁగొని పోవువాఁడై వాన వారి తేరుడిగి యెత్తంబోయి తద్రథకంబై విఘ్నుతేజంబున్న కతంబునఁ గదలింపలేక వితాకుండై తనలోన .... రామా. 8. 121.

**వితాకుపడు** అ. క్రి (వితాకు+పడు) నిశ్చేష్టితుఁడగు (శ ర)

ఉ. అక్కట వేటలాడుచు హయంబు రయంబునఁ దోలుకొంచుఁ దాఁ, గ్రక్కున నొక్కవంది వెనుకం బడి మార్గముతప్పి క్రంపలం, జిక్కి మదిన్ వితాకుపడి చింత మునుంగుచుఁ బండ్లు గోయఁగా, నొక్కెడ దేవదత్తుఁ గని యారికి నేఁగెదు క్రోవవేడినన్. ద్వా. 3 21.

**వితాకురాలు** వి (వితాకు+ఆలు) నిశ్చేష్టితురాలు

చ. . అలనత దీఱ నిద్రఁగవనంచుఁ దలంచి వితాకురాలగున్ ... కువల 3 79.

చ భయపడి లేచివే యదురు పాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ,వియు నెలవంక చన్మొనలవేసియు వేయని పైట కొంగుదోఁ,పియు వటదోఁపకున్న యల పెన్నెఱి కొప్పునునై వితాకురా,లయి యవిచూచి యల్లలన యల్లలనాడు మనంబు కోడుతన్. సారంగ 3 153.

**వితాకులవిత్తు** వి సంతాపబీజము, పరితాపకారణము.

ఉ ఇప్పుడు నా మనోరథములెల్ల వితాకులవిత్తు చేసి యీ,తప్పులు పెట్టెదేమిటికిఁ దక్కఁ దలంచెద పెన్ని చెప్పినన్ .... వి. పు. 2 229.

**వితానకము** సం వి అ పుం. వ 1. వైశాల్యము, విరివి 2. సమూహము, గుంపు. 3. మేలుకట్టు, చాందిని. 4. మాడవృక్షము.

**వితానము** సం. విశే. (అ. అ. అ) 1. వట్టిది, శూన్యము 2. నిస్సారము, సారములేనిది 3 భంగము గలుగఁ జేయఁ బడినది, దిగులు చెంది నది 4 తెలివిలేనిది. 5. దుష్టము, మూఢము, దుర్మార్గమైనది.

వి. అ. పుం. న. 1. వ్యాప్తి, వ్యాపించుట. 2.మేలుకట్టు, చాందిని. 3 తలగడ, మెత్త, దిండు. 4. సమూహము, గుంపు. 5. యజ్ఞము. 6.అగ్నిహోత్రకుండము, అగ్నిహోత్రవేదిక. 7. అవసరము, అదను తఱి.

న. 1. తెఱపి, అవకాశము.

**వితావిత** విశ. మిక్కిలి వ్యర్థము ("వితా' యొక్క ఆమ్రేడిత రూపము.)

ఉ పరోకటబ్బె రాముడకు నెడ్లు బోనంగవు, చంద్రమః కళాధారికి నొక్కయొద్దది వితావిత పిరములేమి . కళా. 2. 20.

చ. ... సంతస మందిన వారుచూడనీ, ధనువును వీరి ముచ్చట వితావిత సేయకుమన్న . . దశా. 7. 199.

ఉ. ... భూ.పాలక యింటివారిడిన బాముల రచ్చలకెక్కినంతయే, బాలద యింకమీఁదను నిజంబుగ రట్టున కోర్చు నంతకుం, దాఖనె యీ శరీరము వితావిత యెక్కుడి బోలి యక్కటా. శుక. 4 63.

క్రి. విశ. మిక్కిలి వ్యర్థముగా.

చ. తడఁబడు మాటగద్గదిక దార్కొను నిల్చినచోట నిల్వరా,దడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపముచెందు నిద్రరా,దెడపని కోర్కెహెచ్చు మదినేమొ వితావిత జాలి జాలియో, నడిగినఁ జెప్పఁగూడ దకటామరు లెత్తిన యాఁట దానికిన్ కువల. 3, 100.

గీ పలకమ్మలఁ గెంపుంచనేల మఱియు, మొరయనేల వితావిత ముదితలార ... చంద్రా. 4 196

చ. ముసుఁగిడి పండియుండుమని మోహముతోడ వితర్దిఁ జూపితా, ముసురసు రంచుఖన్నయయి యొయ్యనవేగి కవాట మవ్వలన్, జెనజెనఁ ద్రోచి మూఁటఁ దలఁబెట్టుక వచ్చిన భర్తకింత సాధ్వస మొదవంగఁ జెప్పవిని వాఁడు వితావిత యేమియం చనన్. హంస. 4. 113

**వితీర్ణము** నం విశ (అ అ అ) 1. దాటఁబడినది, అతిక్రమింపఁబడినది. 2. ఇయ్యఁబడినది, దానము చేయఁబడినది. 3. దిగినది, అవరోహించినది. 4 కొనిపోఁబడినది, తీసికొనిపోఁబడినది. 5 లోఁబఱుచుకొనఁబడినది.

**వితీర్ణి** నం వి ఇ స్త్రీ ఈవి, వితరణము. (శ. ర)

**వితున్నకము** నం వి అ. న 1. కొత్తిమిరి 2. మైలుతుతము, తుత్థము

పుం నేలయుసిరిక

**వితున్నము** నం వి. అ న 1. కూరాకు (వృ వి.) చెంచలి కూరవంటి యొక మొక్క 2 శైవాలలత, నాఁచుతీఁగ

**వితుష్టము** నం. విశ (అ ఆ అ) అసంతుష్టి పొందినది, సంతోషింపనిది.

**వితృష్ణము** నం విశ (అ. ఆ అ) తృష్ణలేనిది, ఆసలేనిది, తృప్తిపొందినది

**విత్త**[1] వి చిహ్నము

ద్వి అజమత రామానుజార్యసిద్ధాంత, విజయధ్వజంబుల విత్తమై మిగులఁ, దళుకొత్తుచుండు త్రిదండముల్ దాల్చి ... ద్వి పరమ 3. 642 పా

**విత్త**[2] వి మిక్కిలి చిన్న గోనె

సీ ... అత్యల్పగోణియై యలరు విత్తయనంగ. ఆం. భా. 2. 266

క చిత్తజుచే దలిరాకుల, విత్తైతన ధైర్యమెల్ల వెడలనడిచియా మత్తేభగమన మిగులం, దత్తరపడి సమ్మదమునఁ దమకించుటయున్ ... వి పు 6. 24.

**విత్తదుఁడు** నం వి అ. పుం 1 ధనదాత 2. ఆస్తి నిచ్చినవాఁడు, ఉపకారి.

**విత్తనము** వి. విత్తు, బీజము

గీ. విప్రవరునకుఁ దూమెడు విత్తనముల, నేల యొసఁగిన ఫలము వర్ణింతు వినుము ... దశా. 5. 100.

గీ. . . బీజాఖ్య పరఁగువిత్తు, విత్తనము గింజ గిజ రన వెలయు నీళ ... ఆం. భా 2 39.

**విత్తము** నం విశ (అ ఆ అ) 1. కనిపట్టఁబడినది, కనుగొనఁబడినది. 2 లబ్ధము, పొందఁబడినది. 3. పరీక్షితము, పరిశీలింపఁబడినది 4 ప్రఖ్యాతము, ప్రసిద్ధికెక్కినది

వి. అ.న. 1. సొత్తు, ఆస్తి, ధనము, 2. శక్తి, బలము.

**విత్తవంతుఁడు** సం విణ. (వ్. వతి వ్) ధనవంతుఁడు, ఆస్తిగలవాఁడు

**విత్తవర్ధనము** సం విణ (అ. అ. అ) ధనమును వృద్ధి చేయునది, లాభకరమైనది, ఆదాయము కలిగించునది.

**విత్తాగమము** సం వి అ. పుం ధనలాభము, ధనప్రాప్తి.

**విత్తి** సం వి ఇ స్త్రీ 1 జ్ఞానము, తెలివి 2 విచారము, ఆలోచనము. 3. సంపాదన, గడించుట, పొందుట.

**విత్తించే** స క్రి (√ విత్తు) విత్తనము నాటించు
గీ విరివిగాఁ బైరు విత్తించు వేళ్లఁగొలుచు, గాఁగ మామకసస్యముల్ గడుఫలించు ... వేం. పంచ 5. 13.

**విత్తిడు** అ క్రి (విత్తు+ఇడు) విత్తులు చల్లు.
క క్షేత్రమెఱిఁగి విత్తిడుటయుఁ, బాత్రమెఱిఁగి దాన మిచ్చి పనుచుటయు వివే, కత్రాణ పరాయణులకు, ధాత్రీశ్వర యుండువందుఁ దగ మేలొసఁగున్. వి పు. 5. 130

**విత్తు** స. క్రి. (విత్తనములు) చల్లు.
సీ. పెంచంగఁ బెరిఁగె నాపృథ్విపైఁ గొండలు విత్తిరాయడవుల వివిధగతుల.. నీతిసీ శ. 60.
ద్వి. త్రొక్కినచోటెల్ల దున్నకపండ, దిక్కులఁబసిఁడి విత్తిన పైరుగాఁగ ద్వి పరమ. 3. 182 పా
ఆ పూర్వజన్మమందుఁ బుణ్యంబు సేయని, పాపి ధనముకాశ పడుటయెల్ల, విత్తమఱచి కోయ వెదకిన చందంబు, విశ్వ .. వేమ 1 44.
ద్వి. మామిడివిత్తుదా మహిమీఁద విత్త, వేమగునే పెక్కువిధు లెలచెప్ప . బస పు (ప్రాత ప్రతి.) 1 261 పం
వి. విత్తనము
గీ. విత్తు సహకారి గాకున్న రిత్తవేల, వంధ్యమగుఁ గాక తా ఫలవంతమగునె ... భార. అను. 1 136
గీ. తవరిహేమంత మగుడుఁ బద్మంబు లడఁగి, పోయెఁబోయినఁ గొలపొక్క పువ్వుతనకు, విత్తుగా దాఁచికొనియున్న విధముపోలె, శైల సుత ముఖముదరహాసమున నొప్పె కు. సం. 6. 783.
విత్తడగు=సమూల నాశనమగు
ఉ. .. ... నీ, వేఁడిమి నూపియూథపుల విత్తడఁగందును మాడివైపు .. భా రా యు 783
జ విత్తించు, విత్తిడు, విత్తుపట్టు, విత్తుమాల్చు.

**విత్తు** సం వి వ్ స్త్రీ దీనికిఁ బ్రత్యేక ప్రయోగము లేదు
1 జ్ఞానము 2. గ్రహణశక్తి, తెలివి.

**విత్తుపట్టు** వి (విత్తు+పట్టు) సస్యములు ఫలించు పొలము
వ. ... చెఱువు దక్షనామున ముప్పదిపుట్లు విత్తుపట్టు సర్వాకర పరిహారముగా శ్రీచోడ గంగ దేవరిచ్చి . దా. శా. 1015.

**విత్తుమాల్చు** స క్రి (√ విత్తు) చంపు, కడతేర్చు.
గీ. చటులగతిఁ గొన్ని కణుజుల సంహరించె, వెంటఁబడి కొన్ని శశముల విత్తుమాల్చెఁ, గొన్ని జింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ, గుక్క లాఖేటకంబున నుక్కుమిగిలి వి శకుం. 2. 15.

**విత్తేశుఁడు** సం వి. అ పుం. కుబేరుఁడు.

**విత్రాసము** సం వి అ. పుం భయము, వెఱపు

**విత్సనము** సం. వి అ పుం. వృషభము, ఎద్దు.

**విథుర** సం. వి. ఆ స్త్రీ విధవ, ముండమోపి.(శాచ)

**విథురుఁడు** సం. వి అ పుం. 1. రాక్షసుఁడు. 2. చోరుఁడు

**విద** సం వి ఆ స్త్రీ 1. జ్ఞానము. 2. గ్రహణశక్తి

**విదంశము** సం వి. అ పుం దప్పి గలిగించెడి కారము గల యాహారము

**విదగ్ధ** సం వి. ఆ. స్త్రీ చాతుర్యమును, చురుకుఁదనమును గల స్త్రీ, చమత్కారిణి.

**విదగ్ధము** సం విణ. (అ అ. అ) 1 ఎక్కువగా దహింపఁబడినది, తగులఁబెట్టఁబడినది. 2 వండఁబడినది 3. అఱిఁగినది, జీర్ణమైనది. 4. నశింపఁ జేయఁబడినది, ధ్వంసము చేయఁబడినది 5 వాఁడియైనది, చురుకుఁదనము గలది, నేర్పుగలది, 6 జిత్తులు గలది, కపటముగలది. 7. తగులఁబడినది. 8 జీర్ణముకానిది, అఱుఁగనిది. 9 మనోహరము, ఇంపైనది 10. గౌరవార్హమైనది. (వేషము.)

**విదగ్ధుఁడు** సం. విశ. (అ. అ. అ) నేర్పరి, చతురుఁడు, నిపుణుఁడు. 2 కపటియైనవాఁడు, జిత్తులుగల వాఁడు.

వి. అ. పుం. 1. పండితుఁడు, విద్వాంసుఁడు, 2. దుర్ణయము గలవాఁడు, జారుఁడు.

**విదథుఁడు** సం. వి. అ. పుం. 1. కృతి, ధన్యజీవి. (మే ని) 2 యోగి, విద్వాంసుఁడు (అ ని.)

**విదరము** సం వి అ పుం. 1. చీల్చుట, భేదనము. 2. వృక్షము, చెట్టు

విశ (అ అ అ) భయరహితము, భయములేనిది. (వాచ.)

**విదర్భ** సం వి. అ స్త్రీ ఒక పట్టణము.

**విదళితము** సం. విశ. (అ అ. అ) 1. మిక్కిలి ఖండింపఁ బడినది. 2. మిక్కిలి భేదింపఁ బడినది.

**విదర్భజ** సం. వి. అ. స్త్రీ. విదర్భ దేశపురాజు కూతురు. 1. దమయంతి. 2. లోపాముద్ర, అగస్త్యుని భార్య 3 రుక్మిణి, కృష్ణుని భార్య. (ఇట్లే విదర్భతనయ మొ)

**విదర్భము** సం. వి అ పుం ఇప్పుడు బేరారని వ్యవహరింపఁబడు దేశ విశేషము 2 నిర్జన ప్రదేశము, జనులు విడిచిపోయిన దేశము.

**విదర్భసుభ్రువు**=విదర్భజ సం. వి. ఈ స్త్రీ

**విదర్భుఁడు** సం. వి. అ పుం. విదర్భ దేశపు రాజు. బ విదర్భదేశ నివాసులు.

**విదలనము** సం వి అ న. చీల్చుట, బద్దలుచేయుట.

**విదలము** సం. విశ. (అ అ అ) 1. చీల్పఁబడినది, బద్దలు చేయఁబడినది. 2. (పువ్వు) వికసించినది, వికసించినది.

వి. అ పుం. 1. విడఁదీయుట, ఎడఁబాపుట. 2 చీల్చుట. 3. భక్ష్యము, పిండి వంటకము. 4 అడవిగోవిదారము.

న. 1 బద్దలతో నల్లిన పాత్ర, వెదురుబుట్ట. 2. దానిమ్మచెట్టు పట్ట, 3. రెమ్మ, ఉపశాఖ. 4 ముక్క, చెక్క. 5. కందిగింజ మొదలగువాని బద్ద.

**విదళించు** సం స క్రి 1. చీల్చు, భేదించు, పగులఁగొట్టు.

క. విదళింప మయుకు సింగపుఁ, గొదమయు మద ఘుళిత గండ కుంజరములపై, నిది బలశాలికి సైఁజము, గద తేజోనిధికి వయసు కారణ మగునే. భర్గ 1 31

సీ. విటుల గుండెలలోన విదళించు చిగురాకు నంపెట ప్రేకెండు సమసె నేఁడు .. వీర. 2. 118.

2. నఱకు, ఖండించు.

సీ కలుషంబు విదళింపఁగల ధర్మశాస్త్ర ప్రపంచంబు లెవ్వాని పలుకుఁ బళ్లు వరాహ 1. 9.

చ కడఁగిన వీరుఁ డారసిలి ఖడ్గముచే విదళించి పెంచ్చుటొ కృష్ణాభ్యుదయము. (ప్రా.)

**విదారకము** సం. విశ (అ ఇకా అ)

వి అ పుం 1 చీల్చునది, విభాజకము, విభజించునది. ప్రవాహ మధ్యమునమున్న వృక్షము లేక పెద్దఱాయి 2 చెలమ, ఎండిపోయిన యేటిలోఁ ద్రవ్విన గుంట.

న. 1. జలబంధనము, ఆనకట్ట 2. చవుటినేల.

**విదారణము** సం వి అ. పుం 1. ప్రవాహ మధ్యమునమున్న చెట్టు, పెద్దఱాయి, బండ 2. కర్ణికార, కొండగోఁగుచెట్టు 3 యుద్ధము

న 1 చీల్చుట, పగులఁగొట్టుట 2 బాధించుట, హింసపెట్టుట 3 చంపుట.

**విదారము** సం వి అ పుం 1. చీల్చుట, పగులఁగొట్టుట, ముక్కలు చేయుట 2. యుద్ధము 3 నది, చెఱువు మొదలగువానియం దెక్కువగా నుండు జలము పొర్లిపాఱుట, జలోచ్ఛ్వాసము.

**విదారి** సం వి ఈ, స్త్రీ 1. గజ్జలోనివాపు (అ ని ) 2. శాలపర్ణి, ముయ్యాకుపొన్న. 3 భూమి కూష్మాండి, నేలగుమ్మడి. (వృ వి ) 4. కంఠరోగ విశేషము, గొంతులోఁ బుట్టెడి యొకానొకరోగము. (వాచ.)

**విదారించు** సం స. క్రి చీల్చు, బద్దలుచేయు.

మ. ... ... ఆశ్వ వికామోదర పార్శ్వముల్ కరటి హస్తంబుల్ విదారించి యుయ్యనరభ్యావధిపు పేనగాడుపుల రణ్యానిన్ బలెన్ గూల్చి నన్ .. ఉ రా 3. 161.

**విదారిగంధ** సం వి. అ. స్త్రీ. ముయ్యాకు పొన్న. (వృ. వి.)

**విదారుపు** సం. వి ఉ. పుం. ఊసరవిల్లి, తొండ.

**విదాహము** సం. వి. అ. పుం. 1. కాలుట, తగులఁబడుట. 2. జ్వాల, పెద్దమంట. 3. తైక్ష్ణ్యము, వాఁడిమి.

**విదాహి** సం వి. న్. పుం దాహమును (అత్యుష్ణమును) పుట్టించెడి పదార్థము.

**విదాహించు** సం. అ క్రి తాపమునొందు

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీ గీర్వాణుఁడు చలిత వియోగి ప్రాణుండగు పంచ బాణుం దలంచి . వేం. పంచ 4 250.

**విదిక్కు** సం వి క్. స్త్రీ మూల, రెండు దిక్కుల నడిమిభాగము.

**విదిక్కుపడు** మి అ క్రి దిగ్భ్రమ చెందు

సీ. నామాట కుల్కి మిన్నక కాలభైరవుం డేలోను నిద్దఱ నిట్లు ద్రుంచె, నింక నెందఱఁ బంప నెంచినాఁడో యని విడిచి కన్కని గుడివెడలి పాఱి.

గీ రేను నామాట పద్యంబుగా నొనర్చి వాసి నిలిపితి నంత నెవ్వారలైన, మ్రొక్కఁ జనుదెంచి కాంచి విదిక్కు పడుచు, వెడలి మఱి చూడరిట వెరవేఁకి పట్టి. ద్వా 4 70

**విదితము** సం విశ (అ ఆ అ.) 1 తెలిసినది, బోధపడినది. 2 తెలుపఁ బడినది. 3. ప్రసిద్ధి కెక్కినది, ప్రఖ్యాతము 4 కోరఁబడినది, ప్రార్థితము 5 అంగీకరింపఁబడినది. 6 వాగ్దానము చేయఁబడినది 7 యుక్తము. (ఈ యర్థము సంస్కృత గ్రంథములందుఁ గానరాదు )

క అది గావునఁ గార్యార్థము, మదవ గురుని కడకు నిపుడు మన మూరకపో, విదితముగాదే తెరవన, ముదితయుఁ దనవిభుని వాక్యములకు వలరుచున్ కుచేల 1. 112

వి అ న 1 ఎఱుక, జ్ఞానము 2 ప్రసిద్ధి, ప్రఖ్యాతి 3 లాభము, ప్రాప్తి. 4 అంగీకారము ఒప్పుదల

**విదితుఁడు** సం వి. అ పుం పండితుఁడు, చదువరి.

**విదియ** వి. (సం. ద్వితీయా) పక్షమందు రెండవ తిథి.

గీ. విదియ నాఁడేరు వడకున్నఁ దదియనాఁడు, కావఁ బడియెడు పనికింత కనల నేల... యయా. 5. 9.

సీ. వర్ష గర్భము వడవకపోయె విదియలఁ గుము దాప్త దారణ కొమ్ము దఱిగె .. కాశ. 3. 149.

**విదిలించు** స. క్రి (√ విదులు) 1 జాడించు, చలింపఁ జేయు.

సీ. అలవోక వోలె వాలాగ్ర మొకించుక విదిలించు నంత నవ్విహాగ విభుఁడు ... సమీర. 6. 169

క ఆ నీరు సోఁకి మాయాధేనువు తా నిద్రపోయి తెలిసిన పగిదిన్, మేను విదిలించికొంచును, మౌనులు వెఱగంది చూడ మగువయగు తఱిన్. వరాహ. 10 60.

2 జాడించు, కడుగు, శుభ్రము చేయు.

ద్వి. పిఁకతో నలికిన విత్తులు నీళ్ల, విదిలించుకొని వచ్చి వేఁపి దంపించి . . బస. పు 4. 970. పం

3 విదుర్చు, వదలుచుకొను.

చ. విడువిడు పట్టరాకు మలివేణి యటంచును జాతి కెంపురా, కడియపుఁ గేలు ఘల్లు రనఁగా విదిలింప ... దశా. 5 24.

4 విదులుచు, దులుపు.

చ కంథ గ్రక్కున విదిలించి యందుఁ బది కోటుల మాడలు రాలఁ ద్రోపుగా . విక్ర. 2. 18.

సీ. వంబెళ విదిలించి తాంబూల దళపూగ నివహంబుఁ జాలగ నించు ముల్కు .. ఆము 7. 7.

5. విదుర్చు, పోఁగొట్టు

వ . ఆఁకటఁ గటకటంబడి గ్రాసంబు వేఁడినఁ జెడు పురుషుం బోలె విదిలించు వారలే కాని యాయాసం బెఱింగి రమ్మను వారు లేరు. (కసరికొట్టు అని భావము) శుక. 3. 187

**విదిలించుకొను** స క్రి (విదిలించు+కొను) దులుపుకొను, కదలించుకొను

క. అని శ్రీపతి యానతి యిచ్చిన మందల విడిచె నతని సిద్ధ విభుఁడు వాఁడును గులగులరై యావగ, లివమై విదిలించుకొనుచు లేచెఁ గిదుకుచున్. పాండు. 4. 297.

**విదిల్చు** స. క్రి. (√ విదులు) విదులఁ జేయు, దులుపు.

క. చెక్కలు విదిర్చి లావులు, ముక్కుకొనందుఱ్వి. శుక. 1. 23౬.

విదిశ సం. వి. ఆ స్త్రీ. 1. దశార్ణ దేశమునకు రాజధాని. 2. మాల్వదేశము నందలి నదీ విశేషము. 3 విదిక్కు, మూల, రెండు దిక్కులనడిమిభాగము.

విదీర్ణము సం. విణ. (అ. ఆ. అ) 1. చీల్చఁబడినది, బ్రద్దలు చేయఁబడినది, ముక్కలు చేయఁబడినది, 2. తెఱవఁబడినది. విస్తరించినది

విదుఁడు సం. విణ. (ద్) (సమాసాంతమున) తెలిసినవాఁడు (వేద విదుఁడు మొ.)

వి ద్ పుం 1 బుధ గ్రహము. 2. పండితుఁడు, చదువరి

విదురు=విదులు అ. క్రి. (క. ర.)
(చూ. విదురుచు)
ఊ · విదురుచు, విదుర్చు, విదుర్చు.

విదురుఁడు సం. విణ (అ. ఆ. అ) బుద్ధిమంతుఁడు, తెలివి గలవాఁడు.

వి. అ పుం. 1 పండితుఁడు, చదువరి. 2. యుక్తులు గలవాఁడు, కుట్రలు పన్ను మనుష్యుఁడు. 3. పాండురాజు తమ్ముఁడు, కౌరవులకు మంత్రి.

విదురుచే=విదుర్చు స. క్రి. (√ విదురు) విదురఁజేయు, విదిలించు

క. కప్పంగొప్పులఁ జిమ్మం,గప్పుల మొగముల నొడల్లఁగప్పిన మెఱుఁగుం, బుప్పొడి విదిరించి కొని మఱి, యప్పడఁతుక లరిగి కప్పపడఁటుల చెంతన్, యయా. 4. 28.

విదుర్చు=విదురుచే, విదులుచే, విద్రుచు, (√విదురు) స. క్రి 1. దులుపు.

గీ. రాలియున్న పుష్ప ప్రకరము విదిర్చి, తిన్నగా నున్నచేసిన సెజ్జయనఁగ, వేఁగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద, కాతిఁ దెలుపొందెఁ జూడ నంబరతలంబు. కార. విలా. 2. 239.

ఉ. ... పెన్నెఱుల్, వేమరుచేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్, గోమల లీలదువ్వి... పారి. 2. 10.

2. చలింపఁజేయు.

క. తలిరాకు మెఱుఁగు వాతెఱ, కలకంఠ విటుండు గమియఁగాఁ జూతలతా,లలన విదుర్చెను గంటివె, యలికంకణ ముఖర విటప హస్తముల నలి పారి 3 49

చ . రసా, తలమునమండి వెల్వడు సుదారత మేను విదుర్చ ... భాగ 3 485

ఉ. ... గ్రక్కున వారుపాటి మునుగంబడ నెక్కిన బిట్టుదూలి న,ల్దిక్కులఁ గూల గాత్రము విదుర్చె నతండు మదద్విపా కృతిన్ ... భా రా. యు 940

3 ప్రసరింపఁజేయు

రగడ .. గొడిపె తింత్రిణీకులము విదుర్చెన్, వడపిందె జనావళి వడఁ దీర్చెన్ ... బహు. 2. 18.

చ ... విస్ఫుట పటుదీర్ఘ నిశ్వసనముల్ బలితంపు శిఖల్ విదుర్చఁగా . . దశా. 2. 26

4. ఒసఁగు, ఇచ్చు

వ. అప్పుణ్యవంశంబు (శూద్రవంశంబు) ...విశ్వ విశ్వంభరా క్రీడనంబు దనకు విదుర్చిన పరమ శాంతి యంతరంగంబున సంతరించి నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె ... భీమ 1. 31.

5 తొలగించు, త్రోసివేయు,

సీ తన ముక్కు కినుకఁ గైకొనక లచ్చి విదుర్చఁ బదనఖంబంటిన ఫాలతలము... దశా. 8. 145

6 జాడించు

సీ. స్నాతుఁడై మెయినీరుచేతఁ దొడయఁ జీర నార్చ చెంద్రుకలు విదుర్చఁ గూడ్రదు ... మార్క. 3 233

7. విదలించు,

సీ. అమాధవి పరాగ మఱిరాగము మించఁ బఱతెంచు కలకంఠిపై విదుర్చె ... వసు 1. 128.

విదుర్చు(రుపు) వి. (√ విదుర్చు) కదల్చుట.

వ. ఇట్లేయు నా సూతనందను విల్లు విదుర్చుదోఁపక గుడుసు వడుటఁ జక్రాకృతింబొలుచు వనల శిఖల చెలువుదాల్చె ... భాం. ద్రోణ. 4. 232.

చ. .... తెక్క విదుర్చు మున్నుగా, పడఁకుచెంకార చేష్టుడిగెఁ బతులు వతము జానువుల్ చొరక్... అను. 4. 118.

**విదులము** సం. వి అ. పుం. 1 ప్రబ్బలిచెట్టు. 2. నీటి ప్రబ్బలి. (వృ. వి.) (మే. వి.) 3 గోవరనము, వాలెంతబోలు. (ఒకదినుసు పరిమళముగల బంక)

**విదులు** స క్రి 1. విడుచు, త్యజించు.

క. పదియాఱువేల నూర్వురు, సుదతులు నెన మంద్రుసీకు సొంపుగ భార్యల్, విదితంబుగ బహురూపుల, విదులక భోగింపు దారవేడుకఁ గృష్ణా. కృష్ణ శ. 23.

1. రాలు. (చూ విదురుచు.)

జ విదిలించు, విదిలించుకొను, విదుల్చు, విదులుచు, విదుల్చుకొను, విదుల్పు

**విదులుచు(ల్చు)** స క్రి 1 దులుచు

చ .. పదములు జంఘలూరువులు బాహువులోలి నమర్చి త్రొక్కియున్, విదులిచియున్ నొగిల్చియును ద్రేసియు నొంచెనతండు ద్రేల్మిడిన్ .. హరి. ఉ 10 255.

2 ప్రసరింపఁజేయు.

సీ. విషము విదుల్చుచు నెస ఘన విముఖతఁ జమజాల పదము లీ సారసములు ... రసి. 4. 52.

3. రాల్చు

ద్వి. ... ఆ తటినొక్క యుడుత ... అచ్చపు భక్తితోనట వార్ధి మునిఁగి, వచ్చితా నిసుకలో నడి పొరలాడి, తడయక చనుదెంచి తన మేని యిసుక, వడఁ గట్టపై .... విదుల్చె . రం. రా. యు. 315 పొ 23. పం

4. దులుపు

ద్వి జడలు వీడఁగఁగలాసములు విదిల్చి, మడిచి చంకలనిడి మరలి చూచుచును , ద్వి హరిశ్చ. పూ. 420. పం.

వ .. పరాగంబులు రాల్చుచుం బయ్యెదలు విదుల్చుచు ... కళా 6 225,

**విదుల్చుకొను** స. క్రి (విదుల్చు+కొను స్వార్థమున) దులుపు

క. కొలనెల సుధారసంబునఁ గలవోవఁగ నొరసి కడిగి కౌముదిలోఁ గ్రొమ్మెఱుఁగుల విదుల్చుకొనిపై, మెఱుఁగిడు వట్లొప్పునగజ మృదునిటలరుచుల్ కు. సం. 8. 812.

**విదుల్పు(లుపు)** వి (√విదుల్చు) విదిలించుట విక్షేపణము.

వ .. జవంబులు రవంబులు వదుల్పులు విదుల్పులు వీకులు తాఁకులు .. భీమ 4. 60.

ఉ. పైటకు లాగులాడి కటిపై ఘటియించిన చేవిదుల్పులన్, జాటిలి నీవికై పెనఁగిపైఁబడి చేతులు తట్టి వేఁతల, నీమ్మటుగ నాటఁ బట్టు బలిమిం గనమిం దగ దొట్టు పెట్టిపో, రాటము లాయెనాయవ కొయారి యెడాటములన్ హుటాహుటిన్ పాంచాలీ. 5. 20.

**విదువు** సం. వి. ఉ పుం 1. ఏనుఁగు కుంభస్థలము నడిమి భాగము. 2 నీటి గుబ్బము

**విదుషి** సం వి ఈ. స్త్రీ విద్వాంసురాలు.

**విధూనము** సం విణ (అ. ఆ అ) మిగుల బాధింపఁబడినది, హింసపెట్టఁబడినది

**విదూరగము** సం. విణ (అ. ఆ అ) మిక్కిలి దూరముగా వ్యాపించునది, మిక్కిలి దూరముగాఁ బోవునది

**విదూరజము** సం వి అ. న వైడూర్యము, నవరత్నములలో నొకటి.

**విదూరము** సం. విణ (అ ఆ. అ.) మిక్కిలి దూరమున నున్నది, దవ్వున నున్నది.

వి. అ పుం వైదూర్యములు పుట్టెడి పర్వతము.

న. మిగుల దూరము, కడుదవ్వు.

**విదూషకుఁడు** సం. విణ. (అ ఈ అ.) 1 మలినముగాఁ జేయువాఁడు, పాడుచేయువాఁడు, చెఱచువాఁడు 2 దూషించువాఁడు, నిందించు వాఁడు 3. చమత్కారి, హాస్యముగా మాటాడువాఁడు.

వి అ. పుం 1. హాస్యగాఁడు 2. శృంగార నాయకుని సహాయులలో నొకఁడు.

(ఇతఁడు తన రూపము పని వేషము భాష మొదలగు వానిచేత నెల్లరకు నవ్వుఁ బుట్టించుచుఁ తన పని నెఱవేర్చుకొనెడి స్వభావము గలవాఁడు.)

3. భోగలాలసుఁడు

**విదూషణము** సం. వి అ. న 1. చెఱుచుట, పాడుచేయుట, 2. నిందించుట, దూఱుట.

**విదేశజము** సం. విణ. (అ. ఆ. అ.) దేశాంతరమునఁ బుట్టినది. పరదేశమున నుద్భవించినది.

**విదేశము** సం. వి. అ. పుం. పరదేశము, దేశాంతరము.

**విదేశి** సం. విశ (స. సి స.) దేశాంతర సంబంధి, పరదేశస్థుఁడు.

వి స. పుం. దేశాంతరము నుండి వచ్చిన మనుష్యుఁడు, అన్యదేశస్థుఁడు.

**విదేశీయుఁడు**=విదేశి సం విశ. (అ. అ అ)

**విదేహ** సం. వి. అ స్త్రీ. మిథిలా పట్టణము, విదేహనగరి.

**విదేహము** సం. వి అ. పుం 1. విదేహదేశము, దేశవిశేషము. 2. విదేహమను నొకానొక మండలము, భూభాగము

**విదేహుఁడు** సం విశ (అ అ అ) 1. దేహము లేనివాఁడు, దేహసంబంధము లేనివాఁడు. 2 కంఠము క్రింది భాగము లేనివాఁడు

వి అ పుం 1. విదేహ దేశనివాసి 2. జనకమహారాజు.

**విద్దె(ద్దియ)** వి (సం విద్యా.) 1. చదువు.

సీ. తెలిపి చూపక క్రోలగిలికొని విద్దెలఁ గొలలవారలకిత్త మొలఁగుటయును .. అ రా. బాల. 45.

ద్వి. విద్దెలు నెఱపుచు విభుని ముందఱను, ముద్దులుగులుకుచు మోహనాకృతుల .. రం. రా బాల. 21 పొ. 4. పం.

2. మాయ.

ఉ. .. ఇంద్రియంబులన్, బెద్దవునీవెఱుంగని ప్రవీణవు బుద్ధులు లేవు గానని, విద్దెలు మానుమానుమవివేకము వెంచను నిన్ను వేఁడెదన్. చంద్ర. వి. 2. 128

3. దంభవాక్యము, బడాయి

ద్వి. విద్దెలాడెదుఁగాక విందుమే తొల్లి ... బస. పు. 6. 105. పం

**విద్దె(ద్దియ)ము** వి (సం. విద్యా) తొలుసారి బాలకులు లేచి నిలువబడుట.

క. విద్దెములు సేయరాదా, ముద్దులపట్టియటంచు ముచ్చట దీరన్, దద్దయుఁ దలిదండ్రులు తమ, ముద్దిడుకొన నళుఁడు వెలసె మోహనశీలన్. ఇందు. 2 17.

మ. జనకుండయ్యలు విద్దె మేదియన ... దశా. 4. 142.

ఉ ముద్దులమాటలున్, జిలుతమోముక నున్ననిలేత చెక్కులున్, గొద్దిగ నున్న వెన్నడుముకూఁకటి కందక ఫాలపట్టికన్, విద్దెము సేయు ముంగురులు విప్పగుతెప్పల గొప్పకన్నులున్, బ్రొద్దొకవింతయై యమరెఁబుష్ప సుగంధికి బాల్యవేళలన్ అని. 2 61

(ఇట "విద్దెము సేయు = చిందులాఁడు" అని భావము)

**విద్య** సం. వి. ఆ. స్త్రీ 1 జ్ఞానము, తెలివి 2 తత్త్వజ్ఞానము, ఆత్మసాక్షాత్కారము 3 చదువు, జ్ఞానహేతువగుశాస్త్రాదికము. (చతుర్విద్యలు ఆన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి మనువు ఆత్మవిద్య యైదవదిగాఁ జేర్చి యున్నాఁడు) (చతుర్దశ విద్యలు నాలుగు వేదములు, ఆఱువేదాంగములు, ధర్మశాస్త్రము, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అను వానితోఁ బదునెనిమిది.) 4 దుర్గాదేవి 5. దేవీమంత్రము 6. ఇంద్రజాల నైపుణ్యము, గారడీ యందలి నేర్పు.

**విద్యమానము** సం విశ (అ ఆ. అ) 1 ఉన్నది, స్థితము 2. సమక్షమున నున్నది, ఎదుటనున్నది. 3. సత్యమైనది, యథార్థము.

**విద్యలవాఁడు** మి. వి (విద్యలు+వాఁడు) ఐంద్రజాలికుఁడు, గారడివాఁడు.

గీ వదలి శౌర్యంబు విద్యలవాని కరణి, నింద్రజాలంబు పన్నెదవే బలీంద్ర దశా 2. 408.

**విద్యాకరుఁడు** సం. వి. అ పుం. విద్వాంసుఁడు, చదువరి

**విద్యాచంచువు**=విద్యాచణుఁడు సం. విశ (ఉ.)

**విద్యాచణుఁడు** సం విశ (అ ఆ. అ) విద్యచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడు.

**విద్యాదలము** సం వి. అ. పుం భూర్జపత్ర వృక్షము.

**విద్యాదాత** సం. వి. ఋ. పుం. చదువు చెప్పువాఁడు, విద్యనిచ్చువాఁడు, గురువు.

**విద్యాదానము** సం. వి. అ. న. 1. విద్యనేర్పుట, చదువుచెప్పుట. 2. పుస్తకాదికము నొసఁగుట. (వాచ.)

**విద్యాదేవి** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతీదేవి.

విద్యాధరి సం వి ఈ స్త్రీ విద్యాధర స్త్రీ.

విద్యాధరుఁడు సం. వి అ పుం దేవతలలో నొక తెగ పురుషుఁడు

విద్యానులాపి సం విశే (న్ నీ న్) విద్యను వల్లించువాఁడు, వల్లె వేయువాఁడు

విద్యాభ్యాసము సం వి అ పుం విద్యనేర్చుకొనుట, చదువుకొనుట, జ్ఞానమును పొది చుట

విద్యారంభము సం వి అ పుం విద్యయొక్క యారంభము) చదువు ప్రారంభించుట, పిల్లవానినిఁ జదువులోఁ బ్రవేశపెట్టుట

విద్యార్జనము సం వి అ న. విద్యను సంపాదించుట, చదువుకొనుట, జ్ఞానసంపాదనము

విద్యార్థి సం వి న్ పుం 1 చదువు కోరువాఁడు 2. చదువుకొనుచున్నవాఁడు

విద్యార్థుఁడు సం వి అ పుం విద్యయే ప్రయోజనముగాఁ గలవాఁడు

విద్యాలయము సం వి అ పుం. బడి, పాఠశాల, విద్యాస్థానము

విద్యాలాభము సం వి. అ పుం 1. విద్యాప్రాప్తి, చదువువచ్చుట 2. విద్యవలన సంపాదించిన ధనము.

విద్యావంతుఁడు సం. విశే (త్. తీ త్) విద్యగలవాఁడు, చదువరి

విద్యావృద్ధుఁడు సం విశే. (అ అ అ) విద్యచే నధికుఁడు, విద్యచేఁ బెద్దవాఁడు

విద్యావ్యసనము సం వి అ. న విద్యయందలి యాసక్తి.

విద్యా(వ్రత)స్నాతకుఁడు సం వి. అ పుం బ్రహ్మచారివ్రతము పూర్తిచేసిన బ్రాహ్మణుఁడు, విద్య పూర్తిచేసి గురుకులమునుండి మఱలిన బ్రాహ్మణుఁడు

విద్యుజ్జిహ్వుఁడు సం. వి అ పుం. మెఱపువంటి నాలుక గలవాఁడు, ఒకానొక రాక్షసుఁడు.

విద్యుజ్జ్వాల సం. వి ఆ. స్త్రీ మెఱపుయొక్క ప్రకాశము, మెఱపుమంట.

విద్యుత్తు సం వి త్. స్త్రీ 1. మెఱపు. 2 సంధ్యాకాలము (వాచ)

విశే. త్. ప్రకాశములేనిది, కాంతిలేనిది. (మే.ని.)

విద్యుత్ప్రియము సం వి అ న కాంస్యము, కంచు

విద్యుత్వంతము సం విశే (త్ వతీ త్) మెఱపు గలది

వి త్. పుం మేఘము

విద్యుదున్మేషము సం వి అ పుం మెఱపు ప్రకాశము, మెఱపు వెలుగు

ఇశ్లే విద్యుద్ద్యోతము.

విద్యుద్దామము సం వి న్ న బారుపడి నుండెడి మెఱపు, తీఁగ మెఱపు

విద్యుల్లత సం వి ఆ స్త్రీ మెఱపుతీఁగ, తీఁగ మెఱపు.

విద్యుల్లేఖ = విద్యుల్లత సం. వి ఆ స్త్రీ

విద్యోతనము సం విశే (అ ఈ అ) 1. ప్రకాశింపఁ జేయునది. 2 స్పష్టపఱచునది

విద్యోతించు సం అ. క్రి ప్రకాశించు

వ .. ఇంతటికి నధిష్ఠానంబై తదీయరాజధానియగు ప్రాగ్జ్యోతిషంబు విద్యోతించె . హరి ఉ 4 45

వ . . కంఠకోణంబునఁ గంఠికోపరి నీలంబునుం బోని కాలకూటంబున సంఘటిల్లు బ్రాంతినంతమనంబునకు ఖద్యోతంబులునుం బోలె విద్యోతించు కంకణాశీవిషానల విస్ఫులింగంబులవలన దుర్నిరీక్ష్యుం డగుచు ... భీమ 5 8.

విద్యోపార్జనము సం వి. అ న చదువును గడించుట, విద్య నేర్చుకొనుట.

విద్రధి సం వి ఇ పుం. కడుపులోఁ బుట్టుపుండు.

విద్రధినాశనము సం వి అ పుం. మునగ చెట్టు, శోభాంజనము (వృ వి) (త్రి ని)

విద్రము సం వి అ పుం. రంధ్రము, కన్నము (వా చ)

విద్ర(ద్రా)వము సం వి అ పుం 1 పాఱిపోవుట, 2 బెగులు, భయము 3. పొరలిపోవుట, గట్టులు మునుఁగఁ బ్రవహించుట 4. కరఁగుట, ద్రవము గుట 5. నింద, తూఱు 6 జ్ఞానము, తెలివి

విద్రాణుఁడు సం విశే (అ అ అ) మేలుకువ చెందినవాఁడు, నిద్రనుండి లేచినవాఁడు

విద్రావణము సం. వి అ న. 1. తరిమివేయుట, పరుగెత్తించుట, ఓడించుట 2. కరఁగించుట, ద్రవముగా చేయుట.

**విద్రావితము** సం. విశే. (అ. ఆ. అ.) 1 తరుమఁబడినది, పరుగెత్తింపఁబడినది. 2. చెదరినది, చీల్పఁబడినది. 3. కరగింపఁబడినది, ద్రవముగాఁ జేయఁబడినది.

**విద్రుచు = విదురుచు** స. క్రి. 1. దులిపివదలించు, వదలుచు.

వ .. తానునగుడిచి దర్పవూరులు విద్రిచి యంద ఱకు వేలువేలకయనమ్ము లిమ్ముగా రచియించి .... భార. ఆది 7. 223.

2 విదిలించు, దులుపు.

వ. ... హిడింబుండను నొక్క రక్కసుండు వారి దవ్వులంజూచి మైవెంచి రూక్షకేశంబులు విద్రిచి ... భార. ఆది. 6 185

ద్వి అటు పట్టువడి యతఁడాకాశవీథి, బటుశక్తి నెగసి యుద్భటవృత్తి మెఱసి, విద్రిచినఁ బడి శేల వీరులు ధాత్రియద్రువంగ మగ్గునూచై త్రెళ్లిరంత ... రం. రా. యు. 348. పా 7. పం.

శా .. ఈ కంథచే, వేలతల్ కవకంబురాలు విద్రుపన్ విశ్వంభరాధీశ్వరా . విక్ర 2 7

3. చిమ్ము, విసరు.

మ. అది చూత్కారముఁ జేసికేల్ విద్రుచు కొంచంభోజమండంబు ను, న్మదభంగిన్ బలు ప్రమోఁతతో వెదలి పల్మొలున్ మహో ఘీంకృతుల్, సెదరన్ వెండియుఁ దొండమున్ విద్రుచుచున్ శీఘ్రంబపెన్ ప్రమాఁకులుం, బొదలుం గూల్చుచుఁ బాలితైన విలయంబుల్ సొచ్చె మగ్రాకృతిన్ కేయూర. 2. 102.

4. రాల్చు.

శ. ఎద్రిచిన కాలపాశమున నీగతిపీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మన్నికత బాణపరంపరపై మిణుంగురుల్, విద్రుపఁగఁ దర్పలంబుల చవింబరితార్థులుగా శరీరపుంబిద్రుపలు చేరుఁ దత్సతుల చేతులఁగాక కులంబు వాతులన్. ఉ. హరి. 4. 109

5. విఱుచు.

సీ. గోవజవ్యాదిఁ గస్తూరిఁ గొఱతపఱచు, వెన్న పడిదెంబు జొబ్బిల విద్రిచివిద్రిచి ,,. నైష. 6 120.

**విద్రుతము** సం విశే. (అ ఆ. అ) 1 (భయము వలన) పాఱిపోయినది. 2 శుద్ధమైనది, కలఁత నొందినది. 3. కరఁగినది, ద్రవమైనది.

**విద్రుమము** సం వి. అ పుం 1. పగడపుఁ జెట్టు. 2 పగడము, ప్రవాళము 3 నవాంకురము, క్రొత్త మొలక, చివురు.

**విద్రుమల(తిక)త** సం వి. అ స్త్రీ. 1. పగడపుఁ దీఁగ 2. (నలిక యనెడి) గంధ ద్రవ్య విశేషము

**విద్వత్కల్పుఁడు** సం విశే (అ అ అ.) కొంచెము తక్కువగాఁ బండితుఁడు, ఇంచుమించుగ విద్వాంసుఁడు.

(ఇట్లే విద్వద్దేశీయుఁడు, విద్వద్దేశ్యుఁడు.)

**విద్వాంసుఁడు** సం విశే (స్. దవీ. స్.) 1. తెలిసిన వాఁడు, బుద్ధిమంతుఁడు 2 చేదువరి.

వి స్. పుం. పండితుఁడు, చేదువరి.

**విద్వి(ట్టు)షుఁడు** సం వి ష్. పుం. శత్రువు, పగవాఁడు.

**విద్విష్టము** సం విశే. (అ. ఆ. అ ) ద్వేషింపఁబడినది, పగగొనఁ బడినది

**విద్వేషణము** సం వి అ న 1 విరోధ కారణము 2. విరోధము, పగ

**విద్వేషణి** సం. వి ఈ. స్త్రీ. కోప స్వభావము గల స్త్రీ రోషముగల స్త్రీ.

**విద్వేషణుఁడు** సం. వి అ పుం. శత్రువు, పగవాఁడు

**విద్వేషము** సం వి. అ పుం 1 విరోధము, పగ, శత్రుత్వము 2 (ఇతరులను) తక్కువగాఁ జూచు గర్వము, తిరస్కారము, తృణీకారము

**విద్వేషి** సం. విశే (న్ ఈ న్.) పగ గలవాఁడు, విరోధము గలవాఁడు.

వి. న్. పుం శత్రువు, పగవాఁడు

**విద్వేషించు** సం అ క్రి. విరోధించు, పగఁ గొను

శా. వా, సీరస్ఫార బలంబు లొండొరుల ధిక్షేపంబులే పారఁగా, వీరావేశ భరంబునం దెనఁగె విద్వేషించి .. జై. భా. 5. 176.

**విధ** సం వి. ఆ. స్త్రీ. 1 పద్ధతి, ప్రకారము 2 మచ్చు, రకము, రీతి 3 సమృద్ధి, ఐశ్వర్యము 4 గుఱ్ఱము, ఏనుఁగు మొదలగు వానికిఁ బెట్టెడి యాహారము, దాణా. 5. చొచ్చు, ప్రవేశము 6 జీతము, కూలి. 7. పని, కృత్యము.

**విధము** సం. వి. అ పుం. 1 రకము, జాతి, మచ్చు, (బహువిధము) 2 రీతి, ప్రకారము, పద్ధతి 3 త్రివిధము, అష్ట విధము మొ. 4 గజకబళము, ఏనుఁగులకు బెట్టెడి దాణా 5. కలిమి, సంపద. (విల్యమ్సు) 6 చొచ్చుట, ప్రవేశము (విల్యమ్సు.)

**విధవ** సం. వి. ఆ స్త్రీ. పెనిమిటిలేని స్త్రీ విగతభర్తృక, ముండమోపి.
విధవకుఁదలసుళ్లు వెదుకుట=నిష్ఫలమనుట.
సీ జవ్వాది యలఁదిన జంకెలత్తఁగనేల విధవకుఁ దలసుళ్లు వెదకనేల. రామ శ. 55

**విధవనము** సం. వి. అ న 1 శోకము, కలఁత, కదలిక 2 వణఁకు, కంపము

**విధవాగామి** సం. వి న్ పుం విధవను (రతియందు) పొందినవాఁడు

**విధవావేదనము** సం. వి అ న. విధవను (వితంతువును) పెండ్లాడుట

**విధాత** సం. విణ (ఋ. తీ ఋ.) చేయువాఁడు, కల్పించువాఁడు
ఋ పుం 1 సృష్టికర్త, బ్రహ్మ 2 దాత, ఇచ్చువాఁడు 3. విధి, దైవము 4 విశ్వకర్మ. 5. మన్మథుఁడు. 6 మద్యము 7 అర్యమ్ణము. (వాచ)

**విధాతృఁడు** సం వి ఋ. పుం బ్రహ్మదేవుఁడు
సీ .. ఇంద్రనందనునకు, దేవిఁగాఁ ద్రిజగతిఁ దీనినీఁ గాంచితివని యున్నచో విధాతృనకు నిట్లు, పాడియె ... భార. ఆది. 7 23.
ఉ . . మారుతికిన్ జయంబొసఁగె మాల విధాతృఁడు వాని గెల్పు కోలేరికి సమ్మతంబగునె యుట్టిది దీనము తెంపుగల్గునే ... భార సౌప్తి. 1. 218.

**విధాత్రాయుస్సు** సం వి న్ పుం 1. బ్రహ్మదేవుని యాయువు. 2. సూర్యుని వెలుఁగు,ఎండ. 3.ప్రొద్దు తిరుగుడుపువ్వు చెట్టు.

**విధాత్రి** సం వి ఈ స్త్రీ పిప్పలి. (వృ. వి.)

**విధానకము** సం. వి అ న 1 శాసనము, నిబంధనము. 2 బాధ, నొప్పి.

**విధానజ్ఞుఁడు** సం విణ (అ ఆ అ) విధినెఱింగినవాఁడు, చేయవలసిన పద్ధతి తెలిసినవాఁడు.
పుం విద్వాంసుఁడు పండితుండు. ఇట్లే విధానగుఁడు.

**విధానము** సం వి అ న 1 ఏర్పాటు, ఏర్పఱుచుట 2 చేయుట, ఆచరించుట 3 సృష్టి, సృజనము 4 ఉపయోగము, ప్రయోజనము. 5 ఆజ్ఞ. శాసనము 6 శాస్త్రవిధి. ధర్మవిధి. 7 శాస్త్రవిహిత కర్మానుష్ఠానము, శాస్త్రమున చెప్పఁబడినట్టు కర్మముల నాచరించుట 8 పద్ధతి. ప్రకారము. 9 సాధనము, ఉపాయము. 10. సంస్కారము (ఉపనయనాది.) 11 లాభము, ప్రాప్తి 12. గజకబళము, ఏనుఁగులకుఁ బెట్టు దాణా. 13 ధనము. 14 బాధ, నొప్పి. 15 (వ్యాక) ప్రత్యయాదులను ప్రకృతికిఁ బూర్వపరములుగాఁ జేర్చుట 16 (నాట్య) భావసంధి. 17. విరోధకార్యము.

**విధాయకము** సం. విణ (అ యి. కా. ఆ)1 ఏర్పాటు చేయునది. 2. చేయునది, ఆచరించునది 3 సృజించునది. 4. విధించునది, ఆజ్ఞాపించునది 5 ఒప్పించునది, అధీనము చేయునది.
వి అ న ఆజ్ఞ.

**విధాయి** సం విణ. (న్. నీ న్) విధించువాఁడు.

**విధి** సం వి. ఇ పుం 1 చేయుట, ఆచరించుట 2 పని. 3 పద్ధతి, రీతి, ప్రకారము 4 అప్రాప్తప్రాపకమైన వేదవాక్యము, ఒక పనిచేయవలయునని నిర్దేశించు వాక్యము, క్రియాప్రవృత్తి నిమిత్తమయిన వేదవాక్యము (ఇది అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి అని త్రివిధము.) 5 సంస్కారము వేదోక్తకర్మము. 6 ప్రవర్తన, నడవడి. 7. స్థితి, అవస్థ 8. సృష్టి, సృజనము 9 బ్రహ్మదేవుఁడు 10. అదృష్టము, దైవము 11 గజకబళము, ఏనుఁగులకుఁ బెట్టు దాణా 12. సమయము. 13 వైద్యుఁడు. 14 విష్ణుదేవుఁడు. 15 నియోగము, ఆజ్ఞ. 16 ఆజ్ఞావాక్యము (వాచ)

**విధి(యి)ంచు** సం న క్రి. 1 చేయు.
ఉ ఇమ్ముగ నాత్మరక్ష విధియించు విధమ్మున మంత్రరక్ష యత్నమ్మునఁ జేయఁగావలయు ... భార. ఆది. 6. 110.

క. శివతీర్థములో నొండెను, శివాజ్ఞలో నొండెఁ దాను జీవత్యాగం, బు విధించిన మానవుఁడును, భవప్రసాదమున ముక్తిఁ బడయు మహేశా. శివ. శా. 281.

2. ఏర్పఱుచు, నియమించు, ఏర్పాటుచేయు

సీ. దివిజ మర్త్యాది జంతువు లమ్మహాత్ము విధించిన తెరువులఁ దిరిగి బ్రదుకు, చుండ ... భార. శాం. 3. 442.

గీ. స్మృతుల యందు బలాత్కార కృతములెల్ల, న కృతములుగా విధించి వాఁడట్టె మనువు ... నైష. 7. 72

**విధిఘ్నుఁడు** సం. విణ. (అ. అ. అ) శాస్త్రవిహితము లయిన కర్మములను ఆచరింపనివాఁడు, ఉల్లంఘించువాఁడు.

**విధిజ్ఞుఁడు** సం. విణ (అ. అ. అ.) శాస్త్రవిహితము లయిన కర్మముల నెఱింగినవాఁడు

వి. అ. పుం. శాస్త్ర విహితము లయిన కర్మముల నెఱింగిన బ్రాహ్మణుఁడు.

**విధిత్స** సం. వి. అ. స్త్రీ. 1. చేయవలయుననెడి కోరిక, ఆచరింప నిచ్ఛ. 2. ఉద్దేశము, కోరిక, ఇచ్ఛ

**విధిత్సితము** సం. విణ (అ. అ. అ) 1. చేయనిచ్ఛగింపఁ బడినది, చేయ నుద్దేశింపఁ బడినది.

వి. అ. న. ఉద్దేశము.

**విధిదర్శకుఁడు** సం. వి. అ. పుం. ఉపద్రష్టయనెడి ఋత్విక్కు, యజ్ఞమున నంతయు సరిగా జరిగినదియు లేనిదియుఁ జూచుచుఁ దప్పిన దానిని దిద్దుచుండెడి ఋత్విజుఁడు.

ఇట్లే విధి దేశకుఁడు.

**విధిదృష్టము** సం. విణ. (అ అ అ) శాస్త్రమునఁ జూడఁబడినది శాస్త్రముచే విధింపఁబడినది

**విధిద్వైధము** సం. వి. అ. న. విధి వాక్యములు, శాస్త్రములు వేర్వే ఱర్థములను దెల్పుట, శాస్త్రము యొక్క భిన్నత్వము

**విధియోగము** సం. వి. అ. పుం దైవ సంఘటనము, దైవయోగము, దైవవశము.

**విధివంతము** సం. విణ. అవ్య శాస్త్రార్థము, శాస్త్రవత్తు ("విధివత్తు" అనుట యుక్తము )

వ. ... వసిష్ఠుండు విధి వంతమ్ముగా సంవరణున కుం దపతి వివాహమ్ము సేయించె ... భార. ఆది 7 87.

**విధివిహితము** సం. విణ (అ అ అ) శాస్త్రమున విధింపఁ బడినది

**విధిహీనము** సం. విణ (అ అ అ) శాస్త్రీయము కానిది, అశాస్త్రీయము

**విధుంతుదుఁడు** సం. వి. అ. పుం. చంద్రుని వ్యథ పెట్టువాఁడు, రాహువు.

**విధుఁడు** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు 2. విష్ణుదేవుఁడు. 3 బ్రహ్మదేవుఁడు 4 శివుఁడు

**విధుక్షయము** సం. వి. అ. పుం. చంద్రుని క్షీణత, కృష్ణపక్షము

**విధుతము** = విధూతము సం. విణ (అ అ అ)

**విధుతి** సం. వి. ఇ. స్త్రీ 1. కదలుట, కంపము. 2. ఇటు నటువిసరుట

**విధుననము** సం. వి. అ. న 1 కదలుట, కంపించుట, కలతనొందుట. క్షుబ్ధమగుట 2 వణఁకుట.

**విధుప(పి)ంజరము** సం. వి. అ. పుం వెనుకకువంగిన కొనగల పట్టాకత్తి

**విధుప్రియ** సం. వి. అ. స్త్రీ తార, నక్షత్రము.

**విధుర** సం. వి. అ. స్త్రీ రసాల. పంచదారయుఁ బరిమళ ద్రవ్యములు గలసిన పెరుగు

**విధురదర్శనము** సం. వి. అ. న. 1. అపాయమగపడుట, భయము కటస్థమగుట. 2 శోకమనుభవించుట, మనోవిచారము నొందుట

**విధురము** సం. వి. అ. న. 1. భయము, విచారము, అపాయము, హాని. 2. విరహము, ఎడఁబాటు

**విధురుఁడు** సం. విణ. (అ అ. అ.) 1 దుఃఖపెట్టఁబడినవాఁడు, బాధింపఁబడినవాఁడు, దుఃఖముగలవాఁడు, విచారమునకు లోనైనవాఁడు. 2. విరహతాపముగలవాఁడు. 3. శూన్యుఁడు, లేనివాఁడు. 4. ద్వేషముగలవాఁడు. పగగలవాఁడు.

వి. అ. పుం 1. భార్యపోయినవాఁడు, మృతపత్నీకుఁడు.

**విధువనము** సం. వి. అ. న కదలుట, వణఁకుట. కంపము

**విధువు** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు. 2. కర్పూరము. 3 పిశాచము, రాక్షసుఁడు. 4 ప్రాయశ్చిత్తార్థమైన యాహుతి. 5 విష్ణుదేవుఁడు 6. బ్రహ్మదేవుఁడు. 7. శివుఁడు. 8. వాయువు 9 యుద్ధము

**విధూతకల్మషుఁడు** సం. విశే. (అ ఆ అ) పోఁగొట్టఁబడిన పాపముగలవాఁడు, పాపము లేనివాఁడు.

**విధూతకేశుఁడు** సం. విశే. (అ ఆ ఈ అ) విరియంబోసికొనిన జుట్టుగలవాఁడు

**విధూతనిద్రుఁడు** సం. విశే. (అ ఆ అ) పోయిన నిద్రగలవాఁడు, మెలకువ చెందినవాఁడు

**విధూతము** సం. విశే. (అ ఆ అ.) 1 కదలుపఁబడినది 2 విరియఁజేయఁబడినది, అల్లలనాడఁ గదలినది 3 వణంకినది, కంపమునొందినది. 4 తీసివేయఁబడినది, పోఁగొట్టఁబడినది 5. చంచలమైనది. 6. త్యజింపఁబడినది, విడువఁబడినది.

వి. అ. న. ప్రతికూలత, విరోధము

**విధూతి** = విధుతి సం

**విధూననము** సం. వి విధుననము.

**విధూనితము** సం. విశే (అ ఆ అ.) 1. బెదరింపఁబడినది, భయపెట్టఁబడినది, కలత నొందింపఁబడినది 2. దుఃఖపెట్టఁబడినది

**విధృతము** సం. విశే (అ ఆ అ) 1 బలాత్కారముగాఁ పట్టుకొనఁబడినది; పట్టుకొనఁబడినది 2 విడదీయఁబడినది, దూరముగా నుంచఁబడినది. 3 పొందఁబడినది 4 అడ్డగింపఁబడినది, ఆటంకపరుపఁబడినది 5 రక్షింపఁబడినది, పోషింపఁబడినది

వి. అ. న 1 ఆజ్ఞనుల్లంఘించుట, ఆజ్ఞోల్లంఘనము 2 అసంతృప్తి, సంతుష్టిలేమి.

**విధృతి** సం. వి ఇ స్త్రీ 1. ఏర్పాటు. 2. శాసనము

**విధేయజ్ఞుఁడు** సం. విశే (అ ఆ అ) విహితకృత్యము (తాను చేయవలసినపని) నెఱిఁగినవాఁడు

**విధేయపదము** సం వి అ న 1. చేయందగిన కార్యము. 2. (వ్యాక) క్రియాపదము, కర్తృకర్మముల గుణక్రియాదులం దెలుపుపదము.

వ్యతి ఉద్దేశ్యము.

**విధేయము** సం. విశే. (అ. ఆ అ) 1 చేయఁదగినది, ఒరుపఁదగినది. 2. విధింపఁదగినది, శాసింపఁదగినది, 3. (వ్యాక) కర్తృకర్మముల గుణక్రియాదులం దెలుపుట కుపయోగింపఁబడునది

వి అ. న 1. కృత్యము, విహితకార్యము. 2 కర్తృకర్మముల గుణ క్రియాదులందెల్పు పదము.

**విధేయావిమర్శము** సం. వి. అ పుం అవిమృష్ట విధేయాంశ మనెడి కావ్యదోషము. (విధేయాంశము ప్రధానముగా నిర్దేశింపఁబడకుండుట)

**విధేయుఁడు** సం. విశే. (అ ఆ అ) 1. ఒకరి యధీనమునసున్నవాఁడు, అన్యాధీనుఁడు. 2. పరులకు లోఁబడినవాఁడు, లోఁగినవాఁడు. 3. వినయముగలవాఁడు, చెప్పినట్లువినువాఁడు.

వి. అ పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**విద్ధకర్ణుఁడు** సం. విశే (అ. ఆ అ) కుట్టఁబడిన చెవులుగలవాఁడు.

**విద్ధము** సం విశే. (అ ఆ. అ) 1. గ్రుచ్చఁబడినది, ప్రవేశపెట్టఁబడినది 2. గాయము చేయఁబడినది, ఆయుధాదికముతోఁ బొడువఁబడినది. (చెవి) కుట్టఁబడినది. 3. కొట్టఁబడినది; కొరడా మున్నగువానితోఁ గొట్టఁబడినది. 4. త్రోయంబడినది. 5 నిర్దేశింపఁబడినది 6 ఎదిరింపఁబడినది 7 సమానమైనది, సాటియైనది.

వి అ న గాయము

**విధ్వంసము** సం వి అ. పుం. 1. నాశము 2 పగ, విరోధము; అప్రీతి 3 అవమానము, ఇష్టములేకుండుట, అసహ్యము.

**విధ్వంసి** సం విశే (న్ ని న్.) 1. మిక్కిలి ధ్వస్తమైనది, తునియలైనది 2 పగగలవాఁడు; విరోధి, పగగలది

**విధ్వస్తము** సం విశే (అ ఆ. అ) 1. పూర్తిగా నశించినది 2. ఎగురఁగొట్టఁబడినది. చెదరఁగొట్టఁబడినది 3 మఱుగుపఱుపఁబడినది, కప్పివేయఁబడినది 4 కాంతిహీనముగాఁ జేయఁబడినది, (రాహుకేతువులచే) గ్రసింపఁబడిన, (సూర్యబింబము మొ)

**వినఁబాటు** = విన్నఁబాటు (√విన్న) వి విన్నఁబడుట, వైవర్ణము

చ. అమృతముఁగోలుపోయి విబుధారులు గంధగజాసురాంధక, ప్రముఖులు మోములందు వినఁబాటు దలిర్పఁగఁగూడియున్నచో, నమరఁగ్ర వప్పుడేన్ను. భీము 4 99,

**వినత** సం. వి. ఆ. స్త్రీ. 1 కశ్యపునిభార్య, అరుణ గరుడులకుఁదల్లి 2 ఒక విధమైన గంప బుట్ట.

**వినతము** సం. విణ. (అ. ఆ. అ.) 1 వంగినది, వ్రాలినది, ముందుకు వ్రాలినది. 2 నమస్కరించునది; అడఁకువగలది 3. మునిఁగినది, క్రుంగినది 4. వంకరయైనది. 5 (వ్యాక) సకారస్థానమున వచ్చినషకారము, నకారస్థానమున వచ్చిన ణకారము.

**వినతాననుఁడు** సం. వి. (అ. ఆ. అ.) వంపఁబడిన ముఖము గలవాఁడు చిన్నవోయిన ముఖము గలవాఁడు.

**వినతానందనుఁడు** సం. వి. అ. పుం. (వినతకొడుకు) 1. అరుణుఁడు 2. గరుత్మంతుఁడు ఇట్లే వినతాసుతుఁడు. మొ

**వినతాసూను(వు)ఁడు** సం. వి. ఉ. పుం. = వినతానందనుఁడు.

**వినతి** సం. వి. ఇ. స్త్రీ. 1 వంగుట, వ్రాలుట. 2. నమ్రత, విధేయత, అడఁకువ. 3. ప్రార్థన, వేడికోలు.

**వినదము** సం. వి. అ. పుం. 1 ధ్వని, చప్పుడు, 2 ఒకానొక చెట్టు వృక్షవిశేషము (వాచ)

**విననివాఁడు** విణ. (√ విను) చెవిటివాఁడు, బధిరుఁడు. (చి. ని. శ. ర.)

**వినపము** = విన్నపము వి. మనవి

క. వేయేలయియ్య వినప, యాయ్యాయిఁక మా వినపమొకటి యటు కనుఁగొనఁగా, నేయొడఁ జూచిన నడవిలు, లాయంబులు వెలయు జమిని లాయములనఁగన్. ప్రబంధ. 165

దీనికి ప్రయోగాంతరము కనుఁబడలేదు

**వినమి** వి. (√ విను) వినకుండుట.

ఆ. పొడుతునెట్లు పాండు పుత్రులతోఁ గయ్య, మేను నీవు దీనికియ్యకొనుము, పలుకువినమి గాఁగఁదలఁపకు ముచితంబు, తెలుఁగు ధీర జనుల కెఱుఁగ రాదె భార. శల్య 1 69

**వినమితము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వంగినది.

**వినమ్రము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వంగినది, మిగుల వ్రాలినది, 2. క్రుంగినది, మునిఁగినది, అణఁగినది 3 విధేయమైనది, అణఁకువ గలది.

**వినయగ్రాహి** సం. విణ. (న్. జీ. న్.) వినయము గలవాఁడు, విధేయుఁడు, చెప్పినట్లు వినువాఁడు.

**వినయనము** సం. వి. అ. న. 1. నివారించుట, తొలగించుట. 2 చదువునేర్పుట, మంచి పద్ధతులు నేర్పుట.

**వినయభా(వు)జుఁడు** సం. విణ. (జ్) 1 నమ్రత గలవాఁడు. 2 మంచి నడవడిగలవాఁడు.

**వినయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షిప్తము, చిమ్మఁబడినది. 2 రహస్యమైనది. 3 చెడు నడవడి గలది

వి. అ. పుం. 1 క్రమశిక్ష, మంచి పద్ధతులు నేర్పుట, 2 యుక్తత, ఔచిత్యము 3. మంచి నడవడి, మంచిపద్ధతి 4. నమ్రత, అణఁకువ. 5. మర్యాద, గౌరవము, వందనము (ఆ. ని.) 6. నడవడి, ప్రవర్తన 7. నివారించుట, తొలఁగించుట.

**వినయస్థుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వినయము గలవాఁడు, నమ్రుఁడు

**వినయుఁడు** సం. వి. అ. పుం. 1 జితేంద్రియుఁడు. ఇంద్రియములు వశపరచుకొనిన జనుఁడు. 2 వ్యాపారి, వణిజుఁడు, బేహారి.

**వినవచ్చు** అ. క్రి. (వినన్ + వచ్చు) వినఁబడు, శ్రవణగోచరమగు.

వ . . మిక్కుటంబగున కోలాహలంబున నేపాటియుఁ జాట వినరాక ... ఆము. 4. 85.

**వినశనము** సం. వి. అ. న. మిక్కిలి నాశము, అగోచరమగుట పుం. సరస్వతినది పైకిఁగనఁబడక యిసుకలో నంతరించిన చోటు, కురుక్షేత్రము నందలి యొక తీర్థము (వాచ.)

**వినష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూర్తిగా నశించినది 2. కనఁబడనిది, అదృశ్యమైనది. 3. పాడైనది, చెడిపోయినది. 4 పతితము, జాతిభ్రష్టమైనది. (వాచ)

**వినష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1 మిక్కిలి నాశము. 2 అగోచరమగుట, కనఁబడకపోవుట

**వినసుఁడు** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) ముక్కిడి, ముక్కు పోయినవాఁడు.

విసపు[మాను(ఁకు) వి. (విసము+[మాను) విష వృక్షము.

ఆ... అందు విసపు[మాఁకులై యున్న చెడుగురే, [దిమ్మరుల వడంచి తమ్మికంటి...నీలా 1 80.

విసబొద్ది వి. (విసము+బొద్ది) పార, ఒకానొకచెట్టు.

సీ... విసబొద్ది యవఁగను వెలయుఁ శార అం భా. 2. 54

సీ. సహదేవి జుట్టుపు చలిపిండి చిటిముటి పెన్నేరు విసబొద్ది పిండిదొండ. హంస. 4 10

విసమాలుచే(లు) స త్రి. రూపుమాపు

ద్వి వసదులన్నియు [వచ్చి వఁదఁలాడి, వెనటిన [బతిమల విసమాలు నిడియ. బస పు 6 574.

విసము వి (సం విషం.) 1. గరళము

చం ... పయోజగర్భుఁడు సుధారసధారలు కెంటిలో విసంబులు చిలికించి చేసెనో కా పొల్పెసలారఁగ దీని నేత్రముల్ నైష 8 116

సీ...,ముఖరాగమును గళంబున విసంబు. వసు. 3 128.

(వ బ ల కభేదమున బిసమని యర్థాంతరము.)

సీ. ఎడవెడ విసము[గక్కెడు పాములను మెడఁ గూర్పఁజెల్లునె మీకుఁగొమ్మలార నీలా 3. 34.

2 నీరు

సీ మించు చూపుచునె నమ్మించి నిల్కడయేది విస మొసంగెడు మబ్బుఁ గొనరనేల. యయా. 1. 28.

(ఇది రెండర్థములకు నుదాహరణము)

జ - విసపాలు, విసపాలవిత్తు, విసపుమేఁతరి, విసపు [మాను, విసబొద్ది.

విసరణము సం వి అ న. [వసరణము.

విసరము సం. వి అ పుం. 1 వెడలుట. 2 [ప్రసరిం చుట, వ్యాపించుట 3. సమూహము, మంద, గుంపు. 4 రాశి, [పోవు.

విసరియాడు = విసరు స. త్రి. (విసరి+ఆడు) ఆడించు

ద్వి విసువీథిఁ దోఁకలు విసరియాడుచును, గురు వులు వాలుచు గునిసియాడుచును. రం. రా. యు. (శ ం.)

విసరు స త్రి. (సం విస్ప) 1 ఆడించు

క తల విసరి వెల దగఁగ లో, యలకించఁదయ్యె. భార అను 2 270

2 త్రిప్పు

గీ...పట్టి కోదండదండంబు పరిఘగాఁగ, విసరు చును వచ్చె వేటొండు వేల్పుతోడు పారి 4 70

క గద విసరివైచె నరకుఁడు ఉ పారి 1 166.

వ. పుడమిపతి పెడవిసరు విసరి ... మనుచ. 4 115

3 రువ్వు,

గీ. తప్పలేకుండ నేల నెత్తమ్మి మొగత, విసరి పతఃప్రదేశంబు [వేటుగొఁటి. హర 1. 27.

గీ విరహితతిమీఁది కోపానమరుఁడు దివియ, వేగమై పైఁడియొఱతోన విసరఁ గుట్లు, దునిసివైటికి వనిభార దోఁచెననఁగ ... ఆము 5.24.

వ అప్పువ్వుదండఁ [గమ్ముననఁ [గమ్మటించివిసరి... హం. 6. 16

4 ఘటించు

సీ తల్లియిచ్చిన చల్ది తగ [బవ్వ వచ్చిన వెనుకఁ జూడక వేగ విసరగలవు సిం నార 88.

5 వీజనముచేయు, విసనకఱ్ఱ నాడించి గాలి [ప్రస రించునట్లు చేయు.

సీ ఇల్లిల్లుదిరుగ నొక్కింతబ్బు శిఖ యశ్వైనే నింటిలోఁ బూరి యిడి విసరక,రాఁజదు... ఆము. 4 127.

గీ. అనుచు వెతనొందు జనకుని యానవంబుఁ, జూచి యదలూన భావించె మందరాంగి, జాలిమై రాఁజబెట్టిన పావకంబు, వీవనం బునఁ బైవయి విసరినట్లు కృ. శకుం. 3. 108

గీ...బహుళ నిజదేహ లేపన పరిమళములు, పోదు ముట్టంగ నొక్కెత సురటి విసరె వరాహ. 9 189

6. చూర్ణముచేయు.

ఉదా - కందులువిసరు, పిండివిసరు, మొ

అ. త్రి 1. వీచు.

క ... వఱదు లఱచె నుల్కులువడె, నెఱిచెడి సుర గాలి విసరె నిలువక పెలుచన్ ఉ హరి 2. 24

క. స, మ్యగ్గంధవహము తనువుల, మొగ్గ చెమటలాఱ విసర ముదితాత్మకులై వరాహ 7. 56.

2. కురియు.

సీ విసరునో కృపగార సవృష్టి కొప్పువఁ దొలఁకునో యమృతంబు పలుకులందు నిం౦ 4 81

వి 1. వీచుట.

వ. పెల్లడరు సిట్టూర్పుగాడుపు విసరుచన్గసరెత్తి ... మనుచ 3 8.

2 ఆడించుట

సీ. తోరంపుటూర్పులఁ దొడరి పాతాళము దాఁకంగ సాగరౌఘములు గలఁగ,వికటంపు టెఱకల విసరున సుపొంగు తుప్పరదొందంబు దూపడంగ హరి. ఉ 5 131.

3. దెబ్బ, పోటు.

క అసురుసురని సొలయున్ రా,జసురేంద్రుఁడు మలయపవను చలికసరునకున్, బిపరుహాళరుశరవిసరపు, ముసురునకుం దడిసి కిసలముల విసరువకున్ కవిరా 5 265

4. రువ్వుట.

వ పుడమిపతి పెడవిసరు విసరి ... మనుచ. 4. 115

5 మల్లవిద్యావిశేషము

వ. ... ఝూటు మొదలగు పదునాలుగువిసరులు ప్రబంధ 78

ఱ. విసరియాడు, విసరుఱాయి.

విసరుఱాయి వి (విసరు+ఱాయి) తిరుగలి. (గ్రా, వా)

విసర్గము సం వి అ పుం 1. త్రోసిపుచ్చుట. నిరాసము 2 ఉద్యోగాదులనుండి తొలఁగించుట 3 పరిత్యాగము, విడిచిపెట్టుట. 4 ఈవి, దానము. 5 కాఱుట, స్రవించుట 6. వృష్టి, సృజనము 7. (మల) విసర్జనము 8. ఎడఁబాసిపోవుట, 9 మోక్షము 10. దీప్తి, కాంతి 11 విసర్జనీయము, రెండుసున్నలు గుర్తుగాఁగలవర్ణము. 12 సూర్యుని దక్షిణదిగ్గమనము, దక్షిణాయనము. 13. మేఢ్రము, మగగుఱి 14. ప్రళయము

విసర్జనము సం వి అ న 1 స్రవింపఁజేయుట, కార్చుట 2 దానము, ఈవి 3 వట్టిదిగాఁజేయుట 4 పరిత్యజించుట, వదలివేయుట. 5 ఉద్యోగమునుండి తొలఁగించుట 6 దేవతోద్వాసనము చేయుట, పూజాంతమున యథాస్థానమునకుఁ బంపుట. వృషోత్సర్జనము, కొన్నిసమయములయందు వృషభమును యథేచ్ఛముగా విడుచుట

విసర్జనీయము సం విణ (అ ఆ అ) 1 విడువదగినది. 2 ఈయఁదగినది 3 పరిత్యజింపఁదగినది. స్రవింపఁజేయఁదగినది.

వి అ పుం విసర్గము, రెండు సున్నలు గుర్తుగాఁగల వర్ణము

విసర్జించు సం స క్రి విడుచు.

వ . పద్యపూరణంబులకు సాధకాంశంబులైన సంస్కృతాంధ్రభాషలంగల జల్లులు విసర్జించి. . (వరాహ 1 9.)

విసర్జితము సం విణ (అ ఆ అ) 1 ఇయ్యఁబడినది, దత్తమైనది 2 విడిచిపెట్టబడినది, పరిత్యక్తము 3 పంపఁబడినది, ప్రేషితము. 4 ఉద్యోగాదులనుండి తొలఁగింపఁబడినది. 5 స్రవింపఁజేయఁబడినది

విసర్పఘ్నము సం వి అ. న. మైనము.

విసర్పణము సం వి అ న ప్రాఁకుట, జేరుగుట. 2. వ్యాపించుట, ప్రసరించుట.

విసర్పము సం వి. అ పుం 1. ప్రాఁకుట, జేరుగుట 2 వ్యాపించుట, ప్రసరించుట 3. ఆకస్మికమైన కర్మఫలము. 4 చర్మరోగ విశేషము.

విసర్పి సం వి ఇ స్త్రీ చర్మరోగవిశేషము.

విసర్పిక సం వి. ఆ స్త్రీ =విసర్పి

విసవిస వి గాలివీచుట, కత్తి మొ త్రిప్పుట, నవ్వుట, నడచుట, ఊఁదుట, కోయుట మున్నగువానియందలి ధ్వని కనుకరణము.

(క) గాలివీచుటయందు.

1. ఉసురు లూడాడ విసవిస విసరి ముసరి, దొసఁగు లెసగించు నురుగాడు ఋటుముదాసి, కదలి తద్దయు గదగడ వడకుదాని, వేలుఁ రాకన్నె గాంచి రావెలఁదు లపుడు. రసిక. 4 47

సీ ప్రళయ వాతూల మంబర మావరించుచు విస విస నమితమై విసరసాగె వేం. మా 1. 46.

(వ) కత్తి మొ త్రిప్పుటయందు.

వ. అనదృశంబులగు ముసలంబులు కఁ విసరు హంబుల విసవిసం ద్రిప్పి . . (అని 4. 76.)

(ట) నవ్వుటయందు

వ. విసవిస నగు మొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుప ... (భాగ 8. 286)

వ. వింతవింత వలపుగొలుపు పొలుపుగల కళావతీ విమలవదనకమలంబులఁ జేరంజని తదీయ నాసా చంపక ప్రసూనవాసనానిలంబు లొయ్యనం బొరయ వెఱచి యనముకునుమరస విసరంబులు వెనమెనవి విసవిస నగుచు రామా 1 1 53.

(త) నడచుటయందు.

క. అని పలికి కలికి కొయ్యాలి, తనుసంతాపంబు వావఁదలఁచి విసవిసన్, జనిబిస విసరముఁ జిగురులు, వనలుం బుపొవ్వఁ ుచ్చి నై పుణి మెఱయన్. రాజ. 3. 107.

(వ) ఊఁదుటయందు.

ద్వి. వెనఁబుటంబులఁ బెట్టి విసవిస నూఁద వవ నాథ. 5. 211. పొ. 21 వం.

(గ) కోయుటయందు

గీ. .. చంపకాశోకహం కెక్కి సొంపుమీఱు, కుసుమ విసరంబు విసవిసఁ గోయుచుండ . ధర్మ. 3 164.

విశ. (సం. విసరః) ప్రసరించునది, సాఁగునది

చ. వసుమతి వేయిపాదములవానికిఁ బుట్టిన ఛాయ పట్టికిన్, విసవిస గాదు కాలొకటి ... నైష 3. 73.

విసారము సం. వి. అ. పుం. 1. వ్యాపించుట, ప్రసరించుట. 2. ప్రాఁకుట, జరుగుట. 3. చేప.

న. 1. కొయ్య 2 కలప

విసారి సం విశ (న్. శ న్.) 1 వ్యాపించునది. 2 ప్రాఁకునది, జరుగునది.

వి. న్. పుం. చేప

ఈ స్త్రీ వాతావరణము, వాయుమండలము

విసికించే స (క్రి (√ విసుకు,) విసిగించు.

క పసగా శీతము పెట్టక, పసచేత నుపాయము నను బని గొను బంటున్, విసికింపక తగులబ్ధము, పొసఁగగ దళమాఁశ మిచ్చి పుచ్చుఁగవల యున్ విజ్ఞా 2 37

విసిపలక వి. పరుండెడు పెద్దబల్ల

సీ పలక యనంగను ఫలకమౌ శయ్యార్థఫలక మొప్పును విసిపలక యనఁగ ... ఆం భా. 2 166

విసిమాలు అ క్రి (√ విసుకు ) మిక్కిలి విసుగు

వ. విప్రవాటంబులఁ బ్రతిగేహంబును పరిభ్రమించి విసివి విసిమాలి వేసరి యారటఁ బొందిసొలసి జూఁకించి తూలి దూఁపటలి ... భీమ 2. 101.

ఉ. మానక వేఁడివేఁడి విసిమాలుచు . షో. 4 (శ ర.)

విసుకు వి విసుగు, విసువు

ఆ అట్టు లేసిరేని యలపును విసుకును, వెఱఁగుఁ బొడమి రాచవేలుఁ జేఁదు, సేయఁ దెలియ లేక చిన్నఁబోవుచు వ్రిగి, యుడిగి మోమువంచి యూరకుండె. అచ్చ. రా. యు. 5 62.

జ విసికించు విసిమాలు.

విసుగు వి విసువు, నిర్వేదము, వేసరుట

గీ వింటఁ గొని వ్రేయవ్రేయఁగ విసుగుఁపుట్టె ... హర. 7. 81.

విసుఁగు అ క్రి వేసరు, విసుపునొందు, నిర్వేదము నొందు.

పంచచామరము ఇసీ యిసీ మొగంబుచూడ కిల్లు వెల్వరించినన్, వెస న్విసింగి పోవు పిగ్గు వీసమంతలేదు సీ, దెసం బసల్ ఘటించె దేర త్రిమ్మరి మటిట్లు వచ్చి సారె సారె నన్నుఁ గెర్లఁజేయరాక పొమ్మిఁకన్ విప్ర. 4. 58

(ఇచ్చట మాత్రము సకిందుకముగనున్నది )

విసుమానము వి (సం విస్మయః) ఆశ్చర్యము

క. అసమానదీప్తితోఁ న, వ్వసుధాధర మపుడు జాళువాకుందనపుం, బసిఁడి పెనుకాశి యగుచున్, విసుమానమొనర్చె సిద్ధవిభునకు మిగులన్ పరమ. 1 182

ద్వి విసుమాన మంది యవ్వేళ దేవేంద్రుఁ, డను మాన భీతిచే నందంద వడఁకి ద్వి. పరమ 2. 51. పొ

విశ ఆశ్చర్యకరము, వింతయైనది

ఉ. మానవకోటి నిట్టి విసుమానపుఁ బిసుఁగులైన వారి నెందైనను గంటిమే . . భార విరా. 3 7.

క విసుమానమతని తేజో,రసపూరము గనె బ్రహ్మరంధ్రము మోవన్ కాశీ 4 178.

ఎగుడుదిగుడైనది.

సీ విసుమానములుగాఁగ, పసతోడఁ జెరవెట్టి గెట్టింబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు మనుచ 4 73.

**విసురూపము** సం వి అ న వికృతరూపము, వికృతాకారము

ద్వి వసుధ నానాసస్యవతియై ఫలించు, విసు రూప మగువాఁడు వెదకిన లేఁడు రం రా ఉ 133 పొ. 23 వం

**విసువాసము** వి (సం విశ్వాసః) నమ్మకము (చూ విసువాసి)

**విసువాసి** విశ (విశ్వాసీ) నమ్మకముకలవాఁడు.

సీ విసువాసి యనఁగను వెలయు విశ్వాసి ... ఆం భా 3. 10

**విసువు=విసుగు** అ క్రి నిర్వేదమొందు, వేసరి

సీ మనలిరో కౌరవుల్ విసువక వైరంబు, గావించు పాపస్వభావు లెటిఁగి, క్రందునఁ జంపిరో ... (భార ఆది. 7 207.)

మ. . .కుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్, విసు వొక్కింతయు లేక దాలవలయుస్వీనిన్ ... కాశీ 272.

వి. నిర్వేదము

మ విసు వౌచున్నది కాలయాపనకు మవ్విశ్లా రెడున్ భావముల్ ... (నైష 8. 52)

జ విసువుకొను.

**విసువుకొను** అ క్రి (విసువు+కొను) నిర్వేదము నొందు

గీ. సఖులు గావించు నుచితోపచారములకుఁ, జెలులు ధైర్యంబు దెలిపెడు పల్కులకును, మనసు గొలుపక వేఱ దైవమా యటంచు, విసువుకొనుచున్న న వ్వేలవెలఁదిఁ జూచి. కవిరా 3 160

**విసూచిక** సం వి. ఆ స్త్రీ. విషూచి

**విసూరణ** సం. వి ఆ. స్త్రీ దుఃఖము

**విసూరణము** సం. వి. అ. న = విసూరణ

**విసూరిత** సం వి. ఆ స్త్రీ జ్వరము

**విసూరితము** సం. వి అ న పశ్చాత్తాపము, దుఃఖము

**విసృజనము** సం వి అ. న. విడుచుట (ఇది క్లేశ సాధ్యము)

క భూవర సస్యములను వి,స్థావిసృజన మొనవ చంద్రుడు చారిత్రవిదుల్ ... భార అను 4 88.

**విసృతము** సం విశ (అ ఆ అ) 1 వ్యాపించినది, విస్తీర్ణము 2 చాఁపఁబడినది, చాఁగినది. 3 పలుకఁబడినది, ఉచ్చరింపఁబడినది. (విల్యమ్సు.)

**విసృత్వరము** సం విశ (అ ఈ అ.) 1. వ్యాపించునది. 2. ప్రాఁకునది, ఇటునటుజరుగునది.

**విసృమరము** సం విశ (అ ఆ అ) ప్రాఁకునది, నెమ్మదిగా జరుగునది

**విసృష్టము** సం. విశ. (అ అ అ) 1. ప్రేరితము, ప్రసరింపఁ జేయఁబడినది 2. విడువఁబడినది, ప్రయోగింపఁబడినది (బాణాది) 3. సృజింపఁబడినది, నిర్మితము 4 ప్రసవింపఁజేయఁబడినది, కాల్పఁబడినది 5, ప్రేషితము, పంపఁబడినది. 6 తొలగింపఁబడినది, ఉద్యోగాదులనుండి త్రోసిపుచ్చఁబడినది 7. దత్తము, ఈయఁబడినది 8 పరిత్యక్తము, విడిచిపెట్టఁబడినది.

**విసృష్టి** సం. వి ఇ స్త్రీ 1. చాఁచుట, ప్రసరింపఁ జేయుట 2. పరిత్యజించుట, విడిచి వైచుట. 3 ఈవి, దానము

**విస్తర** వి. భోజనముచేసెడియాకు

సీ నికట కాననభూములకు నేఁగి మఱ్ఱియా,కులు దెచ్చి విస్తరల్ గూర్చి కూర్చి శుక 4. 108.

**విస్తరము** సం వి అ పుం 1 విస్తరించుట, వ్యాపించుట, వ్యాప్తి. 2 వివరము, అతి సూక్ష్మ విషయములను దెలుపుట 3 బాహుళ్యము, ఆధిక్యము, శబ్దవైపుల్యము 4 సమూహము, మొత్తము. 5. పాన్పు, పడుక 6. ఆసనము, పీఁట, 7. ప్రేమతో బ్రతిమాలుట

విస్తరి=విస్తర వి భోజనము చేసెడియాకు
క. అనుమాటలు చెవి నిడ కా,యన యిట్లని పలుకుఁ దన్మృగాక్షిమణితోఁ, జనువున చుఁ ద్రోయవిస్తరి, చినిఁగెడు నన్నట్లు వలపు చెడ్డది సుమ్మీ. శుక. 2 475.
సీ. విస్తళ్లుగుట్టి కోవెలనంబి వాకిటఁ గనపూడ్చి లంకెల కాళ్లు పిసికి. (వేణు ౪ 41)

విస్తరించు నం స క్రి 1. సవిశేషముగ చెప్పు.
గీ. .. విస్తరింతు సైమిత్తికవిధులు మఱియు,నాదు వాక్యములెల్ల మనస్కరింపు. మా' ఖం 3, 170.
ఆ ... విష్ణుదానియ-దు నిరతిశయస, మాద రంబు గలదు నాదు చిత్తమున, వినుము తద్వి ధంబు విస్తరింతు. భార. శాం. 5. 21.
2 విస్తరిల్లఁజేయు.
ఆ ... ఎంతశఁడిరియైన నిది యేను దీర్చి యీ, విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు. భా' ఆది 6. 243.

విస్తరిల్లు(లు) నం. అ. క్రి 1 అతిశయించు, మిక్కుటమగు.
సీ. అప్సరోవనితల యాటలు విలసిల్లె వెనఁబుపు వర్షంబు విస్తరిల్లె మార్కం 8. 168
ఆ ... వివిధతూర్య వేణు వీణారవంబును, విస్తరిల్లె విపుల విభవయుక్తి. భార ఆది 7 282.
2. వ్యాపించు.
గీ. ... ఆత్మబుద్ధి యవంగ నల్పాంతర పు, వస్తువులు బుద్ధి యన్నింట విస్తరిలుటు. భార శాం. 5. 168.
3. ప్రసిద్ధినొందు.
ఆ. ఘనత నశ్వదానగజదానదీజాగు,రుండునాఁగ నవని రూఢికెక్కి,నట్టి మేటికాతయల్లారి యన మూర,విభుఁడు పాకనాఁట విస్తరిల్లె వి. 1 52

విస్తారము నం. వి అ. పుం 1. వ్యాపించుట, విస్తరించుట, విరివియగుట. 2 వైశాల్యము, వెడల్పు, 3 ఆధిక్యము, వైపుల్యము 4 వివరము, సూక్ష్మ విషయము. 5. వలయాకారవస్తువు మధ్య వ్యాసము 6. చిన్నచెట్టు, పొద. 7 లేఁతచిగుళ్లతోనున్న కొమ్మ 8. శబ్దవిస్తృతి.

సీ తగవారిఁ గాంచి యత్యద్భుతంబగు భవజ్జనకు తెలుఁగు విస్తారముపుప,జెప్పిన వారలు భార అశ్వ 3 206
(విస్తరమనుట న్యాయ్యము)

విస్తారించు నం అ క్రి విరివిచెందించు, విస్తరిల్లఁజేయు
శా నీరేజాంచితలోచనాయ హరయే నీలాంబు దాంగాయ మా,యారాత్రించర ఖండనాయ విభవే హార్యక్షవక్త్రాయ తా,ర్క్ష్యారూఢాయ యటంచు గూర్తురు నిరీహావిశ్వవిఖ్యాతి విస్తారింపన్ మనజస్తవంబులు గముస్ శార్దూల విక్రీడితన్ (అప్పక. 4 243. పా)

విస్తీర్ణపర్ణము నం వి అ న మానకము, ఒకవిధమగు దుంపజాతి (వ్ప. వి)

విస్తీర్ణము నం విశ (అ ఆ అ) 1 వ్యాపించినది 2. వెడలుపైనది 3 విశాలము, విరివియైనది, పెద్దది

విస్తు వి 1. ఆశ్చర్యము 2 దుర్గంధము.(శ్రీ.,వా)
ద్వి. సాముసేయుచు మల్ల చఱచుచుఁ గోల, వేమారుచూచుచు విస్తు కంపెనఁగ, బనసలు చెప్పుచు బ్రమసి పాఱుచును (శ. ర పా) పద నాథ 3 208 పా, 18. పం

విస్తృతము నం విశ (అ ఆ. అ) 1 వ్యాపించినది, విస్తరిల్లినది 2. వెడలుపయినది 3 పెద్దది, విశాలము, విరివియైనది 4 బహుళమైనది, సమృద్ధిగానున్నది, కెంపైనది.

విస్తృతి నం వి ఇ స్త్రీ 1 విస్తారము, విస్తరము, వ్యాప్తి. 2 వైశాల్యము, విరివి, ఆధిక్యము 3 గుండ్రని వస్తువుయొక్క చుట్టుకొలత

విస్పష్టము నం విశ (అ ఆ అ) 1. మిక్కిలి స్పష్టమైనది, విశదమైనది,బాగుగాఁదెలిసినది 2 ప్రత్యక్షమైనది, అందరకుఁ దెలియవచ్చునది

విస్ఫారము నం వి అ పుం 1. కంపము, వణఁకు, అదరుట. 2. టంకారము, వింటినారి చప్పుడు, ధనుష్టంకారము

విస్ఫారితము నం. విశ (అ ఆ అ) 1 చలింపఁజేయఁబడినది, కదలఁబడినది. 2 వణఁకినది, కంపమొందినది 3 టంకారము గలదిగాఁజేయఁబడినది. 4 వ్యాపింపఁజేయఁబడినది, పెద్దదిగాఁజేయఁబడినది 5. స్పష్టపఱుపఁబడినది, ప్రత్యక్షపఱుపఁబడినది 6. స్పష్టమైనది,ప్రత్యక్షమైనది,విశదీకృతము.

**విస్ఫురించు** సం. అ. క్రి. ప్రకాశించు.
మాలిని. ... తేజో, వినరపిహితమూర్తుల్ విస్ఫురింప న్మనీంద్రా. (మార్కం. 1. 125)

**విస్ఫురితము** సం. విశ (అ. ఆ. అ.) 1 అదరినది, వణకినది, కంపించినది. 2. ఉబ్బినది, పెద్దదైనది.

**విస్ఫులింగము** సం వి అ. పుం. 1. అగ్నికణము, మిడుగురు 2 ఒకవిధమైన విషము

**విస్ఫూర్జథువు** సం. వి. అ పుం. 1 అఱపు, గర్జనము, బొబ్బరింత. 2. పిడుగుచప్పుడు, వజ్రనిర్ఘోషము 3 పిడుగువలె హఠాత్తుగాఁ దటస్థమైన విషయము 4 తరంగముల మ్రోఁత, తరంగములపొంగు

**విస్ఫూర్జితము** సం వి. అ న 1. అఱపు, బొబ్బరింత. 2. దొర్లుట 3 ఫలితము, పర్యవసానము

**విస్ఫోట** సం వి. ఆ స్త్రీ 1 పొక్కు, మొటిమ, కురుపు. 2. మసూరిక, అమ్మవారి జబ్బు (మసూచికము)

**విస్ఫోటము** సం. వి అ. పుం. = విస్ఫోట.

**విస్మయంగదము** సం. విశ. (అ ఆ అ.) ఆశ్చర్యము గలిగించునది, అద్భుతపఱుచునది

**విస్మయపడు** మి. అ. క్రి ఆశ్చర్యపడు
గీ మిన్న మిడుగురులై రెండు మెఱచుచున్న, మెఱుఁగు లొక పుట్టలోనున్న నెఱుఁగ లేను, బుట్ట గ్రొప్పించి యా రెంటిపొడవుఁ గావ. కుడిగి వచ్చితి విస్మయపడి మనమువ ధార. ఆర 3 178.

**విస్మయము** సం. వి అ పుం 1. ఆశ్చర్యము, వింత. 2 అద్భుతరసము (నవరసములలో నొకటి.) 3. గర్వము 4. సంశయము

**విస్మయముపడు**=విస్మయపడు అ. క్రి. ఆశ్చర్యపడు.
చ. ... ప, మనయము విస్మయంబుపడు నంతట లోఁ దిగిచెన్నరేంద్ర శల్లవ విఱుగంగ ... హరి పూ 8. 46

**విస్మయాతురుఁడు** సం విశ (అ అ అ) ఆశ్చర్యము నొందినవాఁడు
ఇట్లే విస్మయావిష్టుఁడు, విస్మయాన్వితుఁడు.

**విస్మరణము** సం వి అ. న. మఱచుట, మఱపు, విస్మృతి.

**విస్మాపనము** సం విశ (అ.న.అ) అద్భుతపఱచునది.
వి. అ పుం 1. మాయ, మోసము, వంచన.
న 1. ఆశ్చర్యము గలిగించుట. 2. అద్భుతవస్తువు.

**విస్మాపనుఁడు** సం. వి అ పుం మన్మథుఁడు.

**విస్మితము** సం. విశ (అ అ అ) 1. ఆశ్చర్యపడినది, అద్భుతపడినది. 2. తత్తరపడినది. 3. గర్వించినది గర్వపడినది

**విస్మితి** సం వి ఇ. స్త్రీ. ఆశ్చర్యము, అద్భుతము

**విస్మృతము** సం విశ (అ ఆ అ) మఱవఁబడినది,

**విస్మృతి** సం వి ఇ స్త్రీ. మఱపు, విస్మరణము.

**విస్మేరము** సం విశ. (అ. ఆ అ.) ఆశ్చర్యపడినది, అద్భుతపడినది.

**విస్రంభము** సం వి అ పుం 1 విశ్వాసము, నమ్మిక. 2 పరిచయము, చనవు.

**విస్రంస** సం వి ఆ స్త్రీ 1 పడిపోవుట, పతనము. 2. స్రవించుట, కారుట 3 దుర్బలత, అశక్తి, బలములేమి.

**విస్రంసనము** సం విశ (అ. ఆ అ) 1 పడఁగొట్టునది, రాల్చునది 2. వదులుచేయునది, సడలించునది
వి అ న. 1 పతనము, పడుట. 2. స్రవించుట, కారుట 3. వదులు చేయుట, సడలించుట. 4. విరేచనకారియగు మందు, భేదిమందు.

**విస్రంసము** సం. వి అ పుం = విస్రంస.

**విస్రగ్రంథి** సం వి. ఇ పుం. హరిదలము.

**విస్రబ్ధము** సం. విశ. (అ ఆ. అ) 1. నమ్మినది, విశ్వసించినది 2. పరిచయముగలది, చనవుగలది.

**విస్రము** సం వి. అ. న 1 పచ్చిమాంసపు వాసన. 2. పచ్చివాసన 3 కమురుకంపు. (వాచ.)

**విస్రవము** సం. వి అ పుం స్రవించుట, కారుట.

**విస్రస** సం వి అ స్త్రీ. 1 దౌర్బల్యము, అశక్తి, ఓపికలేమి. 2 ముదిమి, ముసలితనము

**విస్రస్తము** సం విశ (అ అ అ.) 1 సడలినది, వదులయినది 2 దుర్బలము, దార్ఢ్యము లేనిది.

**విస్రావణము** సం. వి. అ న 1 రక్తముకారుట. 2 కారుట, బొట్లుబొట్లుగాఁ బడుట. 3 బట్టినుండి దింపఁబడిన యొకవిధమగుమద్యము,

**విస్రావము** సం. వి, అ. పుం. = విస్రవము,

**వి(క్రుతి** సం. వి. ఇ. స్త్రీ. కాలుట, (ప్రవించుట. బొట్లుబొట్లుగాఁ బడుట.

**విస్వరము** సం. విశ (అ అ అ) పొసఁగనిది, సరిపడనిది.

**విస్స్రందు** వి. మల్లబంధవిశేషము.

వ. విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధంబును దొలకరిమెఱుపును వల్లిమత్తును విస్స్రందను మాస్తాభరణంబును బదఖండనంబును సరి త్రాఁడును లోవిత్తరియు వెలివిత్తరియు పత్యాఁకుశంబులును. మొదలుగాఁగల పది రెండు గాయమానంబులు. ప్రబంధ. 1. 78.

వ నాగబంధంబును దొలకరి మెఱుపును విస్స్రందు మరిత్రాడును ... మల్లుపు. 68.

**విహంగమ** సం. వి. అ స్త్రీ. కావడిబ్రద్ద

**విహంగమ** ము. సం. వి. అ. పుం పక్షి, పిట్ట

**విహంగమము** సం. వి. అ పుం. 1. పక్షి, పిట్ట. 2. మేఘము, మబ్బు. 3. బాణము, అమ్ము 4. (సూర్యాది) గ్రహము.

**విహంగముఁడు** సం వి. అ పుం సూర్యుఁడు

**విహంగిక** సం వి ఆ. స్త్రీ కావడిబ్రద్ద

**విహగము** సం. వి. అ పుం. 1. పక్షి 2 మేఘము, మబ్బు. 3. బాణము 4 (సూర్యాది) గ్రహము

**విహగరాజు** సం. వి అ పుం గరుత్మంతుఁడు, గరుడి.

**విహగుఁడు** సం. వి అ. పుం. 1. సూర్యుఁడు 2 చంద్రుఁడు.

**విహగేంద్రుఁడు** సం. వి. అ. పుం గరుత్మంతుఁడు, పక్షిరాజు.

పర్యా. విహగేశ్వరుఁడు.

**విహతము** సం. విశ. (అ ఆ అ.) 1 చంపఁబడినది, కొట్టఁబడినది. 2 గాయపఱుపఁబడినది. 3 ఎదిరింపఁబడినది, అడ్డుపెట్టఁబడినది.

వి అ. పుం. వైవదేవాలయము

**విహతి** సం. వి ఇ పుం మిత్రము, సహాయుఁడు. (విల్సమ్సు).

స్త్రీ. 1. చంపుట, కొట్టుట 2. దెబ్బ. హతి. 3. భంగము, తప్పుట. 4 ఓడుట, అపజయము.

**విహననము** సం వి అ న. 1. చంపుట, కొట్టుట. 2 హానిచేయుట, అపాయము చేయుట 3. అడ్డంకి. విఘాతము 4 దూదేకువట్టి పనిముట్టు.

**విహరణము** సం. వి అ. న 1 నివారించుట, తొలఁగించుట. 2 చల్లగాలిలోఁ దిరుగుట, వచారు చేయుట, వినోద సంచారము. 3. వినోదము, వేడుక.

**విహరము** సం. వి. అ పుం. 1 తీసివేయుట, తొలఁగించుట 2 విడిపోవుట, కూడికలేమి. 3 మార్పు.

**విహరించు** సం. అ. క్రి. స్వేచ్ఛగా సంచరించు.

క... విప్రవరుఁడు మునిజనములు పూజనము లొనరింప ఖేచరు, లనుమోదింప విహరించె నప్రతిహతుఁడై. భా. శాం. 5. 381

వ. ... అపూర్వ కావ్యరచనా కుతూహలమధు విహారము విహరించుచున్న సమయంబున ... మార్కం. 1. 11.

స. క్రి ప్రణయించు, ప్రజ్వలింపఁజేయు

క విను గార్హపత్యమును న, య్యనలము విహరింపఁబడి . (భార. ఆది 4. 86 )

సీ అగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపు మని పంచి యతిమేచనార్థ మరుగ . భార ఆది. 1 123

**విహర్త** సం విశ (ఋ స్త్రీ. ఋ ) 1. విహరించువాఁడు, వినోద సంచారము చేయువాఁడు 2. అపహరించువాఁడు, దొంగిలించువాఁడు

వి. ఋ పుం. దొంగ, తస్కరుఁడు.

**విహసనము** సం. వి. అ. న చిఱునవ్వు, మందహాసము.

**విహసించు** సం స. క్రి నవ్వు, ఎగతాళిచేయు

సీ హరివైన గంగాలహరివైన విహసించు ... కృ శతకం. 1 5.

**విహసితము** సం. వి అ న = విహసనము

**విహస్తుఁడు** సం. విశ (అ అ అ ) 1. చేతులు లేనివాఁడు. 2 చేయూఁత (సహాయము) లేనివాఁడు. 3. వ్యాకులుఁడు, కలఁతనొందినవాఁడు 4 అశక్తుఁడు, అసమర్థుఁడు 5 చదువరి, విద్యావంతుఁడు

**విహాపితము** సం. విశ (అ ఆ అ.) 1 విడిపింపఁబడినది 2 బలాత్కారమున విడిచిపెట్టింపఁబడినది.

వి అ న, ఈవి, దానము,

**విహాయసము** నం. వి స్ పుం , న , అ. పుం ఆకాశము.

పుం పక్షి.

**విహాయితము** నం వి అ న. ఈవి, దానము (శ ర)

**విహారగృహము** నం వి అ న. క్రీడామందిరము, శిలాగృహము

**విహారదాసి** నం. వి. ఈ స్త్రీ బ్రహ్మచారిణి, సన్న్యాసిని.

**విహారము** నం వి అ పుం 1 తీసివేయుట, తొలఁగించుట, నివారించుట. 2 వేడుకగాఁదిరుగుట, వినోదసంచారము 3 ఆట, క్రీడ, వినోదము. 4 చేతులుకాలు మొదలగువాని కదలిక 5. ఉద్యానవనము. 6 స్కంధము, మూపు 7. బౌద్ధదేవాలయము, మఠము 8. దేవళము, గుడి 9 వర్ణముల యుచ్చారణ స్థానములను బాగుగా విప్పుట, పలుకుటకై చక్కఁగాఁ దెఱచుట 10. విస్తరింపఁజేయుట, విప్పుట 11. ఇంద్రుని ప్రాసాదము, వైజయంతము. 12 ప్రాసాదము, రాజగృహము. 13. ఒకజాతి పక్షి.

**విహారి** వం విణ (న్ జీ న్) 1 విహరించునది, వినోదించునది. 2 వ్యాపించునది 3. మిక్కిలి చక్కనిది.

**విహారిక** నం వి. ఆ స్త్రీ. సన్న్యాసుల మఠము

**విహాసము** నం వి. అ పుం. = విహసనము.

**విహితము** నం విణ (అ ఆ అ) 1. చేయఁబడినది, ఆచరింపఁబడినది 2. ఏర్పఱుపఁబడినది, స్థిరపఱుపఁబడినది. 3. విధింపఁబడినది, శాసింపఁబడినది, ఆజ్ఞాపింపఁబడినది 4. కూర్పఁబడినది, నిర్మింపఁబడినది. 5. ఉంచఁబడినది. 6 సంపన్నము, సహితము, కూడినది. 7 చేయ వర్హమైనది. 8. పంచిపెట్టఁబడినది.

వి అ. న. ఆజ్ఞ, శాసనము.

**విహితి** నం వి. ఇ స్త్రీ 1. చేయుట, ఆచరించుట. 2 ఏర్పాటు.

**విహితుఁడు** వి స్నేహితుఁడు.

గీ: ఎట్టకేలకు విహితుల యిండ్లకేఁగి, పెదిమెఁదానూరకుండుట పెద్దతనము, గలధైయడుగుటకంటె బలువుకదనము, యాచనాంతం హిగౌరవమ్మన వధూటి (కుచేల 1 107)

**విహీనము** వం విణ (అ ఆ అ) 1 విడువఁబడినది, త్యజింపఁబడినది, త్యక్తము 2. శూన్యమైనది. 3. అధమము, తక్కువది.

**విహృతము** నం విణ (అ ఆ అ) 1 క్రీడించినది విహరించినది, ఆడినది. 2 వ్యాపించినది

" వి అ న 1. స్త్రీల శృంగారచేష్టావిశేషము. 2 ఆట, క్రీడ

**విహృతి** నం వి ఇ స్త్రీ. 1 నివారణము, తీసివైచుట. 2. ఆట, వినోదము. 3 వ్యాప్తి, వ్యాపనము

**విహేఠకుఁడు** నం వి అ పుం 1 హానిచేయు మనుష్యుఁడు అపాయము కలిగించువాఁడు, తిట్టెడు పురుషుఁడు.

**విహేఠనము** నం. వి అ న 1 హానిచేయుట, అపాయముకలిగించుట 2 నూఱుట, పొడిచేయుట. 3 బాధపెట్టుట. 4 నొప్పి, బాధ, దుఃఖము.

**విహేఠము** నం వి అ పుం 1 గాయము, హాని. 2 బాధపెట్టుట, హింసించుట

**విహ్వలపడు** మి అ క్రి భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పు.

చ . . భూపతి వేల్పువాల వివ్వలపడఁబోక కైకగురు నానతిఁ జేకొనుమయ్య రాఘవా.

క అన దండమిడి తదాజ్ఞన్, వనదండగతిన్ శిరంబునన్ దాల్చిధరా,వనమునకై రఘువీరుఁడు... చంపూరా 4 35.

**విహ్వలము** నం విణ (అ. ఆ. అ.) ద్రవరూపమైనది, కరఁగినది.

**విహ్వలించు** నం. అ క్రి 1. క్షోభించు, వ్యాకులపడు.

వ దాన న వ్వేధ విహ్వలించి . .

గీ అధికవిస్వరంబైన యయ్యార్తనాద,మునకు మందలోపలఁగల జనములెల్ల, మేలుకని రట మున్న యశ్వాలు నేడుపు, విని యశోదయు మేల్కని విహ్వలించి. హరి పూ 5 152

2 అలయు, అవయవములు స్వాధీనముతప్పు.

గీ . మఱియు నాథాము శాను, వేడిమికి నోర్వ కెంతయు విహ్వలించి మార్కం 5. 380.

విహ్వలుఁడు సం. విశే. (అ. అ. అ.) 1 క్షోభపడిన వాఁడు, వ్యాకులపడినవాఁడు 2 భయపడిన వాఁడు, 3. స్మృతితప్పినవాఁడు 4 బాధనొందిన వాఁడు, దుఃఖపడినవాఁడు 5 అధైర్యపడిన వాఁడు

## వీ

వీంఖ సం. వి. అ. స్త్రీ 1 గతి. 2 ఒక అశ్వగతి విశేషము. 3. నృత్యము 4 కూడిక, కూడలి.

వీంగు=వీఁగు అ. క్రి 1 విజృంభించు

ఉ వీంగు నపార సత్త్వగుణ విస్ఫురణం బరమేశ్వ రోరుశా, మాంగమునందు మున్నదయమై ... కు సం. 1. 4.

2 ఉత్సహించు.

ద్వి చాంగుభళా యను శబ్దముల్ మ్రోయ, వీంగుచుఁ బుధజనుల్ విభ్రాంతులుగను పండితా మహిమ 2 95. పా

వీఁక వి (√ వీఁగు) 1 ఉత్సాహము, పూనిక.

ఉ. ఆఁకలి నీరువట్టు శ్రమ మంగవిపాటన మాత్రి కాత్రి విన్, సోఁకకయుండ విద్యలొగి సొంపుగ నీకుపదేశమిచ్చెదన్, దేఁకువ వారిపూరమున దిగ్గన శుద్ధియొనర్చి రమ్మనన్, వీఁక రఘూద్వహుండును బవిత్రజలంబుల వార్చి వచ్చినన్ (భా రా. బాల 212.)

శా... భోజనోత్తరమునం దాస్థానమై యుండి యచ్చోఁ గంటెట్టక చెప్పెద నృకలవృత్తాంతంబు మం దేటగా, వీఁకన్... కాశీ. 7 173

2. పరాక్రమము

సీ. వీఁకతోఁ గదుఁబూచు మ్రాఁకుల విలుపున వల్మీకమాత్ర పర్వతము నెత్తి .భార. సభా 2 41.

క. తాఁకినఁ బొగడం దగియెదు, వీఁకం బవిద్రోణు బాణవృతుఁ జేయ ...భార ద్రోణ 1 201.

సీ వీఁకతోడ విరాటవీరభేటనమున ధీరుఁ బ్రబలంబ దైతేయుఁ జంపె ... ఉ హ 1. 8.

3. బలము.

సీ కోరెఫలార్థులై వారల యెక్కిన మ్రాఁకుల మొదళుల వీఁకఁ బట్టి, వడిఁ గదల్చు ... భార ఆది 5 166

4 గర్వము

ఉ అవ్వసు మ్రోఁతతో నెదురెఱుంగని వీఁకఁ బరాక్రమించుచో, న వ్విహగంబు తద్ఘనత రారుణ దారుణ నేత్రరోచులన్, నివ్వెఱగంది కాల్కొనఁగ నేరక మేదినిఁగూలె... భోజరా. 3 200

ఉ పూపమిటారి చన్నుఁగవ పోఁకల వీఁకలఁ జౌకసేయు ... దశా 7 213

5 సాహసము

క. .. జ్యాకలితశరాసముఁడై, వీఁకను సైనికులఁ దిట్టి విభుతో ననియెన్ మనుచ 4. 62.

6. విజృంభణము, వ్యాప్తి.

మ పద్మాకరం బంచుఁ ద,త్కమలామోద సుగంధిమారుతము వీఁకన్ మున్నె లంగించినన్ భార ఆది 6 172

తే మతకరి మెకంబు చేకొని మరులువట్టి, ధరణిఁ బోవోమిన త్రిశంకు తనయుకులము, వాఁడగుట వీఁక నాచేత నేఁడు రాముఁ, డంతిఁ గోల్పోవ మారీచు మృగ మొనర్తు చంపూరా 5 57

చ మొకరిపిసాళితుమ్మెదల మూఁకకు గందపు గాలి రాకకున్, మకరపతాకు దాళకును మామిడి మోఁకకు చంద్రు రాకకున్, వికముల వీఁకకున్ సిరులఁ జేర్చిన యామిని యూఁచు మూఁకకున్ .. రుక్మాం 3 154

7. ఔదార్యము

ఆ రాకురాకు మనెడి రట్టడితనములు, పోకుపోకు మనెడి పొగరువగలు, పొడువుపొడువు మనెడి బెడిదఁపుబీరముల్ విడువువిడువు మనెడి వీఁక లినఁగ (విజ. వి 3 150)

8 ఔన్నత్యము.

శా గర్వోత్రిప్తకతరంగ సంఘముల వీఁకన్ బుష్కరిణ్యాపగా, వార్వేణుల్ దనయుత్తరంపుఁ దెసఁ బర్వంగా .. పాండు. 5. 31

సీ తిలకించు భామల బలుచింతయును బోలె విస్తీర్ణమై యొమ్ము వీఁకఁదనర ... శశాం. 2 61.

9. పంగుట.

వ భారంబులవలన వీఁకలుగల కోరకావళ్లు మోచు కొని యొండొరులతోడం బంతంబు లాడుచు వి పు 7 147

10 విహారము.

రగడ లేమ లేమరువములు నీ కవలీల లీలల వీఁకలో జన ... వసు 3 149

11 దైన్యము

శా అనయంబున్ శమవంతుఁడై వినుత శిష్టాచార మార్గంబులన్, గను పుణ్యాత్ముఁడు దుర్గతు ల్గడచి ప్రజ్ఞాహరత్వ సంయాధుఁడై, కనుచుం డుం బటుమోహపంక జలమగ్నంబైన లోకంబు వీఁక నధోభాగమునందు డింది కడుదుఃఖం బొందఁగా నవ్వుచున్ భార. అర 5 60

12 యుద్ధమునుండి పాఱుట

క. కలనైన వీఁ కెఱుంగక, కలనైన న్దెఱయు పెంపుగల ముక్కంటీ యయా 1 128

(శ ర. పా వీఁగెఱుంగక, ముద్రి పా.)

13 సామ్యము

చ ... పరుల వీఁకను మండియు మిత్రభావమున్, బొరయుటయున్ మహాబ్జముల పోలికగల్గియు శత్రుతాగుణస్ఫురణ మొకప్డు చంపుటయుఁ జాతుముగాదె ధరిత్రి నెల్లెడన్ (భార శాం 3 227 )

(శ ర పా. అరులు వీరవ, ముద్రి పా )

14 ప్రభావము

శా సోఁకన్ వచ్చు శిలీముఖంబుల నడంచున్ రాజ హంసాళి న, ట్టాఁకం బెట్టు వనంత రత్నరుచి వోనాడుం దవశ్శ్రీలబున్, ప్రేఁకంబై వెల యున్ ఘనోదయముచే విహారు ని పద్మ ముల్, వీఁకం జిత్రచరిత్ర పాత్రములుగా వే భాతి నూహింపఁగాన్ వసు. 5 100

15 విధము

గీ ఇల్లు బూఁచిన యేపున మల్లివిరుల, వీఁకవెలి దమ్మి తేకులకోఁక నిండఁ, బండువెన్నెలతెల్ల యఖండ రుచులఁ,గంజజాతాండ ఖండంబుఁ గలయఁ బర్వె ఘటికా 2 146

గీ తోఁక ద్రొక్కిన భుజగేంద్రు వీఁక నటలు, గుదిచి పెటికిన సింగంబుకోధపుమాడ్కిఁ, దండ తాడవకుపితో గ్రపుండరీక, భంగిఁ గృష్ణుండు రోషించి పలికెవిట్లు చిత్రభా 6 165

విశ పొడుగయినది

ద్వి .. వీఁకకాళ్లను నడ్డి వీఁపును దనర ...బస పు 3 1117

వీఁకఁదనంబు వి (వీఁక+తనము), ఉత్సాహము.

శా ... వీఁకఁదనంబుతోన పదశబ్దం బల్లబుట్టించి నన్ దశకు. 7 106

వీఁకవిల్లు వి ఒకవిధమైన విల్లు.

గీ గనగనలు వీఁకవిండ్లు పోగ చిలుకలును, సింగ ములు పులిపిల్లలు జింక లేడు,గములు మానిని కోఁతులు కాబుపోఁతు, లేడికదుపులు పులి జుమ్ము పాడిపనులు. ప్రబంధ 85.

వీఁగఁబాఱు అ. క్రి. (వీఁగన్+పాఱు, స్వార్థమున) యుద్ధమునుండి పాఱు.

క నిజబలము వీఁగఁబాఱిన, భుజబల మలరఁగ విదర్భభూవరుఁడు మహో,గజమున్నిఁ జొచ్చిన గతి, విజిగీష విదేహసైన్యవితతిఁ గలంచెన్. వి క్ర. 4 100

చ విను పలుమాటలేల యల వేలుపుమూఁకల లోన నేనియున్, వెనుకకు వీఁగఁబాఱ కోక వీరుఁడు సైఁపఁగలాఁడె యల్కచూ, పినకుఱుఁ డించుకంత నమపేతుశ నంగరకేళియై నిక్కు డ్చిన బటుఘోరసాయక విజృంభణ మస్యూం కోర్వ నెట్లగున్. రాఘవ 4 89.

వీఁగారు అ క్రి (వీఁగు+ఆరు, స్వార్థమున) నిక్కు.

సీ వీఁగారు చనుఁగవ క్రేగున ఁగాఁ దీఁగవడు వసివాళులు వాడుచుండు ... కు సం. 8 9.

వీఁగు అ. క్రి (క్రి వీగు త. వింగు.) 1 ఉత్స హించు

సీ. ఎల్లవిభాగించి యిచ్చినం దమతమస్భృత్తుల నుండక వీఁగి పాండు, ధృతరాష్ట్రి వంద ముల్ .. భార. ఆది 8 6.

శా. ఏ కాంతామణియందు వీఁగి కనెనో యేకాంతుఁ డీకాంతునిన్ ... భాగ 10. ఉ. 30

2 నిక్కు

గీ. ఒక్కసతి వెలికిఁయీఁద నొప్పెఁ గురులు, వీఁగు చన్నులు వలరాచవేఁటకాఁడు, కోక ములఁ బట్ట నొడ్డు వాగు లు వాని, డాకొనఁగ బెట్టు దీము పిట్టలు వనంగ వరాహ. 3 10.
గీ హ స్తముల వీఁగు చనుదోయి యడఁచి కొనుచు . హర. 3 92
ఉ ... దీని లతా తము ్పరు,ల్గా రచియించి నించుఁ గుతుకంబున వీఁగు మెఱుఁగు క్రొవ్వె దన్ పారి 4 8

3 యుద్ధమునుండి పాఱు.
ఉ . . సమరభీతి జనించి యతండు దాళఁగాఁ, జాలక వీఁగిపోయిన నిశాచరులార్చిరి సంభ్ర మంబునన్ ఉ రా 8 51
మ తమి మందేహులతోడఁ బోరి యినుఁడంతన్ వీఁగి తన్ జేర వ, స్తమహీభృన్మణి వెన్కవేసి కొని మిత్త్రప్రేమ గ క్తప్రవాహముగా, బోర వవంగ ... (పారిగ 2 158)
సీ మొఱచెడి దూమున విఱుగుటయు ను వీఁగి పిఱు దఁ జేరినవారిఁ జెఱుచుటయును అచ్చ రా కాల. 45
4. భయపడిపాఱు .
(వేఁగుఁజుక్క) సీ సకుటుంబముగ వీఁగి చరమ శైలముఁ జేరు తుహినాంశు డ ముదారుదోఁ యపంగ . మనుచ. 3 51
గీ. వచ్చి శిబ్బలఁ గూల్చునో వానివలన, వీఁగి యేఁగున్ ... నీలా. ? 74
సీ. వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును బృథుశ క్తమున మల్పు పెన్నకాతీ ... శామ 269.
5. చలించు
మ. ... హాగ్గజంబు లదిరెన్ సర్వాన్వయేశుఁడు ని,ట్టలమై కూర్మక వీఁగెఁ గూర్మపతి వ్రీడం బొందె .. (శా. రా య 152)
మ. . ఖరఁ ఘోర్త బ్రహ్మాస్త్రమున్, ఘటి యించెన్ దనవింట మింట గల మూఁకల్వీఁగె నూఁగెన్ సముత్కటశైలంబులు . దశా 8. 110
ఆ ఘోరశిలవృష్టి గురియించె నొడలు వీఁగించి యతఁడు ... (కళా. 6 68)
6 తొలఁగు, అపసరిల్లు
* లేచి నీల్గుచు జారసాఁచెనేనియుఁ జక్రవాకాచ లేంద్ర మవ్వలకి వీఁగు ఉ రా 2. 196
7 వెనుదీయు
మ పని గానేర దటంచుఁ బూనక వెఱం ద్రావింతు రెంతే జడుల్, పనికిన్ మేకొని విఘ్నలేశము జనింపన్ మధ్యముల్ వీఁగి యం,తనె చాలింతు రనేక విఘ్నతతు లుత్పన్నంబులైనన్ ఘనుల్, పని సాధింతురు . మల్ల నీతిశ 72
8 ఒదిగియుండు.
ఉ ఓహరిసాహరిం బ్రథమ మొల్కొడుధారలగాడ్పు లేటవా,ల్గా హాతి నీడ్చి వీఁగు ప్రజలం గలఁ పన్ ... ఆము 4 93.
9. శిథిలమగు
సీ దంట గుడారు క్రిందటి వెల్లువల నీరు ప్రాయి వీఁగఁగొట్టిన పూట నిట్టు రా వి. 2 69.
10. ప్రసిద్ధికెక్కు.
ద్వి. బవవగీతలశాప్రభాసవేల్లిత న,రసమనఃకలవ కరాజితుం డన గ, వీఁగుచుఁ జేటలవేమయ్య భువిని, దాఁ గాక మఱియు మేదరులు గొంద ఱకు . పండితా పురా 162.
11 విపరు, వీచు
సీ లలితంపు మెట్లఁగేశాకూళి కవ్వల, జలయంత్ర ముల వీఁగు చలువగాడ్పు. కువల. 4 144.
వ క్రి. విడుచు.
గొడ్డువీఁగు = గొడ్రాలితనమువిడుచు
ఆ వె గొడ్డువీఁగి కనియెఁ గొడుకు నెంతయు మూర్తిమంతు నెలఁతలందు మహితభాగ్య, యొక్కతియ యశోద యుర్విపై ననుచు . హరి పూ 5 165
గీ. . ఎన్నపై దేండ్లనైన నాలేండ్లనైన, బిడ్డలను గంద్రు కన్నియల్ గొడ్డువీఁగి దశా 10.107.
సీ కని ప్రాచి గొడ్డువీఁగంగ రత్నమువంటి పుత్త్రి సంతానంబు పుట్టె ననఁగ రామా 2 106.

వీఁడు సం (శ. ఇదము త ఇదన్.) ఈ అనుశబ్దమునకు మహదర్థక ప్రథమైకవచనము ) ఈ పురుషుఁడు. బ. వీరు, వీరలు, వీండ్రు

గీ వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు ... భార ఆది 6 18

శా. తండ్రీ పారెకు ఉవ్వ నాగ్రహామమీఁదం గవ్వదే గాతిగా గుండ్రాలంగొని బాయగాక యిది నాకుం దల్లియే యెన్నడున్, వీంద్రం జూచిన జాడ నన్ను యమునన్ వీక్షింపదు ... వరాహ 5 93.

చ అ మ్మహా, పురుషునిపాలిశిం బతులువో ఎఁగ వీరలతోన యేమ జెప్పెనఁ ఆని ... భార ఉద్యో 3 112.

వీరువారనక=వీరును వారును అనకుండగా

ద్వి ధారుణీప్రజలకు దయ ఏ ప్పఁజేసి, వీరు వారన కతి విశ్రుతకీర్తి, సమచిత్తుఁడై ధర్మ చరితంబుఁ బూని ౦౦ రా జాల 83 పా. 7 పం

**వీఁడుగో** అవ్య (వీఁడు+కో.) 1 ఎదుటనున్న పురుషుని నిర్దేశించుటయం దుపయోగింపఁబడును

ఉ. ... ఉపేంద్రుని ముందటఁబెట్టి వీఁడుగో గుట్టుపుడొంగ చిక్కె సమకొన్న ప్రతిజ్ఞ ఫలించె కావుడున్ ... జై. భా 3 114

("వీఁడిగో" శ ర పా)

చూ. ఇగో=ఇదిగో (శ ర)

2 నిశ్చయముగ నితఁడే యను నర్థమిచ్చును

చ విరులశరంబునుం జెఱకువిల్లును బూనఁడుగాని వీఁడుగో, మరుఁడు మరాళయానలకు మాన వతీ వచనంబులకు పల్లవా, ధరలకుజెల్ల దింక... పి శకుం. 2 92.

**వీకము** సం వి అ పుం 1 గాలి 2 పక్షి 3 మనస్సు.

**వీకాశము** సం వి అ పుం 1 ఏకాంతస్థలము, విజన ప్రదేశము 2. ప్రకాశము, దీప్తి.

**వీకు** 1. పరాక్రమము

ఉ. .... అతత మత్స్యయంత్రమున్, వీకున వట్టు లేసిన సువిక్రము వాఁడు గోరుఁ జూడఁగన్. భార ఆది. 7. 228

ఉ. ... వీకునఁ దాఁకియుఁ బోరి రాజిదే, వాసుర వీరు లార్వ సమమై విషమాత్ముఁడు గుంజ రాతుఁడున్. కు. సం. 12. 796.

2. ఉత్సాహము, పూనిక.

ఉ వీకున నశ్వమేధములు వేయి నరించిన ధర్మ శీలుఁ డిక్ష్వాకులలో, వ్రవు డు బిఁవదాతుఁడవంత యశుం డవార్యవీర్యుఁ డుత్తముండు య నాక్ష ఁడు భా ఆ ౭. 200

క ఆ కపిరాల్చ ఫలంబులు, వీకున గొనివచ్చి యిచ్చి విమలాబ్జముఖి, యీ కానలలో మృగము ల, నేకంబులు గలవు మనకు వేళాతడయిన్. భోజరా ౬. 242

3. ఔద్ధత్యము, గర్వము

సీ. అంతట ఐతతి కాటపట్టనఁజాలు విసయ సమూహంబు వీకు పఱిచి కు సం. 12 899

సీ ... ఉగ్ర. అ యోధవడలు గని రురువడి శస్త్రాస్త్రవృష్టి నమ యులు వీకుదఱఁక ... కు స. 12. ౭08.

వ. నారదునాటకిన్ బాటించి వేఁటకాంద్రదనె తెంగి మేపు మేపుల చమత్కారంబుల విరాక రించి వీకునన్ దిరిగితిరిగి యిాఁశ దీర్చుకొను నవియును. (మనుచ. 4 27.)

**వీక్ష** నం వి ఆ స్త్రీ. చూచుట, నిదానించి చూచుట.

**వీక్షణ** నం వి ఆ స్త్రీ చూచుట, చూపు, దృష్టి

**వీక్షణము** నం వి అ న 1 చూచుట, చూపు, దృష్టి. 2. కన్ను, నేత్రము.

**వీక్షము** నం వి అ. న. 1. దృశ్యపదార్థము, చూడఁ బడువస్తువు 2 ఆశ్చర్యము, అద్భుతము.

పుం. చూచుట, నిదానించి చూచుట

**వీక్షించు** నం న. క్రి చూచు, కనుఁగొను.

గీ పక్షిపక్షంబు వీక్షించి రాక్షసుండు గిట్టఖడ్గంబు వైచిన విట్టు నెగసి. మార్కం 1 88.

ద్వి. అఖలశాస్త్ర బుల నయోధ్యాగిచంద్రు, ముఖమున ప్ర విజామోదవాక్యముల, రాశిల్ల వీక్షింప రమణయై ... తముదామె చెలఁగి న ర్తన మాడఁదొడఁగె ద్వి పరమ 3 164, పా

**వీక్షితము** నం వి అ న. చూపు, దృష్టి.

**వీక్ష్యము** నం. విశ. (అ ఆ. అ.) 1. చూడఁదగినది. 2. ప్రత్యక్షము, కనఁబడునది.

వి అ. పుం గుఱ్ఱము.

న 1. శ్లాఘ్యార్థము. 2. ఆశ్చర్యము, వింత.

**వీక్ష్యుఁడు** నం. వి అ. పుం. నటుఁడు, నర్తకుఁడు.

**పీట** సం వి అ స్త్రీ 1 బంతియాటకు సాధన 2 బంతి, కందుకము, పౌరదండము.

చ ... దుష్కరముగ నూతిలోఁ బడిన కాంచన పీటఁ గొనంగనేరక .. భార. ఆది 5. 210

2 బాలుర క్రీడాసాధన విశేషము, గూటుబిళ్ల, (విల్యమ్సు)

**పీటతటము** విశే.= పీటతాటము (శ. ర, చి వి.)

**పీటతాటము** విశే = విటతటము, భిన్నము, భగ్నము (తాఱుమాఱు. అని శ ర)

క కొమ్ములఁ గ్రుమ్మియుఁ బాదతలమ్ములఁ జమరియును గడములం బఱిపఱియై, యిమ్మెడలఁగఁ దిగిచియు శరదమ్ములఁ నేనుఁగులు పీటతాటము సేసెన్ భార ద్రోణ 1. 175

సీ కోటలు వెస పీటతాటముల్ గావించి పరిఖలు పూడ్చి వప్రములు ద్రొబ్బి ... భాగ. 10 ఉ. 638

ఉ. కొమ్ములనూఁది కుడ్యములఁ గూలఁగఁద్రోచియుఁ గేల పీటతాటమ్ముగ నీవశావలఁ బడన్ సదనంబులు వైచియున్ మహోగ్రమ్ముగ దానియున్న కరిఁ గన్గొని గుండెలు జల్లనంగ వస్త్రమ్ములుఁ గుంచియల్ విడిచి తల్లడమెక్కుడుగా వడంకుచున్ కేయూర 2 103.

**పీటతాటనము** విశే = విటతాటనము (శ. ర.)

**పీటి** సం వి ఇ., ఈ స్త్రీ 1. తములపాకులతీఁగ, తాంబూలవల్లి 2. సజ్జిత తాంబూలము, వక్కలు సున్నము మున్నగు పరికరములతో గూడిన తాంబూలము 3 ముడి, గ్రంథి, పోకముడి, వది 4. అవివేకముడి

**పీటి** వి (త పీడల్) కొల్ల, దోఁపుడు. (శ ర, త్రా) (చూ పీటఁబోవు)

**పీటిఁగలుపు** (పీటి+కలుపు) (సంధిని వర్ణాగమము.) నష్టముకావించు, విడిచివైచు.

సీ ఆక్రాంతజంగ మార్చాశ్రద్ధ వర్తిలు వేద విద్విజపూజ పీటఁగలుపు ... ఆము. 4 43.

**పీటిక** సం. వి. అ స్త్రీ. = పీటి

**పీటిది** వి (పీడు+అది) వెదురుగెడమీఁద ఆఁడువది, దొమ్మరిది

ఆ. వె పీటిదాని పొందు విడువఁజాలక ...వేమన. 354.

**పీటిపట్టు** వి (వీడు+పట్టు) నగరము, పట్టణస్థానము

గీ .. కూరగాయ కట్టియ విల్చుకొనఁగవలసి, యునికి ప్రేపల్లెపీటిపట్టునకు దొరసె హరి వు. 6 5

2 వాసస్థానము

గీ అన్నపూర్ణావిశాలాక్షు కనుఁగొనెలియు, విశ్వనాథుని కందువ పీటిపట్టు లింగములకెల్ల గని ముక్తి లేమ నెలవు, కాశికాక్షేత్ర మాశ్రితకల్ప తరువు (సురాభాం 22)

**పీటిప్రోగు** విశే (పీటి+ప్రోగు) మిక్కిలి దుర్వ్యయము చేయువాఁడు

గీ నిగవ శర్మాభిధానంబు నేతిబీఱ,కాయయుము బోలె నయథార్థ గాథఁ దాల్చి, వైదికాచార దూరప్రవర్తనముల, పీట విహరించుచుండు న ప్వీటిప్రోగు (పాండు 3 13)

**పీటఁబాఱు** అ క్రి (పీటి+పాఱు) వ్యర్థముగాఁ బరువెత్తు

చ గజపతి వచ్చెనంచు నొక గంధగజంబు గుఱించి యొక్కఁడ క్కజపడి పల్కిన న్వెఱచి తానన భూమికి పీటఁబాఱి దారిజడత నిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీము, గ్గజపతి వచ్చె నా విని కలగుదు రీతని శత్రులందునున్. (నైష (5 133)

**పీటఁబుచ్చు** స క్రి (పీటఁబోవు) 1 చెఱుచు, నశింపజేయు

ఉ కయ్యముసేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ, వియ్యెడఁ దప్పితేని జగమే మను నించుక సేవు పోరులన్,డయ్యుటదప్పె నావయిఁ గడంగిన భీష్మునిపాటు సూతు రా,వయ్య రథంబుమీఁది కిటులాశ్రిత మానము పీటఁ బుత్తురే. భార భీష్మ. 3 269.

ఉ ... సంగ్రామము లోన దానవనికాయము నెల్లను పీటఁబుచ్చినన్, దీమసమెల్లఁ దక్కి తన డెందములోపల నుమ్మలించుచున్. మైరా. 1 1 139

గీ విబుధనాథుండు మానంబు పీటఁ బుచ్చి, కొలువవచ్చెద వన్నను నిలువరాదె. దశా. 2 114.

2 నష్టపఱుచు, త్యజించు

ఉ. చారుకులాభిమానమును సన్నుతధర్మము పీటఁబుత్తురే. భా రా. అర. 2 247

సీ ఇహపరసామగ్రి నీయఁజాలెడువట్టి విధి దేవ తార్చన పీటఁబుచ్చె శివరా 2 102.

చ శ్రుతులు పరిత్యజించి విధిచోదితకర్మము లుజ్జగించి సువ్రతములు గట్టిపెట్టి గరుపంపుఁ దపంబులు పీటఁబుచ్చి సత్క్రతువుల యానమాని సతతంబు నుదమ్మునె కొల్చుచుండు నా, శివపథి చాటఁగాఁబనిచె సింధు పరీతమహీతలంబునన్. (వి పు 2 103)

3 వ్యర్థముచేయు

వ. కులవృద్ధు లుపదేశించు బుద్ధులు వినక పీటంబుచ్చి విచ్చలవిడి నిచ్చట వెచ్చంబులు సేయం . . విక్ర. 2. 188.

సీ విట్టువీఁగి ధనంబు పీటఁబుచ్చితి ననుజన్ములు నామీఁదఁ జలమువూని, ధరణీశుతోఁ జెప్పి దండుగ తొంబదివేలరూపాయలు వేగఁగొనిరి చంద్ర. వి. 1. 17

ఉ. యోగి విలాసరేఖ వలువొందెడు నీయనయందు నంగనా, భోగవశాత్ముఁడై నిజ తపోమహిమంబులు పీటఁబుచ్చి లజ్జాగరిమల్ దొఱంగుటలు చాలక యీతఁడు దొంగకూటి కేలాగునఁ జొచ్చెఁ దాఁ దల పాలంబుల నిల్పునె సాదురేఁగినన్ విప్ర. 5 41

**పీటఁబోవు** అ క్రి (పీట+పోవు) 1. చెడు, నశించు

క ... ధైర్యము మానంబును పీటఁబోవఁ జాలెను, జననాయక నీమఱంది పరివారువగన్ భార ద్రోణ 1 363.

గీ. పిరె ఖచరాది ధైర్యముల్ పీటఁబోవఁ, జముచుమన్నారు నముచిసూదనుని సభకు, నిపుడు నీ పాలి కందరు నేఁగుదేరఁ, బోడఁగనఁగ రాక నిలిచెఁ గర్పూరతిలక కళు 2. 74.

2 దూషితమగు.

చ. కల యనరాదు రాములకుఁ గాములకూటము లెన్నిచందముల్, గల వవి యన్నియున్ వెలసెఁ గన్నెతోకం బిటు పీటఁబోయెఁ బెద్దలకును పెద్దయై తనరు తండ్రికిఁ దక్కునపాటు దెచ్చితిన్ ... హరి ఉ. 7. 91

ఉ. .. సాహసముం బరాక్రమము సత్కులజత్వము పీటఁబోవదే. (దశా 2 191)

3 వ్యర్థమగు

గీ పటికిపని తనచెల్మి పీటవోవ, నిన్నగదవమ్మ వింతపనిన్నియులపంచు, సుంటులంతలఁ బిల్లటీఁ జోడు లనిపె, ని తలోనన యీగర్వమేలవచ్చె కువల 5 48

చ .. తఁడును నేఁగి దాది యొడ లాదట జొచ్చి యథోచితంబుగా, నతివకు నపుటప్పటికి నా నృపపుత్త్రిని గూపవైభవోన్నతి వినిపించుచుండ మదినాటును నుండఁగ దానిచిత్తము,య్యతనిచేత నోటువడి యాటలు పాటలు పీటవోవఁగన్ భోజరా 5. 229.

**పీడఁబడు** అ క్రి విడువఁబడు (పీడన్+పడు) వేఱుగాను డు.

క పీడఁబడిన గుల్ఫంబులఁ, గూడఁగ సంధించిపట్టి గదములవడఁగాఁ, బీడించినఁ గూర్మాసన, మీడితమతి నెఱుఁగుదురు యమీంద్రులు దీనిన్ సీతారా 1 102

**పీడనాడు** స క్రి (పీడన్+ఆడు) విడనాడు,విడుచు

గీ పుట్టినిలు డించి యత్తయిల్ మెట్టినట్టి, కోడలి తెఱంగు చెఱకుచేన్ పీడనాడి, బందెదొడ్డికిఁ జను కోడె చందమొంద, సుపవనము కాసి తనయింటి కువిద చనియె రా వి 3 142.

సీ తపసుఁడు మార్గభేదము పీడనాడఁడే శీలనిందు వసింపలేఁడుగాక (విప్ర 2 65.)

సీ ముచ్చటై నాథుండు మోవిబల్మైన నొక్కవెలయాలినా యంచు పీడనాడు శశాం 4 31.

**పీడలి** వి. తృణవిశేషము

చ .వెనుతరు ప్రోల్ల బూదియును పీడలి పిచ్చుక బియ్య మెంద్రయున్ (ప్రబంధ. 200)

**పీడాకు** వి (పీడు+ఆకు.) విడియాకు, వేరాకు, సూచించు పత్రము.

సీ పీడాకు పవచక్రవిహాగదంపతులకు, పాయసాన్నము దేవపటలమునకు హా. వరాహా 2 28 పు

**పీడియము** వి (సం. వీటికా.) = విడెము, తాంబూలము, తములము.

సీ విచ్చేయుఁడు విభూతి వీడియం బందుకోజంగమ స్వామి నా సదనమునకు కాళ 1 35

సీ వీడియం బెడలించి విధు తన్నకనకాలు కాంచి కాంబువు పుక్కిలించి యుమిసి పొందు 1 193

మ పలుకుం దొయ్యలి మోవికాంతి గనయా బాగాలు నయ్యె తెచ్చె,కుక్కలఁబోలుం డెలనాకు లయ్యెవిద పల్కుల్వంటి కర్పూరం బులుకలతోఁ గూడిన వీడియం బొసఁగె నాకుం బద్మ నాభాప్సనా, కలనాపావనహ స్తకంకణ ఝుణ త్కారంబు తోరంబుగన్ పాండు 1 9

ఆ కంతు కాశిబొట్టు కమ్మలు కడియంబు శ్రీ లొక్కపన్నె చీర యొకటి రెండు, వీడియములె కాని విభవముల్ గలిగియు, వల్లకుండు దైత్య వరపుత్రి. (దశా 4. 58)

**వీడు** అ క్రి. (త వీడు) 1 వీడిపోవు

సీ. వీడిన పెన్నెఱివేణి విచిత్రనవీనాభ్రకైన కమ్మ విరులు గురియ (హరి పూ. 3 128)

గీ. చెలువయొక్కర్తు గట్టినచీర వీడిపడఁగఁ జను దెంచె ... (కు సం 8 65.)

చ అన విని మానినీతిలక మప్పుడు మే యఱ దోఁప నిక్కి, పడినకచపం క్తిఁ బిల్చరు ముడి న్వెడదోఁపుచు ... (పారి 1 124)

2 విచ్చిపోవు, ఊడు

మ. బలమెల్లన్ వెనుచిక్క నొక్కరుఁడు కుంభ ద్వాభుదర్పంబుననే, దలపుల్విడఁగఁ దన్ని ... దశా 4 100.

వ ... మగవాల బోరుతలుపులు వీడన్‌దన్ని ... ఉ రా. 3 22

3 జారిపోవు

గీ కళవసంబుండ జలకమండలువు వీడ, జడలు మహి జీరఁ జేజపసరము జాఱ, దర్భముడి వ్రేల ధ్యానతత్వంబు పోలఁ,గడిగి నిలుచుండి యాగ్ర హాగ్రహముఁ జెంది శుపల. 2 35.

4 తొలఁగు, వర్ధిల్లు

క. వాడక వ్రాలక తెవులుల, గూడక తగనెల్ల గెలుకొని నవకములై, చూడఁగ భద్రము లగుచును, వీడెన్ సస్యంబు లిదుమవీడెం బ్రజ కున్ భాగ. 10. పూ. 757

(ఇ నాలుగై దర్థముల కుదాహరణము)

ఉ బసియనామధేయము శుచిస్మతి యా చిగు రాకుఁబోడికిన్, వ్రీడయుఁ గేళిఛారమును వృత్తపయోధముఁ లిన్నితంబమున్, బాడబు గెమ్మెనంబు రతిభావము వోడన వాఁడు నాటి కిన్, వీడఁగఁజొచ్చె బాల్యమును వీడఁగఁ జొచ్చుఁ దదీయచింతతో కాశీ 3 211

నాలుగైదర్థములకిది యుదాహరణము)

5 శిథిలమగు, తగ్గు వశించు

క వీడు చదివించె నయ్యోధ, వీడని వేడుఁ బలారి... వసు 6 35.

దండకము ఈశాను బో న్నహోపేత నా గానన వ్యూహసన్నాహము శ్వీడ వెన్నాడి బాణాసుర స్ఫార బాహాసహస్రచ్చిదాకేళిమై నాతిలోకం బుఁ బాలింపవే (పారి 3 38)

6. విశదమగు, స్పష్టమగు.

క. అని వీడఁగఁ బల్కిన న, మ్మనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదం,బునఁ దన్నునెవరి చెఱుఁ గక, వనితను నిట్లనియెఁ గారవంపుఁ బలుకు లన్ భాగ విరా 2 51.

స. క్రి 1. విడిచిపెట్టు

చ కపటపు మాయబోగియగు ఖండశశాంక ధరుండు వృద్ధవేషముఁ దనరూపు వీడి వెలి చక్కిన యుండఁగ ... హం 2 70

మ జనరాడ్విప్యవివాహవైభవము మించన్‌రేయి రేరాజు వింటిచిన జ్యోత్స్నంబు వితానశశాంక సుమశ్రేణుల్ వెఱుల్ వీడఁగా ... వసు 6 41

సీ ... బోడన వీడి యచ్చో నిబ్బరపుఁ బర్వునె దాఁటఁదోడఁగె గంధర్వకులము, దశా 2. 60

2. విడిచిపోవు

గీ అవయవంబులు గైసేత లఖిలమించెఁ, జెవులు సంభోగవార్తల చవులుమరిఁగె, జనవరాత్మజు కంతను శైశవంబు, వీడి క్రొత్తగఁ బ్రాయంబు గూడునపుడు కవిక. 3. 14.

గీ. ... అటుతఁ బ్రాడుఁగట్టక సొగసెల్లఁ దటిమి యొడల, వ్రేలు వలరాచబలుబూచి వీడఁగలదె. నీలా. 1. 103.

వి వా. (క వీడు. త వీడు. బ వీడులు, వీళులు, వీళ్లు )

1. పట్టణము.

శా. వేమాఱు వన్నెలయానిలుం డదరి యాపీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెసముట్టియుండలి యలిప్రాతంబు బోఁకోపి. విక్ర 1 96.

ఉ. ... బలసూదను వీటికిఁ గొండవీటికిన్ ఆము. 1 37

చ ఇలఁ గల వీళ్లు సూడ మన మేటికిఁ బోవలెఁ బోయినన్ వవి, న్నిలువఁ బనేమి ... విజ 2 59

2. ఇల్లు, గృహము

సీ. వీడుఁ దని వీడు వెల్వడివచ్చి ఖాండిక్యుఁ డా రాజుఁ గనుగొని యాదరమున .. ఆము 3. 60

గీ ఎదురుగా వచ్చి జనక నరేంద్రుఁ డంత, వేమఁ గులమీఁద నంధించి మానవేంద్రుఁ, బురికిఁ దోడ్తెచ్చి తన సహోదరునివీడు, విడిది గావించి యులుప లెక్కుడుగ నొసఁగి దశా 7 228

3. పాళెము, స్కంధావారము, దండు విడియు చోటు

ఉ వీడు పాడుగాన విశ్రాంతి కియ్యెడ, మనము మనలవలదు మంగళార్థ,ముగ శుచిప్రదేశమున శేఁగి యచ్చోట, మచితవర్తన,ముల నుండ వలయు భార శల్య 2 350.

సీ. వాహనంబులు డిగ్గువారుమఁ బన్నులు విడుచు వారుమ దమవీడు లెఱుఁగఁ, దమతమ చిహ్నముల్ దవరఁగఁ గట్టించువారు ... కు. సం. 11. 600

ఉ. విడియువారు మఱియు వీడెత్తువారునై, వేల యూనినట్లు నిండఁబడిరి. భా రా యు 284

4 సేన, దండు

ఉ. ... పాండవకోటి కెప్పుడుం, జేటు దలంచియే బలువు సేసితి వైరము నాకు నింక వీ,వీటికి వారి వీటికిని వెక్కసమయ్యెడు శయ్యమొప్పగున్ భార భీష్మ 3 59.

సీ ఈ రెండు వీడుల తారతమ్యంబులు సెఱుఁగుదు, వొరైన నెవ్వరోర్తు,రు...భార ఉద్యో 2. 304

గీ రెండు వీళ్ళ జనంబులు రేలు వివిధ, హృద్య సంగీతములను సాహిత్యమధుర, లలిత గోష్ఠి వినోదంబులను బ్రమోద, భరితులై ప్రొద్దు పుత్తురు భరతముఖ్య భార. భీష్మ 2 343.

సీ వీటికి సమరస మాటోప మొదవ నాఖిల శంఖము దనప్రమోల ప్రమోయ భార కర్ణ. 1 60.

5 పథిక జనసమూహము, సమూహము, గుంపు.

క నడపించి పంచవటమున, విడియించెను వీడు చోరవీరులు గని యొక్కడు ధనములు గల వీ మొక్కడి ప్రజలో లేరు తీనిఁ గావఁగ యోధుల్ భార. హరి 180

క బృందారక పథమునఁ దిగి, యిందీవరపత్ర నేత్ర యిరువంకల వా,రుం దమకతమున యుటురా, యిందనఁగా రెండువీళ్ల యెడ మున విడిసెన్ హర. 6 101

చ గురుపతిఁగూడు రట్టువకుఁ గొంకనిమోదం .. చిత్రగతి మిన్నులఁ దాకెడు మాయలాత పెన్నిరులను పోడు కాలుకొని యేర్చు వెలుఁగుల వీడు వీడువో. వరాహ 4. 24

6 దొమ్మరులగుంపు.

గీ నేఁటి ప్రొద్దున దొమ్మరివీటితోడ, కాశికాపు రరుగంగఁ గాంచినాఁడ ... చెన్న 2. 317

గీ ... తండ్రిఁ బిలిపించి వార్తయంతయును తెలిపి వీడు దరలింపు మిప్పుడ వీడనిన. భీష్మ 2 304.

7. కట్నము

గీ ... మంత్రు లాప్తులు దొరలు సంబంధి జనుల వీడు చదివించి రెంతయు వేడ్కమెఱయ చంద్రా. 6 50

క వీడు చదివించె నయ్యెడ, వీడని వేడు బలారి ... వసు 6 35

8 సామ్యము.

సీ. అతివ వక్షస్థ్సలి నంద మొందుటఁజేసి, వీ కాయలు కొంత వీడువచ్చు ముకుంద 2. 99

విశే. విశదమైనది

ట్వి మాడలు బహువిధ మణిభూషణములు, పీడంచు వన్నెల వెలయు పుట్టములు వవ
నాథ 2 108 పా 2 పం

**పీడుకొను=పీడ్కొను** స క్రి. (పీడు+కొను)
1 పోయివచ్చెదనని విన్నవించివిడుచు.
గీ వ్రజనివాసుల నెల్లను వరుసతోడ, పీడుకొని తన్ను నందలు వేడ్కననుప, మధురకే తెంచె వ్రజములో మరిగి తాల్చి,యున్న వేషంబ యెంతయు నొప్పు నొసఁగ హరి ఉ 2 93.
క గురునకు శిష్యుఁడు నిచ్చలు పరిచర్య యొనర్చి భక్తిపరుఁడై విద్యల్, గఱవఁదగుఁ గఱచి దక్షముగ, గురుదక్షిణయిచ్చి పీడుకొనఁగావలయున్ (విజ్ఞా 2 35)
గీ. వెక్కసంబులఁ బొగడి సంప్రీతి నెఱపి, పీడుకొని పార్వతియుఁ దాను వృషవరాధి, రూఢుఁడై వెండిమలకు హరుండు చనియె ... పరమ 1 173
2 విడుచు, త్యజించు
గీ. .. విష్ణుఁ బొడఁగంటి భవములు పీడుకొంటి ఉ. హరి 2, 146
క గజభుజగాదుల దెసఁ గల, గుణిబిజికింగాక పీడుకొన్నది వోలెన్, భజియించి నిలిచె వలపటి, భుజమున విశ్వేశ్వరునకు భూసతి ప్రీతిన్. కావ్యా 5 46.
గీ అఖిల మోహినియైన య య్యబలరుఁబోణి, శైశవము పీడుకొన్నది సందుగాఁగ, నమదివంబును రాజనందనులమీఁద, వేఁటలాడుచు మన్నాఁడు విషమశరుఁడు నైష 3 26

**పీడుకొలుపు(ల్పు)=పీడ్కొలుపు** స క్రి (√ పీడుకొను) 1 పోయిరమ్మని సెలవిచ్చి పంపు
ఆ అనిన నట్లకాకయని సంజయుని పీడు, కొలిపి కొంతప్రొద్దు కురువిభుండు, కార్య చింత మునిఁగి కంచుకి వొక్కొరుఁ, బిలిచి వేగవిదురు బిలువు మనియె భార ఉద్యో 2. 16
క నారదుని మాధవుఁడు సత్కారంబున పీడుకొలుపగా నతఁడు హృదంభోరుహమునఁ గృష్ణునకును, వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్ (భాగ. 10. 679.)
గీ శారదానందగురుఁడు సుజ్ఞానపరుఁడు, పీడుకొలుపంగఁ జని నందవిభుని గాంచి విక్ర 3 57
క చనుదెంచె కలహభోజన,ముని రుక్మిణి పీడుకొల్పి. పారి 2 15
2 మీఁదికి నెట్టు, పైకిఁద్రోయు.
గీ సహజసౌజన్య సౌజన్య శంకరునకుఁ, బొసఁగ వర్ధించెఁ దత్కాలపుణ్యభిక్ష, సాంద్రోర్మ్యాలకూల కషంబులైన, పిగురాలిండ్లు పయ్యెద పీడుకొలుప (హర 5 48)
3 విడిచిపెట్టించు
సీ నారికేళావీట నవపుష్పకుహళికావితతి కన్నెలికంబు పీడుకొలిపి గీ... పొలసె నధ్వపరిశ్రాంతి పొడవడంగ మౌనివరుపైఁ గుమార వనానిలములు (భీమ 2. 62.)
4. వదలు, విడుచు, త్యజించు.
గీ ఎల్లకాలంబు మ కెద నిచట నేను మొదలి మామామ యారామపదమునందు వెండి గుబ్బలిపై వేడ్క పీడుకొలిపి, మేరునగ రాజుపైఁ జాల మెచ్చు వదలి భీమ 6 11
వ పురందరాది బృందారకుల పీడుకొలిపి శతానందుండు ... (హర 3 19)

**పీడుకోలు** వి (√ పీడుకొను) (బ. పీడుకోళులు, పీడుకోళ్లు.) 1 పీడుకొనుట, పోవననుమతించుట.
గీ కట్ట నిప్పించుకొని తాను గట్టనిచ్చి, చుట్టములకును లాతిరాజులకుఁ గరము, నెయ్యమును గారవంబును నెఱయఁ ప్రీతి, సాలగలిగించి తగ పీడుకోలొనర్చె హరి ఉ 3. 172.
సీ వెలయ వియ్యాలంది పీడుకోళ్లు గుడిచి వరఁబుపుల్ ముడిచిన నాపసాని కళా. 7. 85.
గీ. అంత వసుదేవుఁ డాదియౌ యాదవులకు, విందులును పీడుకోలును వింతవింత, ప్రియములును జేసి వసించెఁ గేకయవిభుండు, ముదిత శ్రుతకీర్తియును దాను వితతకీర్తి. ముకుంద 3 303.
2. విడుపు, విసర్జనము
సీ దైతేయమదవతీధమ్మిల్లములతోడ విరులనెత్తావికి పీడుకోలు (ఉ. హరి 3. 147.)
సీ. అనుపమంబైన నీఘనతరక్రోధంబు పిరులధైర్యంబు పీడుకోలు. భా. రా. యు. 1390.

మ తలపోఁతల్ దలకెత్తఁ దాల్మి సడలెం దాపంబు దీపించెఁ జేఁతలు డిందెన్, ధృతివీడుకోలు గొనియెన్ . . విక్ర. 4. 154.

3. చావు, మరణము.

క. వాఁ డల్ల వాఁడె పోయెడు, నేఁడతనికి వీడుకోలు నిజముగ నీ వా,పోడిమి చూచెద వే నొక, వాఁడా నిట నిల్చిచూడు వరవర తిలకా. భో. రా. 4 54.

**వీడుకోలుచేయు** స. క్రి. (వీడుకోలు+చేయు.) విడిచి పెట్టు, విసర్జించు

క ... వృథా, బద్ధంబు లఱచు జైనుని, సిద్ధాంతము వీడుకోలుసేయు మటన్నన్. ప్రబోధ 3. 50.

**వీడు(బ)చదువు** అ. క్రి. (పెంట్లి పంతితోఁ బఠో హితుఁడు) కట్నములు చదువు.

మ వరమేళానవయోజనసంభవులు దిక్పాలుర్ ప్రియంబొప్పఁగాఁ, బరమాహ్లాదము మీఱ సొండొరులు పైపై నిచ్చు పట్టాంశుకా,భరణ శ్రేణులు కేలఁ గైకొని సభాభాగంబునన్ నిల్చి సు,స్వరుఁడై దేవగురుండు వీడుచదివెన్ సర్వాగమమ్మూర్తులన్ దశ. 5. 77.

**వీడుచు = వీడ్చు** స. క్రి. (√ వీడు.) వీడఁజేయు, విప్పు

ఉ. విక్క ప్రసూనముల్ గురియు వేనలి వీడిచి కొప్పువెట్టుచోఁ, జొక్కుటఁ బెట్టి భూవరుని చూపులఁ గోమలిబాహుమూలముల్. నైష. 7. 104.

**వీడుకొడాడు** అ. క్రి. (వీడు+కోడు+ఆడు)

1. మాఱు మలయు, ప్రతిఘటించు.

గీ. మానికంబునఁ బుట్టిన మదచకోర,నేత్రపుంభావమునఁదన వేర్పుచూప, సౌఖ్యజలరాశిఁ దేలుచుఁ జతురశీతి, బంధముల వీడుకోడాడెఁ బార్థివుండు. వరాహ. 4. 162

ఉ. కూడిరి యొండొరుల్ దొరని కుంతల కాంతులొప్పంగి వీడుకో,డాడిరి శ్రేష్ఠుడాఁచెడు మదాళులతో ... రామా 1 206.

గీ. గగనగంగాతరంగసంగతములై వ, శిరము శివగేంద్రశిఖరసీమ, దిక్కులతో వీడుకోడాడు దిక్కులందు, ముదిత తోఁగఁజల్లు తెలిమొల్ల మొగ్గ లనఁగ (ఘటికా 2. 61)

2. పెనగొను.

ద్వి. వెఱవెఱపాటును విహ్వలత్వంబు, వెఱపుమఱపును వీడుకోడాడ రం. రా అయో. 96 పా 17. పం.

ద్వి మడువులు పసులకాల్మడికుప్ప చఱచెఁ, దోడుపుఁదొట్రును గడుదూరంబు లయ్యె, వీడుకోడాడెడు విటమిజాలములు, మోడులయ్యెపోయె నోడులుసేయ. అమర. 1. 44. పా. 24. పం.

3 సరిపోలు, సామ్యముపొందు.

వ. .. జడనిధితో వడయాడుచుండిన యోడలతో వీడుకోడాడు రథంబులును ... ఉ. హరి. 4 218

సీ విదియచందురుతోడ వీడుకోడాడెడు రమణీయదంష్ట్రాంకురముల వాఁడు .. పి శకుం 1. 5.

**వీడుకోడు** విణ. = విజ్ఞోడు (శ ర.)

**వీడుదోడు** వి (వీడు+తోడు) అంటునట్టి తోడు, సాగనంపు సహాయుఁడు

పీ పాథోధి రాధేయ పారిజాతములకు వీడుతోఁ డెవ్వని వితరణంబు (వి. పు. 1. 43.)

(ఇట పాదృశ్యద్యోతకము)

**వీడు(ఁబ)పట్టు** వి (√వీడు) 1 వాసస్థానము, ఉనికిపట్టు.

సీ ... వెలుఁగొందు రేయెండ వీడుపట్టిది యని రాజితంబగు పద్మరాగరుచులు ... కు సం. 3 261.

గీ వీఁడఁటే శౌర్యములకెల్ల వీడుపట్టు, వీఁడఁటే ధర్మములకెల్లఁ దోడఁబుట్టు, వీఁడె సాక్షాత్కరించిన విష్ణుమూర్తి, వీనిఁ గనుకంటె శుభములు వేఱు కలవె సీతావి. 1 42

వ. ... అ మ్మహీవరు నాదరంబు వడసి వీడుఁబట్టున కరగిన ... భార. శాం. 2. 364

2. బస, విడిది

చ అఱయక వంపుసేయుచు మహాశ్రమ భూములు వీడుపట్టుగా, లలనఁ దగన్ సుమంత్రుఁడును లక్ష్మణుఁడున్ గొనిపోయి తిమ్ములన్. నిర్వ. 9. 4.

గీ పీడుపట్టుగ మందార విపినవీథి, దివ్య సౌధంబు నందుఁ బ్రతిష్ఠఁజేసి, గారవించె యంత కుమారు కంటెఁ, బాండురాజతనూజు నాఁడలుండు హర 7 117

క ఎదురుకొని పీడుఁబట్టకు, ముదమారఁగఁదాన యనిచి ... (భార అశ్వ 4 136)

3 శిబిరము, స్కంధావారము, దండు విడియు చోటు

ద్వి పనివారి నందఱఁ బరఁగ నుచితవుఁ, బలుకుల నోడఁబడఁ బలిచి పీడ్కోలిపి, పీడుఁబట్టుకుఁ బోయి విశ్రాంతుఁడగుచు పల్నాటి 45 (బ్రా.)

**పీడుప(వ)డు** అ. క్రి (√ పీడు) (పీడు+పడు)

1. తాఱుమాఱగు, మాఱుపడు.

వ. అని బేలువెట్టి కూఁతురుం దానును జరుద్వ యంబు పీడువడ నుపయోగించి నిజగృహంబు లకుం జనిరంత. (వి పు 6 131.)

గీ ఒక్క వనిత గర్భంబు వేఱొక్కవనిత, గర్భమునయందుఁ బెట్టు నొక్కరుఁడు పూచి,పట్టి యాడఁగ వచ్చినయట్టి పలుకు,పీడువడఁజేయుఁ బరివర్తి విను మునీంద్ర మార్కం, 4 92.

2 భేదపడు, వేర్పడు.

క ఎలనాఁగలు మఱి తమలో,పల నృత్తాగములు పీడుపడ నాడుచుఁ గ్రొ,న్నెలదాలుచు వేలుపు క్రియఁ, గొలిచి మగుడి యేఁగునపుడు గుడిలో మూఱన్ హ్వా 8 168

3 తఱఁబడు.

5 శత్రుదేశములు పీడువడఁ దాఁకఁ గోల్కొని గుండెలు వగులంగఁ గ్రుమ్మి క్రుమ్మి విక్ర 4 111

సీ బోఁటికిఁ దోఁచినఁ బోలియుఁ దేకువ యను వెగడువఁ జెయ్యులు పీడువడఁగ భార విరా 2 70

**పీడుపాటు = పీడ్పాటు** వి (√ పీడుపడు) 1. మాఱు పాటు, వ్యత్యయము.

సీ నృపతి లేమను గేళినిపుణత్వ నోఱయుచో వెడ గుతో చెయ్యుల పీడుపాటు నిర్వ 8 60.

మ తన ము న్నాడిన మాటయున్ నిజముగాఁ దన్మానికిం బ్రీతిగా, మనుజుండున్ నెలతో లం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా,మి నియై యీగతి పీడుపాటమర భూమిందాన రక్షించుఁ బో,మ్మనివన్ వచ్చె వసిష్ఠుఁడామను సుతుం డారీతి రాజ్యస్థుఁడై భాగ 9 30

మనుజుఁడు = మనువుకొడుకు

(మనుజేంద్రుండు నెలన్ నెలం బురుషుఁడై, క ర పా)

సీ కాంత కంతట నంతతకంతుకేళి, వివిధ సంకల్ప వాసన పవలు రేలు, తనరు పులకలు కలవరింత లుమ మాట, పీడుపాటులు చెలులకు వెలఁ గానర్ప (కళా 6 215.)

2. విడుపు, విడుదల, విమోచనము

సీ సుతులు పుట్టిరయేని సతులకు మృత్యువువాలా యమై వెంటవచ్చెనేని, బ్రహ్మచేతను పీడుపాటే మియును లేకయుండునే నదుపాయ మొకటి లేదె ... భాగ 10. పూ 38.

**పీడువిడియు** అ క్రి దండుదిగు. శిబిరమేర్పఱచు కొను

వ. ఇట్లు సన్నద్ధులై వెలి పీడువిడిసి తమకు నను రక్తులైన రాజులపాలికిం దగు దూతలం బుచ్చిరి . (భార ఉద్యో. 1. 50)

గీ అతులితోత్సాహమున వేఁటలాడి యాడి, కడఁగి యచ్చోటనే పీడువిడిసెఁగానఁ, గర్ణయుగమునఁ దత్కన్యకాప్రలాప, కలకలధ్వను లాలించి జల దరించి ... శుక 1 386

**పీడె = పీడెము** వి (సం. వీటీ) తాంబూలము

క. నుమపగు నలి గానము విని, వనదేవత గరము మెచ్చి వానికి నొసఁగం, జనఁ బైఁడుల పీడెలు పుచ్చిన విధమునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెన్ (కు సం 4. 452.)

పైఁడుల పీడెలు = సువర్ణముతోఁ గూడిన తాంబూలములు.

**పీడెత్తు** అ క్రి. (పీడు + ఎత్తు) దండువెడలించు

గీ. రాజు పీడెత్తి చేసినఁ దారకభటాలి, యంబరాభోగనిజశిబిరాంగణమునఁ, గాలుకొలిపిన పావకజ్వాల లనఁగఁ, బ్రాచిఁ గనుపట్టె నవ సాంధ్యరాగరుచులు. (పారి 2. 65)

**వీడెము = వీడియము, వీడ్యము** వి (సం వీటీ) తాంబూలము.

సీ. దైత్యావరోధవధూయుతాధరములతో సొబగు వీడెములకుఁ జొక్కుతొదురు ఉ హరి. 8 147

సీ వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ వరిగింజ సోఁకటఁ బల్వరుసఁ దోమ . ఆము 1 60

క. వీడెము సేయని నోరును ... బూడిద కిరవైన పాడుబొందర సుమతీ. (సు శ. 99)

**వీడ్కొను = వీడుకొను** స క్రి. 1. పోయివచ్చెదనని విన్నవించి విడుచు.

క. ...మనము ప్రవాసంబు, బనుపడఁగఁ బ్రీతి వీడ్కొని,చనివర్తిల్లెను విత్కృష్ణరథఁగుమారా (భార శాం 5. 379.)

ఉ వేడ్కఁ బ్రణామపూర్వముగ విశ్వజగజ్జనకుల్ జనార్దనున్ వీడ్కొని యా జనార్దనుఁడు వేగమ కూడఁగరా నరాతు లీ, మాడ్కి మహోద్ధతిం జెనయ మా వశమాయన జోడు గైదువుం, బాడ్కికిఁ దోఁప శౌరియనుజుం డరిగెం దురగాధిరూఢుఁడై ఉ హరి. 4. 171

మ వినతుల్ సేసె దశాననుండు మమతన్ వేమాఱు దీవించు న, జ్జననిన్ వీడ్కొని కుంభకర్ణుఁడు కనిష్ఠభ్రాతయున్ వెంట రాఁ, జని (ఉ రా 2 157)

2. విడుచు, త్యజించు, విడచిపెట్టు

క. ఆ నిశిత మల్లవల్లవ, వీనులు సోఁకిన సమాధి వీడ్కొని జలద,ధ్యానమున నలరు శిఖగతి, నానందము నొంది మూచె హరి నరగఁటన్ వా రా 4. 84

చ. అప్పుడు విలంబమానమయి యంబరకోణ తటాంతరంబునం, దపముని మండలంబు బెడిదంబగు వేఁడిమి నొయ్య వీడ్కొనెన్ . . శివరా. 8 28,

చ. వినదనహర్తయైన రఘువీరునకుం దురవస్థ రాదు వీ, విభుడు దలంకి యొండొకటి యెున్నక మిన్నకయుంతు మన్న యి, వ్విపినమునందు నొంటి నిను వీడ్కొనరాదని లక్ష్మ నల్క

దో,నపువచనంబులాడ నవి సైఁపక వచ్చితి దేవ నావుడున్ రామా 5. 220

క అలతిర్యగన్వయాగ్రగణి,వలన నశేషంబుఁ దెలిసి వారక యతిమం,జులగతి వీడ్కొని రాజిలు, బలవద్రాగానువృత్తి భజియించె వెసన్ హ వ 2 59 (ఇది పై రెండర్థములకు నుదాహరణము.)

3 తప్పించుకొను

మ . నిదాఘాంశునా,వళి వీడ్కొన్నతమంబు గాంచి వనిలో వర్తించు మంచోయనన్ వసు 1 189

**వీడ్కొలుపు(లుపు) = వీడుకొలుపు** స క్రి పోయి రమ్మని సెలవిచ్చి పంపు, పంపు

క పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁ దలరు సొంపు వీడ్కొలుపుఁ బులిన్, లేఁబోకఁ బోఁక తోఁటల, పూఁబాళల కమ్మతావిఁ బొదవిన గాడ్పుల్ భీమ 1 95

ద్వి రేపు మాన్చెద నింత ప్రేఁగును మీకు, నని మహిప్రజలెల్ల నాదరం బెసఁగఁ, జనుఁడని వీడ్కొల్పె జననాథుఁడంత . హరిశ్చ పూర్వ 530

మ ... మ మాన్మపన్నులం ద్రోవ నా, యమతుల్ నీకెదురే జయింపఁగదవయ్యా యన్న లేన వ్వడా, మమరులొల్కొలుపుచు వారి వీడ్కొలిపి దైత్యచ్ఛేదనోద్యోగియై. ఉ రా 1 78.

క కుందుచుఁ జారుల మఱియుం, గొందఱ వీడ్కొల్పి భానుకులవీరుల పెం,పుం దెంపును గపివీరుల, చందంబును దెలిసి తాల్మిఁ జని యల నుండై (రా. మా. 7 208)

2. విడుచు, త్యజించు

చ ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహనీయ వేదనా,భర మఖిలంబు వీడ్కొలిపి భావమునం బరితోషమందుచున్ హర. 4 36

8. త్రోయు

వ. ... విబుధనిర్ఝరిణీపాథఃపూరంబునఁ బోటో ధరవీచీచక్రంబు వీడ్కొలుపుచు ... కాశీ. 6, 175,

**వీడ్కోలు = వీడుకోలు** వి 1. వీడుకొనుట, పోవ ననుమతి

మ ... మునివంశోత్తమునం బ్రహ్మపద్మము శిరం బుంజేర్చి వీడ్కోలతం, డొనరింపన్ జనిచెన్ బురంబునకు నిత్యోద్భాసితైశ్వర్యుఁడై వృసిం. 2. 48.

క తల్లియుఁ దండ్రియు వెలుఁగునఁ, బల్లవడన్ వారికడకుఁ బోయి తడయఁగా, నొల్లక పయనపు వీడ్కోలిల్లం దనయిచ్చ నడపి యేఁగెర వెడలెన్ భార. ఉద్యో. 4 162.

2. విసర్జనము, విడుపు

మ. ... చెక్కులు ఫాలంబు చెమర్పఁగ నెటతోర వీడ్కోల్ చెంద బంగారుగా, జలు టోకియ్యఁగ మార్పులెచ్చఁదలు అచ్చో నిక్కఁ దాళస్థిన్, దలయంచెన్ గనుదోయి సొక్క లోకకాంతా మౌళి మంగాంబికున్ ప్రబంధ 570

విశ విడిపించువాఁడు.

సీ. జలజగర్భుని చదువులచెలి వీడ్కోలు వరాహ. 5 59.

**వీడ్చు = వీడుచు** స. క్రి. (√ వీడు) 1. విప్పు, విడఁ జేయు.

క. తెలవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁగట్టిన వలువ వీడ్చి వేగుట తెలుం, గలపించి నీ కుమారుఁడు, వెలచుచు నది వలువ నగియె విహితమె సాధ్వి. (భాగ. 10. పూ 324.)

మ. కని సత్కారమణీయుతంబుగ నమస్కారంబు గావించి శౌ, మనికాటాహ్వ తకుంతలద్వయము నాత్మస్వర్ణ చేలాగ్రబం, ధనమున్వీడ్చి యెుసంగ నందుకొని మోదంబంది యా నందనం, దను దీవించుచుఁ జెంగటన్నిలిపెఁ జింతారత్న పీఠంబునన్ పారి. 3 25

చ. వెరవున జంటరైకముడి వీడ్చుటకుం గరకంకణంబులుం, హారువుగ మోవి యానుటకు ... (శృంగారరసమంజరి 2. 6.)

2. దొంగిలించు, ఒరులమూటలనువిప్పి వానిలోని వస్తువులు హరించు

చ. వెలయఁగ సొమ్ముతోడ ముడివీడ్చులఁ బట్టిన బటవ్రేలితోఁ, గలయఁగ బెద్దవ్రేల్నలికి క్రమ్మలి వీడ్చినఁ గాలుఁ జేయునుం, జలమునఁ దున్ని మూఁడవగుసారి సహింపక యూరెలుం గఁగాఁ, దలఁదెగవ్రేసి చంపుటుచితంబగు నాయకులైనవారికిన్ విజ్ఞా ప్రా కాం. 95.

**వీడ్పాటు = వీడుపాటు** వి (√ వీడు) వ్యత్యయము, అకటవికటము

క లింగంబుల వచనంబుల, ళంగులు హీనాధిక తలపాటియు వీడ్పాటుం గదిరిన మనముకు నిం, పుంగలుగం జేయు చంద్రుఁ బుధులుచితోక్తిన్. కావ్యా 5. 10

సీ కానఁడు నానాసేవకుల సేవ లెవ్వియుఁ గొనిన వీడ్పాటుగాఁ జనులు పనుచు. ప్రభా 2. 108.

వ ... అప్పుడు తమ నుతుధాన్తి మణిస్తంభ నామధేయంబులు స్త్రీత్వంబుల వెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొనిరి ... కళా. 5 107

**వీడ్యము = వీడియము, వీడెము** వి (స వీటికా-త. వీడైయం.) తాంబూలము

సీ వీనుల నరసోఁకు వీడ్యంపుఁదావుల పలుకరింపుల మేనుఁ బులకరింప. (అని. 3. 95)

ఉ, దూరముపోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్, ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యాహారము పెట్టి వీడ్యము సమర్పణచేసి విహారకయ్యపై, మారువుతో త్తిచిత్తమున కుబ్జోపచరించుట ధర్మమింతికిన్. కాశీ. 2 81

ద్వి. భూతి వీడ్యంబు తొప్పుగా నివేదించి ... పండితా. పురా 168.

**వీడ్వడు = వీడువడు** అ క్రి. మాఱుపడు

క. చరువులు నమ్మనిచెప్పిన, తరువులు వీడ్వడితె సుతకుఁ దల్లికి ... భార అను. 1. 111

గీ. పతియు భరియింపఁగావున భర్తయయ్యె, భామ భరియింపఁబడఁగాన భార్యయయ్యెఁ, బరఁగనవి మనయందు వీడ్వడియె నిమ్ను, చేననెల్లకాలము భరియింతుఁగాన భార. ఆది. 227.

క. ధరణీవరాహాలక్ష్మణుఁ, దని లక్ష్మి వహింప వచ్చునప్పుడు నగరి,తరుణుల తొడవులువీడ్వడఁ, బోరిఁ దొడిగెడు కౌతుకంబు పొల్పగుఁ జూడన్ (కావ్యా 1. 80)

2. తఱఁబడు

చ. తఱఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రముఁ దప్పెడుం గడున్, వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబుగాదు వీడ్వడియెడుఁ జెయ్యి యంగము గడంకదొఱంకెడు .. భార. భీష్మ. 3. 351.

ద్వి. పలుకులు వీడ్వడ భావంబు వెదల, తలఁపులు గరగంగఁ దన్మయత్వమున . . ద్వి భాగ. 2 39. పా.

3. తేఁటపడు

గీ. పాఠయు వీడయుఁబోలె వీడ్వడక మెలఁగి, యబల కంటికిఁ జప్పనై యంతయునమ్మ. విక్ర. 4. 198.

సీ. వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల కడలు దైవాఱెడు కరుణఁదెలుపు భాగ. 6 ౬౬3.

(ఇట ప్రతిఘటించు అని భావము)

4. బంధమునుండి తొలఁగు, తప్పుకొను.

ఉ నా సుతుఁ డింద్రజిత్తు కదనంబునఁ బన్నగ పాశబద్ధులం, జేసిన నిర్జరాదులకుఁ జెల్లదు వీడ్వడనట్టి కట్టులుం, బాసి పరాక్రమించెదరు వంత్రిరథాత్మజులు ... భా రా యు 1058.

5. విడిపోవు, శిథిలమగు

సీ. ఆమయాగ్రణి రాజయక్ష్మధాతువులు వీడ్వడి తాఱఁ జెదవులు దడుపుకొనియెను జై భా. 8. 17

వీణ సం వి ఆ. స్త్రీ. 1 వీణియ, తంత్రీవాద్య విశేషము. 2. విద్యుత్తు, మెఱపు. (మే ని)

వీణము=వీణాము . సన్నవస్త్రము, పలిపము, అంశుకము (శ ర)

వీణాదండము సం వి అ పుం. వీణెకు వెనుకవైపున నుండెడి కఱ్ఱ, ప్రవాళము.

వీణాము=వీణము వి వస్త్రము, అంశుకము

క. పన్నీట జలకమాడెను, సన్నని వీణాము గట్టెను వితులు దాటిమెన్ . . జై భా 3. 11

వీణాస్యుఁడు సం వి అ పుం నారదుఁడు.

వీణి సం వి న్ పుం వైణికుఁడు, వీణవాయించువాఁడు

వీణి(ణె)య వి కస్తూరిమృగము యొక్క కస్తూరియుండెడు బొడ్డుకాయ

వ కస్తూరి వీణెయలును బల్లి గడ్డలును ... శల్హా 3 (శ ర)

చ ... మంచిచొక్కపుఁ గపురంపు గిన్నియలు కస్తూరి వీణెలు రాశిగాఁగఁ గొం,డపొఁదపు దెచ్చి వైచి రచటన్ విజ వి 2 90.

వీణి(ణె)య వి. (సం. వీణా) విపంచి, వాద్యవిశేషము.

క పణాయత లోచన న్ప్రాణాయత చిత్రగాత్ర పాంచాలికయై, వాణియ యీ రూపోయన, వీణియ వాయించె నాగిఁ బ్రవీణత మెఱయన్ వైజ 1 118

ఉ వీణియ మ్రుట్టుటల్ మిగుల వింతలు పెంపులు చిల్కబోధతో, రాణ దలిర్పఁ బల్కుట కరంబపురూపము ... కళా 6 217

ఉ. . చేవడి వీణ మీటుటలు చిక్కెడలించుటలున్ సరింబడన్ ఆము 1 62.

వీణెకాయ వి (వీణె+కాయ) వీణకుఁ గట్టెడు తుంబీఫలము

సీ అతివ వతుస్థితి నందమొందుటఁ జేసి వీణెకాయలు కొంత వీడు వచ్చు ... ముకుంద 2 102.

వీణెపిల్లి వి (వీణె+పిల్లి) కస్తూరి మృగము. (చి.ని)

వీతంసము సం వి అ పుం 1 మృగములను, పక్షులను బట్టుకొనుటకు ఉపయోగించు త్రాడు, వల మొదలగునది 2 పెంపుడు జంతువులనుంచెడు పంజరము, బోను మొదలగునవి 3. ఆట కేర్పఱిచినచోటు (ఆ ని.)

వీతనము సం. వి. అ. పుం కంఠముయొక్క పార్శ్వభాగము, కంధరాపార్శ్వము.

**వీతము** సం. విశే. (అ ఆ అ) 1. పోయినది, గతమైనది. 2 విడిచిపోయినది, వెడలిపోయినది, 3 నిర్బంధములేనిది, స్వేచ్ఛగా నున్నది 4 తొలఁగింపఁబడినది, వినాయింపఁబడినది 5 అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది 6 మెచ్చికచేయఁబడినది, శాంతమైనది 7 శూన్యమైనది, లేనిది 8 కోరఁబడినది, అభిలషింపఁబడినది 9 ధరింపఁబడినది

వి. అ. పుం. యుద్ధానర్హమైన, లేక, యుద్ధమునకు సిద్ధముచేయని గుఱ్ఱము, లేక యేనుఁగు.

వి. అ. న. ఏనుఁగు నంకుశముతో పొడుచుట, మదముతోఁ దన్నుట

**వీతశోకము** సం. వి. అ. పుం. అశోకవృక్షము

**వీతసూత్రము** సం. వి. అ. న. పవిత్ర సూత్రము, జన్నిదము,

**వీతి** సం. వి. ఇ. పుం. గుఱ్ఱము

స్త్రీ. 1. గమనము, గతి, పరుగెత్తుట 2 పుట్టించుట, ఉద్భవింపఁజేయుట 3 (సుఖాది) అనుభవము. 4. తినుట 5 దీప్తి, ప్రకాశము. 6 శుభ్రముచేయుట, శుద్ధి

**వీతిహోత్రుఁడు** సం. వి. అ. పుం. 1 అగ్నిదేవుఁడు 2. సూర్యుఁడు.

**వీతెంచు** అ. క్రి. (వీచు + తెంచు) 1. వీచుచు వచ్చు.

క. అని యాదమఱచి పలుకఁగ, వెనుక దెసం జల్లగాలి వీతెంచిన గ్రక్కున నులికిపడి పదంపడి, హనుమంతుని దిక్కు చూచి యవ్విభుఁడనియెన్. రామా 7 46

దండకము ... ఉద్వేల శైత్యంబుతో గంధవద్గంధవాహోర్భిక శ్రేణి వీతెంచె దశా 4 282

2 శ్రవణగోచరమగు, వినవచ్చు

ఆ. కర్ణకర్ణ వచ్చి కావు మనాథుల, మైతి మను నెలుంగు లగ్గలముగ, బలములోన నెల్లఁగలయంగ వీతెంచె, నార్తి నెల్లముగ జనాధినాథ శార ద్రోణ 1 18

శా వీతెంచెన్ మధుమాస లక్ష్మి తరుణీహిందోళ రాగధ్వనుల్, వీతెంచెన్ బటుమీనకేతనముతో విల్లంది పూఁదేరిపైఁ, తోతెంచెం దలిరాకుఁగైదువుల ... పి. శకుం. 2 121.

గి విపిన వీథుల వీతెంచెఁ గుపితమదన, సమద భుజ వతనుమ ధనుష్టాంకృతములు ... మను 6.29.

**వీథి** సం. వి. ఈ ఇ. స్త్రీ. 1 రథ్య, బాట, త్రోవ. 2 శ్రేణి, పంక్తి 3 అంగడి, దుకాణము 4 ఇంటి ముందటి వైపు దర్శనము, డాబా 5. రూపకవిశేషము, దశవిధ రూపకములలో నొకటి

**వీథిక** సం. వి. ఆ. స్త్రీ. 1 వీథి, బాట 2 చిత్రకుడ్యము, చిత్తరువు వ్రాసిన దీర్ఘపటము

**వీధ్రము** సం. విశే. (అ ఆ అ.) శుభ్రమైనది.

వి. అ. న. 1 ఆకాశము 2 గాలి 3. అగ్ని

**వీది** వి. (సం. వీథి) వాడ, వీథి

క తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము వెలిఁగున్, మది మొలవఁ జక్రధరుపై, వదలక విమవీదిఁ బుష్పవర్షము గురిసెన్ ఉ హరి 1 122

లయగ్రాహి వీదులను గన్మలువు వేదుల మరుత్తరుల పాడుల సరోవర తటాదుల మణిప్రాసాదములఁ గేళిగిరిపాదములఁ దగ్గతప యోదముల బంధుగృహ బేదములఁ గాంచెన్. రామా. 6 111.

ద్వి వేడుక మది కొదవించు వీదులును, వీదులు దోఁచు మాణిక్యవేదులును ... ద్వి. హరిశ్చ. పూ 111.

**వీవాహము** సం. వి. అ. పుం కప్పు.

**వీని(నె)య** = వీణియ వి విశే.

వ కన్నియలన్ను చూపం బూఁదేనియలాని వీనియలయందుం బాడు నేర్పులకు మెచ్చి ... యయా 4. 13

(శ ర పా "తీనియల యందుం బాడు" ముద్రి. పా.)

**వీను** వి √విను కర్ణము, చెవి

చ మునిపతి వచ్చి పూవానఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్, వినుతి యొనర్పఁగా వినిన వీనుల మా చవిగాని మాటలన్, వివవలసెం గదా . . పారి 1 128

క. ఆ నెలఁతయు నవ్వులుకులు, వీనుల కెడఁ జేసి వాని విశ్రవు నతుఁగాఁ, దానెటిఁగి హీనుఁడనక య, హీనత నాతిథ్య మొసఁగి యిట్లని పలికెన్ ఉ. రా. 3. 108.

సీ. నిక్కి వీనులతోడ వెక్కసక్కెములాడు కరణి నున్నవి వీని ఘనభుజములు . మను 2 36.

**వీనుల తేనె** చెవులకింపు, శ్రోత్రానందము.

ఉ. వీనుల తేనెయై కురియ వింతగఁ గావ్యరసంబు గ్రోలి య,మ్మానవకోటికి నృసిం పీఠి. 1. 7.

**వీనులపండువు** శ్రోత్రానందము.

గీ. మత్తకోకిల నిర్భర మధుర కీర, భావణంబులు వీనుల పండువగుచుఁ, దనకుఁ దత్పురి కుపవ కాంతరములందు ... విక్ర 1. 93

**వీనులు చిల్లులు వోవుట** శ్రుతి కటువుగాఁ జెవులు పగులునట్లు తూఁటువడుట, శ్రుతి కటువుగా నుండుట.

వీనులు చిల్లులువోవ నా బొల్లిమాటలు వర్ణించిన ఫలమేమి ?

**వీనులవిందు** శ్రోత్రానందము, కర్ణోత్సవము, చెవుల కింపు.

క. కందువ మాటలు సామెత, లందముగాఁ గూర్చిచెప్ప నది తెలుఁగునకుం, బొందైరుచియై వీనుల, విందై మఱి కానిపించు విబుధుల మది కిన్. మొ రా. పీఠి 18

ఉ ... చుక్కరా, కోడు మొగంబు వారల యశోధనములన్ బగదాయ చూడ్కికిన్, వేడుక గొల్పరే విని వీనులవిందులు గావె తక్కథల్. రామా 7. 189

**వీనులకు విందు** వి కర్ణోత్సవము, శ్రోత్రానందము

సీ కడిఁది విల్లునియు చప్పుడు వీనులకు విందు సేయు నెప్పుడటంచు సీత దలఁప .. ఉ. రా. 1. 88

**వీనుమిగులు** అ క్రి (వీను+మిగులు) ప్రసిద్ధికెక్కు.

సీ. అర్థంబు కాశీపురాధాంగణంబునయందు నానా ప్రకారమై వీను మిగులు ... కాశీ. 2 49

**వీనులకంటి** వి (వీను+కన్ను) సర్పము, చక్షు శ్రవము.

ఉ వీనులకంటి తొయ్యలియొ వేలుపువెలందియొ జక్కి మోరలేఁ, జానయొ ... అచ్చ. రా. బాల. 144.

ఉ ... వీనులకంటి జన్నిదము ప్రేలెడు బొజ్జయుఁ గల్గుగుజ్జు వాఁ, డేనొనరించు కావ్యమున కెప్పుడవిఘ్నము సేయుఁగావుతన్. శుకచ. 1 14.

**వీనులచూపు** వి (వీనులు+చూపు) చక్షుశ్శ్రవము, సర్పము

ఉ వీనుల చూపు పెంపెదముఁ దవిల్చిన మంచము కోడికైదువుం, బూనిన ప్రాఁత వేల్పుఁ గని పోకులఁ బోయిన వెన్నుఁ డిట్లనున్ ఉ. హరి. 2. 172

**వీనెగాజులు** వి. బ బాలక్రీడా విశేషము

సీ. వీనెగాజులు పోతుటీసె గుజ్జంబులు నాట్ల కంబాలాట పట్టకోతి ... హంస. 3 146.

**వీపు** వి (ఇది సామస్వారమని శ. ర., ఈ క్రింది ప్రయోగములు నిరమస్వార మనుటకు నిర్ధార కములు.) పృష్ఠభాగము, వెన్ను

క. ఆపన్నగ ముఖ్యులఁదన, వీపువఁ బెట్టికొని పఱచి విపినములు మహో, ద్వీపములు గిరులు నిఖల ది, క్పాల పురములుఁ జూపెఁ జవహార లకున్. భార ఆది 2 44.

క వీ పెక్కిరమ్మ లంకా, ద్వీపముతోఁ గూడ నై వ దేవీ నిను నే,నేపునఁగొనిపోనోపుదు,నీవతి కడ కతిగడచి నిమిషములోనన్. భా. రా. సుం 305.

సీ. వృద్ధ కచ్ఛపరాజు వీపంఘ్రి పీఠంబు మకతతకం గిడి వెల్లి శిరముపాగ . హర 5 19

**వీపుగానరాదాఁగుట** వెన్ను కనఁబడునట్లు దాఁగు కొనుట (రహస్యముగా దాఁచికొన యత్నించియు దానిన బయలుపఱచుట.)

ఉ. కాఁ గడు వేగిరించెఁ గద తద్గతి నీవు నెఱుంగ నిగ్గునన్, లోఁగుచు నింతమండి యుఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీబలిమి నిప్పిత సిద్ధిగ వీపుగానరా, దాఁగుట దీనిపేరు నిజిడం బిది కాలికకెల్ల సాత్మలోన్. ప్రభా. 5 17.

**వీపుగోల** వి. (వీపు+కోల) వెన్నున మోఁదెడు బెత్తము

ద్వి మొగి బౌద్ధసమయుల ముక్కుపైఁ గత్తి,
యొగిని స్మార్తత సమయుల వీపుగోల పండితా.
వాద 173. పొ.

**వీపుఁబ్రేయు** = వెన్నునఁ బఱచు.
క అనిబెట్టిదంబు లాడుచు, జనపతి చూడంగ
సురుచి సవతికొడుకుఁ జయ్యన రెట్ట బట్టి
పొమ్మని, వెనుకకుఁ బడఁద్రోసి వీపు బ్రేసెన్
బెలుచన్ వి పు 2. 15

**వీప్స** సం వి. అ స్త్రీ 1 వ్యాప్తి, అంతటను
వ్యాపించుట 2. ద్విరుక్తి, చెప్పినది మఱలఁ
జెప్పుట
సీ... వీప్సయో కాని పూర్విలుకాని సఖునకు
నామ్రేడితమొ కాని యర్థిజనకు ... కాశీ.
4. 191
(బుధుని వర్ణనము ఇట వీప్స అనఁగా ప్రతిబింబము
అని అర్థము.)

**వీయను** అ క్రి (వి+అను) అంగీకరించు, ఒప్పుకొను.
గీ. అరిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడు కమ్మ.
వచ్చుటలు చెల్పి తేజీదువాలినోలి, నలసి
యున్నాఁడ నీవేఁగు మనుచు ననుప, నగు
మొగంబున వీయని వగరు వెడలి. కువల.
4. 212

**వీయపురాలు** వి (వీయము+ఆలు) వియ్యపురాలు,
కోడలి తల్లి, అల్లుని తల్లి, కొడుకు అత్త, కూఁతుకి
అత్త.
ఉ వీయపురాల వైతి గదవేయిపు, దత్తపు తొంటి
వావినో, తోయజనేత్రుఁ గాంచిన వధూమణి నీ
సుతఁ జెండ్లియాడఁగా, నాయము నా కుమా
రునకు వర్నిలి హత్తఁగ వత్త వావిచే, నాయువు
గల్గువాఁడవు వటంబ్రు శుభంబగు దీన నెంత
యున్ విజ వి 3 126

**వీయమందు** అ క్రి (వీయము+అందు) సంబంధము
చేయు
ఉ. ఈ వనజాత బంధుకులుఁడీ నిమివంశ్యుని తోడి
బాంధవ శ్రీక చలింపఁ బాటుట శచీధవుఁ
డీశుఁడు వీయమంది నన్మై వెలయించు చం.
రా. 3 103

**వీయము** = వియ్యము వి వైవాహిక సంబంధము

సీ బండారువుల తోడ నొప్పిదంబుగ వీయమందు
వారుగ నిశ్చయంబు చేసి ... దశకు 7 69.

**వీర** సం. వి. అ స్త్రీ. 1 వీరుని భార్య. 2 మగఁడును,
బిడ్డలును గల స్త్రీ 3. మురయనెడి సుగంధ
ద్రవ్యము 4 మద్యము 5 కలబంద. (వృ. వి.)
6 అరఁటిచెట్టు (వృ వి ) 7 ఉసిరికచెట్టు (వృ.
వి ) 8. కాకుకొల్లి. (వృ వి )

**వీరంధరము** సం వి అ. పుం 1. నెమిలి. 2 మృగ
ములతోఁ బోరాటము 3 చర్మ కవచము, తోలు
చొక్కాయి

**వీరకత్తి(త్తె)యు** వి (వీరము+కత్తియ) వియ్యపు
రాలు, జాయాపతుల తల్లులయం దొకతె కొకతె
వీరకత్తియ యగును అల్లుని తల్లియేని, కోడలి
తల్లి.
గీ కూరిమిని వీరకానికి వీరకత్తియకును దొలు
వేల్పు గొంగ యన్నకును మేఱియు ... నీలా
3 87

**వీరకము** సం వి అ. పుం కరవీరము, గన్నేరు
(వృ. వి )

**వీరకాఁడు** వి (వీరము+కాఁడు) వియ్యంకుఁడు,
భార్యాభర్తల తండ్రులు ఒకనికొకఁడు వీరకాఁడ
గును. అల్లుని తండ్రియేని, కోడలి తండ్రి యేని
వీరకాఁడగును
గీ అంతఁ గొడుకులఁ గోడండ్ర బందలముల.
నునిచికొని వీరకానిఁ దోడ్కొని చెలఁగుచుఁ,
బంతిచేరుల దొంగ్రోవపట్ట యరుగు, చున్నచో
నబ్బుగం బొప్పు నొక్క యెడను అచ్చ. రా
కాల 1. 198 (చూ. నీలా 3. 87 )

**వీరణము** వి డంగురము, చర్మవాద్య విశేషము.
సీ క్రొక్కాలు మెఱుఁగు లుక్కున స్రుక్కఁగాఁ
జేయువెలఁదుకల్ బంగారు వీరణములు ...
యయా 4 158
గీ నవ్న వీరణముల ప్రోఁత శంఖ కాహళార్భటీ
ఢక్కికా హుడుక్కారవములు ... రా. వి.
2 49.

**వీరణము** సం. వి అ న వట్టివేరు (వృ వి.)

**వీరణయురుము** వి. (వీరణము+ఉరుము; వృత్తి నివర్ణ
లోపము) చర్మవాద్య విశేషము,

వ డోలు గౌరు గుమ్మెత తమ్మెట వీరణ యురుమ యొంటికంటి యురుమ ... హంస. 3 29

**వీరతరము** సం. వి. అ. పుం. బాణము

వ. వట్టివేరు. (వృ. వి.)

**వీరతరువు** సం. వి. ఉ. పుం. 1 ఒకవిధమగు మారేడుచెట్టు, బిల్వభేదము. (వృ. వి.) 2 అర్జున వృక్షము (వృ. వి.)

**వీరతాంబూలము** సం. వి. అ. న. వీరత్వము చూపుటకుఁ బ్రతిజ్ఞ చేసి పుచ్చుకొన్న తాంబూలము.

ద్వి. పొంగుచు వీరతాంబూలంబు గొనుచు . పల. వృ 7. 896.

**వీరతాయెతు** మి. వి. వీరులు బిరుదుగా కట్టుకొను తాయెత్తు. క. మగజాతి వీర తాయెతు... చంద్ర. (శ ర.)

**వీరపట్టము** సం. వి. అ. పుం. వీరులు ధరించెడి యొక విధమైన వేషము.

**వీరపానము** సం. వి. అ. న. యుద్ధమునకుఁ బూర్వము ఉద్రేకము కలిగించుటకుఁ గాని, యుద్ధానంతరము ఖేదమును బాపుకొనుటకుఁ గాని యుద్ధభటులు త్రాగెడి మద్యము

**వీరప్రసవ** సం. వి. ఆ. స్త్రీ. వీరప్రసువు

**వీరప్రసవిని** సం. వి. ఈ. స్త్రీ. వీరప్రసువు.

**వీరప్రసువు** సం. వి. ఊ. స్త్రీ. 1 వీరునిగన్న తల్లి, వీరమాత. 2. మగశిశువును గన్నతల్లి

**వీరభద్రపళ్లెరము** మి. వి. (వీరభద్రుఁడు+పళ్లెరము) వీరభద్రునకు నైవేద్య మొసఁగెడు పెద్ద పళ్లెము

సీ... భౌమవారపు వీరభద్ర పళ్లెరమిడు గృహదైవతంబు లిట్టింకు లింక ... ఆము 4. 48.

వీరభద్రపళ్లెర మిడుట, ఒకానొక నైవార్చనము.

**వీరభద్రము** సం. వి. అ. పుం. 1 అశ్వమేధ యాగమునకు పనికివచ్చు గుఱ్ఱము. 2 వట్టివేరు (వృ. వి.)

**వీరభద్రుఁడు** సం. వి. అ. పుం. 1. శివునిచేఁ దవభటుల నుండి సృజింపఁబడిన యొక మహావీరుఁడు. 2. ప్రసిద్ధ వీరుఁడు

**వీరమద్దియలు**=వీరమద్దెలు వి. బ. (సం. వీర మధ్యమ్) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.

చ. తరుణుల వీరమద్దియల తాఁకునఁ జిందఱ వందలైన క్రొ, న్నురుగులతోడ శైవలము నూలుకొనంగ నితంబ పంక్తిపైఁ, బొరలుఁ దరంగ రాజ విరి పూవులు వీడిన కుంతలంబులం, బరఁగు పదంబులం దెలిఁగి పైఁబడ వేర్చు విటాళి కైవడిన్ ఉ. హరి. 5 64

గీ. వెండి మట్టెలు పిల్లాండ్లు వీరమద్దియలును నందెలు మొలనూళ్లు నంగుళీయ, కంకణాంగద హార తాటంక ముఖ సమస్త భూషణములు దాల్చి మార్చిమార్చి ప్రభా. 4. 188

సీ. మద్దెలు పిల్లాండ్లు మఱి వీరమద్దియ లిలమిఁ దొడంగెఁ దొయ్యలి యొకర్తు ... యయా. 4 89

**వీరమద్దెల** మి. వి. వాద్యవిశేషము

గీ. సమరసంగీత వివిధ వాద్యములతోన, కలయ విడిదిలో వీరమద్దెలలు నులిసె ... కు. సం 11 51

**వీరమద్దెలు** వీరమద్దియలు

**వీరమలహరి** వి. వాద్యవిశేషము

సీ. వేలుపుఁ బూఁబోండ్ల గేలిసేయు నొయారి చెలువలు దగ వీర మలహరులను ... యయా. 4 158.

**వీరము** వి. (సం. వీరః) వీరము, శౌర్యము

చ. గురుని యుపేక్షఁజేసి తనతున్ సమరోద్ధతి నెల్ల దాని నీ, వెరవిఁడి గానతేఁడు తన వీరము తాఁ గొని విఱ్ఱవీఁగెడున్ ... భాగ. ద్రో 2. 49

క. సైరంధ్రి సెప్పె నీ దగు, వీరమ్మును జెంపు లావు వెరవును మాకున్ ... భార. విరా 4. 84

**వీరము** సం. వి. అ. పుం. 1 శృంగారాది నవరసములలో నొకటి (ఇది దానవీరము, ధర్మవీరము దయావీరము, యుద్ధవీరము అని చతుర్విధము)

శా. వీరం బాఁడుఁదనంబు నొందెనవఁగా ...హరి ఉ. 4 15.

2 అగ్ని, యాగ సంబంధియైన యగ్ని. 3 అర్జున వృక్షము (వృ. వి.) 4 కరవీరము, గన్నేరు. (వృ. వి.)

వ 1 కర్కాటశృంగి (వృ వి) 2. కక్కెస. (వృ వి) 3 కామఁడుంప 4. మిరియము

**వీరముద్దియ = వీరముద్దె** వి. (సం. వీరముద్రికా) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.

వ మట్టియలు వీరముద్దియలు పాయ వట్టంబు లాదిగాఁగ యలంకారముల నలరించిరి నైష. 6 44

సీ. తళుకుఁ బిల్లాండ్లు బిబ్బిలి కాయలును మట్టియలు వీరముద్దెలు నందియలును ... కళా 7 66.

**వీరముద్రిక** సం వి ఆ. స్త్రీ వీరముద్దియ.

**వీరముష్టి** సం. వి ఇ పుం కోమట్లను యాచించుకొని జీవించెడు ఒకతెగ భిక్షుకుడు. (శ ర., వా)

**వీరరజము** వీరరజస్సు సిందూరము.

**వీరరజస్సు** సం. వి స్. న సిందూరము

**వీరరాఘుత్తుఁడు** వి. (సం వి. అ. పుం) శూరుఁడైన రౌతు

సీ. వీరరాహుత్తుల శూరతఁ బొలియించి తురగ సంఘంబుల ద్రుంచి వైచి ... పరమ. 4 159.

**వీరరేణువు** సం. వి. ఉ. పుం భీమసేనుఁడు. (త్రి ని.)

**వీరవట్టము** మి వి వీరులు ధరించు బిరుదు చిహ్నము.

ద్వి. ఘనితంపుఁ దిలకముల్ బాసికంబులును, వెస తోడి నడపులు వీరవట్టములు .. పండితా. పర్వ. 362 పొ

**వీరవతి** సం. వి. ఈ. స్త్రీ. జీవత్ పతిపుత్రి స్త్రీ. పతియుఁ బుత్త్రిలు బ్రతికియుండిన స్త్రీ.

**వీరవిప్లావకుఁడు** సం. వి అ పుం తక్కువ జాతి వారినుండి సంపాదించిన ద్రవ్యముతో యజ్ఞము చేయు బ్రాహ్మణుఁడు

**వీరవృక్షము** సం వి. అ.పుం అర్జునవృక్షము.(వృ వి.) 2. నల్లజీడిచెట్టు. (వృ. వి.)

**వీరసువు** సం. వి. ఊ. స్త్రీ. 1. వీరమాత. 2 పుత్త్రుని గన్న తల్లి.

**వీరసేనుఁడు** సం వి. అ. పుం. నలచక్రవర్తి తండ్రి

**వీరసైన్యము** సం వి అ న. వెల్లుల్లి. (వృ. వి)

**వీరస్కంధము** సం. వి అ పుం. ఎనుఁబోతు.

**వీరహుఁడు** సం. వి. న్ పుం. నిత్యాగ్నిహోత్రమును మానివేసిన బ్రాహ్మణుఁడు.

**వీరాణము** వి వీరణము. (శ ర)

**వీరామ్లము** సం వి. అ పుం ఆమ్లవేతసము, ఎఱ్ఱగోఁగు, పుల్లగోఁగు. (వృ వి.)

**వీరాశంసనము** సం వి అ న. 1. భయంకరమైన యుద్ధభూమి 2 కావలి యుండుట. 3 విరాధారమైన యాశ (వి: వ్యాస్సు)

**వీరాసనము** సం వి అ న 1 యోగులు మున్నగు వారు కూర్చుండెడి తీరులలో నొకటి 2 ఒక తొడ మీఁద రెండవపాదమును చి, మఱి క తొడక్రింద మఱియొకపాదమునుంచి కూర్చుండుట.

**వీరిఁడి** వి అవివేకి, మూర్ఖుఁడు, ప్రాచీనరూపము వీఱిఁడి.

క కూరలు పెరుగును మెసవెడు, వీరిఁడికంటె మోటువదవి వినరావేమా వేమ 3 222

విణ వివేకరహితము, మూర్ఖము

ఉ వీరిఁడి మాటలేల వినవే యలవాఁడెకలింత కన్యకా, తీఁముదన్ వసించి ... రాజ చ 3 52.

**వీరుఁడు** సం విణ (అ ఆ అ) 1 వీరరస ప్రధానుఁ డగు నాయకుఁడు (దాన, దయా, ధర్మ యుద్ధ వీరులు అని నాల్గు తెఱఁగుల వీరులు) 2 ధైర్యము గలవాఁడు 3. శౌర్యము గలవాఁడు. 4 శ్రేష్ఠుఁడు. 5. కులాచార సంపన్నుఁడు.

వి అ. పుం. 1 యోధుఁడు. 2. నటుఁడు 3. సూర్యుఁడు. 4 భర్త. 5. పుత్రుఁడు. 6 జిన దేవుఁడు 7. విష్ణుమూర్తి

**వీరుధ** సం వి. ఆ. స్త్రీ వీరుధము.

**వీరుధము** సం. వి ధ్ స్త్రీ 1. విశేషముగా నల్లుకొనెడి తీఁగ. 2. పొద, గుల్మము. 3. కొమ్మ, చిగురుఁగొమ్మ 4. నఱికిన తర్వాత చిగిర్చినచెట్టు

**వీరువారు** న బ. (వీరును + వారును) సామాన్యులు

వ ... గానలోకంబున వచ్చుటింతియ కాని మఱి వీరువారునుంబలెఁ బట్టణంబుల నెట్టుకొని యుట్టునట్టు మహిమలు పచరించువారము కాము. కళా 3. 41.

**వీరేశుఁడు** (వీరేశ్వరుఁడు) సం. వి. అ పుం. 1. కాశీపురమునఁగల శివుని యర్చావతార భేదము. 2. వీరులలో శ్రేష్ఠుఁడు.

**వీర్యము** సం వి అ న 1. వీరధర్మము, శౌర్యము, పరాక్రమము 2 బలము 3. పుంస్త్వము 4 ధైర్యము. 5 శక్తి, సామర్థ్యము (తపో వీర్యము). 6. మందుయొక్క మంచిగుణము 7. శుక్లము, రేతస్సు.

**వీటిండితనము** వి. అవివేకత, బుద్ధిహీనత

ఉ. ... ఏ, వాండొకరుండనే పలుక కూరక నేరక యుండఁజేయు వీటిండితనంబుచేత నిసిటింతలు వాటెడిఁ జిత్తమివ్వడున్ ఉ హరి. 4. 149.

**వీటఁడి** విశే. 1. అవివేకి, బుద్ధిలేనివాఁడు, లేనిది

ఉ ... వీటఁడియైన మానినికి వెండి వివేకము గల్గ నేర్చునే ... భార. ఉద్యో 8 107

(వేటఁడి శ ర హ)

ఉ వింతె తలుంతు నతఁడను వీటఁడిపాటుఁడు... శు. సం. 2. 84.

2. వెఱ్ఱి.

చ. వినవె తొలంగియున్ మఱియు వీటఁడి మాటలు వేయు నేటికిన్ భా కర్ణ 2 84.

ఉ. వీటఁడి చూపులున్ గులుచవిప్పను ... దశమ 10. 67.

ఉ ... క్రూరుఁడు మారఁడేనియుం, శీఘ్రము మీఱ వేయఁ డొకపెట్టున నెట్టనఁ బోవనట్టి యా, వీటఁడితీవ మేటి కని వేమరు వేమరు వేచుచుండఁగన్ కృ. శకుం. 2. 211

**వీలు**=వ్రీలు అ. క్రి. 1 చీలు, పగులు.

ఉ. కూలఁబడెం దిశల్ కుధరకూటము లుర్వికి రాలె నేల పాతాళముదాఁక వీలెబలద వ్రక రోదరముల్ చిరింగె .. రామా. 8 61

2. తగ్గు, క్షీణించు.

రగడ....వీలకొలు పమరె వరవిందములఁ గుంద ములు, శీలఁ దళుకొత్తఁగ మిళిందములఠెంద ముల.... రాఘ 2. 6.

ఉ. నెట్టన రేయినిం బగలు నేరమినెట్టునటంచు వేలుపుల్, నెట్టియుఁ గొట్టముల్ చలున వీల నిచే బలువొప్పు నొక్కఁడున్, బట్టము గట్టుకొన్న వృషపర్వుని కూఁతుర ... యయా. 3. 75.

3. కూలిపోవు.

చ కనుఁగవ వక్రపూరములు గ్రమ్మఁగ విడిన కాకపక్షమున్, వెనుకకు వీల దైన్యరస వేదన నిల్వఁగలేక యేడ్చుచున్ . వి పు. 2 16.

4. ఉపయోగపడు, పనికివచ్చు.

ఉ వేలక కాలజిత్ప్రముఖవీరులు మున్న కుశాకు గాహతిం, గూలిరి రక్తధారలు బుగుల్కొన లక్ష్మణుఁ బ్రోల . (జై. భా 6 197.)

వి అనుకూల్యము

ద్వి కాఁపు గేములలోఁజు గడితల తేఁజు, ధూపవాసన మేలుతోడవుల వీలు. ద్వి తి పా 1 3 పా 8 వం.

విశే అనుకూలము వ్యావ. ఆ పని వీలుగా లేదు.

**వీలుకొను** అ. క్రి (వీలు+కొను) అనుకూల్యము నొందు, అతిశయించు.

గీ తమ్ముఁ బెడఁబాసి వసుధామనుభాశరావ్య, క్రొత్తవలపంటి నవవింటి కొమరువంటి, నీటు కాఁడైన యుల తిప్పన్నపతిఁ జేర, విరహాగ్ని మంట తమయందు వీలుకొనఁగ శుచల 1 81

**వీలుపడు** అ క్రి (వీలు+పడు) అనుకూలమగు, సరిపడు

వ్యావ ఆ కార్యము చక్కఁజేయుటకుఁ బ్రయత్నించితిని గాని యది వీలుపడదయ్యెను

**వీవధము** సం వి అ పుం 1. కావిడి 2. భారము, బరువు 3. పెద్దవరి (వ్య వి) 4 బాట, మార్గము

**వీవధికుఁడు** సం వి. అ పుం 1 కావటివాఁడు, కావడిమోయువాఁడు 2 చిల్లర సరకుల నమ్ము వాఁడు, సామాన్యవర్తకుఁడు.

**వీవన** వి (√ వీఁచు) విసనకఱ్ఱ

గీ అనుచు వెతనొందు జనకుని యౌవనంబుఁ, దూఁచి యడలూన భాషించె సుందరాంగి, శాఁతిమై దాఁచపెట్టిన పావకంబు, వీవనం బునఁ బైపయి విసరినట్లు కృ శకుం. 3. 108.

సీ. నిద్దంపు నెత్తంపు గద్దియల్ సవరించి వలివాలి గాడ్పు వీవనలు వైచి అచ్చ రా అయో. 104.

సీ. ఘనరతి శ్రమజాత ఘర్మాంబు లార్పంగ వలి వలు వీవన వగుదుగాదె. భా. రా. కిష్కిం. 59.

**వీవని**=క్షీణగని క్షీణింపని, పూర్ణమయిన.

**వీవలి** వి (√ వీచు.) గాలి, వాయువు

చ విటపసమృద్ధభూజముల వీవలులన్ విరులన్ మరందలి, ట్పటలి వియత్ప్రదేశమునఁ బతులు వారిమరాళ మండలం బెటువలె . వేం పంచ. 2 174

చ అల వగరాదిమౌళిసరసాగ్రణులెంచఁ జరించు చల్లవీ,వలి తను భృంగకోటి గొలువన్ విట నేతయవంగ సొంపుమై, నలరెడి దిఙ్నీతతుల యందవుఁదావులు నెంది యుబ్బుచుం, గులు కులిగుర్చుఁ గన్నెలతకూనల మేల్వలపూని శొక్కుచున్ (చంద్రి 1 106)

ద్వి ... కువలయేక్షణలు, తావుల కొండ చెత్తావి వీవలలు, వీవవీవనలొయ్య వీవ నాకెంత ద్వి పకము 3 193 పా

**వీవలిచెలి** వి (వీవలి+చెలి.) అగ్ని, వాయుసఖుఁడు.

క వీవలిచెలి వనిచిన ము,క్తావళితో విభుని వక్ష మంతరాదెన్ దా,రావినత ప్రతిఫలన, శ్రీవిలసిత కనకధరణి భృత్తటపోల్కిన్ చంద్రి 6 41

**వీసబడి** వి (వీసము+బడి) గ్రామమునందు భాగ ప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము (శ ర., వా)

**వీసమంత** విజ (వీసము+అంత) మిక్కిలి కొంచము.

పంచచామరము. ఇవీయిసీ మొగంబుమీద కిల్లు వెల్వరించినన్, వెన న్వసింగిపోవు సిగ్గు వీసమంత లేదు.. విప్ర. 4 59.

ద్వి. వెరకుచు నొక్కచో వీసమంతయును, నాసక్తి లేక సాయంగేహులగుచు, భాసిల్లుచుండిరి ... (పరమ ద్వి 1 42 పా.)

ఆ. కుకవికీటములకు సుకవి కావ్యములోన, నెమక వీసమంత వెరసులేదు ప్రబోధ 1. 80

**వీసము** వి 1. రూకలోఁ బదునారవభాగము

గీ గ్రహణసంక్రమణాదుల కాచేనగరఁ, గాను వీసంబు వెడలమి గ్రాసమువకు, కాఁగవెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని .... మనుచ. 3 129

చ. వెలుపలవడ్డి కిచ్చినను వీసము వచ్చును వట్టు లారెడునో ... కుక. 2. 579.

వ ..మదాంధుఁడనై యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె. . ఆము 7 4.

2 ఒకదానిలోఁ బదునాఱవభాగము, మిక్కిలి తక్కువ భాగము

వ . పోంక మోపున వీసాలు 2 ... కొలుచు ఖండివీసాలు (ద. శా 935)

సీ మనరాజుతోడ ధీమంతు లూహించి నట్టి చెప్పిన వీసంబు తప్పఁగునే. రా వి 2 11

గీ బాలతమ కాంతితో సాటి పోల గోరి, వృత్తి ననల ప్రవేశంబు పెక్కుమార్లు, చేసి కలుషవులఁ బతెఁగాని, వీసమైనఁ, బోలఁగాఁ జాలదయ్యె జాంబూనదంబు రసి 2. 105.

గీ ... వీసమంతటి మాత్రంబు వెలితి ప్రష్ట. కాళీ 6. 277.

**వీసరపడు** అ. క్రి (వీసర+పడు)వెలితిపడు, కొఱఁత పడు, వీసరవోవు. (శ ర.)

**వీసరపుచ్చు** స క్రి. (√ వీసరపోవు) వెలితి పడఁ జేయు.

ఉ సత్యవతీతనూభవనృశంసత భీష్మునిఁ గుంతి జన్మ నాదిత్యకుమారు నూఁక వధి చితి రాజ్య మావిభూతి కౌద్ధత్యము తోడుతన్ వమరధర్మము వీసరపుచ్చి వంచనాకృత్యజమైన యీనిబిడకిల్బిష మేమిటఁ బక్కనెయ్యెడున్. (జై. భా 1. 56)

వ వదనమదిరామోదంబునం దదీయ దుర్వాసన వీసరపుచ్చం గర్ణంబునఁ బిసిఁ సనసమశర మంత్రంబు చెప్పి. (ప్రబోధ 3. 61)

**వీసరపో(వో)వు** అ క్రి వెడలిపడు, తగ్గు

అ ఈఁగకాలియంతయేనియు వీసర,పోవకుండధర్మ మునను నడచి,రయ్య దొంటిరాజుల క్రోధకామ ప్రయుక్తదండధరణ మొప్పుగాక (భార. శాం 2. 335.)

మ. ... పాంచాలిమానంబు వీ,వరపోకుండఁగఁ గాచినట్టి హరికిన్ సర్వంసహాభర్తకున్, గరుణావార్ధికిఁ గృష్ణమూర్తికి నమస్కారంబు గావించెదన్. శేష. 4. 70.

సీ. కోరి శిలాగేహకుడ్యభాగంబుల వ్రాయుదు రమ్మహీశ్వరునిమూర్తి, వ్రాసికన్యాత్వగౌరవము పీనరపోవ దర్శింతు గనురాగతరళ దృష్టి. నైష. 1. 70

వ. ... అప్పువ్వుదండ గ్రక్కునఁ గ్రమ్మఱించివిసరి కేసరంబులు పీనరపోవ, మకరందంబు చింద కోరలు విఱుగం బుప్పొడి పడలం .. హర 6. 16.

ఉ నీ సుగుణత్వమున్ తెలుపు నేర్పును నెచ్చెలు లెల్లఁ జెప్పఁగా, పీనరపోని మోహమున పీనుల విందుగ విందు .. (సాంగ. 2 56.)

సీ విధిమార్గ మొక్కింత పీనరపోకుండ, నర్హ పాద్యాదిక్రియాకలాప, మాచరించి .. హర 4. 55.

**పీనర(ము)** వి. (పీనము+అర.) తెలివి, కొలఁత. చూ: పీనరపోవు.

**పీసు(పిసు)** వి. ఉన్మాదవిశేషము, వలువది పలుమలు. (శ. ర., వా.)

**పీసెలు** వి. బ. భక్ష్యవిశేషము.

వ. కుడుములు దోసెలు పీసెలు రొట్టెలు .... ఆది గాఁగల భక్ష్యంబులు. హంస. 1. 105

## వు

**వు** అవ. 1. ఉదంతములైన నామపదముల మీఁదను గోళద్రుముమీఁదను ప్రథమైకవచనమున వచ్చు ప్రత్యయము.

ఉదా : విష్ణువు, ధేనువు, మధువు, గోవు మొ.

2. ఉదంతనామపదములమీఁది ప్రథమా బహువచనాది ప్రత్యయములకు వికల్పముగను, గోశబ్దమునకు నిత్యముగాను వచ్చు నాగమము.

ఉదా. తరు(వు)లు, మొ. గోవులు. గురు(వు)లు, బాహు(వు)లు.

3. ధాతువులపై వచ్చు మధ్యమ పురుషైక వచన ప్రత్యయము. ఇ, ఈ, ఐలమీఁద మున్నప్పుడు దీని యుత్వ మికారమగును కొన్నిమొడల ఈ ప్రత్యయము లోపించను వచ్చును.

క. ఎదురున్నరూపు పలుకఁగఁ, దుదిఁగటకటఁబడవు పీవు ... భార. ఉద్యో. 1. 362.

సీ. భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగఁ జెపిఎతివి నత్యావధూ ప్రీణనంబు. (ఆము. 1 13)

క. మన్నెఱుఁగుదెదిరి నెఱుఁగుదు .. భార. ఉద్యో 3 34

క. అవిభు ననంతరంబ ధ,రావలయము బూనితివు .. ఆము 1 33

4. ప్రథమాంతమయిన యుష్మద్విశేషణమునకు వికల్పముగవచ్చు నంత్యాగమము.

క బాలసఖుండవు నాకును ... భార. ఉద్యో 1. 378.

చ సుగుణవు పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజమెక్కఁగాఁ, దగుచరితంబునన్ నడచుధన్యవు. (భార ఉద్యో. 3 203)

**వృపూర్షువు** సం విశ. (ఉ) వరింప నిచ్ఛగించిన వాఁడు, ఎన్నుకొనఁగోరినవాఁడు.

## వృా

**వృార్ణము** సం. విశ (అ. ఆ. అ.) వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది.

## వృ

**వృంతము** సం వి అ న 1. ఆకు, పువ్వు మొదలగు వాని తొడిమ. 2 జోకకొమ్ము 3 చూచుకము, చను మొన.

**వృంతాకము** సం వి. అ. పుం. వంగచెట్టు. న. వంగకాయ.

**వృంతాకి** సం. వి ఈ. స్త్రీ. వంగచెట్టు.

**వృంతిక** సం. వి ఆ. స్త్రీ చిన్నకాఁడ.

**వృకదంశము** సం. వి. అ. పుం. కుక్క.

**వృకధూపము** సం. వి. అ. పుం. 1. కర్పూరతైలము 2 అనేక వస్తువులు కలసిన పరిమళ ద్రవ్యము.

**వృకధూర్తము** సం. వి. అ. పుం సృగాలము, నక్క.

**వృకము** 1. తోఁడేలు. 2 సివంగి. 3 నక్క, సృగాలము 4. కాకి. 5. గుడ్లగూబ. 6. కర్పూరతైలము. 7 అనేకసుగంధద్రవ్యములు గలసిన వస్తువు. 8 అగిసెచెట్టు. 9. జఠరాగ్ని. 10. బాఁకలి.

వృకారాతి సం. వి. ఇ. పుం. కుక్క-
ఇట్లే వృకారి.

వృకుఁడు సం. వి. అ. పుం. 1. దోఁచుకొనువాఁడు, దొంగ 2. క్షత్రియుఁడు 3. వృకాసురుఁడు.

వృకోదరుఁడు సం. వి. అ. పుం. 1. బ్రహ్మ 2. భీముఁడు, కుంతీసుతమధ్యముఁడు.

వృక్క- సం. వి. ఆ. స్త్రీ. 1. హృదయము, గుండె. 2. మూత్రపిండము, మూత్రముచేరెడు కడుపులోనుండు మాంసగ్రంథి.

వృక్కము సం. వి. అ. పుం. =వృక్క-.

వృక్ణము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడ్డినది, నఱకఁబడినది. 2. చీల్పఁబడినది. 3. పగులఁగొట్టఁబడినది.

వృక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. శుభ్రముచేయఁబడినది. 2. పఱపఁబడినది, వ్యాపింపఁజేయఁబడినది.

వృక్షకము సం. వి. అ. పుం. 1. చిన్నచెట్టు, మొక్క-. 2. చెట్టు, వృక్షము. 3. కుటజము, కొడిసెచెట్టు.

వృక్షకుక్కుటము సం. వి. అ. పుం. అడవికోడి.

వృక్షచరము సం. వి. అ. పుం. శాఖామృగము, క్రోఁతి

వృక్షచ్ఛాయ సం. వి. ఆ. స్త్రీ. చెట్టునీడ

వృక్షచ్ఛాయము సం. వి. అ. న. పెక్కు-చెట్ల నీడ, దట్టమైన నీడ

వృక్షధూపము సం. వి. అ. పుం. 1. కర్పూరతైలము 2. దేవదారువృక్షము.

వృక్షనాథము సం. వి. అ. పుం. రావిచెట్టు

వృక్షభిదము సం. వి. ద్. స్త్రీ. గొడ్డలి

వృక్షభేది సం. వి. న్. పుం. 1. గండ్రగొడ్డలి. 2. ఉలి.

వృక్షమర్కటిక సం. వి. ఆ. స్త్రీ. ఉడుత

వృక్షము సం. వి. అ. పుం. చెట్టు.

వృక్షరుహా సం. వి. ఆ. స్త్రీ. 1. బదనిక. 2. లతావిశేషము.

వృక్షవాటి సం. వి. ఈ. స్త్రీ. ఉపవనము, చెట్లతోఁపు.

వృక్షవాటిక సం. వి. ఆ. స్త్రీ. = వృక్షవాటి

వృక్షశాయిక సం. వి. ఆ. స్త్రీ. ఉడుత।

వృక్షాంఘ్రి సం. వి. ఇ. పుం. వృక్షమూలము, చెట్టువేరు.

వృక్షాదనము సం. వి. అ. పుం. 1. వడ్రంగి, యులి, విదారణము 2. గండ్రగొడ్డలి. 3. రావిచెట్టు. 4. ప్రియాలవృక్షము.

వృక్షాదని సం. వి. ఈ. స్త్రీ. బదనిక

వృక్షామ్లము సం. వి. అ. పుం. 1. మారేడుచెట్టు న. చింతపండు.

వృక్షాశ్రయి సం. వి. న్. పుం. 1. ఒకజాతి చిన్న గుడ్లగూబ 2. పక్షి

వృక్షోత్పలము సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగుచెట్టు

వృజనము సం. విశే. (అ. ఆ. అ.) 1. కుటిలము, వంకరయైనది. 2. నశ్వరము, నశించు స్వభావము గలది

వి. అ. పుం. 1. వెంట్రుక 2. ఉంగరములవలెఁ జుట్టుకొనిన జుట్టు, అరాళ కేశము

న. 1. పాపము 2. దుఃఖము 3. ఆకాశము, 4. కంచెవేయఁబడిన పొలము. 5. బలము. 6. యుద్ధము, పోరు.

వృజినము సం. విశే. (అ. ఆ. అ.) 1. వంకరయైనది, వక్రము 2. దుష్టము, చెడ్డది, పాపముగలది.

వి. అ. పుం. 1. వెంట్రుక, ఉంగరమువలెజుట్టుకొనిన జుట్టు.

పుం., న. బాధ

న. 1. పాపము 2. ఎఱ్ఱనితోలు

వృజినుఁడు సం. వి. అ. పుం. దురాత్ముఁడు, దుష్టుఁడు

వృతము సం. విశే. (అ. ఆ. అ.) 1. వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది 2. ఆచ్ఛాదింపఁబడినది, కప్పఁబడినది 3. దాఁచఁబడినది 4. ఆవరింపఁబడ్డినది, ఆవరణచేయఁబడినది. 5. అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది. 6. అద్దెకుఁ దీసికొనఁబడ్డినది. 7. చెఱుపఁబడినది 8. సేవింపఁబడినది. 9. మార్పుగలుగఁజేయఁబడినది. 10. వలయాకారము గలది, వర్తులము.

**వృతి** సం. వి. ఇ. స్త్రీ 1. వరించుట, ఎన్నుకొనుట. 2 దాఁచుట, కప్పుట. 3 అడుగుట, వేఁడికొనుట. 4. ప్రార్థన. 5. ఆవరించుట, చుట్టువాఱుట 6. ఆవరణము, కంచె, ప్రాకారము.

**వృతింకరము** సం విణ (అ ఈ. అ) ఆవరించునది, చుట్టువాఱునది

వి. అ. పుం. వికంకతము, కానరేఁగు (వృ వి)

**వృత్తకర్కటి** సం. వి. ఈ స్త్రీ కర్బూజ (వృ వి.)

**వృత్తగంధి** సం వి. ఇ. న. (వృత్తముయొక్క లేశముగలది.) ఒక విధమగు గద్యము

శ్లో. భవత్యుత్కలికా ప్రాయం సమాసాఢ్యం దృఢాక్షరం, వృత్తైకదేశసంబంధాత్ వృత్తగంధి పునః స్మృతమ్ (వాచ.)

**వృత్తచూడుఁడు** సం విణ (అ అ అ) కేశఖండన సంస్కారము జరిగినవాఁడు (ఇష్ట్లే · వృత్తచౌలుఁడు.)

**వృత్తతండులము** సం. వి అ పుం. యావనాళము, జొన్న. (వృ. వి.)

**వృత్తపుష్పము** సం. వి అ. పుం. 1 వానీరము, ప్రబ్బలిచెట్టు 2. శిరీషవృక్షము, దిరిసెన చెట్టు 3. కదంబచెట్టు, కడిమిచెట్టు. 4 కుబ్జకము, గులాబిచెట్టు 5. ముద్గరము, పుష్పవృక్ష విశేషము.

**వృత్తఫలము** సం వి అ పుం 1. రేఁగుచెట్టు 2. దాడిమ వృక్షము.

న. మిరియము

**వృత్తబీజము** సం. వి అ పుం 1. కంది (వృ వి) 2 బెండ. (వృ వి)

**వృత్తము** సం. విణ. (అ అ అ) 1 ఉన్నది, స్థితము 2. సంభవించినది, తటస్థమైనది. 3. ముగిసినది, సమాప్తమైనది. 4. చేయఁబడినది, ఆచరింపఁబడినది. 5. కడచినది, అతీతము (కాలము) 6 గుండ్రమైనది, వలయాకారమైనది 7 చేనిపోయినది. 8 దృఢమైనది. 9. వరింపఁబడినది, చదువఁబడినది 10 పుట్టినది, ఉద్భవించినది. 11 ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది. 12. ఆవరింపఁబడినది, కప్పఁబడినది. 13. వెనుకకు దిరిగినది, మరలినది

వి. అ. పుం. తాఁబేలు

న. 1. సంగతి, వృత్తాంతము 2. చరిత్రము. 3. వర్తమానము. 4. జీవనపద్ధతి 5. ప్రవర్తనము, నడవడి (సద్వృత్తము, దుర్వృత్తము.) 6. పూర్వాచారము 7. వలయము 8 పద్యభేదము

**వృత్తాంతము** సం. వి అ పుం 1. సంగతి, జరిగిన పని, 2. వర్తమానము 3. చరిత్రము, కథ 4 విషయము, ప్రసంగము. 5 విధము, రకము 6 పద్ధతి, ప్రకారము. 7 అవసరము, తఱి 8 స్థితి, అవస్థ 9. మొత్తము, వెరసి, సముదాయము 10 విశ్రాంతి, తెరపి. 11. ఏకాంతస్థితి 12 గుణము, స్వభావము

**వృత్తానుపూర్వము** సం విణ. (అ అ. అ.) అంటోఁక గాను గుండ్రముగా నున్నది.

**వృత్తానువర్తి** సం విణ (న్ నీ న్) విధేయుఁడు, చెప్పినట్లు చేయువాఁడు

**వృత్తి** సం వి ఇ స్త్రీ. 1. ఉనికి, ఉండుట. 2. నివసించుట. 3. బ్రదుకు, జీవనము 4 అవస్థ, స్థితి. 5 వ్యాపారము, పని 6. పద్ధతి 7 స్వభావము, నైజము. 8. వ్యాపారము, ఉద్యోగము, జీవనపద్ధతి. 9. జీవిక. 10 వేతనము, కూలి 11 (వేదాంత) అంతఃకరణ పరిణామము 12. సత్ప్రవర్తనము, మంచి నడవడి, ప్రవర్తనము, నడవడి 13. వ్యాఖ్య, టిప్పణి 14. చుట్టుతిరుగుట. 15 పరిధి, వర్తులము యొక్క కైవారము 16 (వ్యాక) సమాసాది (కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము, సనాద్యంతధాతువు అని పంచవిధములు.) 17 శబ్దశక్తి (అభిధ, లక్షణ, వ్యంజన అని త్రివిధము.) 18. కావ్యరచనా విశేషము, కైశిక్యాది (కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి అని చతుర్విధము) 19. వంశపారంపర్యముగ వచ్చు మాన్యము. 20 ఆలోచన, అభిప్రాయము.

**వృత్తికర్షితుఁడు** సం. విణ. (అ అ· అ) జీవిక (జీవనాధారము) లేక బాధపడెడివాఁడు

**వృత్తిచ్ఛేదము** సం వి అ పుం జీవిక చెడఁగొట్టుట, జీవనాధారము పోఁగొట్టుట

**వృత్తిస్థము** సం. వి. అ. పుం. తొండ, ఊసరవిల్లి

**వృత్తిస్థుఁడు** సం. విణ. (అ అ అ.) 1. వృత్తిలో నున్నవాఁడు, మంచిస్థితి యందున్న వాఁడు 2 మంచి నడవడిగలవాఁడు.

**వృత్తౌజ(స, స్క)ము** సం విణ స్ 1 బలము గలది. 2 బీజశక్తి నశింపనిది.

**వృత్త్యనుప్రాసము** సం వి. అ పుం ఒక విధమైన శబ్దాలంకారము (ఒకటి గాని, రెండు గాని మూఁడుగాని వర్ణములు పద్యమున మరల మరల వచ్చినచో వృత్త్యనుప్రాసము.)

ఉ చొక్కపుటుక్కు క్రిక్కిఱిసి ప్రుక్కక పెక్కువ వక్కఱంపుట, స్నెక్కక ... కావ్యా. 6 16.

**వృత్త్యుపాయము** సం వి అ పుం జీవనోపాయము, జీవనాధారము

**వృత్రము** సం వి. అ పుం. 1 మేఘము 2 చీకటి, 3. ధ్వని. 4 చక్రము 5 పర్వత విశేషము. (మే ని.)

**వృత్రశత్రువు** సం వి ఉ. పుం. ఇంద్రుఁడు

**వృత్రద్వి(ట్టు)షుఁడు** సం వి ష్ పుం ఇంద్రుఁడు, వృత్రశత్రువు

**వృత్రహుఁడు** సం వి న్ పుం. 1 వృత్రాసురునిఁ జంపినవాఁడు, ఇంద్రుఁడు

**వృత్రుఁడు** సం. వి అ పుం 1. ఇంద్రునిచేఁ జంపఁబడిన యొక రాక్షసుఁడు 2 శత్రువు

**వృథపుచ్చు** స క్రి (√వృథపోవు.) వ్యర్థపఱుచు, నిరాశ చెందించు

క. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ నొరువేఁడ కుండునది యభిముఖులై, వచ్చిన యాశార్థుల వృథ.పుచ్చకచేయునది సర్వభూతప్రీతిన్.(భార ఆది 3 304)

సీ అంగదవర్థించినట్టి యభ్యాగతు వృథపుచ్చ కొక జాడఁ బ్రీతిఁదనిపి విజ్ఞా ప్రా కాం. 140.

**వృథపోవు** అ. క్రి. (వృథ+పోవు) వ్యర్థమగు.

ఆ. వినుఁడు పడుచులార వృథపోదు నామాట .. వరాహ 11 80

**వృథా** సం అవ్య. (దీనికి తెనుఁగున ప్రాస్వాంత రూపము గానవచ్చుచున్నది. చూ వృథపుచ్చు, వృథపోవు.) 1 వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా నిరుపయోగముగా. 2 అనావశ్యకముగా 3. తప్పుగా, అవర్థ్యముగా.

(ఇది విశేషణార్థమందును బ్రయుక్తమగును)

ద్వి. బలియులై తమదృష్టిఁబడువారినెల్ల, జలజ సంభవ వృథా చంపుచున్నారు రం రా.బాల 40. పా. 1 పం

చ తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ము వృథావిరులెత్తిచేసె మో.పరులుగఁ జైత్రుఁడంచు. ఆము 5 126

శా ఏలాచేసితి దుష్ప్రతిజ్ఞ యిఁకఁ జండీశాన కోదండ మీ, బాలుం డెక్కిడఁజాలకుండిన వృథా పంపింపఁగా నేర్తునే,.. దశా 7 195.

**వృథాకథ** సం. వి అ. స్త్రీ వ్యర్థసంభాషణము.

**వృథాట్య** సం వి ఆ. స్త్రీ వ్యర్థముగాఁ దిరుగుట.

**వృథామతి** సం విణ (ఇ) మూఢబుద్ధి గలవాఁడు.

**వృథామాంసము** సం. వి అ న. దేవతోద్దేశముగాని పితృదేవతోద్దేశముగాని లేకయే చంపఁబడినజంతువు యొక్క మాంసము

**వృద్ధ** సం వి ఆ. స్త్రీ 1 మునలిది, వృద్ధురాలు. 2 వంశస్థురాలు, వంశములోనిది.

**వృద్ధకాకము** సం వి. అ పుం మాలకాకి, కాకోలము.

**వృద్ధదారువు** సం వి ఉ న సముద్రపాల (వృ వి)

**వృద్ధనాభి** సం విణ. (ఇ) తుందిలుఁడు, పెద్ద బొజ్జ వాఁడు

**వృద్ధము** సం. విణ (అ ఆ. అ) 1. పెరిఁగినది, వృద్ధి బొందినది, పూర్తిగాఁ బెరిఁగినది. 2 గొప్పది, విరివియైనది 3 రాశియైనది, ప్రోగయినది.

వి అ న 1 సాంబ్రాణి 2. (వ్యాక) మొదటి యచ్చు వృద్ధిసంజ్ఞ గల పదము,

(ఆ, ఐ, ఔ ఇవి వృద్ధిసంజ్ఞ గలవి)

**వృద్ధరాజము** సం వి అ పుం. ఒకజాతి గోఁగు. (వృ వి)

**వృద్ధవాహనము** సం వి అ పుం మామిడిచెట్టు.

**వృద్ధశ్రవు(వసు)ఁడు** సం. వి స్. పుం. ఇంద్రుఁడు

**వృద్ధసూత్రకము** సం వి అ న ఇంద్రతూలకము, గాలిలో నెగిరెడి దూదితోఁగూడిన ఒకజాతి విత్తు.

**వృద్ధాంగులి** సం వి ఇ స్త్రీ. 1. బొటనవ్రేలు. 2 పెద్దవ్రేలు.

**వృద్ధాచారము** సం. వి అ పుం పూర్వాచారము, చిరకాలమునుండి నిలిచియున్న యాచారము

**వృద్ధి** సం వి ఇ. స్త్రీ 1. పెరుఁగుట, అధికమగుట (తపోవృద్ధి, జ్ఞానవృద్ధి మొ) 2 హెచ్చుగుట (చంద్రకళలయొక్క వృద్ధి) 3 ఐశ్వర్యము (అభివృద్ధి, సమృద్ధి) 4. జయము, మంచిస్థితి. 5 ధనము, సొత్తు

వృద్ధిజీవిక సం. వి. అ. స్త్రీ. వడ్డివలన జీవించుట

వృద్ధిత్రిపము సం వి. అ. న. శస్త్రచికిత్సకుపయోగించు రెండువైపులను వాడిగల యొకవిధమగు కత్తి.

వృద్ధిమంతము సం. విశే. (శ. మతి శ.) 1 వృద్ధి కలది, పెరుగునది. 2 ధనవంతము, ఐశ్వర్యము గలది. 3. అభివృద్ధిలోనున్నది

వృద్ధిశ్రాద్ధము సం. వి. అ న. పుత్రజననము మొదలగు శుభసమయములయందు విశ్వేదేవతల నుద్దేశించి చేయఁబడు శ్రాద్ధము, నాందీశ్రాద్ధము.

వృద్ధ=వృద్ధుఁడు సం. విశే. (అ. అ. అ.) వృద్ధుడు, ముసలివాఁడు, జ్ఞానవృద్ధుఁడు, వయోవృద్ధుఁడు.

క. వృద్ధని జాత్యంధుండని, బుద్ధివిహీనుఁడని నిన్నుఁ బుత్రుఁడు బలద,ర్పోద్ధతుఁడై మెచ్చఁడవం,బిద్ధంబుల కాని వినఁడు పలికిన పలుకుల్. (భార. అర 1. 388)

సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ. భార సభా. 2. 11.

ఉ. వృద్ధు వచ్చునపుడు వినుకాలు ప్రాణంబులెగయుఁజూచు ... (భార. అను 4. 101.)

వృద్ధు(ఁడు) సం. విశే. (అ. అ. అ) 1 పూర్తిగాఁ బెరిగినవాఁడు. 2. వయసుచేఁ బెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు. 3 (సమాసాంతమున) పెద్దయైన వాఁడు, (వయోవృద్ధుఁడు, జ్ఞానవృద్ధుఁడు, ఆగమవృద్ధుఁడు, ధర్మవృద్ధుఁడు మొ.) 4 బుద్ధిమంతుఁడు, చదువరి, విద్యావంతుఁడు.

వి. అ. పుం. ముసలివాఁడు 2. గౌరవముగల వాఁడు 3 జ్ఞాని, సంజ్ఞాని 4. వంశస్థుఁడు, వంశములోనివాఁడు.

వృద్ధోక్షము సం వి. అ. పుం. ముసలియెద్దు.

వృద్ధ్యాజీవి సం వి. న్ పుం. వృద్ధ్యాజీవుఁడు.

వృద్ధ్యాజీవుఁడు సం. వి అ పుం వడ్డీవలన బ్రదుకు మనుష్యుఁడు, వార్ధుషికుఁడు.

వృధసానుఁడు సం. వి. అ. పుం. మనుష్యుఁడు. (సి. కౌ.)

వృధసానువు సం. వి. ఉ. పుం. 1. మనుష్యుఁడు. 2. ఆకు. పత్త్రము. 3. పని, కార్యము.

వృశికము సం. వి. అ. పుం. 1. ఎలుక. 2. వాసకము, అడ్డరసము. (వృ. వి.)

వ. అల్లము

వృశ్చికము సం. వి అ పుం. 1 తేలు. 2 (జ్యోతి) రాశిచక్రమున వృశ్చికరాశి, వృశ్చికలగ్నము. 3 ఎండ్రకాయ, పీత. 4. శతపది, జెఱ్ఱి. 5 ఒక జాతి పేడపురుగు 6. గొంగళి పురుగు 7. వృశ్చిక మాసము. (సూర్యుఁడు వృశ్చిక రాశియందుండెడి మాసము) 8. గబితేరు.(వృ వి.) 9 బ్రుంగచెట్టు

వృషణకచ్ఛువు సం. వి ఉ. స్త్రీ అండకోశము మీఁదఁ బుట్టిన వ్రణము

వృషణము సం విశే (అ అ అ) 1 నీరు చిలుకరించునది, నీరు చల్లునది, బలము గలిగించునది 2. బలాఢ్యమైనది, దృఢమైనది. 3. వీర్యాన్వితము, పరాక్రమవంతము.

వి. అ పుం. అండకోశము

వృషణశ్వము సం. విశే (అ. అ. అ) సామర్థ్యము కలది, శక్తిమంతము.

వి. అ. పుం. ఇంద్రుని యశ్వము

వృషదంశ(క)ము సం వి అ. పుం.పిల్లి, మార్జాలము

వృషధ్వజుఁడు సం వి అ పుం 1 శివుఁడు. 2 గణపతి. 3. ధార్మికుఁడు, పుణ్యపురుషుఁడు

వృషనాశనుఁడు సం. వి. అ పుం. శ్రీకృష్ణుఁడు (వృషభరూపమును ధరించిన 'అరిష్టుఁ'డను రాక్షసుని సంహరించేసిన వాఁడు) (ఇట్లే వృషాంతకుఁడు మొ.)

వృషపతి సం వి అ. పుం 1. శివుఁడు. 2. ఆఁబోతు, స్వేచ్ఛగాఁ దిరుగవిడువఁబడిన యెద్దు.

వృషపర్వుఁడు సం వి న్ పుం 1 శివుఁడు. 2. ఒకానొక రాక్షసుఁడు (ఈతని కూఁతురగు శర్మిష్ఠను యయాతి పెండ్లాడెను)

వృషభధ్వజుఁడు సం వి అ పుం = శివుఁడు.

వృషభము సం. వి అ పుం 1 ఎద్దు. 2. మగజంతువు (ఆ ని.) 3 జ్యోతి) వృషభరాశి (రాశిచక్రములో రెండవది) 4. బుషభ మనెడు మూలిక 5. కర్ణరంధ్రము. 6 ఏనుఁగు చెవి (ఆ ని)

విశే. అ పుం శ్రేష్ఠము. (ఈ యర్థమున సమాసోత్తరపదముగానే యుండును.)

వృషభాన సం. వి. అ. స్త్రీ. అనుకానవతి, స్వర్గరాజధాని

**వృషలి** సం వి ఈ స్త్రీ 1 విధవ, వితంతువు, 2 దూలగొండి (వృ. వి) కండూర (వృ వి.)

**వృషము** సం వి అ పుం 1 వృషభము 2. (జ్యోతి) వృషభరాశి. 3 ఎలుక 4 ధర్మము 5. నీతి, న్యాయము 6 ఋషభమను మూలిక 7 అడ్డసరము. (వృ వి.) 8 ముఖ్యమైన పాచిక 9 సారె

న. నెమలి పింఛము

విశే అ. పుం. (సమాసాంతమున) శ్రేష్ఠము

సం. వి. న్. పుం 1 వృషభము 2 (జ్యోతి) వృషభరాశి. 3 బుడ్డకొట్టని గుఱ్ఱము, గుఱ్ఱము 4 బాధ, దుఃఖము

విశే న్ పుం (సమాసాంతమున) శ్రేష్ఠము,

**వృషయము** సం వి అ పుం 1 నివాసము, గృహము 2 రక్షకస్థానము, శరణ్యము.

**వృషలము** సం వి అ పుం 1 గుఱ్ఱము. 2. వెల్లుల్లి (వృ. వి)

**వృషలి** సం. వి ఈ స్త్రీ 1. పెండ్లి కాకుండఁగనే రజస్వలయైన కన్నె 2 ఋతుమతి, ముట్టుది 3. గొడ్రాలు, వంధ్య, 4 ప్రాణము లేకుండఁ బుట్టిన శిశువును గన్నతల్లి, మృత ప్రసువు 5. శూద్ర స్త్రీ, శూద్రుని భార్య.

**వృషలీపతి** సం. వి ఇ. పుం శూద్ర స్త్రీ యొక్క మగఁడు

**వృషలీసేవనము** సం వి అ. న శూద్రస్త్రీని రతియందుఁ బొందుట

**వృషలుఁడు** సం వి అ పుం 1 శూద్రుఁడు. 2 పాపాత్ముఁడు, అధార్మికుఁడు. 3. నటుఁడు 4. జాతి బహిష్కృతుఁడు, వెలివేయఁబడినవాఁడు. 5. చంద్రగుప్తుఁడు అను నొక రాజు. (ఇది చాణక్యునిచే వాఁడబడెడి పేరు) 6. తనకు విధింపఁబడిన కర్మము విడుచుటచేత వర్ణభ్రష్టుఁడైన బ్రాహ్మ క్షత్రియ వైశ్యులలో నొకఁడు (ఆ ని)

**వృషలోచనము** సం. వి అ. పుం. ఎలుక, మూషికము

**వృషవాహనుఁడు** సం. వి. అ పుం. శివుఁడు.

**వృషస్కంధుఁడు** సం విశే (అ ఆ అ) ఎద్దుమూపురమువంటి మూఁపులు గలవాఁడు, బలసిన మూఁపులు గలవాఁడు.

**వృషస్యంతి** సం వి ఈ స్త్రీ 1. కాముకి, మైథునేచ్ఛగలస్త్రీ 2. ఎదావు, ఆఁబోతును జేర సమయమైన యావు. 3 కపికచ్ఛువు, దూలగొండి (వృ. వి)

**వృషాంతము** సం వి అ పుం నల్లజీడి చెట్టు.

**వృషాంకుఁడు** సం వి అ పుం 1. శివుఁడు. 2. ధర్మనిష్ఠగల పురుషుఁడు, పుణ్యాత్ముఁడు 3 నపుంసకుఁడు.

**వృషాకపాయి** సం. వి. ఈ. స్త్రీ 1. లక్ష్మి. 2 గౌరి 3 శచి. 4 అగ్నిభార్యయగు స్వాహాదేవి. సూర్యుని భార్యయగు ఉష. 6 ఇంద్రునితల్లి. 7 శతావరి (వృ. వి.), పిల్లి తేగలు (వృ వి.) జీవంతి (వృ వి), తివ్వతీఁగ (వృ వి.)

**వృషాకపి** సం వి ఇ పుం. 1 శివుఁడు 2. విష్ణువు 3 ఇంద్రుఁడు. 4 అగ్ని. 5. సూర్యుఁడు.

**వృషాహారము** సం. వి అ పుం. వృషదంశకము, పిల్లి.

**వృషి** సం వి న్. పుం నెమలి, మయూరము. ఈ స్త్రీ బృసి, యతులు కూర్చుండెడి కుశాసనము

**వృష్ణుఁడు** సం వి అ పుం 1. మన్మథుఁడు 2. కామశాస్త్రమందుఁ జెప్పఁబడిన నాలుగు జాతుల పురుషులలో నొకఁడు. 3 శత్రువు 4 కర్ణుఁడు. 5. విష్ణువు

విశే (అ. ఆ అ.) 1 బలాఢ్యుఁడు, బలముగలవాఁడు. 2. క్రీడాశీలుఁడు, ఆటలాడు స్వభావము గలవాఁడు.

వి న్. పుం. 1 ఇంద్రుఁడు. 2 కర్ణుఁడు 3. అగ్నిదేవుఁడు.

**వృషోత్సర్గము** సం వి. అ పుం ఆఁబోతు నచ్చువోసి స్వేచ్ఛగాఁదిరుగ విడుచుట

**వృషోత్సర్జనము** సం వి అ న = వృషోత్సర్గము

**వృష్టము** సం. విశే (అ ఆ అ) 1 వర్షించినది 2 వర్షించుచున్నది.

**వృష్టి** సం వి ఈ స్త్రీ. వర్షము, వాన.

**వృష్టిజీవనము** సం విశే. (అ ఆ అ.) వర్షాధారమైన పంటలు గలది, దేవ మాతృకము (దేశము)

వి. అ పుం చాతకపక్షి.

**వృష్టిభువు** సం. వి. ఉ పుం. కప్ప, వర్షాభువు, భేకము

**వృష్ణిమంతము** సం. విశే. (త్. మత్. త్) వర్షములు గలది.

వి. త్. పుం మేఘము

**వృష్ణి** సం. విశే (ఇ) 1 మతాంతరము నవలంబించిన వాఁడు. 2. కోపము గలవాఁడు, తీక్ష్ణ స్వభావము గలవాఁడు

వి. న్. పుం 1. మేఘము 2. పొట్టేలు, 3. కిరణము. 4. 4. వృషభము 5. కృష్ణునివంశమునఁ బ్రాచీన పురుషుఁడు, ఒక యాదవుఁడు. 6 కృష్ణుఁడు. 7. ఇంద్రుఁడు. 8 అగ్ని 9 వాయువు, గాలి. 10 పాషండుఁడు.

**వృష్ణిగర్భుఁడు** సం. వి. అ. పుం కృష్ణుఁడు

**వృష్య** సం వి ఆ. స్త్రీ 1. ఉసిరిక. (వృ. వి) 2. శతావరి, పిల్లితేగలు. (వృ వి.) 3. ఋషభమనెడి ఔషధి.

**వృష్యము** సం. విశే. (అ ఆ. అ) 1 కురియఁదగినది 2. వీర్యవృద్ధిని గలిగించునది (ఔషధము.)

వి. అ. పుం మాషము, మినుము,

వి. వాజీకరణము, కామోద్దీపనము చేయుట

# వె

**వెంగడము** విశే. వ్యత్యస్తము, తాఱుమాఱయినది.

క అంగజహారుని ప్రసాదమువం గలుగుచు వచ్చె మతుఁడు వాఁడాదిగ మా, వంగడమున వది యిప్పుడు, వెంగడమై కూఁతు రుద్భవించె న్నాకున్ (విజ. వి 2. 8)

**వెంగలి = వెఁగలి** విశే (క. బెంగళి) 1. మూర్ఖుఁడు, అవివేకి.

క గంగాతనయుఁడు దెగినను, సంగరమున కుత్సహింపఁజనునే తమకున్, వెంగలు లని యప్పుడు దెలి,యంగా వెఱఁగితి సుయోధనాదుల గృష్ణా. (భార. శల్య 1 351.)

చ ... కుంభజుఁడు బాలుని నొక్కరుఁ బంచఁగాఁ గ్రొత్తగ వెంగలిఁ గడుఁ బెద్దచేయుచుఁ జొగ్గత్తకుఁ జొచ్చె నితండు నొంపగాఁ, దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ దాఁగుడుఁగూర్చుట నెంత బ్రతుకి వన్. (భార. ద్రో. 2. 46.)

రగడ. వెంగలిదతునిఁ గూడినకతమున విజ్ఞానము చెడి పశులమైతిమి. (వరాహ 5 122)

2. వెట్టివాఁడు, అమాయకుఁడు.

ద్వి కటకటా యిట్టి వెంగలిరాజు గలఁడె, మటు మాయతపసియే మరులుకొలిపెను.. అమ్మెనరఁ గడమకై యాలిఁ గొం డనెడు. ద్వి హరిశ్చ. ఉ 409.

గీ మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు, నలఁతిదొరఁ గొల్వఁ గడఁగు వెంగలులుగలరె. అచ్చ. రా యు. 154.

3. మూఢుఁడు, జడుఁడు.

క ... లింగాకృతిశివుఁ గొలువని, వెంగలిమానవులకుంజె వెడఁగులు గలరే శివసా 254.

క. నింగియు నేలయుఁ దానై, పొంగిన హాలాహలంబుఁ గొరిమూర్తి తహిన్, వెంగలుల మమ్ముఁ గావుము, గంగారంగత్తరంగకలిత జటాంగా. వీర 3 231.

ద్వి. పొంగి చిచ్చులుకంగఁ బోవుచుఁ జీర, కొంగొనరించు పెన్వెంగలి యట్లు. బస. పు 3. 97 పా 1140 పం.

4 వ్యర్థము, యుక్తిలేనిది.

సీ. ఎవ్వరితోనైన నెఱుఁగెత్తి యొక్కింత పనిలేని వెఁగలి పలుకు పలుకు. భాం. విరా 2. 250.

**వెంగలితనము** వి (వెంగలి + తనము.) 1 అవివేకము, మూర్ఖత

క కొం గేటికి విడువుము మును, ముంగలి వెడ లంగ వెఱతు ముగ్ధుఁడ నీ కీ, వెంగలితనమె ట్లొదవెన, నంగ విశ్రుతినూప నర్హమా నాయెదురన్. (భోజరా. 4 328.)

2. వెట్టితనము.

సీ వెర విట్టి తెలఁ గిది వెంగలితన మని యొల్ల వాఁడును దవరయొత్తఁగినట్టి, తెలఁగున నిజకార్య దృష్టియ కయికొను ... భార. శాంతి 1 45

**వెంగలివిత్తు** విశే. మూర్ఖాగ్రేసరుఁడు, వెట్టి

క. వెంగలివిత్తయి తిరుగుచుఁ, గంగారై చెడక ముక్తిఁ గాంచుంచు నతం, డంగజులతోడ విడువని, సంగడములు వదలవలయు జలజాతముఖీ. భాగ. 9. 583.

వ అవ్వెంగలివిత్తు లలుచు వీఁటిఁడి యలవులకు వంకలొత్తి మాఱుసెప్పుటయు నొవవక భారం. ఉద్యో. 3. 285.

వెంగలివిత్తులు = వెట్టికాయలు.

**వెంగలీఁడు** వి (వెంగలి + ఈఁడు, స్వార్థమున) వెంగలి, అమాయకుఁడు

గీ అబ్ధిసంభవ యితఁడువో హాలహలవు, విషము పుక్కిటఁ దాల్చిన వెంగలీఁడు, కాశీ 5. 116.

**వెంగెమాడు** స. క్రి. (√ వెంగెము.) = వెంగెములాడు, వ్యంగ్యార్థము వచ్చునట్టు మాటలాడు, పరిహాసముచేయు.

చ. తరుణికి వెంగెమాడవలెఁ దవక కాంతునిఁ గన్నచోటులన్, విరసముగాడు చిత్తభవవిభ్రమ మంత్రము దీనికై వినుం, బరుసములాడితిం బదరిపట్టకు మెగ్గులు వేంకటేశ్వరా శాళ్ళపాక వారి శృంగారవృత్తశతకము 101.

**వెంగెము** వి (సం. వ్యంగ్యమ్) వ్యంజనచేతఁ దెలియఁదగిన యర్థము, ధ్వన్యర్థము.

సీ. మచ్చరించినవాఁడు మంచిమాటాడిన వెంగమై తోఁచును వెగటుపోవ, ... (నీతి 76.)

**వెంగెములాడు** స. క్రి (√ వెంగెము) = వెంగెమాడు, వ్యంగ్యార్థము వచ్చునట్లు మాటలాడు, ఎగతాళిచేయు.

ద్వి వెలఁది వెన్నెలసోగ వెంగెంబులాడఁ, దుల కించు బొమ్మంచుదుప్పటి గప్పి. ద్వి. పరమ. 4 315 పు.

**వెంచ** వి. (త. వెంచ = సరస్సు) మడుగు, హ్రదము.

చ. ఎలమిన పూరిమేసి సెలయేఱులనీరులు ద్రాగి మేలివెంచల శెలమావిఁ గొంపముల చల్లనినీడల నిల్చి ... (కు సం 6 707)

చ. ... ముందటిగిరిపాంత గొంత యొడదవ్వుల రేగడవెంచలోపలన్.

ఆ. నాల్గుకాళ్ళ రొంపి నాఁటిన ... ధేనువుఁ. బొడఁగని ... (ద్వా 10 38., 39)

**వెంజామర** మి వి (త. వెణ్ణామర—వెల్ల + చామర) తెల్లనిచామరము, వింజామరము వీరశ్రీశైలేశ్వర మహాదేవరకు ఉత్తరాయన సంక్రాంతి నిమిత్తమున నిచ్చినక(ం)నకదణ్డముఖ వెంజామర 1ట్టి ... ద శా 4 1252.

... పహిణ్డినీరు వఱడినకా(ము)ల వెంజామరలు 2. ద శా 4. 1190

. పహిండికాయలతోడి వెంజామరలు 2 .. ద.శా 4 975

**వెంట** వి 1 కార్యము, పని.

చ వరుఁడొకవెంట నెన్నఁడు ప్రవాసగతుండగు నాఁటగోలె నప్పురుషుఁడు వచ్చునంతకును ... (భార అను 4 359)

ఉ ఈతని చందముం దెలుప నిట్టిది యక్కటవైరులుగ్రులై, నాతలపై సభన్మచరణం బిడిపోయిరి గాక యల్పమే, యీతెఱఁగేమి సేయుదును దీర్ణబలంబున వీనికారమున్, వే తొలఁగింతుఁ ద్రోవఁ గను వెంటకుఁ జూడుఁడు మీ రుపాయమున్ హరి. ఉ 8. 16.

గీ నయము తెడ యొక యొల్లవెంటలను తెఱచు, మాట పరుసదనంబు కుమారచంద్ర పి శకుం 4. 167

2 విషయము

చ ఒకరునిచేతి ప్రోవుమ దదువ్నతిప్రాపునుగాంచి యొల్లవెంటను గొఱంతలేక పొగడందగు సంపద నొంది .. భార. ఉద్యో. 2 77.

ద్వి నీవు రాజ్యముసేయ నిఖలభూజనులు, నే వెంటనే భయ మెఱుఁగరు గాన, నిన్నిచెప్పితి మీకు నిక్లేను వెఱవ, న న్నింక మన్నించి నా మాట వినుము రం రా. ఉ. 134. పు. 28 పం.

ఉ. ... విదిశాపురి మించు నందు వే, వెంటఁ గొఱంతలేని పృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పేరింట నెసంగు ... శుక 2 144

3 కారణము, హేతువు

చ. వివతకు దాస్యమొందె నొకవెంటఁ దదీయ నిరాసహేతువై, యనఘువిచార నాకు నమృతాహరణంబు విధేయ మయ్యె ... భార. అను 1 251.

క వలసినయప్పుడు మరణము, గలిగింపఁడు పాప జాతికాలుఁడు గరశాదులవెంట జావుదొరకదు, బలుగావలియై నిశాటభామినులునికిన్ (భా. రా. స్కంధ 248)

ద్వి ఏ వెంటనో మాకు నింత నిగ్రహము. గావించె నిప్పు డాగంధవాహుఁడు రం రా ఉ. 84 పా. 28. పం.

4. దారి, మార్గము.

క. కమక్రమసిన తెరువరి తన, కనపాయంబైన మార్గమరసి తగవెతింౘగిన వారు చెప్పఁగాఁ గై,కొనవిశరదఁ దగిశవెంటఁకుం బొరవకటా. (భార. ఉద్యో 2. 280.)

క. వెంటను వేఁకావనుఁదను, వింటిరె మునులార మీ పవిత్రాంఘ్రులు న, న్నంటుట మదీయ మూర్ధము,వెంటంగా నభ్రగంగ వెల్లివిరియుటన్ హర 4 57.

మ. తమలోఁబుట్టినవిద్య గవిఁకొనుచుం దమ్మాం నంసారవిౘిభ్రములై కొందఱు దేలుచున్ గలఁ గుచుం బత్వెంటన్ దైవయోౘగమువందే వర మొకుఁ గెత్తి ఘుటులై కైవల్య సంప్రాప్తులై . (భాగ. 8 721.)

5. ద్వారము.

చ పురిఁబరిఘోరగిరికరముల్ బలమాత్రము వెంట శోధమంౘిరముఁ జొచ్చి యందుఁ దరుణీతను గంధము తాలినంకెలై, నెరయఁగనిల్చి కేకిర మణివిభ్రాతు త్నెడపట్టి బ్రాబ్బఁగా, నరిగి తదీ యభూతిఁగొనియాడు నిజాప్తులు మూఁగి యూకొనన్ (కువల. 1 76 )

6. విధము, రీతి

ఉ. వీరలు పెద్దద్రవ్యకొక వెంటనొడఁబడి తేటి కాంతులై ... (భార ఉద్యో. 1. 841.)

ఉ. ఏవెంటనేయున విఘ్నము, గావింపుము తానుఁ దుదయగతుఁ దగునేనిన్, జీవింపఁడు విమతుం డది, గావున వాకొర్కి దీరఁగాఁదలకొనుమా. (భా. రా. యు. 1617 )

శా. ... వేఁ, డిపకామ్రౘ్కృతులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం, డేవెంటన్ బ్రదికించె మే లనుచు ... (భాగ. 10. 486.)

ద్వి కంథుశ్వేతుండు ప్రసన్నుగాఁ బడ నె, గావున హితులగు కాంతలబుద్ధి, లేవెంట హితమె కా కేల యొం దగునె పండితా. పురా. 150.

7. వెనుక భాగము

గీ. బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు, వచ్చునింటికిఁ బ్రజ దన్ను మెచ్చిచూడ. మనుచ. 1. 54.

సీ. వనిత యెవ్వతె హత్తుకొనుచా వీని నటంచు వెంటనే బుడుతల వేగఁబనుతు . . కువల 4 180.

8. వేఁట.

శా. ఘంటాకర్ణుఁడ నేమ కాయనుఁ డీకాలాంత కుం డేము ముౘక్కంటింగొల్తుము కిన్నరేశు పనికై కైలాసశైలంబునన్, బంటన్వచ్చిన సారమేయములు నీ సైన్యంబులున్నావె యే, వెంౘటంబోయితిమేమి కాఁడవిలో వేఁటాడరే యెవ్వరున్. ఉ. హరి. 2 140.

9. ఉపాయము

గీ. ... వృత్రాసురుండు, పుట్టె వతనికిఁ దైబన మ్మూర్తి గలుగ, న ప్తమునులమువంపి తత్సంధిఁ జేసి, వేలుపఱేఁడొక్కవెంట వ మ్విప్రుఁజంపె. (మార్క 1. 11 9.)

10. స్థలము, చోటు

క ఇవ్విధమున ఘోరంబగు, న వ్విపినాంతరము సొచ్చి యరుగఁగఁ గాముల్, గ్రొవ్వున మ్రోఁగుచు నాతని, వెవ్వెంటన్ దామెయగుచు నెగురుచుఁ బట్టెన్. ద్వా 8. 101

క. కావున వివేకహీనుల, క్రోవం బోవలదు వారి తోడిచెలిమి దా, నేవెంటనైన నాపద, గావింపక పోదు సుమతిఃలితులకైనన్ కేయూర 3.283

అవ్య ద్ర 1 అవిలంబముగా

ఉ. వంచనవేల్పుటెంకి కిటు వచ్చి యుపాంతము నందు ముందటం, గంచమువెట్టుకొన్నయది కర్పూరయుగ్మము మాఱువెట్ట నేతెౘచుచు నున్న వాఁడు మనదేవర విష్ణుఁడు వెంట వీరిమాౘచిం చుటమే ల్పుఛారనము చిప్పెడు నోయకమున్న కారికన్. హర 6. 125 .

క. ఆవేళ రైభ్యవసు వసుౘధావరు లాంగిరసుచే యథాసముచితపూౘజావిధులు వడసి వందితుౘలై వెంటౘ బనిరి దివికి నఘగిరి పవికిన్. వరాహ 2 9.

2. వెంబడి.

ఆ. మౌనులచట వారి మార్గంబుఁ గానక, వెదకి వెదకి యల్లవిపినభూమి, పాపటయును బోలెఁ బాపట్టు నొక తవ్వుత్రోవ వెంట వంటిపోవు చవల (వాల్మీ 2 82)

చ. అరసెదఁగాక యివ్వడుగు నాగడ మంచు వసించె వంగణాం,తరమున గోడమాటువడి దతుఁ దెఱుంగకయుంచె వాని సుం,దరి పని వెంట న దైనకుఁ దాఁ ఇనుదేర నిశేచ్ఛనాత్మ మం,దిరమువనుండి యావెలఁదిదిక్కునకుం జని యంత దఱుఁడున్ కేయూర 2 23

వెంటఁబట్టు అ క్రి (వెంటన్+పట్టు) వెనుకకుఁ బోవు

క త దవసరంబున బోదులు, పదివేవురు వెంటఁ బెట్టి బాగై రాఁగాఁ, బొదివెలువడి రథ్యం బులఁ, గదలించిరి ఘూసరోమకదళిరోముల్ కళ 5 156.

వెంటఁబడు వ క్రి. 1 వెంబడించు.

క. మింటిసికవేల్పు మిక్కిలి,కంటిసెకన్ నొచ్చి పుట్టుగావక పోఁకున్, వెంటఁబడి మరుఁడు వాలుం,గంటీ రాఁ దగునె యెంతగండము గక చెన్ యయా. 5, 138

చ. ... ఆ,మరధరణీరుహప్రసవమాల్యసుగంధభరా నుయాతబం,భరనికరంబు వెంటఁబడి బంట్ల తెఱంగున వంటి కొల్వఁగన్. జాహ్నవి 1 128

2. తఱుము, తొందరపెట్టు.

గీ. ఇట్లు వర్తింప నొక్కనాఁ డిరులు గవియు, వేళఁ గారాభ్యంతరాచేత వెంటఁబడఁగ, నింటివారికిఁ జెప్పక యేగెఁ జపల,మగఁడు పొరుగూరికై బుద్ధిమంతుఁ డగుట శుక 3 487.

వెంటఁబెట్టుకొను స క్రి కూడనుంచుకొను

మ సుగుణాంభోధుల మంత్రిపుంగవుల నచ్చోనుంచి యం చన్మతిన్, దగువారిం దన వెంటఁబెట్టుకొని రత్న స్యందనారూఢుఁడై, .. చేరె నాథుఁడు వాల్మీకాశ్రమ స్థానమున్. ఉ. రా 7 156

వెంటనంటు స. క్రి (వెంటన్+అంటు) వెనుదగులు, వెంబడించు.

సీ. హరిహయవాహనాహంకారము హరించి వేఁడి వేలుపుజాడ వెంటనంటి ... వసు. 4 12,

మ చిరునవ్వుల్ దళుకొత్తు నెమ్మొగములన్ శ్రీ చూర్ణపున్ రేఖడా, లొఱపౌ తిర్మణి పట్టెలుల్ల సిల శిష్యుల్ వెంటనంట గ శ్రీ,హమనారి స్మరణ బు లుప్పతిల దాసోహమ్మటం చొండొరుల్, సఁగన్ వైష్ణవుతేగుదెంచి రచటన్ సౌశీల్య సంపన్నులై ఇందు 5 6.

క ... గురుతరమగు మురుచి, త,త్పరి మళముల వెఁటవంటి పాయక చనుచున్ శుక 6 88

వెంటము వి వేడుక, కుతూహలము (చి ని, శ ర)

వెంటాడించు వ క్రి. 1 వెన్నాడు, వెంబడించు.

శా. కంటంగంటి పటుంచు నార్చి శతశ్సృంగ శృంగాధరాగ్రంబునన్, వెంటాడించి కరాళకీల పటలతే వ్వాశ్రయార్చిశ్ఛటా, లుంటాక ప్రతిఘాతరారుణదృగాలోకంబు సంధిల్లఁగా, లంటంద్రొక్కి లులాయదానవుని వక్షోగ్రంబు శూలంబునన్. వరాహ 11. 111

2. త్వరపెట్టు, తఱుము.

క ఒగ్గముల ద్రవ్విపడుమని, ఐ గ్గడు వెనుఁ దెరల వలల నురలు మృగములన్, దగ్గటి చం పెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్ భాగ 1. 454.

వెంటాడు న క్రి (వెంట+ఆడు.) వెంబడించు.

సీ. గొరవంకపై డేగఁ గొనివేయవది దానిఁ దఱుము వెంటాడి తత్తడిని నూకి, . చంద్రా 4. 99

మ హతిమూర్చాంతమువన్ రథాధిపతు లాత్మానూనసూతాళివం,గతి నిందించిన వర్తితాత్ము లయి సంగ్రామంబునందే రథ,స్థితపాళిన్ తతులై రొ ప్రాక్సమయసందృష్టధ్వజుఁ లైన గ,న్వితతాదృగ్రథనాయక వ్రజముచే వెంటాడి రిష్టార్థ్యతన్. (రఘు 4 107)

వెంటి వి మెలిపెట్టిన గడ్డి, కసవుపిరి చి వి, శ ర., బ్రౌ, వా.)

చ .. బుణముంగొని పెట్టక పాయుద్రోచు దు,ర్జమఁ బురివెంట్లు చుట్టి పరుషంబుగఁ గొల్వఁగలేదు పితులన్. (రుక్మాం. 2. 9) (ముద్రి పా వరివెంట్లు. చి ని పా)

**వెంటిగొను** అ. క్రి (వెంట+కొను) వెరిగొను లయగ్రాహి. గంటి వడఁ దాఁచుడు మగంటిమి దలిర్పన్, వెంటగొనఁగానులిచి మింటి కెగయన్వయిచి ... భా రా యు. 1420

**వెంట్రువ** వి. ఒకజాతి ముంగిస, బభ్రువు
గీ వెంట్రు వనఁగను బభ్రువు వెలయు నకుల అం భా 2 86.

**వెండి**[1] వి (క. బెళ్లి. త. వెళ్లి) రజతము, పంచలోహములలో నొకటి (నిత్యైకవచనము)
సీ ... వెండియొడ్డెనలపై వెలచి తెచ్చినపైఁడి పళ్లెంబు లాయత్తపఱచువారు ... నైష 6. 108
సీ. వెన్నెల జరియుడ్డ వెండిలేఁగెలఁకోలు యజ్ఞోపవీతంబు లమర నమర.. విక్ర 7. 148.
గీ. ... వెండిమే లెక్కు వెంద్రుకవిల్లు వోలె ఆము. 4. 177
(ఇయ్యది విశేషణముగాఁ గూడఁ జెప్పనగును ఉదా. వెండిగిన్నె.)

**వెండి**[2] అవ్య 1. పునరర్థకము, మఱి (ఇది "ఉను" వర్ణకాంతము నగును)
క. మాయయ్యకుఁ బాయక పని సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్, మీయయ్య వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు నానయు లేదే. భార. ఆది 3. 137.
క. మండెడు బలు నారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్, వెండి ప్రయోజన మేదీ, రండానుత! దీనిపై శరము నిగిడింపన్. హార 7. 54.
ఆ. వెండియొక్క పండు విప్రుఁ డెప్పుడో తెచ్చి, తనకు, నీక యమ్ముకొనిరెయు ననుచు. విక్ర 8 20.
క. పాండవహితుఁడగు విదురుఁడు, వెండియు జనుదెంచి, కార్య విధులందు సహాయుండయ్యె జలనిలోద హితుండయి మంతనము సేయఁ దొడఁగె విభుఁడున్ భార. అర 1. 72.
2. అనంతరార్థకము, పిమ్మట.
గీ. అట్లు కావున నవ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబుగావించు పనికి. హరి. పూ. 2, 25.
ఉ ... విముక్తికవ్యక్తన్, డానెద నంచు నెమ్మనమునం బ్రమదంబు వహించి వెండియున్ విక్ర. 2. 189
చ ఒకమరి బుడ్డగింప విలయోదకముల్ పయికుబ్బి చిప్ప వ్రచ్చుకొని మహోగ్రవీథిఁ జన సూకరతన్ మెయి వెంచి వెండి క్రిందిదిక్కఁ గయి వ్రాలు తత్సలిలనిర్మలధార ... ఆము. 4 21.
క. పడఁతికిఁ గన్యాధర్మం, బెడలినఁ గొంఱయగునె వెండి యొవ్వతికైనం, గడివోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁడగువాఁ డమోఘ వివేకా. భోజరా. 4. 224.
3. కింత్వర్థకము, ఇఁకనేమన్న
సీ.. గీ .. సోమయాజుల మెన్ని మాల్లాము శ్వపచఖగకులుల మెన్ని మూరులుగాముపాము గాములము నెన్నిమాలులుగాము వెండి, కంస రిపుభక్తుల మొకండె కాముగాని ఆము. 6 61

**వెండిక** అవ్య. పునరర్థకము, మఱి
ఉ వెక్కెడి రూపులున్ విఱిగి వెండిక వెండిక వ్రాలు రూపులున్ ... కు సం 11. 899.

**వెండికొండ** వి (వెండి+కొండ) కైలాస పర్వతము, రజతశైలము
సీ... ధవళకేతన రుచులుఁ, ఛత్రముల రుచులుఁ, జామరంబులరుచు లొక్కసారినిగిడ, మెండుకొని వెండికొండపై నిండ నా ప్రచండభుజదండుఁ డాతఁడు దండు విడిసె. ఉ రా. 2 331
ఉ...తురంగ వాహుఁడై, సంగతివేగ విత్తపతి శంకరు కొండకు వెండికొండకున్. వీర. 3. 33.

**వెండిగుండు** వి (వెండి+గుండు) 1. కైలాస పర్వతము, రజతశైలము. (శ ర) 2. వెండి గుండు వలె మండుటచేఁ కుక్క కియ్యఁబడిన పేరు.
ఉ. పులియఁడు బూచిగాఁ డసురపోతులరా జమమంతిగాఁడు చెంగలువసివంగి భైరవుఁడు గత్తెరసంపఁగి వెండిగుండు మల్లెలగుది . . మకుచ. 4 32.
సీ ... విష్ణుప్రసాదంబు వెండిగుండుల వరిపచ్చి మిరెము వెట్టిపుచ్చుకాయ ... ఫి. శకుం. 1. 108,

3 బ. ధాన్యవిశేషము.

వ. రాయమెచ్చులు యేరుమల్లెలు మునిమనో హరాలు వెండి గుండ్లు బొంత మడములు కూటికుప్పలు కాటు నంపెగలు .. ప్రబంధ 112.

**వెండిగుబ్బలి** వి (వెండి+గుబ్బలి) రజతాచలము, కైలాసము.

సీ వెండిగుబ్బలిపై వేడ్క విడుకొల్పి, మేరు నగ రాజుపైఁ జాల మెచ్చువదలి . భీమ 6 11

సీ. ... విన్నుద్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోని మేలువాఁడు .. అచ్చ రా. బాల. 13.

**వెండీఁడు** వి. సూత్రధారుఁడు, బొమ్మలాడించు వాఁడు

ద్వి. ప్రకటిత కపటనాటకసూత్రములను, వికృతి ప్రకృతు లార్పు వెండీఁడు నటఁడ. బస పు. 4 70.

**వెంట్రుక** వి 1 కేశము, శిరోరుహము.

సీ. కలుకువెంట్రుకలలోఁ బలుచు మందాకిని సుకుమారదేహంబు స్రుక్కఁబాఱ .. హర 7.79.

సీ ... జుంజువెంట్రుక లెత్తి చుట్టవలేదిఁగవన్న గాథీశ్వరు వగిది మెఱయ. విక్ర. 2 123.

ఉ ... ఎలదేఁటి దాఁటులన్, బమ్మెరపోవఁ దోలుఁ దెగబారెడువెంట్రుకలు,...మనుచ.3 6.

సీ ... వెంట్రుక నెఱినెఱక నాఁగఁ దనరుఁ గేశము ... (ఆం భా 2. 145)

2 రోమము

ఉ తండ్రులు మీరు మీకు నయతత్వము చెప్పెద మన్న మమ్మ వేమంత్రుడు జనంబులూఅడు బృహస్పతి మీయెడనేను లేవిచో, వెంట్రుక యంతమోసమును వేచి దురంబున కెత్తివచ్చునా, పౌంద్రుఁడు . ఉ. హరి. 2 101

నిడువెంట్రుకవెట్టు=అ క్రి బెదరించుట.

క గడగడవడఁకెడు మేననిన్నిడువెంట్రుకవెట్ట నెదుర నిదుర జలింపన్, మెడమడచు నావు లించుం, దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్. (ఉ హరి 6. 96.)

**వెంట్రుకవిల్లు** వి. బ. గుజ్జుపుతోఁక వెంట్రుకలతోఁ గట్టిన ధనురాకారమగు వాద్యవిశేషము. (దీనిని దసరివాండ్రు వాయి తుర. దీనిని 'కామాచి' అందురు)

గీ. వృష్టితటి నిడ్డ కెనర్ద్రావఁ గ్రిందినుండి, తేట నదినీటఁ దనవెంటఁ దేలు మీల, తళుకుతో నాఁచులత దోఁచె వెలికి జమిలి, వెండిమీ లెక్క వెంట్రుకవిల్లువోలె అము 4 177

**వెందగు(వు)లు** న క్రి (వెన్ను+తగులు.) అనుగ మించు, వెంటనంటు

ద్వి. అప్పుగ నిటురాఁగ నతఁడు వెదంగిలి, వచ్చుచు నింగలకు వసుధేశ వినుము రం రా బాల 12 పా. 2 పం

ద్వి. తలలు వీడఁగ నాయుధంబులు విడిచి, వలనేది పాఱెడువారి వెందవిలి, సటుశిలీ ముఖముం పాలు సేయుచును రం, రా ఉ 16 పా. 7. పం

**వెందు** వి తమకు వశపడుటకై తుమ్మెదలు మధ్య నుంచి పాడెడు పురుగు

చ. చెవుడు పడంగ నల్లడలఁ జేరుచు నన్నొకవెందు చేసి మీ, రివియనియంచు బుజ్జవములిన్నియు నెన్నఁగ వేల .. కు సం 3 676.

**వెంపర** వి 1 పీడనము 2 హింస 3. భేదనము (శ ర) (చూ. వెంపరలాడు)

**వెంపరచేయు** దే న క్రి హింసించు

సీ పాదంబు లిసుకలోఁ బాతి వెంపరసేసి పటు సాయకముల పాల్పఱుత మనుచు దశకు 2.71.

**వెంపరలాడు** న. క్రి (వెంపరలు+ఆడు) 1.భేదించు

వ తామరల పరంపరల వెంపరలాడి తుండంబుల తండంబులు పొడవులెత్తి ఘూత్కారంబులుచేసి. ప్రబంధ. 1. 166.

సీ ... చెవి దార్చి విని చీమ చిటు కన్న కొకసారి నెలవి వెంపరలాడుఁ జిట్టెల్ల ...మనుచ.4.17.

2 బాధించు, పీడించు

చ. మఱి పనిలేదె వేసరవు మాటికి నిక్కడ నుండ నోయి చే, టెఱుఁగని కూన దుర్జయునకేంద్ర శిఖామణి వీఁడె వచ్చె నే, వెఱవును లేక వేలు పుల వెంపరలాడుచు నాలకింప మా, మొఱలు తదీయధాటి నిను ముట్టఁజుమీ నిమిషంబు నిల్పి నన్. వరాహ. 3. 34.

చ అని కొనియాడి చేడియ నొయ్యారపురాశిని జేసి నట్టి యవ్వనజుచేతికిన్ బిరుదు వైవంగవచ్చుఁ గదయ్య దీని ప్రాపున ముదమొందు కెందలిరు గొందళవుందొర చూచువారలన్, వెనుకొని కావుటంపరల వెంపరలాడకు మన్న మాను నే కుతల. 4. 154.

(వెంపరలాడు-ముద్రి. పా)

3. హింసించు.

చ. చలమునఁ దావ యోగిజనసంఘము వెంపర లాడఁ బూని పూవులుకులు వింటఁ గూర్చి తటి ముక్కులఁ దీర్చి తదీయసార మగ్గలముగఁ గ్రోలఁగా మమరుగాలికుల న్మరుఁడేయ వ్రేటుచాయల నలరెన్ బలాశముఖులాం తము లంటుకు మూఁగు తుమ్మెదల్. చంద్రా. 4. 85.

చ. ... పేనలఁ బెక్కు తంగులన్, కొడవడఁగించి మండి బలుమూఁకల వెంపరలాడుచుండె . . వై. భా. 6. 177

ఉ ... పూవింటియతండు నన్గినిసి వెంపరలాడక మున్నెయల్ల వాల్గంటిమనోజ్ఞ సంగమ సుఖస్థితి యొగతిఁ గల్గఁ జెప్పవే. రాజ. చ. 3. 77

**వెంపరలువెట్టు** స. క్రి (వెంపరలు + పెట్టు) భేదించు.

వ. .... ఆ శత్రారి సేనానక్రాకరంబుఁ జొచ్చి శోధించి కలంచి కలగుండు సేసి మట్టిమల్లాడి వెరఁజి వెంపరలువెట్టి వచ్చిపోయిన తెరువెఱుంగ రాక ... (వి. కుం. 3. 126.)

**వెంపలి** వి బాణపుంఖ, ఒకజాతి. (వ్య. వి.)

(బ. వెంపళ్ళు, వెంపలులు. దీనిభేదములు తెల్ల వెంపలి, ములువెంపలి మొ॥)

తే. వీరరససారసాకారవిహరణంబు, విష్ణునకునొప్ప శతనితో విగ్రహింప, దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి, పాలి వెంపళ్లు తమ కెంత బంటి యనుట. ఉ. హరి. 4. 124.

**వెంబట్టు** వి. (వెల్ల+పట్టు.) తెల్ల నిపట్టు.

క వెట్టగని మీఁదఁ గెలఁకులఁ, జుట్టి సితచ్ఛద సమూహిమణియుట గడుఁ గన్పట్టు సరోవర లక్ష్మికిఁ, గట్టినవెంబట్టు మేలుకట్టుం బోలెన్. (కు. సం. 10. 386.)

**వెంబడి** వి (వెన్ + పడి) 1 వరుస, క్రమము.

వ ... అప్పుడు తమ సుముఖాన త్రిమణి స్తంభనామ ధేయంబులు స్త్రీత్వ పురుషత్వంబుల వెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొనిరి ... కళా. 5 103

చ దినముల వెంబడిన్ జడనిధిన్ మునుగ్రోలిన నీరు ... ఆము. 4 86

2. ప్రకారము, రీతి

వ ... పిదపఁ బాళ్ళు వెంబడిం బంచుకొని ... మనుచ 4. 60.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయంగ సంకేత,తం బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక రాఘవ 4. 19. (రామాయణార్థమున)

అవ్య. క్రియ 1. అనుసారముగా, వెంట.

ఉ... దంతపు మెట్లవెంబడిం, జే వడి వీణ మీటు టలు ... ఆము. 1 62

తే. అంతట వినివి యతఁ డాలతాంగి బిల్చి, నా తలంపు వెంబడి నీవు నడచె దనుచుఁ బలికె తిది యేమి చెపుమ నీ తంగు లిపుడు. కళా 6. 65

చ తన హృదయంబు వెంబడిన తప్పకఘోటక మంత వంతనే, పనుపడ నిల్చి ముందలఁకుఁ బాటి కెలంకులకుం దొలంగి తా, వెనుకకు నేఁగు దెంచి కడువేడ్క యొనర్పఁగ బంతియాడ నెమ్మని గనకంపుఁగోల నడిమింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. ప్రభా. 2 29

తే. విప్రువెంబడిఁ బడి నీవు వేడ్కఁ జనిన ...దశకు. 3 35.

ఆ తగదు మిగుల నిచటఁ దడయంగ సంకేత,తం బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక. రాఘవ. 4 19. (భారతార్థమున)

సీ. ... నిద్రిశద్రుచ్ఛాయ నిలువక జరుగ వెంబడి నధ్వగపంక్తి పోఁగలు వెట్టె ఆము. 2 46.

సీ... ఒకటికి వెలవియ్య మటికి చీకటి దాఁక బసు లగాపరుల వెంబడిన పోదు. హంస. 3. 142.

**వెంబడించు** స. క్రి (√ వెంబడి.) అనుగమించు, వెనుకొను.

మహాస్రగ్ధర ... విదళించున్ వెంబడించున్ విను
వకసురులన్ విష్ణుఁ డీతిఁద్రుంచున్. ఉ. రా. 2 838

వ . . వివిధ రాష్ట్రనివాసులు ... శ్రీరాముని వెంబడించిరి .. ఉ రా. 8 268

**వెంబడు** అ క్రి (వెన్+పడు) 1. వెంబడించు.

చ జవవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది చూడఁజో, డవ రవగాలు చూపుచు హుటాహుటి నేగి పరాకు వీరు వీ, ఁని తమఁ జెల్వ నందఱు రయంబున వెంబడవాగె సడ్లయై, య్యనఁ గనుమూసి కన్దెఱచునంతటిలో ముని సీమఁ జేరఁగన్ (కువల 2 58)

2. కామించు, వలచు.

సీ ... పరకళత్రముల వెంబడఁ దలంచినవాఁడ ప్రజ్ఞా విలాసంబు పదటఁగలసె శివరా. 3 62

**వెంబర** విణ 1. దుష్టుఁడు, దుష్టము

చ కలిగినవానిఁ బ్రాఁబలుకుఁగమ్మని యూర్పుల వాని యొందు నే, వెలుఁగును గాని పెన్వెలుఁగు వెంబడినిం జనువాని నంతటన్, వెలసిన వానిని గ్గనని వెంబరపుట్టువు జాతిపుట్టువుం, బలె గతి గానలేదు యతిమానస హంసక కంసహింసకా పాండు 2 71

౨ అవివేకి, మూఢుఁడు

ద్వి. అమృతంబు గుక్కల కందిచ్చి పులిసి, నంబలిఁ ద్రావఁగా వాళించునట్టి, వెంబర గాని వివేకిగా డెందు. ప్రభులింగ 3 ఆ 92 పొ 10 పం

**వెంబరవిత్తు** విణ (వెంబర+విత్తు) మూఢాగ్రేసరుఁడు.

మ మరుక్రూ రాస్త్రభయార్తిఁ గుంజము సొరన్ మత్తాళిమల్లాతిదు, స్తరహల్లోహలశబ్ద మందడర సంతాపించి చూతంబు డా, యు రటత్కోకిల పక్షిక్ష్వేలాడ వెతనేయన్ నిల్వ శంకించి వెం, బర విత్తై వలువంకల మ్మని వరాపస్మారలోలాత్ముఁడై సమీర. 3 233

**వెకలి** విణ. (సం. వికలః) 1. మూఢుఁడు

ద్వి. సకలోన్నతుండనై సడిగన్న నన్ను, వెకలినై తమతండ్రి వెడలంగఁ ద్రోవ, యతి హీన సత్త్వుఁడై యడవులలోన, బతిమాలి ఫలములం బర్ణాశనముల, వికృతాంగుఁడై తపోవృత్తిమై నున్న, నొక పెదమానవుఁడోపునే చెనక. రం రా. యు. 251 పొ. 14. పం

సీ. వీథిలోఁ బోడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై పలుమాఱు వెక్కిరించు . . ఉ రా 7 828

సీ పట్టు పాఱు మటంచుఁ బారావతంబును వెకలినై నే నేల విడువఁబోతి ... సారంగ 2 145.

2 ఉన్మత్తుఁడు

సీ ... వెకలియై తిరుగ నేవేళను రతికేళి కళలు దేరెడు మోము కళలుదేరె ... ప్రబం 1.755.

3 ఆసక్తురాలు, ఆసక్తము

గీ. ... వనిత చిన్నారి పొన్నారి తయసువాని, విప్రనందనుఁ గన్నంత వెకలియగుచు. పాండు. 3 62.

సీ ... లీలఁ గర్పూరతాంబూల మర్పణఁజేసె వెకలి మాటలతోడి యొక విసాళి ప్రబోధ. 5. 59

వ .. పుహాళ్ళ మప్పతిల్లు నెత్తావులకు వెకలులై యాడు మొకరితుమ్మెదలు . మనుచ. 3.28.

4 అర్థము లేనిది.

సీ... వేడుక కై వను వెకలి నవ్వులు మీఁఱ నటనఁ జూపట్టఁ బల్కుటయు లేక . వాల్మీకి. 1.33.

వి. వెఱ్ఱిది, అర్థము కానిది.

ఉ. వచ్చి పురంబువాకిట రువార పుఁగో డెతనంబు తోడఁ, గన్నిచ్చకు వచ్చుచేడియల నెచ్చరికించుచు ధూర్తకోటితో, మచ్చరికించుచున్ వెకలి మాటలు మాయపుఁ గూచిమారపుం, బచ్చలు చూచుచున్ సెలవి పాఱఁగ నవ్వుచుఁ గేకరించుచున్ విక్ర 8 8

**వెకలితనము** వి (వెకలి+తనము) అవివేకము, మూఢత్వము.

చ. అకట తదీయసత్కళల నాదటఁ గన్గొని మెచ్చి పాతితో, పికముగ నిచ్చు సమ్మనము చేడియలో మరలంగవచ్చునే, వెకలితనంబుచే నిటుల వేదనఁబొందఁగ నంచు నెచ్చెలుల్, పకపక నవ్వి కేరడపుఁ బల్కులు పల్కఁగ నెట్టకేలకున్. చంద్రా 2 145

**వెకలిపడు** అ. క్రి (వెకలి+పడు) అవివేకము నొందు.

క ఒక చెలిపై భ్రమపడి యా, సకి పిలువక యున్న మోహసంగతమతియై, వెకలిపడుచుంటి వదియు న్నమకురున్ పగవంగవలదు మనుజాధీశా. (పాదుంరో. 5. 148)

**వెకిరింత** వి. వెక్కిరించుట.

క. ... దీపము లేనింతుల్ సుఖలోపము లవి చీఁకటింటిలో వెకిరింతల్. (వై జ. 3. 26)

**వెక్క** వి. వేఁడిమి.

క. అక్కెండి యీరెలుంగై, చెక్కులు చెమరించి నెఱులు చిక్కులువడి కాల్పోక్క వసివాడి యూర్పులు, వెక్కం గెమ్మోవి కమలి వికలాంగముతోన్. పారంగ 3 242

సీ. తరుణారంభాగర్భదళతాళవృంతంబుపై గాలి వెక్కన పలుకఁబాఱె .. నైష 2. 119.

ఆ వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన నుష్ణసంజ్ఞదగు .. (ఆం భా. 1 83.)

**వెక్కఁబెట్టు** స. క్రి (వెక్కన్+పెట్టు.) పైకి నిగుడించు.

తే వెట్టి నీ రానుకతమున వెడలనట్టఁ, జొక్కఁబోఁ దట్టి యుకకమ్ము వెక్కఁబెట్టి, దడిగఱవఁబోవు వేఁపిచందమునఁబట్టి, పరుసమెచ్చఁగ మారుజప్రముఖుఁ బలికె శుక. 3. 32.

**వెక్కలి**=**వెకలి**

ద్వి ... ఆ విప్రు, కడఁ గూడి చదువు వెక్కలి బ్రహ్మచారులు. నవ. 2. భా (శ ర)

**వెక్కసపడు** అ. క్రి (వెక్కసము+పడు)

1. సహింపలేనిస్థితి నొందు

క. ఎక్కడివెలుఁగిది యిన్విభుఁ, డొక్కఁడ యిటు చొచ్చెనెట్లొకో తెలియ గమచున్, వెక్కసపడియెడు మా కతఁ, డొక్క ముహూర్తమున మగుడ నొయ్యననదోచెన్ హరి ఉ 5 87.

వ. ఇవ్విధంబున విరోధివర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ .. భార. విరా 5. 2.

తే. ... ఓకాంత, యిచటికస్తోకభుజబలాఢ్యుఁ, డొకరాజు వచ్చి నీయాత్మభవునిఁ, దునిమె నెఱుఁగ మతండు వోయినపథంబు.

క ఇక్కరణిఁ జెప్పినన్ విని, వెక్కసపడి వనమునందు విహరింపఁగ .. భా రా. అర 1.131.

2. వింతపడు, ఆశ్చర్యపడు

ఉ. కయ్యము గల్గినట్లయిన గంధగజప్రకరంబు కుంభముల్, వ్రయ్యఁగదురంగ పంక్తులుధరం బడఁ దేరిగముల్ బదల్పడన్, దయ్యమికీవు వెక్కసపడన్ గదపందువు సేయునాకు ... (భార. ఉద్యో 3. 67)

ద్వి బ్రొమొక్కుచులోకంబు వెక్కసపడఁగ . . బస పురా. 184 పొ. 11. పం.

**వెక్కసపాటు** వి (√ వెక్కసపడు) సహింపలేని స్థితి నొందుట

ఉ వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లనున్ ... భార విరా. 5 112.

మ. ... ఈ, రసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు వె,క్కస పాటొందఁగ వ్రచ్చుఁ జించుఁ బొడుచున్ గారించుఁ దూలించు ... భా రా యు.1974.

ద్వి. అక్కటా యిది యెంతయన్యాయ మనుచు, వెక్కసపాటున విధిని దిట్టుచును, నరపతి దూషించి నాతి నిందించి, పురమార్గమున వారు పోయి రా ప్రొద్దు ద్వి. శ సా. 2. 835. పం.

**వెక్కసమందు** అ. క్రి (వెక్కసము+అందు.)

1 సహింపలేని స్థితినొందు

చ .. బమల్ వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికిన్, వెఱపావరించు వార్త ... భార అశ్వ. 3. 157.

ద్వి. ఎఱిఁగి యాకసమున కెగసి వేగమునఁ, గఱకు రక్కసులు వెక్కసమంది చూడఁ, గపులెల్ల మ్రొక్కమర్కటసంభ్రమమునఁ, గపిరాజు వచ్చి రాఘవునకు మ్రొక్కె. రం. రా. యు. 389. పొ. 29 పం.

ఉ. చెక్కిటఁ జేయిచేర్చుకొని చింతిలు నుస్సురటంచుఁ బాపులన్, వెక్కసమందు లేమ దొలవింబొడఁగట్టినయట్లు నుండఁగా, నక్కనఁ జేర్పఁబోవు భ్రమమంది వెనం దల యూచునంతలోఁ, బక్కునవవ్వు నింతిపయి జాలి నృపాలకమౌళి కన్నతన్. హంస. 1. 72.

2 ఆశ్చర్యపడు

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్క కాంతరూ, పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది దా వినీతయై, ప్రుక్కుచు పీచభామినుల చొప్పునఁ బల్కెడుఁ దౌరులుం గడున్, వెక్కసమందఁ జూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. (భార విరా 1. 308)

ద్వి వెక్కసంబందంగ వేయిమాడలును, జక్కఁగ నెన్నితిఁ జౌకముల్ ద్రోచి బస. పురా 120 పొ 10 పం

వెక్కసము వి. సహింపరానిస్థితి, దుస్సహత్వము

క ఇక్కైవడి రక్కసునకు వెక్కసమునఁ దొడరు జముని వీరభటులతో, నుక్కున మార్కొని పోరఁగ, నొక్కరుఁడుం గలుగఁ డసురయోధులలోనన్. ఉ. రా. 3. 336.

2. లోకువ, చులకన.

క. మనసిచ్చినఁ దన కోడరు, చనువిచ్చినఁ బ్రజలు వెక్కసము సేయుదురో,టను పతి మనసీయక కడుఁ, జనువీయక మెలపవలయు సమ్ముఖచరులన్. కవిక 2. 18.

3. వింత, ఆశ్చర్యము. (చూ. వెక్కసపడు.)

4 అధికము

ద్వి అక్కఱ గండఁడై యపఏటప్పటికి, వెక్కసంబున మూర్లు వేలు నపిఎచ్చి... ద్వి హరిశ్చ ఉ 478 పం.

5. బ. దుస్సహవచనములు.

ద్వి. నేడు నీకల్ల నానిజము, గానక యేల వెక్కసము లాడెదవు ద్వి, సారం. 1 32 పొ 17 పం.

విజ. 1. దుస్సహము.

సీ. ... రాధేయబాహులే యాతిశేయజులకు వెక్కసం బెవ్వని విక్రమంబు ... వి. పు 1.46.

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి వెక్కసం బయి తోఁప వెఱఁగుపాటు ... కళా. 7. 68.

2. దుర్లభము.

ఆ. ధేమకాదుతైన దానవు లీలాశ,ననములో నున్నవారు దీనిఁ, జొచ్చి వాసవాది సురగణంబుల కైన, వెక్కసంబు బ్రదికి వెడలి చనుట. (వి. పు 7.194)

3. మిక్కుటము, అధికము.

చ. కొనరి వసంతకాలమునఁ గోయిల గొల్చిన భంగి నేడ్చిన,బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వె,క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరుసోనలై, యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగన్. కాశీ. 5 167.

మ రసికుండౌ రఘునాథ కీర్తినతి యౌరా! తొల్లి వాగ్బంధముల్, రసవాదంబును రాజవశ్యవిధి నేరంబోలుఁ గాకున్న వె,క్కసపుం బ్రౌఢి వహించి శేషఫణిమూఁగంజేయఁ దారాద్రి ను,ల్లసముల్వాల్కఁగ ఛత్రచామర మహోలత్సుల్లగనన్ శక్యమే విజ పీఠి. 18.

వెక్కసి విజ. (వెక్కసము+ఇ) 1 దుస్సహుఁడు, దుస్సహము, దుస్సహురాలు

ఉ మక్కువ నేమఁ గేగెఁ బదమా యను మా యను వెల్ల రోయు నీ,వెక్కసి వెంచు సింగముల వేఁటల వేఁటలలిఁ ద్రుంచుచున్ చంద్రా. 2 50.

ఉ అంతట వొక్కనాఁ డల ధనాధిపుఁ డశ్వము వాగె వెక్కసిన్, దంతులుమీఱ నెక్కి పెనురౌతన జోడన చెల్వుఁ జూపుచున్ ... కువల. 4. 199.

గీ. ఘనుల మునులను మన్నించి ఖరులకు ఖర, దూషణుల భీషణాంబకాదులను గూర్చి, యొక్క రక్కసి వెక్కసై సొక్కుదాని, ముక్కుచెవులకుఁ గల నిక్కు చక్కుచేసి. సీతా వి 1 10.

2. హింసకురాలు, హింసకుఁడు.

మ ... తద్భావంబు ఘోరంబుగా, విని గో గోపక గోపికానికరముల్ విభ్రాంతిమై బిట్టుమే,ల్కని చూడం జనుదెంచి రర్భకుల కెల్లన్ వెక్కసిన్. రక్కసిన్ వి. పు. 7 120

వెక్కసించు అ క్రి. (√ వెక్కసము) 1. అధికము గఁగమపడు (దుస్సహమగు, అని శ. ర.)

సీ ... ఆ నాకు వెక్కసించు నా యీమహైశ్వర్య శ్రీ
మింక ఁ దురులకై న నేమిచెప్ప, .. కవిక. 5.9

2. అతిశయించు

మయూరసారి వృత్తము వెక్కసించె శైలవిశ్ర
మంబు లొక్కి రేఫజంబులు నగంబుల్
చక్కఁగా మయూరసారిశోప్పున్, నిక్క మంబు
జాతనేత్ర శౌరి అప్పక. 4. 171 211 పా.

**వెక్కించు** వ. క్రి. (√ వెక్కు.) ఉబ్బించు, స్థూలము కావించు.

ద్వి. తొలుకోడి కనువిచ్చి నిలిచి మై వెంచి, ...
ముక్కున నీకెలు జక్కొలిపి కడుపు, వెక్కించి
మెడ సాచి నిక్కి మిన్నూచి. పండితా పురా.
88. పా.

**వెక్కిరించు** వ క్రి (సం. విక్రి) అపహాస్యముచేయు.

ఉ. ... నిన్నఁబట్టి తా, నెన్నఁడు బ్రాంతియయ్యె
మతి తొన్నఁడు నేర్చును వెక్కిరింపఁగాన్.
(కు. సం. 10. 510.)

సీ కేకిగొండ యొకనిచే నిచ్చి తలమున్న, కొండ
దొంతి కుదురుకొన వమర్చి, మగుడ నడుగ
వాఁడు వగచరుల్ వగ వానిఁ, గిక్కురించి
పోయి వెక్కిరించు. భా. రా. యు 267.

గీ. వీథిలోఁ బొడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై
పలుమాఱు వెక్కిరిఁచు. ఉ రా 7. 32°.

అ. క్రి. 1 వికారచేష్టలుచేయు

సీ. కనుఁగొని తత్పురోగమ భూమిరుహశాఖ లెక్కి
యూఁచుచుఁ జాల వెక్కిరించు ... భాగ 10.
స్కం. ఉత్త. 544.

సీ, ... తే. వెట్టి యనరాదు పైఁబడి వెక్కిరించు,
గామి దనరాదు మొగమున గంటు వెట్టు శుక
3. 21.

2. ఇతరుల వేషభాషా చేష్టల ననుకరించుచు
హాస్యము కావించు.

చ. ... తెలిలో కథచొప్పున బొమ్మలాడఁగా,
హొకకడ హాస్యపుం బ్రతిమ లుండవె పెక్కులు
వెక్కిరించుచున్ అని. 1 12.

**వెక్కిరింత** వి (√ వెక్కిరించు). (శ. ర) (చూ. వెక్కిరింతలాడు )

**వెక్కిరింతలాడు** వ క్రి (వెక్కిరింతలు+ఆడు ) ఎగతాళిచేయు, పరిహసించు.

సీ అలదుర్గ యెక్కిరింతల వెక్కిరింతలాడెడు రీతి
నాలుకల్ వెడలఁ జాచు ... కవిరా 2 33.

**వెక్కిలి**=ఎక్కిలి (సం హిక్కా. త విక్కమ్ )

బ. వెక్కిళ్లు

సీ గీ .. తనరారు హిక్కకు నామ మగుచు,
వెక్కసంగ వెక్కిలి యన వేదవేద్య. ఆం. భా.
1 140.

**వెక్కు** అ క్రి (సం హిక్కా. త వెక్కమ్.)

1. వెక్కిలి విడుచు, ఎక్కిళ్లు విడుచు. ?

వ ... మోపెట్ట నశక్యంబయిన ముక్కువెడి
వెక్కిన వారలం జూచి... భార. ఆది. 7 178

సీ చివు రెల్లఁగని నొత్తి తొవరాకు గుత్తుక
దెక్కొని కోయిల వెక్కుచుండు ... కు. సం
5. 341

ద్వి. అక్కిలి పరవక యరగమ్మ గొనక, వెక్కక
పీఁకక వెడగురు వడక ... పండితా. దీక్షా.
31 పా

2 ఏడ్చునపుడు వెక్కిలి ధ్వనివలె ధ్వనించు.

క. ద్రోవదియు సుభద్రయు శోకావేశం బడర
మోము లశ్రులం దోఁగం గా వెక్కి వెక్కి
యేడ్చిరి . భార. ఆశ్ర. 1. 163.

ఆ. మిక్కుటంపు జాలిఁ బెక్కు దెఱంగుల, వెక్కి
వెక్కి యేడ్చి స్రుక్కి సొక్కి, పాలసుదిండి
తీర్పరులు బుజ్జగింప వ్రతండు గొంతదిట
మెదం గుదిర్చి. అ. రా యు 361.

3. వెగచు, దుఃఖించు, రోదనధ్వనిచేయు

క ఒక్కింతకాలమువారిని, వెక్కువయగు కాలము
వారి వెనయుదు రోలిం, దక్కువ కులజునిఁ
గవియన్, వెక్కుదు రిప్పులను గొంది వేశ్యలు
జగతిన్ విజ్ఞా ప్రా. కాం. 115.

క ఒక్కతె భయశోకంబుల, వెక్కుచు ఘెయిఁగల
విలాసవిభ్రమలత్ముల్, ధక్కుటయుము నాక
యొంటిపైఁ, నెక్కొన ధరణీకు నెదుర నిలిచి
వివీతిన్. (మనుచ 4. 69 )

ఉ. ... ఎక్కడఁ జొచ్చువాఁడ విఁక నెవ్వరిఁ
జంపిననేమి యంచుఁ దా, వెక్కుచు లక్ష్మ
ణుండు పలవింపఁగ ... దశా 8 140

వి. వెక్కిలి, వెక్కిలి. బ వెక్కిళ్లు.

తే. ... ఊర్పు లెడతెగుఁ గన్నుల నొందు వికృతి
వెక్కు పుట్టును నాలుక వెగడు గదురు. మార్కం. 84.

సీ. కోరకతతులపై జేరి యాసక్తిచే నవి పిల్చి యాపోవ కవలికేఁగి, కుసుమ మొక్కటి యబ్బ వెన మూఁగి మధువాన వక్కొండు టమజేసి వెక్కు పుట్ట, నించుకించుక త్రాగ చంచువు వద వొంద నా తృప్తిఁ గ్రోలఁబోవందు లేమి, (భోజసుతా. 3 22)

సీ. వెక్కులు పెక్కులై వెతలఁ బెట్టుచునుండు శ్వాసంబుఁ బుట్టుచు గాసిఁబెట్టు ... శివధర్మో. 6. 47.

విశే. సన్నద్ధము, సిద్ధపఱుపఁబడినది

ఉ. క్రేవల వేఁటకాండ్రు దమకింపగ డింపల వెక్కు బాకులం, బోవుచుమాంస భేదమువి బోనము లాయితమైనదాఁక నా,యావిధు లాచరించి యవి యన్నియు దేవరకెక్కు నట్టి సం,భావన సేసి తారు మఱి బంతులు పాఱి భుజించుచుండఁగన్. కకు. 1. 117.

అ. క్రి ఎక్కు. రూ. (సం. హిక్కా) 1. వెక్కిళ్లు విడుచుట. 2 ఏడ్చునపుడు ఎక్కిళ్లవలె ధ్వని చేయు.

తే. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి యేడ్వఁ దొడఁగె లతాంగి. .... శృం. నై. 4 87.

**వెక్కుమీఱు** క్రి. (వెక్కు+మీఱు) వెక్కిలి విడుచు, వెక్కు.

చ. వివశత నొంది మేను విడువెండ్రుక వెట్టఁగ వెక్కు మీఱి క,న్గవఁ దెఱవంగ రాక పొరిఁ గంపము నొందుచు నిశ్వసించుచున్ ... హరి. ఉ. 8. 110.

**వెక్కురు** విశే (√ వెక్కు సం. వికారి.) వికారము గలవాఁడు, వికృతము.

క. ఎక్కడి సుతు లెక్కడి సతు, లెక్కడి సంపదలు మాయ లిన్నియు ధర్మం, బొక్కటి నిజమని యెఱుఁగని, వెక్కురులకు సుకృతి భోగ విభవముగలదే. కుచేల. 1 62.

ద్వి. కథఁగి పేదవులఁ గాయసందేరి, కుడిచి వర్తింతు వెక్కురు తాపసులకుఁ, బొడల కళాసంబో బూదిపొక్కణమొ, జడలో రుద్రాక్షలో సంపదలేల? హరిశ్చ పూర్వ. 1484.

క. చొక్కపుఁ గక్కసికులమున, వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్, నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర వెట్టిన్ భాగ 7. 254

క. నిక్కము మొనలిపి రెండవ, యక్కరమున కరిగృవంబు సందుండిన యా, వెక్కురు కబ్బం బొడయనిఁ, జిక్కువడఁగఁ జేయుఁ బగరచే ఁణభూమిన్. అప్పక. 1 348.

సీ వెక్కురు నాఁగను వికృతఁబు విలసిల్లు . .ఆం. భా 1 182

**వెగచు** అ. క్రి. ఏడ్చునపుడు వెక్కిలివలె ధ్వనించు.

ఆ విడువనయ్య తండ్రి తడయక వచ్చెద, వీఁడె నన్నుఁ జూచి వెగచివెగచి, కొడుకువద్ద వెగడు వడి యేడ్చుచున్నాఁడు . మార్కం. 1 215.

ద్వి వెడలు నిట్టూర్పులు వెగచుకుత్తికయు, బడలిన మేనును బఱిలినమోము. ద్వి హరిశ్చ. 2083. సం

క. వగచిన చిత్తము నలఁదురి ... వెగచిన కంఠమునుడుగక, నెగసిన నిశ్వాసతతియు నీరజ ముఖికిన్ కు సం. 5. 587.

2. వెక్కు, ఏడ్చు.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని . భాగ 10 872

**వెగటు** వి రోఁత, వైరస్యము

సీ విబుధ ధామముమీఁద వెగటుగల్గినఁగాని వన జారి మిమ్ముఁజేరి చెనక వెఱచు కువల 2 15

సీ. భవ్యకలఎక సాదవ పరిష్కృతాళ్ళియ విపిన కేలనముల వెగటుఁబూని... హరిశ్చ నల 2. 18

ఆ పరుల పంచఁ జేరి బ్రతికి పలా వృత్తిమెచ్చ లంగు కోకిలమ్మునకుఁ బొసంగుఁగాక యింటఁ జక్కెరద్దిననుని, వెగటు చిలుక నీకుఁ దగునె చిలుక. రసిక. 4 172.

విశే. అనిష్టము.

శా. నీ రమ్యాకృతి నెమ్మదిం దలఁపుచున్నిద్రా విహీనంబు లౌ వేఁగంబు న్వెగటై మనోభవ శర వ్యాకీర్ణ ధారావాహిన్ ... శయ్యాగతృంబు ప్రసూన తల్పమునఁ దాపార్తిన్ వెనన్ దూలెడిన్. ఇందు 2 177

క. ఆమె యఁట నన్ను బిలిమిన్, గామించునఁట యుడఁబడక క్రమ్మఱ నేరా, స్వామికి వెగటుగ ననునఁట, యా మాటకె యాజ్ఞవెట్టు నఁట విభుఁ డహహా. సారంగ 2 21.

2. విరసము.

క. అని యది యాడిన మాటలు, విని జంగమ మూర్తి మదికి వెగటుగఁ దోఁపన్ ... చెన్న. 2. 32.

తే. అయ్యలార మీ కెల్ల నే మనిన మాట, వెగటు కాదుగదా . . పరమ. 3. 37.

3. వెక్కసము

సీ. ముసు ద్రుంగి వెగటైన వనతమ స్తతి గ్రక్కుఘన విరోచన మయూఖములవంగ ... చంద్రి. 4. 34.

వెగడందు=వెగడొందు అ. క్రి (వెగడు+అందు.) వైవశ్యమును పొందు.

వ. వారును దత్కృత్యా దర్శనంబున వెగడందిన వారు గావున ఉ హరి. 3. 185.

వెగడు వి 1 చలనము, తల్లడము.

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెడు రెండవ వన్నె పెట్టకేలకుఁ దగఁ దేర్చునప్పుడు బలంబుతోఁ గురు రాజు సూడ ... భార. విరా. 5. 336.

తే రోదనధ్వను లెసఁగంగ రుక్మిణియును, సత్యభామయు నప్పుడా సవ్యసాచి, కడకు నేతెంచి పుడమిపైఁ బడిరి వనట, పెల్లమునిఁగి యుల్లంబులు వెగడ నొంద భార. మౌస. 102.

2 తడఁబాటు.

చ ... పుష్కరపత్ర నిభంబులైన లోచనముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం బనుదెంచె వల్లవల్లవ వెడ భీతిదోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్. భార. విరా. 1. 276.

క భగదత్తు నేనుఁ గడరిన, వెగడునఁ బాండవుల మొనలు విఱుగుటయు .. భార భీష్మ 3. 35.

3 భయము

సీ బోటికిఁ దోఁచినఁ బోలియుఁ దేకువయను వెగడునఁ జెయ్వులు పిడుపడఁగ .. భార విరా. 2. 70.

చ. అనుటయు నాతఁ డాత్మ వెగడంతయుఁ బాయఁ బ్రబోధ లక్ష్మి గ్రమ్మనఁ దలయెత్త నాద్యుననమాను సనాతను వాసుదేవుఁ డాఁగని . హరి. ఉ. 9. 108

4 దుఃఖము

ఉ. నావుడు మూర్ఛవచ్చిన మనంబునకున్ ధృతి యూఁత యిచ్చి నం,తావన వారిఁ దోఁ బనిచి పార్థివ ముఖ్యుఁడు దల్లడంబునన్, దావు కొనంగ లేక తనతమ్ములు నప్పుడ పిల్వఁ బంచి నా,నావిధ చింత ముట్టికొనినన్ వెగడందుచు నార్తమూర్తియై. నిర్వ. 8. 109.

వెగడుపడు అ. క్రి (వెగడు+పడు) 1 తల్లడపడు

ఆ. ... కొడుకు దద్ద వెగడుపడి యేడ్చుచున్నాఁడు, బుజ్జగింతు నేమచు ... మార్కం. 1 215.

సీ. సకలాంగ భసిత కంచుకమున విషపుచ్ఛ విషధరాదుల భీతి వెగడుపడక ... కాశీ. 1. 71.

ఆ. .. సదనులోని విప్రజనుల మీఁద, వెగడుపడఁగఁ గాటి వెఱపింతము ... భార 2 150.

2. తొట్రుపడు, తడఁబడు

వ అట్టి యవక్ర విక్రమ పరాక్రమంబునకు వెగడుపడి బాణుండు వేట మొగంబువడి సేయునది లేక విన్నవై యున్నయెడ ... భాగ. 10 ఉ. 428

3. భయపడు.

వ హిరణ్యాక మందరంబులు సహిరణ్యగర్భమున్ గొనర్చి వెగటు పడ యున్న మృగంబు మాఱడించి యాతిథ్యం బొనరించి. వేం. పంచ. 2. 179.

వెగడుపఱచు స. క్రి. (√ వెగడుపడు.) వెగడుపడ జేయు, తల్లడపఱచు.

క అతఁడంద ఱ విశిఖంబులు, వితథమ్ములు గా వెగడుపఱచి యుద్ధతి సైంధవు పోనీడ, కతిరయమునఁ దేరు నడుపు బాణాసనమున్. భార. ద్రో. 2. 98.

తే .. మగుడఁ జదువుఁ జెప్పఁదలఁచె.

క. తలఁచి యదియపు డొకింతయుఁ, దొలుతటి తరువాయి మఱియుఁ దోఁచక మఱియప్వల వరసిద్ధ శ్రుతిశబ్దము, పలుకునకున్ రాక వెగడు పఱచినఁ గలఁకన్. పర. 1 118

2 తడఁబడఁ జేయు, విభ్రాంతి నొందించు

తే ఇట్లు గృహారాజి కేలి శానేకరత్న, వివిధ రుచి వైభవంబులు వెగడు పఱుప . వసు 4 78

వెగడొందు=వెగడందు అ క్రి (వెగడు+ఒందు)

1. తల్లడపడు, చలించు

సీ విబుధారి కినుకకు వెగడొందు తెఱఁగున వన రాశికరము ఘూర్ణనము నొందె .. నృసిం. 2. 107

సీ వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి వాహంబు లొకలు వైచుకొనియె ... విక్ర 4. 60

2. తడఁబడు

క. వగముట్టికొనినఁ జిత్తము, వెగడొందఁగ మేను గలయ ... భార విరా 2. 308

3. భయము.

క. వెగడొంది యిట్లు పలుకఁగ, నగుచే ... భార విరా. 4. 66.

గీ. విఱిగి పాఱినఁ బోనీక వెన్నడించు, హాలధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన, మునిఁకి . ఉ. హరి. 3. 107

వెగవెగ వి శీఘ్రముగా నడచుటయందగు ధ్వని కను కరణము; గబగబ.

సీ. వేగుఁ జూచెదమంచు వెగవెగఁ జనుదెంచి దూర మేఁగుచు బోదల్ దూఱువారు....కృష్ణ.3.46.

వెగ్గము వి. పంతము.

ద్వి ఒకతోఁటలో నిరఁదున్న మాయక్క, వెర బిఠాయె తనుఁజూచి వెగ్గంబులాడి, లలితంబులైన విలాసముల్ చూపి, వలపింపఁగలనె యీ వటు వేషధారి, వని ... ద్వి పరమ. 4 386 పొ.

వెగ్గలమాడు అ. క్రి (వెగ్గలము+ఆడు) అధికముగా వంచరించు.

ఉ. ... తరుమరంద సరస్సరవింద గోష్ఠికిన్, వెగ్గల మాడు తేంట్లు ... ఆము. 5. 122.

వెగ్గలము విశ (క వెగ్గళ) అధికము

ఉ వెగ్గలమైన మోపుగడు పేఁకన యెత్తఁగఁబోయి ముందటన్, మ్రొగ్గతిలం బడెన్... వా౦ర.1 21

క. ... పెనుఁబెంట వలలనురలు మృగములన్, దగ్గఱి చంపెడువేడుక, వెగ్గలమై చిత్తమందు వెటాడింపన్. భాగ. 1 464.

క సలసలమను కలకలు వెఁగ్గలపుం గినుక యను సెనటఁ గల వడివడి నౌదలయంటి చూచు కొనియె, నిలువెదలిరి నా క్షణంబ యెత్తిన భీతిన్. పాండు. 5. 207.

సీ . గీ జలజనాభుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలచేసి, వారెనయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి, కల్లు బిల్లులుచేసి వెగ్గలము వవ్వె ఉ హరి. 3 99.

గీ బాల్యమున నుండి యౌవన ప్రాయమైన, యపు డుఁదన భార్యయందు నయం బొకింత గావఁ దయ్యెను వేము వెగ్గలము పెరుగఁ, గలదె మాధుర్యగుణము తిక్తంబుగాక వై. భా 4.86.

వెగ్గలించే న క్రి (√ వెగ్గలము), త్రోసిపుచ్చు.

ఉ మన్ననచేసి మీరు బహుమానముతో ననుజేరి నారు నేఁ, గన్నది దెల్పకుండిన వఘంబగుఁ గాదని వెగ్గలింప కీ, విన్నప మాలకింపుము ... సారంగ. 2. 6.

వెగ్గలీఁడు విశ. (వెగ్గలము+ఈఁడు.) అధికుఁడు, గొప్పవాఁడు.

సీ. అబ్ధిసంభవ యితఁడు వో కోలహాలపు విపణిఁ బుక్కిటఁ దాల్చిన వెగ్గలీఁడు ... కాశీ. 5.110.

(క ర సా. వెంగలీఁడు వ్యుత్పత్తి.)

వెచ్చ వి వేఁడిమి, తాపము

సీ. వలరాచరాచ వాఁడలిరాయిడు కనువెచ్చఁ గరఁ గిన యల కనికరపుఁ బోతు ... కుకుచ. 2 9.

చ. ... వెచ్చలం, గరికిరి తాపతాంగకములఁ గప్పిక రొంపులు వందయాఱఁగెన్. ఆము 3. 47.

2 జ్వరము.

సీ ... వెక్క నా వేఁకి నా చిచ్చుఱుకుఱుడ ఇగ్గి మొప్పు . అం. భా. 3. 128.

3. కాఁక, తాపము.

చ... అ.ట్ధిరా,డ్విరహా ఘరంబున వ్రొదము వెచ్చకు కాంతి యొనరప్రవాహినీ, తరుణులు మేన దట్ట ముగఁ దాల్చిన ము త్తెపుఁ బేరులోయవన్ ఆము 2. 51.

విశ 1. ఉష్ణము, వేఁడియైనది (వృత్తియందు విక ల్పముగ నిగాగమము)

ఉ. వెచ్చని కన్ను నీ దరర పిడిన వేవలితోడఁ తెల్పనా,వుచ్చి తనూజులం బనవ ... భార. ఆను 1. 289

సీ. ... గీ. కేట చలివెచ్చ నీరువఁ దీర్థమాడి .. హార 2. 107.

చ. శలి మలి వెచ్చయోగిరముఁ దియ్యని చేరులఁ దిమ్మనంబులున్ ... ఆము. 2. 81

2. తీక్ష్ణము, అసహ్యము.

చ. వలచుట జాతిలోనఁ దలవంపగునే కదయింక దాఁచఁగాఁ, గలిగెడిదేమి నా నమపుకాంద్రను దాల్లిఁటివారి వీథిలో,వలఁ గనివంత వెచ్చ నగు కాటున కోరిచి యన్నదమ్ములం, బిలిచిన రీతిఁ బిల్వ వలపించెఁ జమీ యతఁ డంబజావనా. కువల. 4 181.

క్రి. విశ వేఁడిగా.

తరలము. వమరకూరులు పాండవుల్ జితశత్రు లున్నత చిత్తులుత్తములు వారలతోడి వైరము ధర్మయుక్తిఁ గరంబ యుక్తము ప్రజా క్షయ కారణం బని శద్దయున్ భయమందుదుచున్, విమ మఁగ్రై పడియుండె వోయని వెచ్చనూర్పుచు విన్నవై భార. వభా. 2. 310.

వెచ్చఁబడు అ. క్రి. (వెచ్చన్+పడు) వేఁడి కలదగు. (వ్యవ.) స్నానమునకునీళ్లింకను వెచ్చఁబడలేదు

వెచ్చఁబెట్టు న. క్రి (వెచ్చన్+పెట్టు) వేఁడిమి కలి గించు.

(వ్యవ.) నేయి వెచ్చఁబెట్టుము.

వెచ్చకాఁడు (వెచ్చము+కాఁడు) విటుఁడు. (బ. వ.) వెచ్చకాండ్రు.

వ. . . ఈ ధనంబుల నేమి యయ్యెడు నయ్యె యో,ఈ వెచ్చకాఁ డెచ్చటికేఁగిన నేమి?...నా చేసిన దురితఁబె తకాలఁబునరకంబుల మండినను దరుగునే, వడచి కుడుచు వడఁతికంటెఁ పాపిని యున్నదే యని విచారించు .. జాహ్నవీ. 4. 41

సీ . .గీ. సురల యాఁకటికూడు ముచ్చులకు గేఁడు, దిక్కులకుఁజేఁడు వెలుఁగుల యిక్కి కోడు, లచ్చి పైదోడు రేఁబోటి వెచ్చకాఁడు, చంద్రుఁ డలరారె నక్కళా సాంద్రుఁడగుచు. కవిజ. 3. 79

విశ మిక్కిలి వ్యయము చేయువాఁడు. (శ ర)

వెచ్చన వి వేఁడిమి, ఉష్ణము.

ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చనయన, నుష్ణ సంజ్ఞ తగు .. ఆం. భా 1 47.

విశ ఉష్ణముగలది, వేడియైనది.

సీ. తొలుదొ త్తె నుదయాద్రి శిలఁదాఁకి తీండ్రించు నసిలోహమున వెచ్చనై జనించె ... ఆము. 1. 36

క్రి విశ. క్రు. వేఁడిగా, వెచ్చగా.

ఉ ... చెలింగని వెచ్చనూర్పుచున్. ఆము 5. 89.

వెచ్చపడు అ క్రి. (వెచ్చము+పడు) వ్యయమగు.

క కడు మేటయైన దొఁచేఁ, ఒడినది మీసొమ్ము వెచ్చ పడనోపిన నీ, కడగొఁత దివ్వవచ్చున్... పరమ 5 57

ద్వి. చేతివిత్తము మున్ను చెవటయై పోయె, పలు తెఱంగుల వెచ్చపడి ... నవనాథ. 5. 211. పా. 19. పం.

వెచ్చపఱుచు (√ వెచ్చపడు) వ క్రి. వ్యయము చేయు

గీ. ... వచ్చపైకఁబు వీందలో వెచ్చపఱుప, నెన్ని చెప్పినమాట లింకేటి కనిన ... హరిశ్చ. 4. 199.

వెచ్చపెట్టు న క్రి. (వెచ్చ+పెట్టు) 1. వెచ్చించు, వ్యయముచేయు

క. కట్టక కుడువక యొరులకుఁ, బెట్టక తమతండ్రి కూడఁ బెట్టిన సిరిఁ ... దనయిచ్చ వెచ్చ పెట్ట దలంచెన్. విక్ర 2 163.

ద్వి పలోకో కౌసల్య యొదనుబ్బి యుబ్బి, వే సంఖ్యధనంబు వెచ్చపెట్టెడిని ... ర. రా. అయో. 88. పా. 28. పం.

తే. మాద్రి మీరు విభూతి వేద్రాద్రిరాజు, దాన
ధారార్థ మఖిలప్రధాన వగు, వెచ్చపెట్టుటం
దలంచి యోవిబుధ తటిని, తమను శశిమౌళి
జడలలో దాగియుండు పం. దు 1 72

2 విడుచు

చ. హరిపద పూజనం బొలంగి యత్యభూఁ గొల్చు
కులాభిమానముల్, వదలక వెచ్చపెట్టి హరి
చందన కీర్తులు వీటి బుచ్చి .. హరిశ్చ
5 92

3. చెఱచు, పాడుచేయు

చ. ... మాయ నింద్రియాధిక మతియై యవాఁడు
దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పాతకములం
గూలకున్నె ... భాగ 6 517.

4. ఉపయోగించు, అనుభవించు

శా. ఏలా వేయును విన్నవింపఁగఁ ద్రిలోకేశా
మహేంద్రాదిది, కావలై శ్వర్యము వెచ్చపెట్టు
కొను మింకన్ సృష్టి నష్టంబగున్ .. వరాహ.
10 18

అ. వలసినట్లు దివ్యవస్తువులెల్ల నా, యిచ్చినవి
నట్లు వెచ్చపెట్టి. ప్రభా 1 85
("నా యిచ్చి వనుభవించి వెచ్చపెట్టి" అను
పాఠాంతరమున "వెచ్చపెట్టు=వ్యయపఱచు,
వెచ్చించు" అని యర్థము.)

**వెచ్చపోవు** అ. క్రి. (వెచ్చము+పోవు) 1 వ్యయ
మగు, తఱుగు

చ. తన ధన మించుకంతయు వృథా వ్యయమై
నది లేదు వైష్ణవార్చనలకు వెచ్చపోయినది
సర్వము ... పరమ. 4 148

సీ. కళ వెచ్చపోని నిర్మల చంద్రబింబంబు పర
భృతంబంటని సరసిజంబు రామా
4. 64

2. నశించు, చచ్చు

ఉ. ... ఆలిని బిడ్డల న్విడిచి యాకటి చిచ్చున
వెచ్చపోవువారేలిక బంటు వాని మొక
యించుక లేక కృశించువారునై, తూలె జనంబు
మీద తని దోషము దాఁకి నిరస్త సస్యమై ...
కాశీ 3. 153.

**వెచ్చము** వి. (వి. సం. విసర్జనమ్) 1. వ్యయము,

గీ. వెచ్చమన్న ఁ దానంట వేఁడువాఁడ, ధీశ్వ
రుఁడంట తాము పతివ్రతలంట. కళా.
6 90

క. ఈమెటు వెచ్చము చేసిన, నామేరు మహాద్రి
యంత యర్థంబైనన్, వే మొదలికి మోసం
బగు ... విక్ర. 2 167.

క. ఎచ్చోఁగజ ఘోటక్రియ, తచ్చాత్వణ సుభట
జీవిత ద్విజసువుపూ, జోచ్చ నిజభోగములు కగు,
వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్ ఆము
4 262

2. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సర
కుల యప్పు.

ఉ. వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరు
వొల్లరు .... పి శకు 1 78.

సీ. బచ్చయి వెచ్చంబు లిచ్చురొక్కపు దొరదళ
వాయువై కొల్చు చిలువ తాల్చు ... అచ్చ
రా సుం. 41.

3. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సరకు

క. ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు
గొనఁగ శీఘ్రమెయిది యీ, పల్లియ సంతకుఁ
జని ... శుక. 2 183

**వెచ్చించు** స. క్రి. (√వెచ్చము) వ్యయపఱచు.

సీ. అశ్వగో మహిష రూప్య సువర్ణ వస్త్రంబు లెన్ని
వెచ్చించిన నేమిఫలము ... భీమ 4 82.

క. జనను బతికార్యము తన ప్రాణము వెచ్చించి
యైన భటునకుఁ జేయం,గా వగు .. ప్రబోధ.
3. 69.

**వెచ్చు** అ. క్రి. 1 క్రాఁగు, తప్తమగు.

ఉ. వెచ్చెన మిన్నభంబు పరివీత శరార్చుల దైత్య
సైన్యముల్, విచ్చె . కకు. 2 123.

గీ. . అట్లు సిద్ధుఁడరుగ నమ్ముగ్ధ మూర్ఛిలఁబొందె,
విరహవహ్నిచేత వెచ్చివెచ్చి శోభనా. 3 70.

ద్వి. పాముచే నీవు లోఁబడియున్నవాఁడు లెఱింగి,
వేమాఱు శోకాగ్ని వెచ్చుచుండితిమి. ద్వి. భాగ.
2 23 పా.

సీ. గీ. వెచ్చెననఁగండె వనఁగను వేఁగె ననఁగఁ,
గమలె ననఁగను నేకార్థములుగ. ఆం. భా.
3. 99.

2. సంతాపము పొందు, పరితపించు

క. అవ్వవు వెన్నెలచేఁ గడు, వెచ్చుటలును మాన మైతలి పెదవిట్టులచే, నొచ్చుటలును బ్రియుఁ డచ్చని, ముచ్చటలును విప్రలంభమునఁ జెవఁ దగున్. కావ్యా. 3. 128. వ

ఉ. మచ్చిక రెట్టిగాఁగ దన మందిరమొంది యభీష్ట వస్తువుల్, వెచ్చెలు కల్లఁడొంది ముఖశీలఁ జరింపఁగఁ జేయలేమికిన్, వెచ్చని యూరువు లింటుకొని విన్నఁదనంబును బొంది వెవ్వగన్, వెచ్చినయట్లు సజ్జనుఁడు వేలోక దుర్దశచేత నొచ్చునే. కేయూర. 8 274.

సీ. కుదుర వేడుక పుట్టి కడియు నోటికఁబోని వేదన వెదవెద వెచ్చివెచ్చి ... వాసిష్ఠ. 1 124

3. కాలు, దగ్ధమగు.

వ ... అలాట లోచను లోచనంబు చిమ్మిన నతం డును వెచ్చి విమ్నుఁగూడెనే ... పార. 3 9'.

ఉ. చిత్తజువైరి ఫాల శిఖరే జగ మెల్లను వెచ్చఁ జూచెనో, యి త్తెఱఁగంటివట్టమునకే నిటులుండక యుండ నెవ్వఁడే, నెత్తులు వెట్టెనో... వాల్మీకి 3. 7.

4. మండు, జ్వలించు.

ద్విః. వేఁడి వేలుపుదిగి వెచ్చి దీపంబు, లీడేర్చి కిరి ... ద్వి. హరిశ్చ పూ. 1157.

వి. వేఁడిమి.

కం ... మ్మిచ్చిమ్మునను వెచ్చనుర ... అము 3. 28.

వెజ్జతికము వి (వెజ్జ+తికము) వైద్యము.

క. పేరవి వెజ్జతికము రా, పేరుతు వని రాజ పురుషునికినితరునికిన్, జూరాదు లిడిన దురము, జారసికొవనలయు నుత్తమాధమ విధులన్ విజ్ఞా. 2. 67.

వెజ్జ వి. (సం వైద్యః) వైద్యుఁడు, భిషక్కు.

ఆ. ఇన్ని సంకటముల నిల్పంగి నెంతయు, పొగులు చిత్తవృత్తి నొవ్వుదీరఁ, వెజ్జ వీవకావె ... భార ఉద్యో. 8 26.

శా ... వేరం బెత్తిన ఘాత చెయ్యి యిదుపన్ వెజ్జెవ్వఁ డూహింపఁగన్. దశకు. 2. 89

ద్వి వెజ్జులు వచ్చినన్ వేగ మూర్చదరు, లజ్జింపనేఁటికి లకాంగి నీకు .. రం రా అయో. 92. పొ. 10 పం (104 5 నవ్య పం )

ద్వి. మందు పెట్టఁగ లేము మనఁజేయలేము, వెదక నంపఁగ లేము వెజ్జుఁ దేలేము ... ద్వి హరిశ్చ. ఉ. 1938

వెజ్జుఁదనము వి (వెజ్జ+తనము) వైద్యత్వము. వైద్యుఁడయి యుండుట.

గీ .. కడవనాతకు చాలు నీ గొడవయేల, వెజ్జుఁ దనమేల యని మది లజ్జవొడమి మనుచ. 5. 18.

వెజ్జురాలు వి (వెజ్జ+ఆలు.) వైద్యముచేయు స్త్రీ.

గీ. అమను వారలు పలుకంగ నాతణమున, జయము విజయను దోడ్కొని జవన గతిని, వెజ్జ రాండ్రము మీరు నా బిడ్డచెంతఁ, బదిలముగ నుండుఁడీ యంచు వనముఁజేరి పార్వ 4. 187

మ .. ఉగ్రదళ వక్త్రిభృచ్ఛిరోక్షారమున్, శమ మొందింపఁగ వెజ్జురాలయిన కాంతన్ భక్తి భావించెదన్. చంద్రా 1. 2.

వెట్కా-(టకా)రము వి ఎత్తిపొడుపు.

శా కానిమ్మెంత ప్రయోజనం బనుచు వెట్కారంబుగాఁ బల్కు, నాభానోత్తంసముఁజూచి ... రంగా. 2 45

వెట్ట వి 1 వేడిమి

గీ అట్టి వేసవి తెకిరంబు వెట్టకతన, నేల వందందు వికివిన నెఱియలందు ... వాల్మీకి 2 70.

(మార్తాండుఁడు) గీ. త్వష్ట కవన్యక సంజ్ఞనుద్వాహమయ్యె న వ్విలాసిని యమ యమునాహ్వ యములు, గలుగు కొడుకును గూఁతుమ గనియెఁ గని నిశ్వేశ్వరుని మేనివెట్ట వహింవ లేక. వరాహ 5 89

సీ ... జిగి దొంద పండంచుఁ జేరవచ్చిన చిల్క బలువెట్ట దిగులొంది పరువు లిడఁగ ... ఇందు. 8. 28

2. వేసవికాలము, వెట్టకారు.

చ వరియగు నిట్టి వెట్టలను సరఃము నంచు ... అము 2 47

3. తాపము,

ఉ. . . అరిమొనవని లాగయి మీకుఁ దోచినఁ, గొండెటకైనఁ దక్కు వెడబుద్ధులఁ బోయిన నే నవశ్యమున్, దండన సేయుదున్ .. పరమ 2. 64.

క వెడ తెరువు లిచటఁ జెల్లవు, పుడమివనహా దొంగలానఁ బొడిచినఁ గోకల్, విడుతురె ... కళా 3. 204.

3. వికృతము.

క. వెడగోఁతల నెత్తురొలుకఁ, బడఁద్రోచినఁ వచ్చి కుక్క పదువు వెమకకున్, జడిసెఁ గబళింప నొల్లక ... భార. శాం. 3 508.

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెడరూపము గాల్చి గ్రుడ్లు వెలికుబుక ... భాగ. 3 701.

సీ. తొడగులు వదలి కుత్తుక వెండి మిక్కిలి వెడ రూపులై వడ్డ వీరభటులు .. జై భా 2 78.

4. వ్యర్థము, వట్టిది.

ఉ. అవల వచ్చు నాపదల కన్నిట కోర్చి లతాంగిఁ గూర్చి శా, కీ వెడమాటల న్మాఁటలఁ దెన్ని విధం బులఁ జూపి చెప్పినన్ ... భార. విరా. 2. 78.

క. మీకును మీపతి యానతి, మాకును మా భర్త యాజ్ఞ మన్నింప దగున్, వాకోవాక్యమ్ముల వెడ, వాకాట్లం బన్నుటలు వలవదు సేయన్ శివరా 4. 70.

చ. హృదయము తెప్పుడుం గదియకే తలచౌ వెడ కౌగిలింతలన్, గదిరెకు మేలు కార్యములఁ గల్గక మాటల యందె కల్గు పెన్నదురులు వట్టి కైతవములు చాల ఘనంబయి ముందు వేస విన్, బొదలఁగ నిశ్చయంపతుల పొందుల కార్యల పొందు కైవడిన్. ఆము 2. 62.

5. అసత్యము, కల్ల.

సీ. వన్నె లుపచరించి కన్ను పన్నులుచేసి వెడ మాటలను బ్రేమ గడలు కొలిపి. ప్రబోధ 1. 75.

సీ వెడప్రోవ మును జెప్పి వడినవ్వఁ దిరుగు వధ్య గుల కొలంది యపత్రపయు మరల ... ఆము 4 162.

ఉ ఆతని పాలికేఁగి వినయంబున జాగిలి మ్రొక్కి దీవనా, న్వితయుఁ బోతె. గొంత వెడదమ్ము ఖుపుల బాష్పకణంబు లతి క్ర, జాతములై వెడలుచు టయు . పరమ 3 215

ఉ. ముంగిట నాడు పుత్రుఁ దతిమోదముతో ... చిఱుగంతులతో వెడయేడ్పుతోడ, దాయంగ.. ముద్దుమో, ముంగమియార ముద్దిడుట ముజ్జగ మేలుటగాక యుండునే. కవిక 1. 40

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది

క. అడలఁజొచ్చి నెమ్మనంబున, వెడతెలివొడఁ గూర్చి .. నిర్వ. 8 181.

సీ. వెలవెలనై చాల వెడవవ్వు వహియించి మురి పెంబు దఱిగిన మోమువాని ... ఉ రా. 6. 205.

7. పిచ్చి.

క. కడతలఁపు లుడిగి సంధికి నొడఁబడు మిది తెన్నె. . భార కర్ణ 3. 273

8 నిర్హేతుకము నిష్కారణము

క. ...కరుణారహిత, త్వమునఁ దొలు మేన వెత పగ, వమేయ వరవధము నేసినట్టి దురాత్మున్. భార అను 6 109

9 వింత, ఆశ్చర్యము

ఉ దేవ! సురాధినాథ భవదీయ మనోజ్ఞమునంది వింతగా నీవిధిఁ జింతింపఁగఁ గత మెయ్యది నేఁడు తపోనిమిత్త మెం,దే వెడవార్తగల్గెనో కవిక 6 49

క్రి. విశే. 1 అల్పముగా, కొంచముగా

క. చని వెడ వికసిల్లెడు నా,నన పద్మముతోడ .. భార విరా. 2. 320

సీ. వెడవాడు లీలారవిందయుగ్మము మాడ్కి నుదతి నీకనుఁగవ సోలమందె . నిర్వ.8.86

సీ .. విరళమై పక్ష్మతి ద్వితయంబు వెడజాఱ జంచులోకించుకాకుంచితముగ . . నైష. 1 98

ఉ. . . చ, న్నెరివల జాఱు కొంగు సవరించుచు వీడిన కొప్పుఁ బల్మరుం, జేవెడ దోపుచుఁ బలికెఁ జెందొవ చూపులు క్రేళ్లు దాఁటఁగన్ పారి 4. 57

2 వదలుగా.

సీ చిటిప్రేలి పూసపై ఘటియిల్లు వెడపట్టుచిమ్ముఁ నురియ డా ల్మిమ్మగముగ ... ఆము 7.14

వి 1. ఇంచుక కాలము
చ అడరు నవాంబు ధారలు జటాటవిలోఁబడి విభ్రమించి వెల్వడి చనుదెంచి రాలుగొని పక్షములన్ వెడనిల్చి మోవిపైఁబడి .... కు. సం. 6. 767
2 చెఱకు (ఈయర్థము మన్మథ ధనుస్సందర్భమునందే కనఁబడుచున్నది 'పుష్పము" అని (బ్రౌ. ని)
క. పదా తీవపుడు వెడసింగాణిఁగొని యలరుఁ దూపు గమిఁ జక్కెర యే, బాణముగాఁ గలిగిన కం, బాణవు దొరపింజ పింజ గాడఁగ నేసెన్. విజ వి. 1 62 (128)
Phrase—(1) వెడ విలుకాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుడు.
చ. వెడవిలుకానికిం జెఱకు విల్లును గల్వలకొలి కోలి కల్, గడలు కొనంగ నామనియుఁ గల్వల రాయఁడు నిచ్చి మన్నవం, బడయుడు వాని కెక్కుడుగ మౌర్వులు కాముని గాన్కకెక్కె నాఁబడిబడి గంధలుబ్ధ మధుపమ్ములు రాఁజను డెంచెఁ దెమ్మెరల్ విజ వి 1. 211.
చ వెడ విలుకాఁడు నెమ్మనము వేమఱుగేడఁగి తేకు వంకిడిం, బోడువఁగ మేను పానుపునఁ బొందక నిన్నభయ ప్రదానమే,' నడిగెదనంచు రాఁ గలిగనమై యిటు వెన్నెలవేఁడి వెన్కొనన్, గొడుగుల నీడ వచ్చితిఁ జకోరవిలోచన యేమి చెప్పుదున్ రామా. 6. 146
(2) వెడవిలుతు(లు) డు = ఇక్షు ధన్వుఁడు, మన్మథుఁడు.
క వెడవిలుతు కీర్తికాలము, వడువునఁ జంద్రాతపంబు వాలుటయును . . భా రా యు 38
క. వెడవిల్తుఁడలరు వింటను, గడువడ విరితూపు తేర్చి కదియింపుచు న,వ్వడఁతిన్ రాచందురునిన్, గుడియెడమల నేసియేసి కో యని యార్చెన్. యయా 5. 111.
(3) వెడవింటివాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.
ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బాష్పకుల కోణకోణయుమ లగ్ర మునం జనఁజూచు చూపు తీరై కమవట్టెఁ దమ్మెఁ నము టు కానన్ వెడవింటివాఁడు క్రొం,దై క ధకిణకం గఱచి యేసిన సింగిణి కోలయో యనన్ మనుచ 3. 90.
(3) వెడవింటిజోదు = మన్మథుఁడు
క. వడి వేఱవేఱ సిరములు, గడఁగి కెడాఁగయితి కుంతికాంచిన కొడుకుల్, వెడవింటి జోదు మొనవడిఁ, గడిగిన బారాచ పంచకంబో యనఁ గన్. పాంచాలి 4. 14
(5) వెడవింటిదొర = మన్మథుఁడు
సీ వెడవింటి దొర దాడివెడల నుత్సాహించుఁ జిలుకపైకములు వింధులకుఁ దిరుగు. చంద్రా. 4. 141.
(6) వెడవింటిజేఁడు = మన్మథుఁడు.
క వెడవింట జేని నైనియుఁ, గడకంటనె యేలు కొనఁగఁ గలవెల నవలా, వడకింటిలోన వింతగు, కడకంటఁ జరింతె వన్నుఁగాదని యవలన్. ప్రభు. 1. 737
(7) వెడవింటబోయ = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు
తరళము పగలుమీఱఁగఁ బాంథకోటుల బాధ పెట్టుచుమందు నీ, తొగతగుల్ వెడవింటి బోయకుఁ దోడువచ్చిన వాఁడవో . . విజ వి 3 64.
(8) వెడవింటి బలుదంట = మన్మథుఁడు.
సీ వెడవింటి బలుదంటఁ బొడచూపఁ గానీక . . నీలా 1 42
వెడఁగు విశే. 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.
ఆ. భ్రమ విమోహ లోభ భయ పరిభూతనై, కొడుకు విడువనంత వెడఁగ నయ్యె. భార ఆది 6 280.
క మది ధృతిలేని వెడంగుల, మతిఁగలుషిన మమతికిం బ్రమాదము వచ్చున్, మతిఁ గలుషిన మతి మంతుఁడు, సితచ్ఛదోత్కరము చేతఁ జెడ్డవిధమునన్. కేయూర. 3. 75.
క ఓ వెఱ్ఱులార! యేటికి, నీ వెడఁగు విచారములు సహింపఁగ రాదా, యేవారికైన మేలా, చాపులతర్కితములుగ్ర సంగ్రామములన్. భీమ 4. 62.

ద్వి. గుడికేఁగి మీకుంకఁ గొలువనేలనిన, వెడఁగు ప్రశ్నకు మీరు వినుడుత్తరంబు. బస పు. 6. 182. పా 332. పం.

2. వికృతము.

ద్వి నీరాడి ముడుక వన్నియ మూరకుఱుచ, చీరలు వెడఁగు కుచ్చెలు వెట్టి కట్టి ... అ. మ క. 1. 23. పా. 23. పం.

వి 1. అవివేకము.

క. కార్యము తెఱఁగెట్టిది నీ. వార్యవ్రత ముగ్రకు గొచ్చి యాడెదు నీ కా, దుర్యోధను వనిరయ మని, వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో భార ఉద్యో 1 318

క. కడు వనుఁ గన్నతల్లి కెవ్వ గావల రామునిఁ గన్నతండ్రిగా, మదుగని ... కొలుచు చుండెడు తన్ను వెడంగుఁ బాని ... అడవుల లోపలం గఱకులాడిన దోపవువంటుయంతయుం, గుడిచితి వంచు నా మఱఁది కుట్టుకు నిక్క- మెఱుఁగఁ బల్కుమా. అచ్చ. రా. సుం 90.

2 వికారము.

క. అని పలుకు పార్థు పలుకులు, విని పలుకక యున్న మనుజ విభు దెసఁ గోపిం,చిన తన మది వెడఁగుదుపుచు, వనిలసుతుం డిట్టులనియె నాతని తోడన్. భార. శాం 1. 114

**వెడఁగుఁదనము** వి (వెడఁగు+తనము) అవివేకముఁ

చ ... విదార విదూరుఁడు భీష్ముఁ డెంతయున్, వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధుల బుద్ధులు వెచ్చటివవే భార. సభా. 2. 9.

వి ... ఒడికంపుఁ జేఁతల యొఱపెఱింగిన వింత ... వనితల వెడఁగుఁదనము ... కావ్యా. 8. 41.

**వెడఁగుపడు** (వెడఁగు+పడు.) అ క్రి. 1 అవివేకము నొందు.

సీ. ... మేదుర మోహాంధకారమున వెడం? పడఁడు సంసార మిన్నంగ వృద్ధిఁ, బొందుఁ గాల క్రమమున పర్వుకుషవరుఁడు. భార అశ్వ. 1. 195.

.. కలఁత నొందు.

సీ గీ... అడరి కోర్కులు చిట్టు ముట్టాడ వెడఁగు పడిన యుల్లంబు పట్టునఁ బట్టుఁడ దనకు, వశముగాకున్న నెంతయు వంతఁ బొందు ... భార విరా 2 292

3. జడత్వము నొందు, మ్రాన్పడు

క వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలం చుకొని యవశ్యంబును ని,ప్పు డితనిఁ దెగఁ జూడక చొ,ప్పడునే యావిప్రశిశువు ప్రాణం బనుచున్ నిర్వ. 10. 78.

4 వికారము నొందు.

వ. కొమరారు దోశిఖ్ఁ ద్రాళ్ళతోడన్ దిరుగుడుల వెడంగుపడి వడి దప్పునట్లు త్రాళ్ళంగట్టువడి పొట్టలదురగ నిక్కి పరిసెనంబులు వేయు వవి యను ... మనుచ. 4 28

**వెడఁగుపఱుచు** స క్రి వెడఁగు పడఁ జేయు, వికారము నొందించు

వ ... ఎండకాఁకును రేయింటి యలజడియు నప్పటి యాఁకలియు నొడళ్ళు డిల్లపడం జేసి నను మొగంబులు వెడంగు పఱిచినను బొలివోని పౌరుషంబుల నయ్యిరువాఁగును గడంగి కల యన్ జెరసి పెనంగి .. భార ద్రో 5. 286.

**వెడఁగుపాటు** వి (√వెడఁగుపడు) వెడఁగుపడుట, నిశ్చేష్టత నొందుట

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముని ముఖ్యుల రెట్టఁబట్టి యా,తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాసనం,బులు గొని కూరుచుండిరి తపోధనులున్ సురలు స్వేదంగు పాటొలయఁగ గ్రుక్కు మిక్కు మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్. ప్రభా 1 82

**వెడఁగురుపడు** అ క్రి (వెడఁగురు+పడు) మాన్పడు, జడత్వము నొందు.

సీ ... మాకు నీపూన్కి నమ్మతమేము దీనికి నీతోడివారము నీవు దప్పి,యున్న వాఁడవు విద్రయ ను లేక యున్నేని వెడఁగురుపడియెదీ యడవిలోన భార సౌ. 1 60

(వ్రాఁత ప్రతిపా 'ఎడగర' అపముద్రి)

చ. ఉడుగక కన్నునీరఁ గడు నొవ్వఁటి చాయలు పెద్ద కన్నులున్, వెడఁగురు వడ్డమోముఁ బటు వేదవఁ గందిన యంతరంగమున్ ... హరి. పూ. 8 155.

ద్వి అక్కిలి పఱపక యుఱగన్నుఁ గొనక వెక్కక వీఁగక వెడఁగురు పడక . పండితా దీక్షా 61 పొ.

**వెడఁద** విశే 1 విశాలము

క. వెడఁద యుఽంబును వమ్నవ, కడుపును దృఢ కరివ తనువు గల యాతనికిం, దడర ... భార ఆది 7 222.

సీ వేయి గుఱ్ఱములూవనిన వెడఁద యరద, మర్థితో నెక్కి . హరి పూ. 4 85

గీ సిడము వడిమికి వెడఁ ద్రుంచె వెడంద, వాతి దొడ్డతూపునఁ గురుసేన దొంగలింప . భార. భీష్మ. 2 49

ఉ విచ్చిన కమ్మదమ్ములకు విందులు పెట్టు వెడంద కన్నులున్ పాండు 4 49

2. స్థూలము.

గీ. పిఱుఁదుఁ బిక్కలుఁ తెక్కలు చెడఁగుఁ దొడలు, వెడఁద యొడలును జన్నులు వెంద్రుకిదను, సంకు లేకుడ బలియుట .. హంస. 3 183.

**వెడఁదమోము మెకము** వి పంచాస్యము, సింహము

సీ వెడఁదమోము మెకంబు నడపులడా గిరిచి ... నీలా 1 42.

**వెడఁదవాతియమ్ము** వి (వెడఁద + వాయి + అమ్ము) బాణవిశేషము, విశాలమైన వాయిగల బాణము.

వ సురనదీసూనుండు వెరవుగల వనపాలకుఁడు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగు లడరు వెడందవాతియమ్ముల నమ్మహీశుల తలలు తోల్ల నేయుచు . . భార భీష్మ. 3 63

ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి .... భార విరా. 5.146

**వెడఁబడు = వెడలఁబడు** అ. క్రి (వెడలన్. .పడు వృత్తి నివర్ణవికారము.) బయటఁబడు

ద్వి. కడుపులోనవె చచ్చి క్రచ్చుఱఁగ్రేవు, వెడలకున్నను చూలు వెడఁబడకున్న, మసలక వెడలంగ మందులువెట్టి, పసరంబు ప్రాణంబు వననుగాఁ గాతు పవనాథ 1. 40. పొ 10. పం.

**వెడగఱవడు** అ క్రి. (వెడగఱ+పడు) జడత్వము నొందు, (లేక) కాంతిహీనమగు.

చ ఉడుగకకన్ను నీరఁ గడునొప్పఱి చాయలు చెడ్డ కన్నులున్, వెడగఱ వడ్డమోముఁ బటువేదనఁ గందిన యంతరంగమున్ . . హరి పూ 8.155.

**వెడచఱచు = వెఱచఱచు** అ. క్రి. భయపడు.

క. ఎఱకల గాడ్పున నొగి వెడ, చఱవఁగ వడివిచి యతని శాతనఖములఁ, జఱజఱఁ జీరియు ముక్కునఁ, గఱచియు నొప్పించె బాఁడు గరుడసుతుఁడున్ భా. రా. యుద్ధ 1704

క వడి నెగసి వాలములఁగొని, వెడచఱవంబఱచి దొంగ వీఁడు మనకు లోఁ,బడియె ననుచుఁ బిడికిళ్లఁ, బడఁబొడిచిరి ... భా రా. యు. 203

లయవిభాతి వెడచఱవ మొత్తియును దడఁబడఁగ నొత్తియును .. భాగ 10 ఉత్త 787

**వెడతపసి** వి. (వెడఁగు+ తపసి.) అవివేకతపస్వి.

గీ వెడతపసినాకె నెద గొడ్డు వీఁగి కన్న, రాము నెడఁబాపు వతినిష్ఠురంపుఁ బలుకు, జిలుకు తవ వంటి పెనువంట చేతఁగాని, మఘమునాచిన్ని పాఁపడే మనుమవాఁడు చంపూరా 2. 63

**వెడతుఱు** వి. ఒకానొక చెట్టు (వృ వి) (చూ. వెడతుఱుపల్లి = వేణుతురుమిల్లి) పి శా. శ. 1024. Ep Ind 5

**వెడదప్పు** దే వి స్వల్పదోషము

సీ బ్రాహ్మణ జనముల రాజులు పూజింతురటు గాన నేను విప్రార్పనంబు, సేయుదు విప్రుని చేతన యుల్లైతి వెడదప్పునన యొండు వెరపు వాకు, దురితఁబు వాపంగ దొరకొనదు ... భార. అశ్వ 3 99.

**వెడదారి** వి. (వెడ+దారి) అపమార్గము

సీ జడదారి యొయ్యారి వెడదారితిరువో నడుగు నెత్తమ్మి దుమ్మిడియె నీతఁడు ... బహు 4. 82

**వెడనగవు** వి మందహాసము.

క. . . మృదులకల భాషలఁ దఁ,శొక్కెడు వెడ నగవులతోఁ, జిత్తభవుం డార్వ నవలు చిమము నెపము నన్. మనుచ. 6. 80.

**వెడపాడు** అ. క్రి. కొత్తిగా పాడు.

సీ. వెడలించె నెవ్వాఁడు వెడపాడు బావిలోనూసర వెల్లియై యున్న వృగుని... అప్పక 4 841

**వెడపేరు** వి. తుచ్ఛపు పేరు.

చ. అని మునినాథచంద్రుఁడు దయారస ముప్ప తిలంగఁ బల్కిన, న్విని యలివేణి తానిదియె వేళయిఁక న్మతి వీనిఁ దక్కఁగాఁ, బెనఁగక యున్న నన్ను వెడపేరునఁ బిల్తురు లోకు లంచు... విప్ర. 8 74.

**వెడపోక** వి. తుచ్ఛమగు నడునడి

ఉ. పొట్టలుబ్రొవ్వి కొన్ని వెడపోకల నట్టెలు చేసి యిట్టటున్ గట్టిరుతై నృపుల్ తెరువు గట్టరె నాతలఁ బొట్టుపొట్టుగాఁ, గొట్టక తూపులం గదుపు కొట్టక ... చంద్రాంగ. 6. 65.

**వెడమబ్బు** వి. అల్పమేఘము.

సీ. అలరు వెల్తురులేని వెడమబ్బులు హిమాద్రి లేని మంచులు వార్ధి లేని నురలు ... వరపథూ. 5. 185.

**వెడము** వి. ఎడము.

సీ. వెడము వెట్టరాని ప్రియుఁ గూర్పుమని రంభ తిచ్ఛకమ్ములు పల్కి తెమ్మనిటుల... శ్రీరంగ 10 58.

**వెడయేడ్పు** దే వి కృత్రిమ రోదనము.

గీ. ఎదురుగాఁ బోయి వెడయేడ్పు లేడ్చువారి, తోడనిట్లని పలుకు మీ తోయజాక్షి ... దశకు. 5. 92.

**వెడలఁగొట్టు** (వెడలన్ + కొట్టు.) స. క్రి. వెడలించు, పోనడఁచు.

ఉ. గొట్టుతనానఁ దన్ వెడలఁగొట్టిన దిట్టమ రట్ట డంచుఁ బోఁ,బుట్టువనొట నొందనక పోయితి. ఉ. రా 2. 309

**వెడలఁబడు** అ క్రి. (వెడలన్ + పడు) స్వార్థమున పడు) 1 వెడలు, బయలుదేరు

క. మించిన పనులకు వేరము, లెంచం బనిలేదు సీత నొక్కటి పటులన్, గొంచు వ్వెడలంబడి యే, తెంచితిగా చాల మన్నితిన్నిలు మింకన్. రామా. 68.

2. వెలువడఁ బడు, ఉద్ధరింపఁబడు,

గీ హా సరోజాక్ష గోత్ర దుఃఖార్ణవమున, మునిఁగి యున్నాఁడఁ జేయార్చ కొనఁగ లేక, నీ కృపాదృష్టి వేరోడగాక యున్న, వెడలఁ బడు టెట్లు సుఖము గాంచుటెట్లు. జై. భా. 1 106.

**వెడలబాటు** వి (√ వెడలఁ బడు) వెడలఁబడుట.

చ భువన భయంకరంబులగు పోరులఁ దమ్ముల తోడఁ గూడ నీవు వెడలఁబాటు లెన్నయల పుంజలము న్వెలయించు చోట ధర్మవున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు... భార. శాం. 1. 4

**వెడలఁబాఱు** అ క్రి. (వెడలన్ + పాఱు) వెడలు

సీ. అడ్డకట్టఁగ నీక యల కేకరాతులు వెడల లజ పొరఁజించి వెడలఁబాఱె .. చంద్రా 5 27

**వెడలఁబెట్టు** స క్రి. (వెడలన్ + పెట్టు) వెడలఁజేయు, వెలిపుచ్చు.

సీ. తోఁక నూరక మేను నోఁకఁగ నులివెట్టు వెడవెడ నాలుక వెడలఁబెట్టు ... భాగ 10. ఉ 544.

**వెడలఁబోసికొను** స క్రి చెప్పుకొను, ప్రకటించుకొను.

చ వెత వెడలంగఁబోసికొన వేళ్ళొక నచ్చెలిఁగాన మిన్ దిశా,పతులకు నంతయుం దెలియఁ జాటు టకై గమకించునో మమీ, యతివయనన్. రామా 6 132

**వెడలనాడు** స. క్రి (వెడలన్ + ఆడు) 1. వెళ్లడి చేయు, లిఁబుచ్చు

క. నీ యంగన కపటా చా,రాయత్తము మాకు వేడలనాడుట తగదే, మీ యున్న రాత్రులంద త,దియ వ్యాపార మేము తెలిసితి మెల్లన్. కేయూర. 3 231

2. తూలఁ బలుకు, ప్రేలు

ద్వి. విను మీఁదెఱుఁగక వెడల నాడెదవు .. బస వు. 4. 50 పం

**వెడలించు** స క్రి. (√ వెడలు) 1 పాయఁజేయు, తొలఁగించు

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగులపై
బ్రాలి యో మహామతి యే నెక్కడఁ గన్న
శేషమెక్కడ, వెడలింపఁగదయ్య దురిత విష
విధి వలనన్ భోజరా 3. 87

గీ .. గంధవహుఁడు, నతుల నయ్యెద వెడ
లించి చన్నుఁగవకుఁ, దప్పుసేసియు దైత్యు
చిత్తంబు వడసి హం 3 4.

చ. పొలుపుగ గొల్ల క్రొందలిరు బోఁడుల కుఱ్ఱ-
మిటారి గబ్బి గుబ్బలు బలువెన్న ముద్దలని
భావమునందల పోసిదాసి కంచెల వెడలించి
మాటికిని జేతుల నొక్కుచు హాంతకారియై,
యలఁతిగ నవ్వ పెన్నుఁడు దయామతి మాకు
బ్రసన్నుఁ డయ్యెడున్. రసి. 1 3.

2 వెడలఁ జేయు, పైకి రావించు.

క. దయ్యాఁ దిరిగించి దేవుఁ, డొయ్యన వెడలించె
నోరి యూర్పున నమ్మెన్, నయ్యమి వర్యుఁడు
వెలువడి, యియ్యనఁ గనుఁ గొనియెఁ దొంటి
యేకార్ణవమున్. హరి ఉ 9. 109

గీ కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి, తజ్జ
లముతోడ వెడలింపఁ దలఁపఁడేని ... శృ
నై. 2. 123.

ద్వి ఎడనెడ బొక్కలనిడిన బాలకుల, వెడలించి
భక్షించు బేతాళతతులు ... హరిశ్చ. ఉత్త.
1630.

3. వీడఁజేయు, విడుచునట్లు చేయు

గీ. ... ఎల్ల తెలుఁగు పనులు నారాత్రిలోఁ దీర్చి
ప్రొద్దు, పొడుపునకు మున్న వెడలించెఁ బురము
సకల, జనములను జీవధనముల సరకు నతఁడు.
భార. మౌన. 174

4. వెడలఁగొట్టు.

మ ... ధనగుప్తుం డొవరింపఁ బూనిన మహా
ధౌర్త్యంబు సర్వంబుఁ గాంచి నిశ్చేచ్ఛం బను
మంచుఁ గంచి వెడలించెం గిన్కతో వల్లునిన్
విక్ర. 7. 180.

5. ప్రవహింపఁ జేయు

గీ. వెన్నెలరముబ్బి వెడలించె దీర్ఘికా మంద
సౌగంధిక మధునదంబు.... మనుచ. 6. 29

**వెడలిచేను** అ. క్రి. (వెడలు+చను) వెడలి పోవు.

క. పెద్దపులి వెడలిచనె నని... దశా 4 40.

**వెడలు** అ క్రి 1 బయలుదేఱు. (రూ వెలలు.)

క. వేగుటయు సత్వరంబుగ, నా గాంగేయుండు
మించి యనికి నడచినన్ సాగర తరంగముల
గతి, వేగమ తరతరమ మొదలు వెడలఁ దొడం
గెన్ భార. భీష్మ. 2. 167.

సీ ... దైవ సైన్యంబు లీరీతిఁ దరతరంబ, వెడలి
మొనలేర్పరించి యుద్వేలవృత్తి పారి 5. 2.

తే. వలయు నవరణ తోడ భూ వల్లభుండు,
వెడలె వేఁటకు మృగయా ప్రవీణులైన, శబర
నాయకులుభయపార్శ్వములఁ గొలువ ..
విక్ర 2 131.

2 పైటవచ్చు.

ఆ ... మూఁకలెల్ల జుట్టు ముట్టినపుడు, వెడలువట్టి
వెరవు వివరానికేమి నా, చొచ్చు నేర్పు బలువుఁ
జూడు మధిప భార. ద్రోణ. 2 5

గీ దేవదేవ రక్షింపవె దివ్యమూర్తి, యనుచుఁ
బలుకు నవ్విప్రుని యార్తభంగి, చూచునప్పుడు
మురవైరి చూడ్కి కేల, వెడలె నాకునుఁ గన్నీరు
వేయునేల. ఉ హరి. 2 9

తే. అబ్ధితో గూడ మునుగ్రోలు నౌర్వవహ్ని, యుద
రబిలమున నొకచోట నుండియుండి, జటిల వరు
నకుఁ గద్రూజ కటకకటక. విరహతాప విషం
బున వెడలినపుడు పాంచు. 1. 121

3 వెళ్లు, కడచు

తే. తపము గావింప వెడలె వత్సర సహస్రములు
మహాదేవుఁ డంత నా భూమి ధర కు, మారి
గౌరి ననుగ్రహింపంగఁ దలచి. వరాహ. 6. 16.

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తి
వారయకే దినములు పొందై వెడలునట్లు నడ
వఁగ, దైవంబామీఁద మేలుతావ ఘటించున్.
మనుచ. 4. 107

తే ... పాండు బహుళపక్ష పరంపరలు వెడల,
కిండలో నేఁడు ముల్లయ్యె నిందుముఖి.
ఆము. 5. 84.

4 సంచరించు, ప్రయాణముచేయు.

చ ఎడపక మున్ను మింటిపయి నే తగులంబును
లేక మూకతన్, వెడలెడుచో ... ఆము. 4.85

5. వ్యాపించు.
తే. వెదలు దువిమిన మీఁదికి వెదలు రుధిర, ధారలు మదాంధ పరిపంథి వీరభటక బంధములు నిల్చెఁ జెక్కులు వగలు విరుదు, బంట్లు పట్టించు లాను దివ్వె పొఁజు లనఁగ. వరాహ. 5. 29.
సీ. ... తే వెదలు పేరెండకును శరద్వ్యాకుముడిగి, వార్షికమె యెక్కి ... ఆము. 4. 181
చ. అడఁకువ మీకు నేమి యిడవతయమౌవనుట విన్నబంబుగాఁ, గొడిదెఁడు దానతోయ మడుగుం దిగ దమ్ములు ముజ్జగంబులన్, వెదలు కొలం తియై సుగుణ విక్రమ హంస పరాగయుక్తిచేఁ, గడలు కొనంగఁజేయు వలకైతవ వామను విన్ను నెన్నెదన్ చంద్రాంగ. 1. 78.
6. తొలఁగు.
క. ... మనమున నాటిన మాటలు, వినుమెన్ని యుపాయములను వెదలునె యధిపా. భార ఉద్యో. 2. 62.
సీ. ఏమార్గమునఁ జేసి యీ దుష్టసంసార దుఃఖంబు వెదలు .... వాసిష్ఠ. 1. 171.
7. తోవు, వశించు
గీ. విష్ణుమూర్తులు కడ చన్న వేళలందు, నజుని మూర్తులు విబుధులు వెదలు నపుడు, కలదె నీకు నపాయంబు కాలకంఠ ... శివరా 1 1053
న. క్రి. దాఁటు, లంఘించు అతిక్రమించు
ఆ. మదపి దకట జలధి వెదలి పన్నపుఁ గ్రయ్య, మునిఁగి రూపడంగు ఒనులమాడ్కి ... భార. శాం ప్తి. 2. 17.
సీ. గ్రహరాజు వాజెదు ఘంటాపథముదాఁటి చుక్కలు వాడకెంచు చక్కి వెదలి ... శృ. నై. 7 37.
వి. బయలు.
ద్వి. పడతి కాళ్ళును జల్లివగ్గంబు గట్టి, వెదలికి నీడ్పించెఁ దొడఁగి కాచిరువ, కులపతి యని యెదు కూరిమితేక ... పండితా.పురా.96 పొ.
వెదలుమ్చు(ల్చు) స క్రి. (√వెదలు.) వెదలఁజేయు.
చ. అదలున నెంతయు న్గలఁగి యగ్గలికం గుడిచేయు పాఁచి మై, పడఁకెదు కొమ్మకేలు చెలువంబుగఁ బట్టి యయాతిమాతిలో, వెదలిచి యప్పుడమ్మ గుప వేసవిలకన్నులు మోము చెక్కులున్, మెద చనుదోయి నెన్నడుము మేను పిఱుందునుగాంచి వేడుకన్. యయా. 8. 451.
క. వికసించు తమ్మినుండు మధుకరావళి వెదలి వెలుఁగు దొరగవఁ గాసాఁరకలావఁతుఁడు మునుగొంచక భ్రమింగి వెదల్చి నినుప కురిపెఱ మనఁగన్ రా వి 8. 11
సీ కుబుసంబు విడిచిన కొడమ నాగమురేవదొన వెదల్చిన పువ్వుఁదూపు సరఁసి ... పరమ. 2 31.
వెదలుపు(ల్పు) వి. వైశాల్యము
చ వెదలుపు గల్గ నోకులోక వేయి ధరించి వియ వ్వదీ జలం, బదరఁగఁ బుక్కిలించి రయమా రఁగఁ దెచ్చి మహానఁలఁబుపై, వెడపడకుండఁ జల్లనది ... హరి. ఉ. 8 72.
క ఆమడ వర వెదలుపు మూఁడామడ నిడివి యును గలిగి యతి రమ్యంబై, రామ ఘటకర్ణు పటు నిద్రామందిర మలరు మృదులతలను తతులతోన్ ఉ. రా 2. 293.
వ. అదియును నూఱుయోజన-బుల వెఁల్చు మూటయేఁబది యోజనంబుల నిడుపును ...
భార సభా 1. 62
సీ. రేఖలేరపడఁగ వర్ధిలి వెదల్పయి రెమ్మ పసరు వాఱుచు నిక్కఁ బసరుకప్పు ... మనుచ.6.27.
సీ కంరహారము దాఁగి గంగతో లుదయించె వెద లుపు నిడుపునై మెద పొసంగె... కళ.4.159.
వెదవాదము వి, వి, వ్యర్థవాదము.
మ గడు పొక్కొక్కఁడు నిత్య దూష్యులనుచున్ గంజాతులన్ రోయ నీ. వెదవాదంబుల కేమి వామదికి భావింపన్ సతిం బోల నిప్పుడమిం గామిత వస్తువుల్ బరిహితంబుంబోలు పుణ్యాం బులే, దదరన్ ... మల్ల భూ. 2 35.
వెదవెద విశే. అతి సూక్ష్మము, అత్యల్పము, మిక్కిలి చిన్నది (ఇది "వెద" యొక్క ఆమ్రేడిత రూపము.)
సీ. వెదవెద మూఁగారి వింతయై యేరపడు దేరని వకులతో నారు నిగుడ ... భార విరా 1 245.
చ. వెదవెద కొఁద లిదగునె వెంకట భర్త వసించు కొండకున్ మద. 5. 64

సీ. కుంభి కుంభముఁబోలు కుచకుంభ భరమున వెడవెడ నడుములు వీఁగియాడ .. వీః. 3 155

క్రి విశే 1 మిక్కిలి యల్పముగా, కొంచము కొంచముగా. (ఇది ప్రయోగములందు ద్రుత ప్రకృతికముగాను, కళగాను గూడఁ గనవచ్చు చున్నది. నిర్ధారక ప్రయోగము కనపడలేదు. కాని కళయని శ ర)

సీ అరటి సుహకరిణావలి వెడవెడ యాదరించుట రాగ మ డరఁ దొడరి .. భార విరా. 2. 2?8

ద్వి. వెడవెడఁ దన కచ్చ పిడంగఁ బాటి, వడి మోము వగులఁగ వాటంబు దాఁక ... ద్వి. హరిశ్చ ఉత్త. 1108.

వ ... మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాది కృత్యంబులు వెడవెడం దీర్చి శకుంతలావ లోకంబునకు లోకలోచనుం గనుంగొను నప్పుడు పి శకుం. 3. 146

చ వెడ వెడయేనుఁ దొల్లి యిది వింటి ననుంగని కుంతి యెంతయుం, జెడనది నైచిపోయె ... భార. ఉద్యో 4 88

2. బిగ్గరగా.

వ. ... ధనుర్జ్యాయ నిర్ఘోషంబులగు శరవ్రాతంబులు వెడవెడ వార్చుచు వగల మొగంబులఁ బ్రవేశించి వెడతల వెడలుచు . కళా. 8. 110.

గీ. అనుచు వాలోయ కరశరాసన కఠోర, గుణ నినాదప్రతిధ్వని కుధర గుహల, వెడల వెడ వెడ వార్చుచుఁ బిడుగు తునక, వంటి నారాచమున నదరంట నేయ వరాహ. 7 80.

చ, వెడవెడ వార్చుచున్ దిశలు బీటలువాఱనదల్చి రుద్రుపై, నడచిన నమ్మహారథుఁడు నవ్వుచు భూతపిశాచ కోటిఁ జూచుచుఁ జని వేయఁ బొచ్చె ... వరాహ. 5. 112

3. మిక్కిలి విశారముగా.

సీ. తోఁక మూఁకమేను సోఁకఁగ నుబ్బెట్టు వెడ వెడవెడ నాలుక వెడలఁ బెట్టు భాగ. 10. ఉ 544.

4. తఱచుగా.

క వెడవెడఁ బొడమెడి యూర్పు, లుదుములు తుడుములుగ వెడలదొడవులు నడలన్, ముడి బొమ జంకెన చూపులఁ, బడఁతుల వదరించి కోప పరవశయగుచున్ చంద్రా 2 146.

5 అశ్రద్ధగా

క. వెడవెడ యపవలుకులు చెవి,నిడి కొండొక నేవు చింత యొనకరంబున పొలవిడి యూరకుండి... భార. శాం. 1 56.

ఆ మగడు చన్న దెసకు మనసును జనియున్నఁ, జెయ్వు వెఱఁగు పడినఁ జెవులు సొరని, వృద్ధ వనిత కథలు వెడవెడ నూఁకొంచు, నుండె నగల నొగిలి యుత్పలాక్షి విక్ర 6. 113.

6. మృదువుగా

గీ. .. వేగ వెడవెడ తడియొత్తి....అము 5. 89.

7 అధికముగా.

గీ. మస్తకము వాంచి యునురని మౌనముద్ర, నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత, సేపు వెడవెడ చింతించి శిరసొకింత, యెత్తి సన్నంపు జెలుఁగుతో నిట్టులనియె. మనుచ 3 97.

8 మెల్ల మెల్లగా.

సీ బిడిబిడిఁ గమ్మ పుపొవడి నిప్పుకలు చల్లి వెడ వెడగా గాలి నుడిసెనేవి... రాజ చ 3 80

చ వెడవెడఁ గన్నుమూయుఁ బలవించుఁ గనుంగవ విచ్చు ... యయా 5 113.

సీ ... పచ్చరా కట్నంబు వచ్చిక పట్టని వెడవెడ మునివ్రేళ్ల నడఁచిపోవు . దశా. 1. 272

9. దృఢముగా, గట్టిగా

క. .. ప్లవంగుని మెడఁగడు, వెడవెడ బిగియించె గ్రుడ్లు వెలికుఱుకంగన్. భాగ. 10 ఉ 556.

వెడ్డరి విశే (వెడ్డు+అరి³) వంచకురాలు.

ద్వి పాపజాతులు విసపతులు వెడ్డరులు, మాటల ప్రముచ్చులు మందులమార్లు ... పండితా.పురా. 116. పా.

వెడ్డు విశే కపటముతోఁ గూడినది.

ఆ. పాటిపోయి వచ్చి బడిపొచ్చి యీ వెడ్డు, నిద్ర వోవఁ గృష్ణ నీకుఁ దగునె . వర్మ 9. 272.

('అ. పాఱిపోయివచ్చి వడనొచ్చి యీగుహ' అని
చి. వి. పా.)

ద్వి. వెద్దుమాటలెకాని వేలుఎలకవ్న,దొడ్డవాఁడపుర
కాదూఁ కలిఁదీరు ... ద్వి. వ. పా. 1. అ.
30 పా. 1. పం.

వి. వంచన.

సీ. ముమ్మోవనుపాలితుధనము వెద్దునఁ గొన్న తరు
ణిమేదెప్పటెదు వెరవు గొఱలి ..దశకు. 5 88.

వెద్దుకొలుపు స. క్రి. పీడించు.

సీ. అతిమాత్ర మాయాన మనుభవించును గాక
విటజవంబుల నేల వెద్దుకొలిపె ... క్రీడా 287.

వెద్దు(పె)వెట్టు స. క్రి. (వెద్దు+పెట్టు) వంచించు.

చ. అనవుఁడు మున్న యిట్టులనరై తిది వోవఁగ
నీను మిమ్ము నెం,దుమ గదువెద్దువెట్టితి ..భార
శా. 6. 301.

క. ధనముగ్గలదు పుత్త్రిలు శే,రని యాసంబాపి
యొరుని యాత్మజుఁ దానే,ఱుఎవ వెద్దువెట్టతగఁ
తే,కొన నేనియుఁ గృత్రిమంపుఁ గొడు కాతని
కిన్. విజ్ఞా. ఆచా. కాం. 152.

తే. ఇట్టగతిఁ దెల్వి మమ వెద్దువెట్టుపోక్కొ, చెట్ట
రది దా సృజించిన బిడ్డగావ, బొంకగుచు వంత
కరియ క్రోపు పదు వోక్కొ, పరదఱఁడు
చెప్పెనని విన(బడియెఁ గాన ప్రభా. 3 10

వెఱఁద=వెడఁద విశ. విశాలము.

వ... అనంగ ధ్వజ పట కఠోర పాఠీనచ్ఛాయా
దాయాదంబులైన వెఱఁద కన్నులు తలచుట్టు
ముం బలిసి పొలయ ... భీమ. 2. 110.

ఉ. వంద మతుం గమంగొని వెఱంద కమంగ
వనించె కామఎముల్ ... శృంగార రసాల
కాలము. 2. (శ. ర.)

వెఱుతురు=వెలుతురు వి. శరీరము, క్రకరము.
(వ్యు. వి.)

సీ. కోరింద వలతుమ్మ గొటిజె కోడారెయు
వెఱుతు రూఢంగ దంతి వెఱ్రివిమ్మ ... హంస.
4. 9.

సీ. వెఱుతు రవంగము తెలయుఁగరీరంబు ... ఆం.
భా. 2. 53.

వెన్నాఁడు అ. క్రి. (వెన్ను[2]+ఆడు.) వెంబడించు,
వెంటనంటు.

సీ పరములు దొట్రిలఁ బరువులెత్తెడివారి వనుకర్త
వృత్తి వెన్నాడి చనదు ... వసు. 1. 56.

సీ. వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును బృథురక్త
మున నుబ్బు పెన్నసాటి ... రామ. 259

మ .. మాయావి యన్వాడు . . పాతాళము
సొచ్చినన్ విడువకాకాఖా మృగ ధీశుఁడా,తని
వెన్నాడి వనున్ రసాతల బిలద్వారస్థితుం జేయు
చున్ ... చం. రా. 6 2..

వెన్నిచ్చు అ. క్రి (వెన్ను[2]+ఇచ్చు ) 1. వెనుదీయు,
వెనుకకు మఱలు.

మ. వరుఁ డాభీల పరాక్రముం డగుడు దైన్యం
బంది వెన్నిచ్చి విచ్చి,రి వార దఱు దివ్య
సంఘము నుతించం ... భార. కర్ణ. 3. 313.

2. (యుద్ధరంగమునుండి) పాఱిపోవు.

సీ. వెన్నిక రణముతో విగతాసుఁ గువారు వివి
ధాధ్వరములు గావించువారు ... వరాహ.
10. 113.

సీ ఇలఁగు భృత్తులకు వెన్నిని కూర్మిపతులు గోత్ర
వర్గము బల్మిఁ గూల్చ వింద్రులు ... బిల్హ.
1. 30.

క దగగొట్టి కలనఁబెట్టిన, మగఁటిమి వెన్నిచ్చి
పాఱు మాళవ నృపతిన్, మగధపతి యట్టి తఱి
నా,శుగతిన్ వెన్నాడి కోటఁజొరఁదోలి పడిన్
శా. వి 5. 16.

3. వెనుక దిరిగి పాఱు.

సీ. ... పగఱకు వెన్నిచ్చి పఱవక సంగర క్షోణిఁ
గూలిన మహోశూరులకును ... దశా. 4. 95.

వెన్ను[1]=వెను దే అవా. 1. వీపు, పృష్ఠభాగము.
(రతిదేవి )

గీ. మొఱని క్రొవ్వేణి వెంటపై నెఱసిపొలయ,
నడలు దరికొని వావిరి నఱచుచుండె ... కు.
సం. 5. 565.

వ. మనుజపతి యమళులుం దాను వెన్నదొల్లె.
విందానువిందులుం గాంభోజుండును, శూర
సేనుండును బుచ్చంబైరి ... భార.భీష్మ 2.96.

వి. పృష్ఠభాగము.

గీ ఉట్టిపడి మ్రొక్క గళిఁదెల్పు మరగఁపై రి, వెన్ను వెన్నునఁగొని విన్నువీథి కెగసె ... విపు. 3 4.

సీ జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్నుగానరా జగతికి మిన్నేఱు దిగినచోటు .. మనుచ 2. 7.

వి. 2 ఇంటివసి కొప్పు

వ. .. పొడిల్లునుం బోలె వెన్నొఱగి ... కవిక 4 118

వెన్ను²=ఎన్ను వి వరి మొదలగువాని యెన్ను, కణిశము

ఆ ఉత్తముని కడుపున నోగు జన్మించిన వాఁడు చెఱుచు వాని వంశమెల్ల, చెఱకు వెన్నుపుట్టి చెఱుపదా తీపెల్ల ... వేమ 2 భా 2.

గీ. కలమ గర్భంబులౌ మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బీఁకెపొటి, వెన్నుచూపి తృణంబూని యెన్నరాని ... రసిక. 2 101.

వెన్నుఁడు వి (సం విష్ణువు) విష్ణుదేవుఁడు, కృష్ణుఁడు.

క. వరనాథ సమర్పిత మగు, విరవాదుల తండ యొప్పె వెన్నుని పాదాం, బురుహంబున నంగుటమున, సురభిళ యాకాశగంగ కుప మానంబై .. నైష 3 115.

గీ వెన్నునకు నన్నదాదుల మెన్నదైన, నవకృతి యొనర్పుము ఉ. రా 2 28.

ఉ వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్ర చయంబు తోడఁ బో,వన్న కుమార యిట్ల యిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు . భార. ఉద్యో 3 348.

క వెన్నుఁడు నవ్వికు దవ్వుల, గన్నంతన నిజ సమాధి కవితాసనమున్, గ్రన్నన విడిచి యెదురు నని, సన్నత మౌళియయి భక్తిసంభ్రిత గతిన్. హరి. ఉ 6. 32

విన్నవాఁకఁ బలుకు వెలఁదిఁ బుదుకు, కొడుకు రిక్కఁజేని నోడతి చూపొదయని ... రామ 197

వెన్నుఁగాడి వి (వెన్ను+గాడి) వెన్నెల, ఇంటి నడుకొప్పు మ్రాను (శ ర పా)

వెన్నుగుదియ వి (వెన్ను+గుదియ) వీపుపై కొట్టుట కుపయోగించు కఱ్ఱ

తే గీ మందులాడి చెడుగు మానిసి ఘాతంబు, పిసిఁడి విచ్చుగాండ్ల వెన్ను గుదియ ... చెన్న. 2 24

వెన్నుచూచు న క్రి (వెన్ను+చూచు) పాఱఁ దోలు.

వ నిర్జరులం దర్శించి, కిన్నరుల వెన్నుచూచి. హరి, 3 9

వెన్నుచూ(సూ)పు అ క్రి. (వెన్ను+చూపు) వెన్నిచ్చి వెనుక మఱలు.

సీ మురియ పైపగవచ్చు మొన దారసించిన శూర త్వమున వెన్ను చూపఁ దనుచు ... పాండు. 1 63

గీ కలమ గర్భంబులౌ మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బీఁకెపొటి, వెన్ను చూపి తృణంబూని యెన్నరాని, నావఁదల వంచుచుండె వనారతంబు రసిక 1 101.

(వెనుఁగవఁ బఱచు అనియర్థాంతరము)

సీ చనునె శత్రువుల వెంట మునుదాన తగిలి యీ వ్విరులు నెగువంగ వెన్ను మాపి, పఱచుట ... హరి ఉ 2 3.

పంచచామరము అలంతులయ్యు కూర్మి మత్త కాదులైన బోదుల, బ్బలారి వెన్నుసూపి వార పొచినాఁడ కాని నేఁ, డలంఘ్య బాహుశక్తిఁ దావకాజిలోన నుఁచుఁ బి,చ్చలించి తొల్తఁ దత్కథల్ వచః ప్రయోగ చాతురిన్. కళ. 3. 126.

వెన్నుదన్ను=వెనుదన్ను న క్రి (వెన్ను+తన్ను)

1. వెంబడించు, అనుసరించు

సీ. చిన్ని వెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు ..,మనుచ. 2. 48.

చ మొవలు గలంగినం గని సముద్ధత వత్తినదళి
వెన్నుద,న్ని నిలిచె దానవేశ్వరుఁడు ... నిర్వ
3 13

మ గడఘోఁజు వ్వెనుదన్ని నిల్వ విలుమూఁక
వ్వెంబడిన్ గాఁపుగా నడవన్...చంద్రా 6 78

ఉ. ఆ హరి వెన్నుదన్ని కుసుమాయుధ సాత్యకి
సాంబ సారణుల్, బాహుబలంబు మీఱఁగఁ
గృపాణ శరాసన సాయకాది సన్నాహము
తోఁడ నిల్చి . . చిత్రభా 8. 12

సీ ధారాధరము వెన్నుదన్ని పుట్టిన చాయనున్నదీ
బింబాధరోష్ఠి వేణి ... విజ వి 2 106

(ఇట ఔపమ్య ద్యోతకము)

2. తిరస్కరించు

వ. నెన్నడుముల విన్న వెన్నుదన్ని ... మనుచ.
5 101.

అ. క్రి వెనుక నిలుచు.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణ సుతుం
డును కర్ణుఁడున్ బహుప్రాణ పరాయణత్వమున
దర్పనముజ్వల భంగి ముల్ల నద్బాణ పరంపరల్
గురియఁ బార్థుఁడున్ వెనుదన్ని చూడ నక్షీణ
జవంబునంగవియు సేనకు మార్కొన నగ్గ
లించితే. భాః విరా. 5. 278

వ. ... వెన్నుదన్ని చూచు నవసరంబున ... ఉ
హరి 3. 26. (శ ర త్రా)

వెన్నునడుగు విష్ణుపదము, ఆకాశము

గీ .. జక్కవలు వెన్ను, నడుగు పట్టుక మొటి
పేయఁ దొడఁగె నపుడు. అచ్చ రా అయో 15

వెన్నువిఱుగు అ క్రి ధైర్యము కోల్పోవు

వ ఇట్లు జంభాసురుండు ... పడినం దాంకుండు
వెన్ను విఱిగి పడి నిశ్చేష్టితుండై యున్న ...
కుమా సం 12 857.

వెన్నువమ్మెట వెన్నుపైని కొట్టుట కుపయోగించు
పమ్మెట.

చ మద మొదవంగ మూపక కుమార సమూ
హము వెన్నుపమ్మెటై, యొదవిన వాల
మార్చుచు ... భోజరా 4 20.

వెన్నుప(చే)అచు న క్రి (వెన్ను+చఱచు) వెంబ
డించి తఱుము. (అమారు వర్ణనము.)

సీ జంకించి పర పృథగ్జన కోటి చందానఁ గఱకు
జీకటి వెన్ను నఱచు వాఁడు ... కాశీ 3 234.

వెన్నుసొచ్చు న క్రి. (వెన్ను+చొచ్చు) వెనుక
జేరు, శరణొందు

సీ. విప్రులఁ జుట్టల వెన్నుసొచ్చి యట్టివారిని గొలి
చిన వారిఁ బ్రజల, హర్షంబుతోఁ గాచి
యన్యాయ ముడుపుచు . ద్వా 7

వెన్నెక్కు అ క్రి (వెన్ను+ఎక్కు) గర్వించు

ద్వి నిన్న సీ వెఱఁగక వెన్నెక్కి క్రొవ్వి
కన్నులఁ గానక కఱకంఠ మూర్తి, నొడలు
గల్గఁగ జూచి యెరునిగాఁ జూచి ... పండితా.
పురా 95.

వెన్నెముక వి (వెన్ను+ఎముక) వీపు నడిమి
యెముక (శ. ర పా)

వెన్నెల[1] వి (వెల్ల+నెల) 1 చంద్రిక. (చందు
రుని) తెల్లని కాంతి

చ. . చందురు మనసోగ వెన్నెలలతోఁ దులఁ
దూఁగెడు తద్గుణంబులన్ నైష 1 50

చ. వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన
పూవుగుత్తి వేల్పుల గమిజేవగజ్జ యుడివోవని
చల్వల కెంకి వెన్నెలల్, మొలచిన పాదు ..
పారి. పీఠి. 6

2 వెన్నెల వంటి కాంతి

ఉ .. నా సఖ, స్ని కనుదోయి వెన్నెలలు నిండక
కోర్కులు నాకు నిండునే. ఉ హరి. 1 62

సీ. పిడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ వరిగింజ
నొకటఁ బల్వరున . ఆము 1 60

3 ఒక విధమైన యాట.

ఉ. అల చిమ్మన చీఁకటి చూట మొట్టియా వెన్నెల
లాట మెట్టినటు విన్నలమెన్ మును మున్ని
లాస్థలిన్ .. ముకుంద 3 53.

వెన్నెలకందు = శ్వేతచందురుఁడు.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడ
మిన చెలువ తోఁబుట్టుమాకు . . మను 2.43

వ్యావ అడవిగాయు వెన్నెల నిష్ఫలము

క అతివల హృదయము లాఁసి, రతికలనన్దెల్పలేని
రట్టడిరూపున్, జతురతయు జవ్వనంబును, వితి
యచుమీ యడవిఁ గాయు వెన్నెల రీతిన్.
శశాం 3 78.

ఇల్లే కానఁగాచిన వెన్నెల
వెన్నెల² వి వరివిశేషము, వందనభేదము
సీ జోహారు నీకు మంజులకీర రుకాళ చిన్నివెన్నెల నీకు జిత్తజన్న .. ఇందు 3 87
వ. శ్వేతగిరి యందలి సింహాలోచమునకు వెన్నెల ధర్మపురియందలి యోగానందునకుఁ గొల్వు ప్రెుక్కి . ప్రబంధ 1. 660.
వెన్నెలకుప్పలు వి బాల్యక్రీడావిశేషము
సీ దాఁగిలి ముచ్చులాటలు గచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్ను బిల్ల . కాశీ 3 33.
తే గీ అనవుఁ గన్నుగవుం గుప్పలవనినుంతుఁ, గూర్మి నను పేర్మి వెన్నెల కుప్పలాడు . . శా వి 2 23
సీ రమణీయగతిఁ జకోర కుమారికలు గుంపు గొని యాడు వెన్నెల కుప్పలనఁగ ... వి. శకుం. 2 183
వెన్నెలకూన వి బాలికా క్రీడావిశేషాలు
సీ చేతుల కణఁగవి చెలువ చెక్కు లటంచు వెన్నెల కూనకు నమ్మి బిలరు . పార్వ 2. 21
వెన్నెలకోలు వి నమస్కారము, వందనము.
రగడ విష్ణుపుర ఋన విలసిల్లు మహావిష్ణు స్వామికి వెన్నెలకోలని . . హంస 4 213.
వెన్నెలగీము వి (వెన్నెల+గీము) చంద్రుఁడు
సీ. కటిక చీకటికి నగ్గంబైన రే వన్నెలాఁడి వెన్నెల గీముఁ గూడుకెల్ల . ఉ రా 5 100
వెన్నెలగుత్తి వి (వెన్నెల+గుత్తి) చంద్రుఁడు
వ. తెల్లని దివిరాజ, మడివాలు కేలువఁ దవశివ యొడయ, కాకరా వెన్నెలగుత్తి కన్దోయి మన్నిడడ ప్రబంధ 216.
వెన్నెలపాపఁడు వి (వెన్నెల+పాపఁడు) చంద్రుఁడు.
సీ వెలఁదిరో యీతడే వెన్నెలపాపని పువ్వుగాఁ దురిమిన పుట్టుభోగి .. వీర 3. 157
వెన్నెలపులుఁగము వి (వెన్నెల¹+పులుఁగము.) క్రీడావిశేషము.
వ. సరస సల్లాప బుల వల్లభులంగూడి వెన్నెల పులుఁగంబులాడు క్రీడావతులును . . వరాహ 4. 155
వెన్నెలపులు(ల్గు)గు వి వెన్నెలకు సంతోషించెడి పక్షి విశేషము, చకోరము.

గీ పొసఁగరే యింతి వెన్నెల పులుఁగుగములఁ, బెనుచుటకు మేత నించియుంచిన వెడంద ... అచ్చ రా అయో. 18.
సీ వెడఁద గూడులనుండి వెన్నెల పులుఁగులు తెమలె నా నేత్రాంచలములు తెరుగ ... ప్రబంధ 290.
చ స్ఫురిత నవోత్పల ద్యుతులు చొప్పడ యామిని కామినీ ళవ, న్మరహార మూర్తియై తడుము మూర్ఛిల వెన్నెలపుల్గు వేలుపుం, దొరల కొసంగఁబూని .. కృ శకుం 2 194.
వెన్నెలప్రోవు వి (వెన్నెల¹+ప్రోవు) వెన్నెలలో బాలురు కుప్పలుగా నిసుః పోసియాడుపాట.
సీ ముఱిపెంపు నగవులు ముద్దు లేఁజెక్కులఁ బొర లుచు వెన్నెల ప్రోవు లాడ ... 1. 85
వెన్నెలబచ్చె వి (వెన్నెల+బచ్చె) చంద్రుఁడు.
వ మీ మొగంబుల మిల మిలలు గెలుపాడ వచ్చెఁ జూమీ వెన్నెల బచ్చుప్రుచ్చు ... వసు. 4 28.
వెన్నెలబొమ్మ వి (వెన్నెల¹+బొమ్మ) వెన్నెలతో చేసిన బొమ్మ.
సీ వడపొడ నేర్చిన వవకంపు లత లవఁ బోలు పోఁడు వెన్నెల బొమ్మలవఁగ ... ధనాభి. 2. 23 వం
వెన్నెలరా వి. (వెన్నెల¹+రా) చంద్రకాంతమణి
ఉ ... బలు వెన్నెలరాల వరాల జాలురాఁ జిన్నెలఁ జూడముట్టె . ముకుంద 3 58.
వెన్నెలరాచఱా వి. (వెన్నెల¹+ రాచ+ఱా) చంద్ర కాంతమణి.
ఉ, వెన్నెల రాచఱా చలువ విప్పుటరంగులఁ జేసి జాళుఱా, కిన్నరలూని . . అచ్చ రా. బాల 120
వెన్నెలరాయఁడు వి (వెన్నెల¹ + రాయఁడు) చంద్రుఁడు.
చ విను రతవంపు వంగడపు వెన్నెలరాయ మర్యు పేరివన్ .. అచ్చ. రా. యు. 218
(సూర్యవంశ శ్రేష్ఠుఁడని భావము.)
వెన్నెలతేఁడు వి. (వెన్నెల¹+తేఁడు) చంద్రుఁడు.
చ వికట జటా కుడుంగమున వెన్నెలతేని ధరించి ... పొడనూపె భీమనాయకుఁడు ... భీమ. 5. 58.

రగడ గురువెంద వరె గిలుబు కొనియెంబయ్యర దొంగ, విరులం గరికుంభ కుచవెరంజు మెయర గ్రుంగ మనుచ 3 84.

వ పమతించి వచ్చి కాఁగుచున్న కాఁగుల మీఁది మీఁగడలు మెల్లమెల్లనె పుడుక వెరఁజి యారగించియును ... వి. పు 7. 126

4. కనుపెట్టు, కాచియుండు.

సీ. వేన మన్నీఁడ నీవికావ వెరఁజుము గైత నీవాజాడ గవఁగఁ జూపు .. ప్రబంధ 188

5. గట్టిగా పట్టుకొను

చ. బిరవవమొప్ప గాలి తడఁబాటు మెయిన్ గవిఁ దూటి యొక్క కుర్కురము తమంబులో వెరఁజి కోటలచేఁ గబళించి పొట్ట పెం, తెరనుదుమంచుఁ దెచ్చి కని చేవరొబలంగక త్రుంచివైచె. మనుచ. 4. 52.

వెరవరి విశ (వెరవు+అరి) 1 ఉపాయశాలి.

చ. వెరవరిగాక వీఁడు కురువీరుఁకుం బొడ నూపువాఁడె యచ్చెరు వొక ప్రామనిపేర నిటనేరఁగ వచ్చుచు నున్నవాఁడు .. భార. విరా 4 81.

ద్వి వెరవరులై మేష వృషణముల్ దెచ్చి, సురలు వంధించిరి సురలోక పతికి .. రం రా బాల 50. పొ 28 పం.

సీ సకల విద్యా విచక్షణత మించినయట్టి వెరవరి నైరంధ్రి వెంటరాఁగ .. రాజశే 3. 201

2 జీవనోపాయజ్ఞుఁడు

సీ ధనమెంత దబుగునో యనఁ డింత వెచ్చ మావడ్డికాముల వెరవరికిఁ గలికి ... రా వి 1 35.

వెరవిఁడి విశ (వెరవు+ఇఁడి) 1. ఉపాయహీనుఁడు

క. మఱవక యోధులు పూఁడులు, గొరికిన వాయొడలు మృదువగునె నీకేలా, వెఱివిఁడి చందము పుట్టెన్, దఱి దీనికి వెరవుఁ జెప్పి దన్ విను మక్తిన్ వేం పంచ 4. 544

క. తరుణి విరహాతురుఁ డగు, నరనాథ తనూజు మంత్రి నందనుఁ గని యూ, నరపతి సుదక్షుడా యని, వెరవిఁడియై పలుకఁదొడఁగె పీడని కాఁకన్. సుద. 5 4.

క. గురుజను లెఱుఁగక యుండను, వెరవిఁడియై మిమును గట్ట వెళ్ళి చనువునన్, పరియింపఁ దగిన పురుషుఁడు, పరిణయమగునేని నదియు పైకాచ మగున్. విజ్ఞా ఆచా 101

2. తెలివిలేనివాఁడు, మూఢుఁడు

క. ఆరులకు సిరియొచ్చెదనను, వెరవిఁడియుంగలఁడె దీని విడువుము .. భార కల్యా 2 76

క ఉరు బాహు బలము గల్గియు, వెరవిఁడివై తేర కాని విధమున నకటా, కరుణ యెదలోనఁ దలఁపక, దురమున జమువాత నిన్నుఁ ద్రోచితి పుత్రా భా రా. యు 1385

వెరవు వి. 1. ఉపాయము

క వెరవును లావును గలిగిన, పురుషులు లే రెట్లు లోకమున .. భార శాం 3 31

ద్వి ధరణీశ మీకు సంతాన సంప్రాప్తి, వెరవైన కథ మున్ను విన్నాఁడ నేను ... రం రా. బా. 11. పొ 7 పం.

ఉ .. రా,మావని వాథు తమ్ములకు నట్టి యపౌరుషవృత్తి మేలె మీ, రి వెరవాదరింపఁ దగునే యనినన్ మునులెల్ల నవ్వుచున్ నిర్వ 10.10

క ఎట్టి వెరవునవైనన్, ఊతి పులకరి జయము ధనోన్నతియుఁ బ్రజానీతి రక్షణము ధర్మంబుల్. ఆము 3. 35

2. నేర్పు, చాతుర్యము

సీ .. కీర్తి ధనార్జన క్రీడనంబు.

ఆ. గలిగి జనుల నేలఁగాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ వెవులేని, యట్టి నీవు విరటునెట్టి చందంబున, ననుచరించువాఁడ వధిప చెపుము. భార విరా. 1. 67.

గీ అఖిల మోహనమూర్తిగా వరుఁడొడఁ, బంచ బాణుండు కాన నిర్మించెఁగాక, వేదజడుఁడైన యజునకు వెరవుగలదె విక్ర 7 44

క. హైవచ్చె క్రూరజంతుఁ, జే వెరవున నేయు ఱుండు సిగ్గే చెపుమా హర 7. 57

3 రీతి, విధము.

గీ నగరు వెరవునఁబురుకుత్సు నరణి వలుని రమణ నర్జున క్రియఁ బురూరవుని చందమున. విక్ర. 269.

క సిరితామో కాలొడ్డిన, కరటినిఁ బైకొనుచు నేనె కదియఁగ నను నీ, వెరవున విడనాడుచు నొక, తిరిపవుఁ జెలిపట్టెఁజేరఁ దివి రెదవేమీ. యయా. 2 78 (క ర. పా)

4 ధర్మము

గీ మేలుగల నాఁడు మురియుచు మెప్పవేర్చి, గొడవ లొదవెడు తఱిఁ బోవ విడువఁదగునె, తలఁపనుసురుల యొడయఁడై తవరు మగని, వెరవెఱింగిన నాడెవ్వ డెఱుఁగ కలకు అచ్చ రా అయో 71

5 ఆనుకూల్యము

సీ మాతలేశ్వరు నొక్క మణికందరంబున విశ్రామముండంగ వెరవుచేసి హార 5. 40.

6 ద్వారము

వ. ప క్వాన్న గంధంబు గాలివెరవున నాఘ్రాణించి .. కాశీ 4 120

గాలి వెరవునన్ = గాలిద్వారా

విశే 1 శక్తము, సమర్థము

క పావన గుణానుభావము, భావన భావింపనెట్టి పరమ నదులు నీ, కావేరికి సదృశంబులు, గావేరికినైనఁ బొగడఁగా వెరవగునే కళా 2 18

ద్వి పొరి భూతకోట్లను బుట్టింపఁ జెఱప, విశ్వ యుంప నొక్కఁడె వెరవైనవాఁడు . రం రా ఉ 103 పొ 10 పం

2 యుక్తము

ఆ వాములానితోడ వాట్లనితోఁడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడనదయరితోడను, వెలకునెత్తమాడ వెరవుగాదు ఉ హరి 3 112

మ. వర వైతాళిక వంది బృంద జయ జీవస్ఫార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతిన్ నిజావాసమున్ హరి ఉ 4 117

క పరపగు మోహావ మేర్పను, వెరవగుచో నెల్లి నేఁడు విడిసెన మధురా, పురమున .. ఉ హరి 4. 168

3 అధీనము

క గరుడునిపై శార్ఙ్గ ధను, ర్ధరఁ డగు విష్ణుండు మేరు తటిఁ బోలుచు తటి, త్పరివృత జలదము బోలుట, వెరవ దనుజ రాజ హంస వితతి యితనికిన్ నిర్వ 3 5 (శ.ర )(విరియ ముద్రి పా )

వెరవుపడు[1] అ క్రి (వెరవు+పడు) వశమగు, అధీనమగు

వ. అప్పాటం బ్రతివచనంబునఁ బాటిల్లు చీకటి తప్పు కప్పి వుచ్చ వెరవు పడకుండునట్లుగా బ్రకాశించిన హర. 5 57

వెరవుపఁడు[2] అ క్రి (వెరవు+పడు) అనుకూలమగు

గీ అపుడు గాని మా తండ్రి యున్నట్టి చోటు, నరసి సంధించు కొనుటకు వెరవు పడదు కళా. 6 154.

వెరసి వి అంకెలను గలుపఁగాఁ దేలిన మొత్తపు లెక్క

ద్వి చదువు లెక్క ల [illegible] బస. వు 6 783. పం.

వెరసి(సు)మాట పర్యవసానము, చివరకుఁ దేలిన సంగతి

వ అన్నియుం జెప్పనేల వెరసి మాట యొకటి గలదని యిట్లనియె కళా. 78.

క తగవెరసు మాట చెప్పెద, మగువలసంచల కటాక్ష మార్గణ జాలంబు గెలువఁ దాఁకినఁ దాఁకవె, జగతిం గోవిదుల మతులుఁ జదువులుఁ దెలువుల్ ప్రబోధ 1 47

వెరసు వి. అంకెలు లోనగు వాని పంక్తి

చ. హరిదనధిశమా రమణులాతుర గాలిమదుల్ల పట్టముల్, తరువుల రాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతదిమాన వేశ్వరునకుఁ దెచ్చియిచ్చిన సువస్తు పరంపర లెక్కఁ గూడు పె, న్వెరసుల రీతిఁ దత్పవన వీతిఖురాంకము లుండు నుర్వరన్ వరాహ 12. 60

ద్వి స్వర్గంబు గరసు మోక్షంబుల వెరసు, శివ యోగుల కిరవు సిద్ధుల వెరవు ... పండితా. పర్వ 813

వెరసుబడి వి (√వెరసు) అంకెలపంక్తి, అంకమాలిక

క విను మీతని సేనం గల, వనచరభట సంఖ్య వర్గ వర్గములెల్లం, బెనురాశి సేసి కవిలెం, బన వ్రాసిన వెరసుబడి నిశాచర నాథా భా రా. యు 364.

వెరళించు స క్రి. చెలఁగించు, విజృంభింపఁజేయు. (ప్రయోగాంతరము కన్పడ లేదు. ఇంకను విచార్యము.)

గీ చిలిలి లోపలనే చీమ చిటుకుమన్నఁ, గనకనవ కూయు ఒకదారి కవల కదన, వరుని వెర లించు మల్లెంటు విరుల కదన, బడుకయిలు మాని విరహాతాపంబుఁ బూని కువల. 5 38

**వెఱ** వి. (త వెరు.) 1. భయము

క. చెఱువు వడుమ వినినను బెను, వెఱమొకములు పెదరినను వివేకవిధి యు, క్కుటి బహుళ సైన్య మఱి ముఱిఁ, బఱచిన వా గంగరాదు బలి యుర కైవన్ భార శాం. 3. 16

చ. వెఱమెరలేని యట్టి బలు వీరుఁడు కృష్ణ కుమారుఁ డొక్కచే, జబది . భాగ 10 పూ. 662.

శా పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రు లడవిన్ బోఁ ద్రోచిరి వైఖరిన్, బొట్టుంగట్టిన ప్రాణ నాయకుఁడు పో పొమ్మంచు నోవాడెడిన్, గట్టా కోయిల పిల్లచందమున బల్గాపిన్ వెఱంగొంటి న, న్నిట్టట్టుం గికురింపఁ జూచెదవొ కుయ్యాలింపవే శ్రీహరి కృ శకుం. 3. 164

2. ఆశ్చర్యము.

గీ నేను మొదలుగ నొండొండ నెనఁగునంప, వెల్లి వఱపియు వస్త్రముల్ వెలయఁజేసి, కాన మొక్కని వందుఁ దాకదు దగులదు, ఱిచ్చవడి నిలిచితిమి వెఱ ముచ్చముడిఁగి. హరి.ఉ. 5 67.

గీ. అవఘ మణికంథరుం డట్లు తనదు తపము, విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ, దిరుగఁ దపమొనరింపంగ దొరకొనియెనొ, యిపుడు రంభతో నున్నాఁడొ యెఱుగ వలయు. కళా 3. 47.

గీ. దిగధి పాలుర నెల్లఁ దోడ్తేరఁబనిచి, వారు దాను రహస్య విచారణపరత, నుండి వెఱతోడి భయమునను దిఱగొనుచుఁ, బలికె గీష్పతిఁజూచి యాబల విభేది. కవిక. 7. 97.

3. నిశ్చేష్టత

మ. పనిగా వేర దటంచుఁ బూనక వెఱంద్రావింతు రెంతేజములన్, పనికిన్ మేకొని విఘ్నలేశము జనింపవ్ మధ్యముల్ వీఁగి యం,తనె చాలింతురు ... మల్లి నీతి. 72.

**వెఱఁగందు** అ క్రి. (వెఱఁగు+అందు.) ఆశ్చర్యపడు.

క ఈ జనపదమున కధిపతి, యే జనపతి యో మునీంద్ర యిదిశృతయుగ వ ద్భాష్పిజితమని వెఱఁగందెదు, నాజీ తనూభవునితోడ యతి వరుఁ డనియెన్. చం రా 2 96

గీ చిత్తజాతుండు కనుమాయ చేసినాఁడొ, మన మనంబుల విభ్రాంతి మట్టుకొనెనొ, కమలలో చన పతితాప గౌరవంబు, యనుచు వెఱగంది మదిఁగుంది యజ్ఞముఖులు విక్ర 1 138.

**వెఱఁగు**=**వెరఁగు** వి (త బెఱగు త వెరళ్) ఆశ్చర్యము, వింత

క తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము వెఱఁగున్, మదిమొలవఁ జక్రధరుపై, వదలక వినువీథిఁ బుష్పవర్షము గురిసెన్ ఉ హరి. 1 122.

ఉ. . వాసియు వన్నెయుం దగవు వైభవముం జవ్వముల్వివేకమున్, బో నవతుల్ భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమిచెప్పుదున్ పారి 1.92

క. . . నతఁడా, రూపం బెడఁబాసి ఖేచరులు వెఱఁగందన్. మనుచ. 4. 116

3 అద్భుతకృత్యము, వింతపని.

క శ్రీ విశ్వ విభుఁడు చేసిన, యా వెఱఁగుల కలుగ వలయు వలిగిన హిదవన్, భావింప వతఁడు ధీరుఁడు, వావిరి నను దేరఁడతను వడిఁ బడ వలయున్. కావ్యా 1. 104.

ద్వి. వెఱఁగైన యా రంగ విభు మహామహిమ, మఱి వేల్పులకు నవాఙ్మనస గోచరము ... ద్వి పరమ 5. 417. పొ.

**వెఱఁగొందు** అ క్రి. (వెఱఁగు+ఒందు) ఆశ్చర్యపడు.

సీ విక్రమార్కుని నైన వెఱఁగొందఁగాఁ జేయు జండ తరాభీల పాహారములు ... విక్ర. 1.87.

**వెఱఁగుపడు** అ క్రి (వెఱగు+పడు) 1 ఆశ్చర్యపడు

క వెఱఁగు పడి హర్ష రాగము, దఱిఁగిన వెల వెల్లనై వదనములు ప్రాలం, దెఱఁగేది ఱిచ్చ వడి ర, త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు వంతన్. భార అర. 7 158.

గీ. నేఁటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీర హోమంబుచే నీవు వేల్పుఁబెద్ద, వెఱఁగు పడఁ జేసి లోకైక విజయహేతు, వంశముతోడుటఁ బౌలస్త్య వరకుమార. ఉ. రా 2 214

వ కౌతుకాంకురంబు కరఁగు వడ వెఱఁగుపడి .. మనుచ. 6. 79.

2 నిశ్చేష్టత నొందు

చూ: వెఱఁగుపాటు.

**వెఱఁగుపఱుచు** స. క్రి (√వెఱఁగు పడు) ఆశ్చర్యము నొందఁజేయు.

వ కెంపు మించుగన్ బఱచుట గగన చరుల వెఱఁగు పఱిచి ... మనుచ 4 115.

**వెఱఁగుపాటు** వి. (√వెఱ గు పడు) 1 నిశ్చేష్టత

గీ దాని కన్నులనెల్లఁ జిత్తమున భయము, విస్మయంబును బెనఁగొన వెఱఁగు పాటు, గదిరి చిత్రరూపంబులఁ గరణి నుండ . భార.అను. 4 400

ఆ. . . వెఱఁగు పాటు దనికె నెఱనాడె నొవ్వ నెవ్వగలు వగల నీరె దొగులు వొదివె ..భార. విరా 2 106.

క అబ్బెఁ దగుబాధ మది మది, మబ్బెడు లో నంత రాయ మొదఁ గూడుటయున్. బ్రబ్బికొను వెఱఁగు పాటది, నిబ్బరపు విషాదమువఁగ నెగడుం జూడన్. కావ్యా 1 73.

2 అబ్బురపాటు, ఆశ్చర్యము

ఉ వెఱఁగు పాటు తోడి వెఱపు నాకస్మికసమ్మదంబు మానసంబు నొలయ . హరి. ఉ 3 188

చ. ... గురు శిష్యులు కౌరవ సేనలోని భూపతి సుతకోటికిన్ వెఱఁగుపాటొనరించిరి ...భార శాం 5 128

**వెఱచేఱుచు** అ. క్రి. (వెఱ+చఱుచు) భయపడు

క వెఱచఱవ నింతకంటెం, దఱుమగ బాణంబు లేసి తడయక పగఱం, జెఱుతుననియుమము చల్లుచు, గ్రుమ్మకు ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. భార. సభా 2 305.

వ. ఇట్లు క్రీడించి గాంగేయుడించి గాండీవి దన యరదంబు రయంబున

క పఱపి రథికులను సూతుల, నఱికిన మ్రోడుపడి యుండె నానారథముల్, వెఱచఱచిరి కురువీరులు పఱిపఱియై మనబలంబు భయముం బొందెన్ భార భీష్మ 2 38.

అయవిభాతి తఱిమి వెసరక్కసుల వెఱచఱువఁ బట్టుకొని, పఱిపఱిగ వేతలలు మఱిపి ... భా. రా యు 1437

**వెఱచు** అ క్రి 1 భయపడు

క. రవిసుత పార్థుల ఘోరా, హవమునకును వెఱచుచున్న యది కుంతి. .. భార. ఆది. 6 41

చ. పరమున కేను దాసుఁడని పల్కఁగఁ బ్రాపుఁడఁ గాను మత్సుతన్, హరునకు నిత్తునా వెఱవ నయ్యె . కు సం 3 970.

చ వెఱచితి రాఁగదే యనిన వెండిక దాపగఁ దీర్తు నీవు నా, వెఱపెటులున్న నీ రథిక వీరులు వాపెదరు ... భార ఉద్యో 4 139

ఆ. పాపఁడనక వెఱక పాపని మొదలింటి, పోక లెల్లఁ దలచి పొగడఁ దొడఁగె ... భాగ. 10 116

వెఱక = వెఱవక.

క . విహంగంబులు రుతముల, నవని సుతను వెఱకు వెఱకు మన్నంట్లుండెన్ భా రా, అర 2 150.

వెఱకు = వెఱవకు

గీ ... అని జయంబిచ్చి తన గదా హతికి వెఱని, మనికి ధనపతి దయచేసె ... సమీర 2 133

వెఱని = వెఱవని

ఇది 'వెఱచు' ధా యొక్క వ్యతిరేకార్థక విశేషణము

2. జంకు, సంకోచించు

గీ అడియుఁగాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచిత దక్షిణ లర్పించి యున్నధనము, గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁదనిసి, విడిచి రర్థంబు దీనికై వెఱవవలదు జై భా 1. 73

సీ హీర కుట్టిమ భూము లిసుకనేల లటంచు గట్టిగా నడుగులు పెట్ట వెఱచు . దశా 1 272.

క. ... పన్నిన భయమున బేడిన, రెన్నఁడు జల దుర్గభూము లేమఱ వెఱచున్. హరివం 2 90

3. వ్రమత్తగా నుండు

క. ... విను కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. భార. శాం 2. 261

**వెఱచుకొను** అ. క్రి (వెఱచు + కొను, స్వార్థమున) భయపడు

ఆ ... వెఱపించఁబోయి వెఱచుకొన్న చాయ యయ్యె. కృష్ణ. 3. 48

**వెఱపరి** విశే. (వెఱపు + అరి³) భయము కలవా డు, భయము కలది.

సీ ... భయశీలుఁడౌ వెఱపరి .... ఆం. భా. 3. 9

**వెఱపాటు** వి (వెఱపు + పాటు) భయము.

ద్వి. నిరవైన పతి మీఁది నెయ్యంబు దలఁచు, వెఱ గందిచింతించు వెఱపాటునొందు .. రం. రా ఉ. 122. పా 3. పం.

క. ఏవరము కొల్లదేవా, దేవర కరుణాకటాక్ష దృష్టి యునిచి నా, కావరముచేత వచ్చిన, యీ వెఱ పాటుడిపి బ్రోవవే యని పలుకన్. శ్రీరం. మా 4 83.

**వెఱపించు** స క్రి (√ వెఱచు) భయపెట్టు.

ఆ. ... వెగడు పడఁగఁ జాతి వెఱపింత మొజ్జలు తంత్రప్రయోగ విధుల దప్పవలవ. భార ఆది. 2 130

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱ పింపంగవలదు మాధవ ... భార ఉద్యో 3 43.

ఉ. తేలపుగాదె నీవు వెఱపించెదు వీరిని హారిఁబోలె వన్ను .. రాఘవ 4. 10.

**వెఱపిఁడి** వి (వెఱపు + ఇఁడి) నిర్భయుఁడు, భయము లేనివాఁడు, భయములేనిది.

వ. .. వెఱపిఁడి తఱపికొన్న విధంబున శరీ రంబు చొచ్చి .... విక్ర. 4 98

**వెఱపు** వి (√ వెఱచు) భయము

క కఱవు పయిఁ గఱవు వొరయుచు, వెఱపు పయిన్ వెఱపు దోఁప విడువని యిడుముల్, దొఱఁగమి పెన్ ... భార. శాం 4. 72.

మ. కరకంఠుం డరుదేఁచు శేఖరుని షట్కాలంబు బూజించు నెం,దఱు భక్తుల్ దనువేఁడి నం బ్రమదమున్ దాతృర్యమున్ భక్తియున్, వెఱపుం గల్గి తదిప్సితార్థములు గావింతు న్ని రాంఘ్యతన్ హం స 1 11., దశా 2 333

**వెఱపెక్కు** అ. క్రి (వెఱపు + ఎక్కు) భయపడు.

చ ... చొప్పుకునే వినుకోఁటి కాప్తిఁ జెప్పిన క్రియఁ జెప్పినీవు వెఱపించిన నే వెఱపెక్కు వాఁడనే భార కర్ణ 2. 38.

**వెఱబొమ్మ** వి (వెఱపు + బొమ్మ) వక్ష్యములకు భీతి కలుగుటకు భీకరాకారమునఁ గట్టెడు బొమ్మ

క నెఱవగు సంపద గలితన, నెఱిదానం గుడువఁ గట్ట నేరని మనుజుం, డఱిముఱిఁ జేరికిఁగట్టిన, వెఱబొమ్మయె కాఁడె యెన్ని విధములఁ జూడన్. విక్ర 2. 179.

ద్వి. వీఁ డొక్క వెఱబొమ్మ విప్రవృశ్చికము. పీడించి వీరి నొప్పించుచున్నాఁడు ద్వి. హరివం ఉ 932 పం.

**వెఱవెఱపాటు** వి. (వెఱ + వెఱ + పాటు) నిశ్చేష్టత

ద్వి. వెఱవెఱ పాటును విహ్వలత్వంబు, వెఱపును మఱపును వీడి కోడాడ రం. రా అయో 96 పా 17 పం.

**వెఱవేఁకి** వి (వెఱ + వేఁకి) 1. భయజ్వరము.

గీ ఏను నామాట పద్యంబుగా నొనర్చి, వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన, త్రొక్కి జను రెంచి కాంచివిదిక్కు వడుచు, వెడలి మఱిజూడ రిట వెం వేఁకిపట్టి ద్వా. 4 70.

ద్వి వన్నెఱంగెరు గాక నాపేరు తెలియ, విన్న మిత్తికి నైన వెఱవేఁకి వచ్చు ... ద్వి హరివం ఉ 1194 పం.

సీ మొన్నఁ బారాశర్య ముని యోటరాఁ గూఁత లిగయించి వెఱవేఁకి యెత్తఁజేసె . . కువల. 2 80

2. సంతాపము, జ్వరము

ఉ ఏవి దినంబులో రజను లెయ్యవియో విను నిద్ర యెట్టిదో, వేపుట యెప్పుడో యలఁతవెమ్ముఖునం బున కెద్ది మందొ యే, ద్రోవలఁ గ్లేశయో తలఁపు తోఁడవ చెయ్వు లెఱుంగ నేను నా. కీ వెఱవేఁకి మాన్పఁ గమలేక్షణ యబ్బితి నీవు వెజ్జయై. హరి ఉ 7. 170.

(ఇందలి 'వెఱ' శబ్దము సాధురేఫ ఘటితము విర హార్థకము ప్రత్యేక ప్రయోగము లేనిది అని శ. ర)

వెఱసొమ్ము అ క్రి. (వెఱ + సొమ్ము) భయపడు
సీ. ... పశువుఁ జేయ, విప్రులు పట్టరా వెఱసొచ్చి యొకిఁగెడు గవయంబు చాడ్పునఁ గర్ణ భీతి, మల్లఁ ననుకుపు నుండుదు ..భార కర్ణ ౪ ౩౩
క. ఇటులఁ దమిపెంచి మారుఁడు, పటలంబెట్టంగ నొచ్చి నడి పటు నిటుఁ జెం,దుటకు వెఱసొచ్చి రతిసం, ఘటనార్థము మిగుల వేగు కాలము నందున్ హంస ౩ 156

వెఱగాయలాటలు వి. బ బాలక్రీడావిశేషము
గీ దాయముల వాడు వామనగాయ లాడు, కాట లను కాడు వెఱగాయ లాటలాడు, మున్న మున్నగ దాఁగుడు మూ తలాడు, నా సుశీల జగన్మోహనాంగి యగుచు బ్రహ్మో. ౩ 27

వెఱ్ఱి వి (క. త మ వెఱి.) 1. పిచ్చి, ఉన్మాదము.
ఉ వైదిక కర్మచారి జనవత్సల నీ మది బట్టు కొన్న యున్మాదము హీన మానవు మనంబునఁ బుట్టిన వెఱ్ఱివో లెన,ప్యాదులఁ దీర్పుటొప్పదు... భార. శాం 1 101
గీ. .. అబ్బాయి వెఱ్ఱి వట్టె నేమొ, యనుచు నాలాగె కాపింప . . శుక. 2 456
2 అవివేకము
క జడలు ధరియించి యడవుల, నిడుమలఁబడి కాయ గసరులే మెసఁగెడు పెన్, బడుగు నిమఁ గవయఁదగునా, విడువిడు నీకేలపట్టె వెఱ్ఱిఁ అకాంగి రామా 6 152.
చ తనకిది దక్కెనంచుఁ బ్రమదంబునఁ బంక్తి ముఖుండు మీఁద కేతుని చిగురాకులూఁచుచుదిఁ దూరినఁ దాలిమి మాలి చేరఁగాఁ, జని యిది యేమి వెఱ్ఱి యొకొ జవ్వనమున్ బోలిపోవ విష్ణుఁడు, చనె కలకాలమున్ దపసి చొప్పున దాఁటెదు వృద్ధకాంతవై ఉ రా. ౩ 115
విశే 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.
ఉ ఇమ్మడి వెఱ్ఱి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని యాడె ... భార. సభా. 2. 39
క. నీ పదవి కరుగ నొడఁబడి, నీ వెనుకవ వచ్చు నప్పుడు నిందింతురు మమ్మి వెఱ్ఱు లితని మాన్పం,గా వలఁతులు గాకయని జగజ్జనులధిపా. భార శాం 1. 66
ఉ విను పతివ్రత లగు వెంఁదుల దిక్కు రా, వెఱ్ఱి యేయమ ర్త్య విభుఁడు నీకు, వలవదతని మీఁది వైరస్య మనుకూల, వృత్తి బోలునయ్యవి ప్రియంబు హరి ఉ 9 78
మ వలవమ్మా యిటువంటి కానిపని యో హామాళీ యీ వెఱ్ఱిబుద్ధులు నీకేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భావలిల్లాడి యీ,కాల నాకేటికిఁ గట్టెదమ్మ ... సారంగ. 2 102
2 పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు, పిచ్చిది
సీ వెఱ్ఱులు దొలుమేన వెడ్డున సాధు జనము మోస పుచ్చి ధనంబు గొన్న జములు . భార అను 5. 105
ఉ .. నీ, చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే ... మనుచ 8 68
3 వికృతము
గీ . క్రోటి నిర్వంకఁ బట, తులను నివురుచు వెఱ్ఱి చూపుల నురంబుఁ, గెలఁకుల గనులం గొమచుఁ గానఁ గేకులుండె అము. 4. 181.

వెఱ్ఱికుందెన వి (√వెఱ్ఱి) వృక్షవిశేషము (వృ వి.)
సీ వెలగ విషము దారి వెఱ్ఱి కుందెన మంచి కుందెన కలబంద గువ్వ గుత్తి .... హంస 4 10.

వెఱ్ఱిగొను అ క్రి. (వెఱ్ఱి + కొను) అవివేకము నొందు
గీ పల్ల వేవల్లె పెద్దవారిట్లు వెఱ్ఱి, గొనితి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన, రక్కసులు లోనుగాఁ జేయ క్రందులెల్ల, నుడువఁ దమకు దిక్కైన వాఁడొరుఁడు గలఁడె. హరి. పూ. 8 181.

వెఱ్ఱిగొలుపు స క్రి (√వెఱ్ఱిగొను) అవివేకము నొందించు, మోహపెట్టు
క ప్రకృతి గుణంబులఁ గొని బహు, వికృత రూప ముల నట్లు వెఱ్ఱి గొలిపెనే, వకలంకుడ ... భార శాం 6 51.

వెఱ్ఱిచిక్కి వి (వెఱ్ఱి + చిక్కి) వృక్షవిశేషము (వృ వి) ఒకజాతి యడవిచెట్టు
సీ గోగు పొగడములు గోరంటలును బెద్దవెలమ సుంకేసరి వెఱ్ఱిచిక్కి ... హంస 4 11.

**వెఱ్ఱిచెఱకు** వి. (వెఱ్ఱి+చెఱకు) ఇక్షు విశేషము, అడవిచెఱకు (వృ. వి.)

ఉ. వెఱ్ఱిచెఱకుఁ గోలవింటి బిడ్డకు మల్లె, శివె నారిఁ జేసి ఖావ శవ్వఁడు. వలచుపువ్వు కోండ్ల చెఱచోటులనే మెత్త, విరుల తూఁపులేసి మరులు కొలిపె. వైజ 2. 35.

అ. వెఱ్ఱిచెఱకు నందు విలసిల్లు ముత్యాలు, పొరలు ప్రేంఖణంబు పువ్వుచాయ, వది సమస్త భూత లాధీశ కామినీ, వశ్య కరము ధరణి వలయము వమ రత్న 40

సీ. రసదాళి చెఱకుతోఁ బ్రతివెఱ్ఱి చెఱకై నఁ జూవ వాతెఱ బ్రతి చక్కెరగును ..చంద్రా 4 105.

**వెఱ్ఱిజిల్లేడు** వి (వెఱ్ఱి+జిల్లేడు) రాజార్కము, ఒక జాతి జిల్లేడు (వృ. వి.) (శ. ర)

**వెఱ్ఱితనము** వి. (వెఱ్ఱి+తనము.) అవివేకము, తెలివి తక్కువ తనము.

సీ. కావలు బలాఢ్యుల బలవిహీనుల క్రియ వెరలంగ వడిచిన వెఱ్ఱితనము .... ఖార ఉద్యో 1 376.

మ. మత్తెకవోరి మా వదువు మార్కనేన్ జరి తింపఁ బూని వీ, వెఱ్ఱితనాలు మానవని పేర్కొనిటాడఁగ వింటనుండి కాఁ, జిట్టునఁ గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, వెఱ్ఱియగారు మంచిగురువే దొరికెన్ జదువెట్లు చెప్పునో వైజ 4. 12.

గీ. ... రైవకృతంబులకును, విఱ్ఱవీఁగుట బ్రేఁగుట వెఱ్ఱితనము దశా. 2 418

**వెఱ్ఱినారువ** వి. (వెఱ్ఱి+నారువ) అరణ్య వృక్ష విశేషము, ఒకజాతి యడవి చెట్టు. (వృ. వి)

సీ. వేరు పవసగుత్తి వెఱ్ఱి నారువ రేల పవస కరక కొమ్మిని పలుకరేణి ... హంస 4 11.

**వెఱ్ఱినిమ్మ** వి (వెఱ్ఱి+నిమ్మ) అరణ్య జంబీరము, అడవినిమ్మ.

సీ కోరింద్రనలతుమ్మ గొటికె కోదారయ వెణుతు రూడుంగ దంతి వెఱ్ఱినిమ్మ ... హంస. 4. 9.

**వెఱ్ఱిసీరు** వి (వెఱ్ఱి+సీరు) వెఱ్ఱి యెత్తించు నీరు, మద్యము, కల్లు.

గీ. వెఱ్ఱిసీరాను కతమున వెడలునట్టి, తొక్కుఁ బోదట్టి యొకకమ్మ వెక్కఁబెట్టి, దశ గఅవఁ బోవు వేఁపి చందమునఁ బట్టి; ఎరున మెచ్చఁగ నూరుజ ప్రముఖుఁ బలికె. శుక 3 32.

గీ మేంమీఱిన గొఱియల మేఁక గముల,గొటి యపోతుల నటికి బ్రోగులుగ నిడ్డ, వెగ్గలపుఁ బచ్చి వంజుళ్లు వెఱ్ఱినీళ్లు దొరవాతుగ నిడఁగడు పార మెసఁగి అచ్చ రా యు 231

**వెఱ్ఱిపాల** వి. (వెఱ్ఱి+పాల) అరణ్య వృక్ష విశేషము, అడవి పాలచెట్టు

వెఱ్ఱిపాలాకు అరిక బియ్యము పిట్టున ఎలుక కాటు మానును. (చి శి చి ని)

**వెఱ్ఱిపుచ్చ** వి (వెఱ్ఱి+పుచ్చ) చేఁదిపుచ్చ (వృ. వి)

గీ. పావంయు వెఱ్ఱి పుచ్చయు బత్రపుష్య, వల్లరి ఫల మూలంబులుల్ల పిల్లి, గ్రహణమునఁ దెచ్చి చూర్ణంబుగా నొనర్చి, నీళ్లతో నీయవిషము లన్నియును దీఱు (చి శి చి. ని)

**వెఱ్ఱిబాగులు** వి (వెఱ్ఱి+బాగులు) తెలివిలేని స్త్రీ (గ్రా.) తెలివిలేనివాఁడు, వివేకము లేనివాఁడు (శ. ర పా)

**వెఱ్ఱిబిల్ల** వి (వెఱ్ఱి+బిల్ల) అరణ్య వృక్ష విశేషము, ఒక జాతి యడవి చెట్టు

సీ పుతిచింత మోదుగు ముటుమోదుగును వెల్లిపుల్ల వెలగ వెఱ్ఱి బిల్లశిల్ల ... హంస 4. 11

**వెఱ్ఱిబీర** వి (వెఱ్ఱి+బీర) చేఁదిబీర (వృ వి)

గీ మునివి వెఱ్ఱిబీర ముష్టి యుమ్మెత్తల, విత్తవములఁ జెముడు వేళ్ల ఖాను, మూలములును దైలమున దించి చమరిన, సర్వ వాతములును శాంతి నొందు (చి శి. చి ని)

**వెఱ్ఱిమొల్ల** వి. (వెఱ్ఱి+మొల్ల) అడవిమల్లె (చి. ని)

**వెఱ్ఱివాఁడు** విణ (వెఱ్ఱి+వాఁడు) 1 వివేకము లేనివాఁడు

చ. విడువక నీవు పట్టనము వీథుల వీథుల వెఱ్ఱివాఁడవై, చెడుగులఁ గూడి ధౌర్త్యములు సేయ మహీరమణుం డెఱింగెనే, విడుచును సోమయాజి మమ వృత్తులు చేకొమనెల్ల వెంటలన్, కెడుదుము గాదె నీకతవఁ జీరయుఁ గూడుమ లేక పుత్రకా కాశీ. 4 93

2. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు (శ. ర పా.)

**వెఱ్ఱిసెనగ** వి. (వెఱ్ఱి+సెనగ) ఒక జాతి చిన్నచెట్టు, చిన్న మొక్క.

సీసమాలిక. ... కాము జిలుగు మెట్ట దామరవెట్టి సెనగ జంచిరము కాచి నల్లకాచి .. హం. 4 10

**వెట్టిసొట్టి** వి (వెట్టి+సొట్టి) తుంబీ భేదము, చేఁతి సొరఁ.

చ నిలువక వచ్చి వచ్చి ధరణిం జిఱువెంచియలున్ వసుంధరం, గలసిన గోడలుం జివికి గంపలఁ గాచిన వెట్టిసొట్టితీ, వలు చిగిరెంత గంటగమి వాతులుగప్పిన పూడు పాఁతరల్ ... వేం పంచ 1 467

**వెల** వి (క బెలె త విలై) 1 కొనువస్తువున కిచ్చెడు విలువ మూల్యము, క్రయధనము

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మూకు నొసఁగు మనుటయు .. భార. అశ్వ 4 189

గీ జీవహింస యెన్నండును జేయవవఘ, ఉరులు సంపి తెచ్చిన మాంస మొనర విలిచి, తగిన వెల కమ్మి బ్రతుకుదు ... భార. అర 5. 38

ద్వి ఏ మేడ దేశంబు లేలుట లేడ, భూమికి వెల యిమ్ము భూమీశమాకు .. రం. రా బాల. 16. పా 14. వం

వ .. తపస్వులకు నూఱువురకుం బ్రోలునాంటి బబ్బర వాఁడు పన్నస్రలు దగువెలకు విలిచి కొని ... ద. కా 1281 9

సీ విలువనా జిట్టినా వెలయన రోయన వెలయుచు మందును విక్రయంబు.. అం. భా. 2 267.

2. పందెము

ఆ. వాదులానితోడ వాట్లినితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమేటినితోడ వడియరి తోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు ఉ. హరి. 3. 112.

**వెలఁగ** వి (క బెళల, త. విళవు.) కపిత్థము, వృక్ష విశేషము.

చ. .. త.త్పదములఁ దోకయున్ బిగయఁబట్టి చెలంగి వెలగ బ్రమానితోఁ, బదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు వేఁగ రక్క సున్ భాగ. 10. పూ. 435.

సీ. వెలఁగపండులు పుల్లవెలఁగ పండులు మోవి పండ్లు వంకెవపండ్లు బలుసుపండ్లు . కాళ. 3 99

ఆ పిలికి పూలు బూతపిల్లు లేనికకొమ్ము, లలరుఁ దేసి పెద్ద వెలఁగపండ్లు, వెదురుఁ బ్రాలు జాతి పదనికల్ గసగసాల్, జల్లి మెకపుఁ జాలుఁ జాలపప్పు. యయా 1. 31.

**వెలఁగొను** స క్రి (వెలన్+కొను) వెలయిచ్చికొను, విలిచికొను

ఉ. ఆసలఁ బెట్టి యేచు వసువంచు వచింపఁగ నేల సంతతో, ద్భాసి నిజాభిజాత్యమువఁ దద్వసువున్ వెలగొన్న మోహసంపాన పదంబు దారమణి వారక కు క్షేమతిం జనించె . వసు. 4 111.

(ఇట వశము చేసికొన్న అని భావము.)

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁ గుబేరుని జెనకెడు వైశ్యులు . కుచేల 1 23

(ఇట పోలు అని భావము )

**వెలఁది** విశే (త వెళిదు) 1 నిర్మలము

గీ ... కుప్పతిలు చుట్టుఁగొండపైఁ గొవలుసాఁగి, వెలఁది వెన్నెల తెల్లడ వెల్లివిరిసె, శ్రీరం. 2 258.

ద్వి సలలిత శశి కాంత చంద్రశాలలును, వెలఁది ముత్యంబులు వెలయు వాకిళులు ... ద్వి హరిశ్చ. పూ 178

సీ ఓలి నన్నింటి సద్యోభృతంబులు నించి వెలఁది పట్టున వర్తులలవరించి ...

గీ . . యందముగ నివాళించి రయ్యువని పతికిఁ, జారు కంకణ ఝణఝణాత్కార మెసఁగ . భోజరా. 2 96.

2. తెల్లనిది, ధవళము.

గీ చలువ లందిచ్చె నొకతె చెల్వ వెలఁది నవ్వులుత్తరీయము లంచుచే నొడియ మూల్య. భూష ణంబులఁ గై సేసె బాలఁతి యొకతె ... దశా. 6 27.

ఆ చెలువ యొకతె చలువ వలువచేఁ దడియొత్తు, మగువ యొకతె సొగసు సిగయొనర్చు, వెలఁది చందనంబు వెలఁది యొక్కర్తుమై, నలఁద నొకతె ధూపములఁ జేయు. ఇందు. 5 26.

ద్వి. దళుకొత్తు వెడఁదకెండము మీఁద జిసుగు, వెలఁది జన్నిదములు విలసిల్లుచుండ ... ద్వి పరమ. 3 244. పొ 12 పం

3. మేలైనది

సీ. పవనమూగమమునఁ జవులు వకాృడించి మించఁ జాలు వెలంది మిన్నగములు ... వసు 6 72. (నారీ రత్నముల సముదాయములు అని యర్థాంతరము)

క. సికఁజుట్టె విరులొక్క, సికతామయనితంబ వెలఁది కస్తురి నొక్క వెలఁది యలదె...సారంగ 2 192.

4 ప్రసన్నము, సంతోషభరితము

చ. ... పైపయి నద్భుత ప్రగుంభనము మనంబునం జెనుప: బల్కె నమంగు వెలఁది పల్కులన్ ఈ. వ. 2. 102.

(వలపతనమున ప్రియపతి వచనములతో అని యర్థము.)

5. విశదము, స్పష్టము.

ద్వి. వలనొప్పఁగాఁ బోయి వచ్చిన తెఱఁగు, వెలఁదిగా వంతయు వినిపింపఁగోరి ... నవ 2.65. పొ. 6. పు.

వి. 1. చక్కని యాఁడుది, ఆఁడుది, భార్య

గీ. వెలఁది సంకల్ప సోపాన వితతియందు నతఁడు మాడంగ సంచరింతహారహంబు...నైష 2.87

క. . . శైవ శరానన మెక్కిడి, యా వెలఁదిం బెండ్లియాడు మా రఘురామా రామా.4.61.

సీ. ... ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత. ఆం. భా. 2. 104.

గీ వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము నిష్ఫలయోజనముగ నమ్ముసేఁత, యనెడు నప్తవ్యసనములఁ జనదుతగుల. భార. ఉద్యో. 2. 44,

సీ వెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరిలేదు సౌభాగ్య గరిమ నీకు ... పారి 1 58.

గీ. చిత్రకారుఁడా తెఱఁగెల్లఁ జెప్ప విభుఁడు, వెలఁది తాదమచ్చ యేకాంతవేళఁ జూచి .... విక్ర. 3. 57.

ఆ. . పేయు వత్సరములు వెలఁదితో రమియించి దశా 3. 62.

2. ధావళ్యము, తళతళ కాంతి.

గీ. ఈ వెలఁది యెుదల్ పైఁడిలో వెలంది, యీ వెలంత లలాటంబు లే వెలంత, యీసుపాణి రదశ్రేణి యేసుపాణి, యీబిడారు మృగమద శ్రీబిడారు విజ వి. 1 130

వెలఁదిమిన్న వి స్త్రీరత్నము, శ్రేష్ఠురాలైన యాఁడుది

వ. వేఁడివేల్పు వెలంది మిన్న వేనలి నలవరింపుకొన్న సన్నజాజి విరుల సరుల విరులంగడలుకొని ... ఉ రా 4. 163.

వెలఁదుక వి (వెలఁది+ఉక స్వార్థమున.) స్త్రీ. ఆఁడుది.

క. ... సౌరభమాలా, కలిత మధుమత్త మధుకర, విలసనమున నొప్పు నవము వెలఁదుక పొల్పెన్ మార్కం 1. 24

సీ అనయమ్ముఁ జెఱయిమ్ములను ద్రిమ్మరుచునుండు చలి వెలుంగు నమంగుఁ దెలియ లెనయె .

గీ ఇవ్వెలందుక కనితవ యీడుచేడె లందఱును డెందముల నుబ్బి యాడుకొనఁగ నీలా 1 52.

వెలఁబెట్టు స క్రి. వెలయిచ్చికొను.

క కలిగిరిపో యిది మన గను, వెలఁబెట్టని భృత్యులనుచు వెలఁదియుఁ దాను , గలకల నవ్వుచు నాట్యము, సలిపిరి కరడమరుతాళసహితము గాఁగన్ ప్రబోధ. 3 58

(వెలఁబెట్టని భృత్యులు=వెట్టి నౌకరులు.)

వెలకుఁజూపు స క్రి (వెలకున్+చూపు.) అమ్మఁ జూపు, విక్రయింపనెంచు

సీ. వెలకుఁ జూపవు పొన్న విరియంతగొప్పమా యది యరంటులలోయ నద్యోఁజుమ్ము ... కవిరా 1. 81

వెలకెక్కించు స క్రి. (వెలకెక్కు) ప్రసిద్ధినొందించు.

క ఆ రాతుఁ దునుమాడక, పోరాడు పురంబున కును బోరాటమహా, ధారాట రథ మదద్విప, వీరాటన పాటవంబు వెలకెక్కించున్. మద. 5. 76.

**వెలకెక్కు** అ. క్రి (వెలకు+ఎక్కు) ప్రసిద్ధిచెందు
చూ వెలకెక్కించు

**వెలగఱవుసేయు** అమూల్యమగు
గీ వెలఁ గఱవుసేయు కౌశేయములు గలు
గఁగ, మానమైనట్టి మైనమై నూనవేల
సారంగ 2 188.

**వెలచాన** వి (వెల+చాన) రోవెలఁది, వేశ్య
గీ. అప్పుడంబుచఁ గామ సేవాభిధాన, యైన వెల
చాన మీఱు జయైక తాన శుక 210

**వెలచు** స. క్రి శుభ్రపఱుచు, తోము.
సీ. వెండి యొడ్డెవలపై వెలచి తెచ్చిన పైఁడి
పళ్లెంబు లాయత్త పఱచవారు నైష
6 108
(ఇది సానుస్వారమని చి ని, శ్రౌ, నిరను స్వార
మని శ. ర నిర్ధారక ప్రయోగము లభింపలేదు
కనుక నిరనుస్వారముగా గ్రహింపఁ బడినది)
సీ పుష్పాడికంటె బుష్పాడలోనఁ బోలిచి వెల
చిన చెంగల్వ విరులకంటె పి శకుం 4 146
సీ విరహుల మర్మముల్ విదళింపఁ గరసాన వెల
చిన మరునస్త్రగుళికయనఁగ శివలీలా
విలాసము 1

**వెలచెలువ** వి (వెల+చెలువ) వెలచాన, రోవెలంది,
వేశ్య
వ నిలింప పతి కొలువు వెలచెలువల బెలువంబులు
మెచ్చని మెచ్చు లాఁడులు. ఉ రా 5. 248

**వెలడు=వెడలు** అ. క్రి నిర్గమించు, పైకివచ్చు,
బయలుదేఱు
క వెలడు నడఁ దెలివితోన,గున్నలువలపల
నుడియు శిఖలఁ గొమరుగు భార శాం 3 14.
తరువోజ వెలడు విట్టూర్పుల వెస నుచ్చలించు
వెలువునఁ గలుగు నెవ్వఁగుచందోయి.
కు. సం. 5. 588

**వెలతలిరుఁబోఁడి** వి. (వెల+తలిరుఁ బోఁడి) వేశ్య,
రోవెలఁది
గీ సంభవించెఁ గాచాశచి సంగరంబు, చక్కఁగా
వేగ దిక్కుల జాట నేఁడు, దండహాతు లొద
వెను వెలతలిరుఁబోండ్ల, తల్లులకుఁ దూర్పు తెల
తెలల్ దాయునపుడు. శా వి 1. 77.

**వెలన=వెల్లన** వి తెల్లఁదనము చూ వెలనగు

**వెలనగు** అ క్రి (వెలన+అగు) వివర్ణమగు కాంతి
రహితమగు
సీ పాత్రావలోకనోపాయంబునకు నైన వెలనైన
దీపంబు వెలుఁగఁజేసె . కాశీ 4. 133

**వెలనాఁ(ల్నా)డు** వి దేశవిశేషము.
క వెలనాఁడు పేఁగివాఁడును, బలుగుల నాఁడా
కనాఁడు పొత్తపి నాఁడున్, గల మురికినాఁడు
రేనాఁ, డలయక గమఁగొంటి నచటి యబలలఁ
గంటిన్ హంస 1 53.

**వెలనేస్తకాఁడు** వి (వెల+నేస్తకాఁడు) విటుఁడు,
బోఁటుఁగు
గీ చాపపైనుండి యుచిత సల్లాపగరిమ, నుబుసుఁ
బోకల వొకకొంత యూరడించి, వెలలఁబన్నెడు
తనకూళ తలఁపు నేఁడు, గానతేఁడని వెలనేస్త
కానిఁ జూచి ప్రబంధ 726.

**వెలపడంతి** వి భోగముచాన.
గీ ముకుర పీఠావిధానంబు మొదలులేక, వెల
పడంతికిఁ గాదాదు విటునిఁ గవయ క్రీడా
1 186.

**వెలపెట్టు** అ క్రి. (వెల+పెట్టు)
వ . భీమనథనం దన వనమునకుం జంగ కాయ
లకు వెలపెట్టిన గన్ధ(హ)స్తిమాడలు ఇరువది
20 ... దశా. 1211 15.

**వెలపొలఁతి** వి (వెల+పొలఁతి,) రోవెలఁది, వేశ్య
ఆ మమత మూఢవిటులు భ్రమతురింతియ కాక
వెలపొలంతి కెందు వలపు గలదె. వైజ. 2.76.

**వెలపోయు** స క్రి వెలగానిచ్చు
గీ పడుచు పని చేసితివి రేఁగుబండ్లకొలకు, ముత్తి
యంబులు వెలపోయు ములుచగలఁడె జై
భా 5 58
చ. మసగాని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్
వెలవోసినట్లు దుఃర్వ్యసనముఁ జెంది కావ్యము
దురాత్ముల కిచ్చితి మోసపోతి . . దా. శ. 7.

**వెలమ**[1] వి ఐ శూద్ర జాతిలో నొక యవాంతర
శాఖ, ఆ శాఖకుఁ జెందినవారు
వ . అందు (శూద్ర వంశమునందు)ఁ బద్మ
నాయకులన వెలమలనఁ గమ్మలన సరిసర్లన
నొంటర్లన బహుప్రకార శాఖోపశాఖా భిన్నం
బులైన మార్గంబులన్ ... భీమ 1. 81.

(వీరు మహాశూరులు, మిగుల క్షాత్రవంతులు.)

గీ. వరలుకరు లోక రెండువేలరసిచూడ, రాజులును వెలమలుం గ్రమ్మ ప్రజలు ఘనులు, గలుగు రాయలతోఁ జేరి గెలువ మనకు, వశమె యైన ఖుదా యున్న వాఁ డటంచు కృష్ణ. 3 26.

శ. హారమౌళి హీర మచ్యుత, చరణాబ్జ మరంద ధార జాహ్నవి లోకేశ్వరి తమ సోదరి యానట, పురి వెలమల భాగ్యమహిమ పొగడఁగ వశమే. పాండు. 1 112.

(ఇట శూద్ర సామాన్యపరము)

**వెలమ[2]** వి. ధనము, వృత్తివిశేషము.

వ. ఇవ్వకవ్వుర మద్దిగద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిన మొదలుగఁ బెక్కు తెలుంగుల ప్రూఁకులు ... పి. శకుం 2 14.

**వెలమఁడు** వి. (వెలమ[1]+వాఁడు.) వెలమ తెగకు సంబంధించినవాఁడు.

ద్వి. పరమేశ్వరుఁడు తనజాపలోఁతరయ, వరు దెంచి వెలమఁడై యరి యప్పనంబు ... బస. పు. 4. 877. వం.

క ధనవంతుఁడైన శతహాలి, యను వెలమని మీఁద తేని యన్యాయపథం, బొవరించి .. దశకు. 3 148.

**వెలమనూళ్లు** వి. బ. తెలిక జాతిలో నొక భేదము ఈ జాతిలోని భేదాంతరములు.

వత్తిపాలు, వరియూళ్లు, కుముదాళ్లు, మట్టూళ్లు, పోవండ్లు, ప్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండ్లు, అడ్డనూళ్లు.

వేగిశా. శ. A. D. 1086. Ep. Ind 6.

**వెలమ్మనంది** వి శాకజంఘు, నేలవేములోని భేదము (వృ. వి.)

సీ వెలమనంది చివికి వెలమనఁగాఁ గాక జంగాభి ధానంబు చనును ... అం. భా. 2. 66.

**వెలమిటారి** వి (వెల+మిటారి) వేశ్య, పణ్య స్త్రీ.

గీ. విటుల తళ్పిబ్బులకుఁ గేరు వెలమిటారి, వగవు నేలివడాలు ... కలిగి చౌదంతి పొడమె నా జలనిధి యందు. దశా. 2. 228.

**వెలయబ్బురము** విశ (వెల+అబ్బురము) మిక్కిలి వెల గలది, అమూల్యము

సీ. వెలయబ్బురవుఁ గ్రొత్త విడి కెంపు రవగుబ్బ గలశాలి జిగివాటి గలని వెలయ ... ఇందు. 5 37.

**వెలయాట** వి (వెల+ఆట) 1 సురతక్రీడ, రతి.

గీ అఁగరాగఁబు దమ వెలయాటవంత, రంగ రాగంబు నొసఁగెడు నప్పురంబు, గట్టివాలు పడంతులు వంతుచేతి, గట్టివాలున కొప్పింతు రెట్టివాని కవిక. 1 1 22.

2 ద్యూతక్రీడ, జూదము.

గీ. ... పెద్ద వెలయాటఁ దెగ గెలిపించువారు. దశకు. 5 36.

**వెలయాలు** వి. స్త్రీ (వెల+ఆలు; బ. వెలయాండ్రు, వెలయాండ్రురు.) రోవెలఁది, వేశ్య.

క వెలఁదియు ధరణీ విభుఁడును, వెలయాలును దాసిఁగూడి విమలాకృతులై, వెలువడిరి యగ్గి గుండము, జలరుహషండమున నుండి చను దెంచు గతిన్ విక్ర. 6 133.

చ. .. బలారి కొలువ్వులోఁ, గల వెలయాండ్ర కెల్లను శిఖామణి వివేకదా...ఉ. రా 4. 213

క. ఇల . వెలయాండ్రుర కలువు మగల విడువు నతులన్ కు. సం. 8. 165.

ఉ ఆ మహాత్ముఁ డొక్క వెలయాలికి మిక్కిలి తాను గూర్చువాఁడై, మమతనెమ్మలంగుచు ... విప్ర. 4. 42.

ఱొడఁబడక క్రమ్మటి నేరా, స్వామికి వెగటుగ ననవఁట, యా మాటకె యాజ్ఞ వెట్టునఁట

సీ. భవ్యకలవిక పాదప పరిష్కృతాత్మీయ విపిన ఖేలనముల వెగటుఁబూని ... హరిశ్చ వల 2. 18

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది.

**వెలయించు** స. క్రి (√వెలయు.) 1 బయలు పఱచు, ప్రకటించు.

క. నా పురుషత్వము గైకొని, వేపోయి దశార్ణ పతికి వెలయించిన మీ, యాపదలు దొలఁగి చనఁబోడ, మూవుము పదినాళ్లయంత మావృత మొప్పన్. భార. ఉద్యో. 4. 387.

ఉ. అక్కట యుగ్రసేనుని మహాత్మునిఁ బల్కుట సంగరంబునం, దెక్కుడు పౌరుషంబు వెల యించుటయే పలుకందలంచితన్, గ్రుక్కక నన్నుఁ బల్కుము విరోధి నొకండన కాన నీకు నీ యుక్కివ మెన్ని చందముల నోర్వక పోవునె వేయు నేటికిన్ హరి ఉ. 30

క. జనని సతీత్వము వంశాం,బున విమలత్వమును దనదు భుజవీర్యము నా,తనయుం డిటు వెల యించునె, యని ప్రార్థనఁ బు కాఁగఁ బ్రాణమ్ము తుఁదై మార్కం 8 27

2. ప్రసిద్ధి కెక్కఁజేయు.

గీ. తన మహత్త్వంబు భూమిఁ బఁ దాను వారి,పేరు వెలయింపఁ జాలు గంభీరమహిమ... హరి పూ. 1 22.

3 ప్రకాశింపఁజేయు.

మ. మహి మున్నాగమశాసముఁడు సృజియింపం గుండలీంద్రుండు దన్నహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుఁడు ప్రోవన్ మహా,మహులై సోముఁడు భాస్కరుండు వెలయించన్ సొంపు వాటించు నీ, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ మునఁ దత్రాఎగల్భ్య మూహించెదన్ వసు. 1. 10.

క వెలయించు వట్ట యొకమణి, వెలుఁగారం గొమము ... ఆము. 4. 283

4. కావించు

ఉ. ఈ యిల ధర్మరక్ష వెలయింప జనించిన యట్టి యాది నారాయణ మూర్తి వీవు ... విక్ర. 2. 64.

5. వ్యాపింపఁ జేయు.

క. ఆజ్ఞ వెలయించె దిక్కుల ... విక్ర 4. 10.

6. కప్పు, ఆచ్ఛాదించు

సీ బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు మాహేశి రుద్రాక్షమాలఁగూర్చె, కౌమారి వెల యించె గజచర్మ చేలంబు వైష్ణవి తోలు దువ్వలువ మడిచె ... హ 4. 87.

7. పావనము చేయు, పవిత్రీకరించు.

క. కావున విను పాత్రము మే,లై విహితాచరణ సౌమ్యమగుదానముభా,శ్రీ వరదాత్రాదాతలఁ, దా వెలయించు భువన ద్వితయ రంజకతన్ భార శాం 1. 334

8 ఉల్లాసము నొందించు, సంతోషపఱచు

శా దంతా ఘట్టిత రాజతాచలచల ద్గారి వ్వయం గ్రాహమున్, కంతుద్వేషికిఁ గూర్చి శైల జకుఁ దద్గంగా ఝరాచాంతి స,త్వంతామోదము మున్నుగా నిడి కుమారాగ్రేసరుండై పిత్రు, స్వాంతంబుల్ వెలయింపఁ జాలు నిభ రాద్వక్త్రుం బ్రశంసించెదన్ వసు. 1 7.

సీ.. గీ తన సహజ లక్షణములలో నెనసియుండ, నా సరోలక్ష్మి గర్భచిహ్నములు దాల్చెఁ, బరిణయము లేక కన్య గర్భమున కిట్లు, గాక వెల యింపవచ్చునె లోకములను వర. 1 83.

వెలయింతి వి. (వెల+ఇంతి) వారకాంత, పణ్య స్త్రీ.

చ సతతము బ్రహ్మ కర్వ మర సంయమిముఖ్యుల నాత్మ సామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రాకృత జనునట్ల తాను దవగెన్న నొసంగెను బంటుకోనమై వైజ 4 5.

మ... మాశలం లాభ స్పృహన్, సువిలాసంబగు మే నొసంగు వెలయింతుల్ భోగ్యలే జ్ఞాన క,ల్ప వనీవల్లి కుఠారముల్ మరఖిమల్లా . భూ.2 58.

(ఇట్లే వెలయువిద, వెల ముద్దుగుఁడి మొ )

వెలయు అ. క్రి. (సం. విలస్ ) 1. ప్రసిద్ధికెక్కు.

క కడిఁది వగలు నేఁ డెవ్వఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు కౌరవనాథుం, డెడుఁ గాక యంచు నిత్తఱి, విడువ దగునె యతని వలన వెలసిన వాఁడన్. భార. ఉద్యో. 4 65.

తే. ఒకరఁ దండ్రిచే లక్ష్మిఁ గైకొను వతండు, తండ్రిచేఁ గీర్తులఁ గాని తనరు వతఁడు, తండ్రిచేతన వెలయు వతఁడు మదీయ, కులము నందును లేకుండ వలయుఁ దండ్రి... మార్కం. 8 220

2 ప్రకాశించు.

(లక్ష్మివాక్యము) క.. మ,తుష్టి కర చరితులగుటఁ ద్రివిష్టప నదులకడ నిలిచి వెలసెద వనిరొయెన్... భార శాం. 5 13.

సీ.. గీ. వెలయు నెవ్వాని యభిరామ విమలకీర్తి .. నైష. 1. 87.

౮ కలుగు, పుట్టు.
క. నలు గుణములు దమయంతికి, నలునకు దమయంతి గుణగణ ములు జను లిమ్ముగ్గురఁ బొగడుట విరువురకును, వెలసె మనోభవ వికార విభ్రమ మెదలన్ భా౦ అర. 2. 10.
సీ. క్రొక్కారు మెఱుఁగులుఁ జుక్కల మెఱుఁగును గలసి యిమ్ముగ్గురగ యి వెలసె నొక్కొ భా రా అర. 2 25.
ఆ ఇట్టి తలపు లుడుగి యింటికిఁ జనిసుఖం, బుండుమని పురోహితుండు వలుక, విని మనంబులోన వెలసిన వైరాగ్య, మగ్గలింపఁ బల్కితతని తోడ. జాహ్నవీ. 4. 58
4 వ్యాపించు
తే అతివ విను రంభకును గల యట్టి భయము, నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ, గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున. వెలయఁగల దది వెలయు శ్రోవలను గలుగు కళా 1.89.
5. బయలుపడు
తే వెలసి భాషింప నిప్పుడు వెరవు గాదు, తపముఁడుదయించి క్రుంకునంతాఁక సైచి, రాత్రి వచ్చిన కార్యంబు రాము నతికి, విన్నవించెదఁ గాక నే వెరవు తోడ భా రా సుం 164.
6. ఆవిర్భవించు, అవతరించు.
క. . వెట్టుకొనవలసి నిలిచిన, ఘట్టంబిఁ గొల్వఁ గలుగఁ గామితఫలముల్. భీమ 1 101
7. ఒప్పు.
తే . .పుడమి లోపల మిథిల నాఁ బ్రోలు వెలయు. నీలా 1 26
ము. తతయు క్తిన్ ఘన శబ్దముల్ వెలయ...దశా 1. 4.
8 ఉండు.
చ కలదు గదా మధారసము కంజదళాతులముద్దు పల్కులన్, వెలయుఁగదా హాలాహలము నీరల చిత్తమునందు .. భర్తృ. 2. 60.
సీ. ....గీ... వలువరాని మహాత్మలో వెలయు గాక, మమ. 1. 5.
క వినుపది నీ కొరు లెఱిఁగించిన మద్వృత్తాంత మేన చెప్పుటకు మనం, బనుమాన మెసయునైనను, విను చెప్పెద నేన తక్క వెలయ రిట నొరుల్ పి శకుం 1 186.
౯ సఫలమగు
గీ అత్తలోఁ బరిణఘునూను నంతికమున, కమనమ విలాసగరిమతో నరుగునపుడు, నల నువంద మహోవ౦ద మఱరబల్కె, నిలువు మెలనాగ నీ కోర్కె వెలసె ననుచు ఇందు 5 164
10 పవిత్రమగు, పావనమగు
గీ ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదుగాన, వలసె నివృత్తి కులమెల్ల వెలసె నీకతమున సుర ముని పితృ తర్పణములు సేయు, మరిగి జాహ్నవా పుణ్యతోయముల వనఘ. భార శాం. 1. 163
క. ఎల్ల జగంబులు నేలిన, హల్లక హితజాటుఁడల్లుఁ డయ్యెడు నట నా, యిల్లు వెలసె లోకంబులఁ, దల్లి రుద్రాణి యెట్టి ధన్యఁడ నొక్కొ. వరాహ. 6 82
11 అతిశయించు
క తొలు ప్రాయపు మగ కొదమల, తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొనన్, జఱ జాతి జవ్వనము గదు, వెలసెఁ బ్రతిదినము వింత వింతగ నంతన్. కళా. 1. 28 (135.)
వి॰ 1 అతిశయించు.
సీ. గీ. . వెలయు వేడుక వాహ్యాళి వెడలి వచ్చు. నమర నాయకుఁ గాంచి సంయమి వరుండు. దశా 2 19
2 ప్రసన్నమగు, నిర్మలమగు
క కురిసె సుర పుష్పవర్షము, హరిపై నప్సరస లాడి రాతోద్యంబుల్, మొరసెనుభన్సర్వంబై, తిరసెన్ బవనంబు దెసలు వెలసెన్ గలయన్. హరి. పూ 6 98.

వెలయెక్కు అ క్రి (వెల+ఎక్కు) విలువకెక్కు అధిక మూల్యమగు.
క నేరుపరి పోషించిన, హారము వెలయెక్కు శీల నతిశయముగ .. ప్రబోధ చం. 1. 27

వెలయెసఁగు అ క్రి (వెల+ఎసఁగు) విలువకెక్కు, అధిక మూల్యమగు.

గీ. విజయలక్ష్మి సమేతుఁడై వెల్లగొడుగు, నెక్కి అమర విభుఁడు... దశా 2 443

**వెల్లచేఱపు** వి (వెల్ల+చఱపు) సన్నపుఁ బూఁత. (శ ర.)

**వెల్లజిగిపుల్గు** వి (వెల్ల + జిగి + పుల్గు) హంస, శ్వేతగరుత్తు.

మ అని ప్రార్థించు దివాటకోటిఁ గని యాహా యెంత కార్యంబు వచ్చె నిలింపాగ్రణి కంచు ధాత కరుణాస్ఫీతాత్ముఁడై లేచి కొల్వున నున్నందఱుఁ గొల్వ వెల్లజిగిపుల్గుం దేజిపై నెక్కి గ్రక్కున లంకాపురి కేఁగెఁ జారణ ముఖుల్ గైవారముల్ సేయఁగన్ ఉ. రా. 5. 12.

**వెల్లయేనుఁగు** వి (వెల్ల+ఏనుగు వ్యత్తినివర్ణాగమము) ఐరావతము, తెల్లనియేనుఁగు.

గీ వెల్లయేనుగు నెక్కి రీవెల్ల మెఱయు...వచ్చె నమరనాయకుఁగాంచి. దశా 2 18

**వెల్లదీవి** వి (వెల్ల+దీవి) శ్వేతద్వీపము.

గీ వెల్లదీవియుఁ బోని యవ్వీడు సొచ్చి ఆము 6 64.

**వెల్లన** వి తెలుపు, ధావళ్యము, వెలవెలఁ బాటు, వివర్ణత.

చూ వెల్లనగు

**వెల్లనగు** అ. క్రి (వెల్లన+అగు) తెల్లనగు, తెల్లపడు, వెలవెలఁ బోవు

సీ ..వేలుపురాయని తేజి వెల్లనయ్యె. ఉ రా 1. 68

క తల్లడపడి యరదముడిగి, విల్లును నమ్ములును విడిచి వెల్లనగుచు మేనెల్లఁ జెమరుపఁగ నూరుపులు, పెల్లుగ నమ్మనుజపతుపు పెలుచం బలికెన్. భార ఆర 6 244.

గీ. వెల్లనై యున్న నత్తెఱంగెల్ల నెఱిఁగి, రాచ చిన్నెలు సడలించి రఘువు కొలపు, సామి వలి నార చీరలు జడలుదాల్చి, తపసి రూపూని యచటికిఁ దరలివచ్చె అచ్చ. రా అయో 58

(దీని ఆమ్రేడిత రూపము వెల్లవెల్లన)

వ .. వాహినులు చిక్కువడి చిందఱవందరై మత చెడి నులామడియై యేపుదెగి యవురు సవురై యనువు దప్పియదవదయై యంతంత విచ్చి యరవరలై పాఱలేక పలపలనై వెఱఁగుపడి వెల్లవెల్లనై చిదుముడిపడి చెల్లాచెదరై పొడవడంగి ప్రోవున నొక్కండై పోవిడిచి ..ఉ హరి. 1. 148.

**వెల్లమొదవు** వి (వెల్ల+మొదవు) తెల్లనియావు, కామధేనువు

ఉ ..టి రోదధిఁ బోలు వెల్లమొద వొక్కటి గన్పడఁజూచి మొక్కుచున్ ఉ రా 3 388.

**వెల్లయెలుక** వి. (వెల్ల+ఎలుక) తెల్లయెలుక

గీ ఉడుము గరిమిడి కొక్కుదందడియు వెల్లయెలుక కల్లెక్క తఱచును నేమి చెప్ప ... మనుచ 4 25

**వెల్లవారువము** వి (వెల్ల+వారువము) ఉచ్చైశ్శ్రవము, వెలిమావు.

గీ ..పొడమె, వెల్లవారువ మా పాలవెల్లియందు. దశా 2. 226

**వెల్లవాఱు** అ. క్రి (వెల్ల+పాఱు) వెల్లనగు, వెలవెలఁబోవు

క తెచ్చపడి వెల్లవాఱుచు, ముచ్చ ముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా, వచ్చిన ధైర్యం బూఁతగ, తచ్చేడియ నిల్చుటప్పు డద్భుతమయ్యెన్ కేయూర. 4. 188.

**వెల్లవేయు** అ క్రి (వెల్ల+వేయు) (గోడలకు) సున్నము పూయు.

(వ్యవ) వారి క్రొత్తయింటికి వెల్ల వేసినారు.

**వెల్లవోవు** అ క్రి. (వెల్ల+పోవు) తెల్లపడు

ద్వి వెల్లవోవని పండు వెదురులు చూచి ద్వి. పరమ 2. 66 పొ

**వెల్లాటకత్తి(త్తె)య** వి (వెల్లాటకము + కత్తియ.)

1 వేశ్య.

గీ మునుపు నేదని కొసఁగిన కనకపాత్ర, తెచ్చితివి దేవదేవికిఁ దిరుగనిమ్ము, ఎందు వెల్లాటకత్తియ కిచ్చినట్టి, సొమ్ము మగుడంగఁ గొనుటయే సుగుడితనము. విప్ర. 5 78.

2 జార స్త్రీ

గీ. నీ జనని పుణ్యజన వర్ణనీయ సాధ్వి, నీ జనకుఁ డెన్న నభిమాన నియత ధనుఁడు, నీ వగరు పోతుటేఁగకు నిలువరాని, దయ్యు వెల్లాటకత్తెవై పోటయకిది శుక 1. 316

**వెల్లాటకము** వి. (వెం+ఆటకము) ప్రసిద్ధి

గీ. సంభవించిరి గంధర్వజాతి ననినఁ, గలితనం బెల వెల్లాటకంబు పేయ...భీమ 1. 88.

(శ. ర. పా 'పెన్నాటకము' ముద్రి పా.)

**వెల్లాపుఁగత్తె** వి. స్వైరిణి

శాఁ...ఘనాళుల్ మింట వర్తిల్లఁగా, దూషించున్ తెలఁగున్ దళుక్కునఁ దటిత్తుల్ దోఁచినట్లెల్ల వెల్లాపున్ గత్తె చరింపుచున్ సురభి మల్లా. మల్లభూ 2 84.

**వెల్లి**[1]**=వెల్లిక** వి (త వెళ్లం.) 1. ప్రవాహము

క. అవి యూరడిల్లఁ బలికిన, విని యాతఁడు సంత సంబు వెల్లిం దేలెన్...భార. శాం. 1 282.

సీ కల్పాంతవేళ నేకటకంబు మునుఁగదు నింగితో రాయు మున్నీటి వెల్లి .. కాశీ 3. 103.

క. అల్లారు తెల్లమై గలు, గల్లున నదియలు మొరయఁగా వేడుక పెన్, వెల్ల మునిఁగించె ధరణీ, వల్లభనందనుఁడు చూచువారల చూడ్కుల్ రాజన. 2 5.

2 పరంపర.

క. కవిసినఁ గడంగి యేనుము, గవియించితి పంప వెల్లిఁ గడుఁ గ్రూరత ... భార. ఉద్యో. 4. 342.

ఆ కడలి యాకసంబు పుడమియుఁ దలుచుగ, నంప వెల్లి పొడువఁ బొంపు మీఱ, యంధకుండు గొండ యల్లుఁడుఁ దాఁకొని, యడరుపట్లు ప్రేటులాడు నెడల. అచ్చ. రా. యు. 348

వెల్లిఁ గలిపిన చింతపండు=ప్రవాహములోఁ గలిపిన చింతపండు; నిష్ఫలము.

గీ. మాటిమాటికిఁ జేసిన మందులెల్లఁ, జెల్లెఁబో వెల్లిఁ గలిపిన చింతపండు, నీట వ్రాసిన వ్రాలునై నెరయ వఱదఁ, బోవు గాకేమి నెత్తురు పుట్టనేల. కాశ ?. 111.

**వెల్లి**[2] వి (క బెళ్ళి త వెళ్లై.) తెలుపు, శుక్ల వర్ణము.

విశే తెల్లనిది, ధవళము, శుక్లము.

చూ వెల్లిమెకము

**వెల్లిఁజల్లు** స క్రి. (వెల్లిన్[1] + చల్లు) చెఱుచు, పాడుచేయు.

వ. తల్లిమాట యించుకంతయు విననొల్లక ప్రల్లదులై యెల్లధనంబు వెల్లిఁజల్లి బంధుజనంబులు నిందింప నాతతాయులై చిత్తవిభ్రాంతిం దిరుగుచు. జాహ్నవి. 3. 12.

**వెల్లిఁబోవు** అ క్రి (వెల్లిన్ + పోవు) వ్యర్థమగు, నిష్ఫలమగు.

సీ. పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర భూరి సంపద వెల్లిఁ బోయెనన్న...ఉ హరి. 4 300.

సీ. మానక గుపిఎంచు మదన కోదండంబు నిష్ఠురతను దన్ను నేలఁ గలయ, నెప్పుడు జంకించు హృజ్జాత శింజిని గారవంబునఁ దన్ను గాలిఁబోవ, నూరక విరఁబడు మారనారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁగలయ, పనిలేని పని మిట్టిపడు మనోజపతాక, ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁబోవ. వరాహ. 4 - 21.

(ప్రవాహమునఁ బడిపోవునని యర్థాంతరము)

**వెల్లిక=వెల్లి**[1] వి ప్రవాహము.

శా ఆ జాబిల్లి వెలుఁగు వెల్లికల డాయన్ లేక రాకానిశా, రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రం బొత్తి యొత్తి యా, రాజీవానన యేడ్చె ...వసు 4 52.

**వెల్లికిలు** అ క్రి. వీఁపుగ్రిందగు.

మ. తరుణీరత్న మొకర్తు వెల్లికిల నీఁదన్ గుచ్చి చన్ బిందియల్, గరమొప్పెన్ .. ఘటికా. 2 121.

**వెల్లిగొను** అ. క్రి (వెల్లి[1]+కొను) 1 ప్రవహించు

ఉ. ఆ లలితస్మితాస్య అలితామల కోమల చంచలాలి సాలోల విశాల సంస్ఫురిత లోచన దృష్టి రస ప్రవాహమం, దోలిన పర్వి వెల్లిగొని యొక్కటఁ గ్రక్కున ముంచి ... కు సం. 5. 518.

మ ...వైరివీరుర ముగ్రోద్ధతిఁ జీరి నెత్తురులు సర్వోర్వి నభోవిక్రటీ, పరిణాహంబుల నెల్ల వెల్లిగొనఁ బైపైఁ జల్లి ప్రేవుం బొదుల్ గర మాటోపముతో నతండు హరి నాకర్షించె హర్షించుచున్. హరి. పూ 4. 87.

శా. ఆమోదాంబ్రు భరంబు వెల్లిగొన ... నైష. 5 137

2. వ్యాపించు, పచరించు.

గీ. శిరసు మకుటంబు సాఁగ జిత్తరుపు గొలుస, గల్లముఁగ గుండలద్యుతి వెల్లిగొనఁగఁ, గలికి తెలిసోగకన్నులఁ గరుణ చిలుక, జనవరుని బ్రేమం గౌరి సాక్షాత్కరించె. కవిక 6 180

3. పరంపరగా వెడలు.

ఉ. ఆఁగను బ్రేమ త బ్రమోఁగుమను తెక్కలు పాములువోలె గాడెచే, సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబులు నూతునొంచి ..పారి 5. 16

ఉ. వెల్లగు నమ్మహోరవము పేర్చి సరోజభవాండ భాండముల్, చిల్లుబడోఁ బ్రచండ గతి సేన ధరాస్థలి యూరెనో యన, న్వెల్లిగొనంగ నేర్పడిచి నిర్భయతన్ నడిపించె .. తాళ చ. 2. 71

4. మునుఁగు, మగ్నమగు.

సీ. పుష్కలావర్త కాంభోధరంబుల వృష్టి విశ్వ ప్రపంచంబు వెల్లిగొనగ .శివరాత్రి 1 51.

5. అతిశయించు

క. తల్లియుఁ దండ్రియు బ్రమదము, వెల్లిగొనఁగఁ గౌఁగిలించి వేడ్కవన లీ, నుల్లమునర .. పాం పూ 7. 68

**వెల్లిగొలు(ల్పు)ఫు.** స. క్రి (వెల్లిగొను)

1. ప్రవహింపఁజేయు.

గీ ఇట్లు శత్రుంతపునిఁ బ్రదుంచి యిన్విధమున, నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁదలఁచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె...భార విరా 5 78

ఉ. పూచిన యొక్క పోఁక నును బోదియఁజేరి విలోకనప్రభా, వీచికలం దదీయ పదవీ కల శాంబుధి వెల్లిగొల్పుచున్.. వసుచ 2 28.

2. పరంపరగా వెడలించు.

సీ. సాత్యకి యత్యుగ్ర శరముల విందానువిందుల వెసఁ బరి విశతతనుఁ, జేయంగ వతనిపై నా యవంతీశులు వివిధాస్త్ర జాలంబు వెల్లిగొలిపి, విలుద్రెవ్వ రథహయంబులు నొవ్వ సారథి దలరఁ బ్రస్ఫుటశక్తి కలవఁజూప ... హరి ఉ. 2 51.

శా.. .పౌలస్త్యుఁడున్, భల్లఁటుల్ వడి వెల్లిగొల్పి సమర ప్రారంభవేల్ల ద్ధను, ర్వల్లీ జ్యాఘన నాదమేదుర నభో రంధ్రంబుగా .. భా. రా. యు 1480.

3. వ్యాపింపఁజేయు

సీ. కొమరు వెన్నెల వెల్లిగొలుపు కట్టాణి పో, క్తి కముల గంరమాలికలు వైచి ... వరాహ. 8 111.

వ మరాళంబులు .. రోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయు తను యమలంపుఁ దెలిదళుకుఁ జిలికి యది ముంయజంపుఁ గలయంపి చెలువ నలవరింప వందుఁ గుందవంపు రంగవల్లి కామతల్లికల యుల్లాసంబు వెల్లిగొలుపు గురుదంత కాంతి వల్లరులచేత నతిశయిల్లుచు. . ప్రభా 2. 105

● క్రి ఆనందము సేయు.

గీ. ఉల్లమునకును జాడ్యకి వెల్లిగొలుపు, నా వరదు మోమునందు మనంబుఁ జేర్తు, ననుచు గీత రూపములుగా నాకు కవిత, నుతుల రచి యి చి పాడుచు నతఁడు గొలిచె కళా 2 144.

**వెల్లితల** వి (వెల్లి¹+తల) ప్రవాహ పురోభాగము, ప్రవాహమునకు ముందటి భాగము

గీ గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చౌటి పొర గాక చిట్టూట చోటు గాక, వెల్లితలగాక క్రిఁ జెదల్ వేరుపురుపు, రాఁపిపోటును లేని చాలాటి నేల. విప్ర 2. 18

**వెల్లిదొట్టు** అ క్రి (వెల్లి¹+తొట్టు) అతిశయించు.

ఉ ఎవ్వరమౌట మమ్మెఱుఁగ నీదు యథాకథిత స్వరూపమై, యెవ్వఁడ నౌట విన్నెఱుఁగ నీదను భావ్యతఁ దోచియైనఁ దా, నెవ్వరిదౌటఁ దన్నెఱుఁగ నీదు ధ్రువ బ వెల్లిదొట్టు నీ, ద్రెవ్వని మాయలో మునిఁగి తేలెదు మీలము గా మె యీశ్వరా కవిక 6. 182

**వెల్లిపొడుచు** అ క్రి (వెల్లి+పొడుచు) 1. ప్రవహించు

సీ గంగ యాతని మహాగారంబుపై వెల్లిపొడి చినవల్లి యద్భుత తపస్వి,యగు నమ్మహాత్ముఁ దయ్యమర తరంగిణిఁ గమఁగొని . హరి. పూ 8. 90.

(మువర్ణముఖరి) వ ఖిల్ల వల్లభుల వల్లియులపై వెల్లివొడిచినం దల్లడపడ కాశీ 1 142
2. ఉప్పొంగు.
వ. పొంగి చింతాసాగరంబు వేగిర-బ వెల్లివొడిచె ననన్ మనుచ 3 9.

వెల్లిమెకము వి (వెల్లి + మెకము) సింహము.
ఉ వచ్చి యిదేమి చెవ్వ కిటు వచ్చితి వప్పుడు కాలు పోతుతోc, బొచ్చెపు బొల్లివెల్లి మెక ముల్ దమ బెబ్బులిc గూడి గూడెముల్, సొచ్చితినంగ తెంచులోక చొప్పున నూర్గురు వోయిరన్న వాc, డచ్చెరుపాటు సిగ్గు నొలయన్ విమచుం దల వ్రేల వై చినన్. కళ 4. 59.

వెల్లిపడు అ క్రి (వెల్లి¹ + పడు) ప్రవాహమగు
శా .. కన్నీరు ము,న్నీరై వెల్లివడంగc గాలి తునతో నించాపుచున్ గూరిమిన్. వేం. పంచ. 1 256.

వెల్లిపాఱు అ క్రి. (వెల్లి + పాఱు) ఎడతెగక ప్రవహించు, అతిశయించు.
గీ పాడి దప్పిరి నృపతులు బలసెc గొంటె, మడcగె చాలిమి మాత్సర్య మతిశయిల్లెc, జెల్లె దయ పాతకంబులు వెల్లిపాఱె, గ్రమ్మె దుర్వ్య సనంబులు దిమ్ముదేcగె వరాహ 7 31
క. నముదాత్త మీననంచా,రమునc దొలంకుచును ముఖ నరస్సున లావ,ణ్యము వెల్లిపాఱc గ్రేవల, నమరించిన పిల్లకాలcకులంగన పీనుల్ కళా. 7. 128.

వెల్లివిరి విశ (√వెల్లి¹) వెల్లడియైనది, ప్రకటితము.
క అలతెల బిందువయి నా, మెలకువ వెల్లివిరి యైన మేలగునే ని,ర్మల చరితc దజున కాణుం, దలుగcజె ప్రాణముల కింత యప రాధమునన్ ఉ హరి 5 198. (విశేష.పా )
గీ. వెల్లి విరిగాcగ భూజను తెల్ల నెఱుcగ ... దశకు 6 82.
క ముల్లోకంబుల జనములు, రొల్లన్ రొకండ్లc బాద రోయక మతియున్, వెల్లివిరి గాcగc దిరిగిన, గల్లరు నయగారి మెలcకుకం గొని పోయెన్. వరాహ. 7 22.

వెల్లివిరియు అ క్రి (వెల్లి¹ + విరియు) 1. ప్రవహించు
క. ... మదీయ మూర్ధము, వెంటంగా నభ్రగంగ వెల్లివిరియుటన్ హర 4. 57.
గీ పిడుగువడ్డ తెఱంగునc బుడమిc ద్రెళ్ళి, సొమ్మ గొని కొంతవడికి లోనుమ్మలికల, వెచ్చ నూర్చుచుc దెప్పిరి వెల్లివిరియ, వేcడి కన్నీరు గొనగోళ్లc దోcడుకొనుచు అచ్చ. రా. యు. 360.
2. ఉప్పొంగు.
గీ. పెరిcగి పాండవాంబుధి వెల్లి విరిసినపుడు, విలువ విమ్మగు దీవిగా నిన్నుc దలcచి...భార. భీష్మ 1 59. (ప్రవహించు అని శ. ర )
వ ... ఆనంద ప్రవాహంబుల్లంబున వెల్లివిరిసిన కతంబున . . కాశీ 1 100.
3. వ్యాపించు
సీ చనుకట్టు విపcc జుట్టును ఘన స్తనకాంతి జల్లించి యురముపై వెల్లివిరియ ... వై జ. 1 181.
చ ... అచ్చెరువుగc బోయి వెల్లివిరిసెం గపి వాహిని లంకచుట్టునున్. భా రా యు 495
వ జగదండ కర్పరంబునc గుంటువడి మగుడు వేగం బడరc బుడమికి డిగి నలుగడల వెల్లివిరిసి పెల్లగుచుం జాలుకొని యిద్దరులు వేరుపడునుద్ద విడి నేలబడి వెడలి ... చం. రా 8 25.
4. వెల్లడియగు, ప్రకటితమగు
ఆ. నీ కడింది లావు నే నెఱుంగనె వాలి, కోcకc జుట్టి కడలిc ద్రోయుటయును, జెఱను బెట్టి వేయి చేతుల యొకిమీcడు, విడుచుటయును జగము వెల్లివిరిసె అచ్చ రా. యు 500.
5. వృద్ధిపొందు, అతిశయించు
వ. ఇట్టి మాయాపులున్న చోట సత్యంబు మూలc బడి కల్ల వెల్లివిరియుc బింగళకుండును మదో త్కటంబు పడుపునcగు మంత్రి మంత్రతయంత్రం బుకం దగులు వాcడుగాcడె. వేం.పంచ.1 590
6. చెదరిపోవు

వ . . జీవనంబులు విడిచి విమల జ్ఞానవశంబున ముక్తులగు పురుష రత్నంబుల చెన్నున నన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లి విరిసి చను మేఘంబులును . భాగ. 10. పూ 764

**వెల్లివిరిసేయు** స క్రి (వెల్లివిరి+చేయు.) ప్రకటించు.

క వనితల పురుషుల యెడఁ బుట్టిన యది వెల్లివిరిసేఁత డిమ్మరి తన మెట్టి నికృష్టుండైనను .. భార. శాం 6 208.

వ. కంఠగత ప్రాణంబు లగుజంతువులకుం గాలకంఠుండు గరుణా వశంవదుండై కర్ణోపకంఠంబుఁ జేరి యుపదేశించు తారక బ్రహ్మ మంత్రరాజంబు మాతవంబున విని యెలుంగుటం జేసి మధు మదోల్లాసంబున నది వెల్లివిరిసేయుచున్న వియోయావ విందిందిరంబులు మంద్ర స్వరంబున ఝంకారంబు సేయు. కాశీ 2 44

గీ ప్రౌఢ గోపాంగనలు తమ ప్రాఁతవలపు, వెల్లివిరిఁజేసి రింది రావల్లభునకు ..జై.భా 3 76.

**వెల్లివీఁగు** అ క్రి (వెల్లి[1]+వీఁగు.) అతిశయించు, మిక్కుటమగు.

ఉ. ఆ సమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖంబులై, భాసిలు తూపులన్ హృదయ పద్మము లక్ష్యము సేసి యేసినన్, గాపిలి కాకుండు తమకంబునఁ దన్ గనుసన్నచేసి యు, ల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువన్నియమించి గ్రక్కునన్. కృ శకుం. 2 124.

**వెల్లిసూపు** అ క్రి (వెల్లి[1]+చూపు.) ప్రవహించు.

క. హరిగిరి జల మనమున నత్యురురాగ రసంబు నిండి యుత్కటమై తత్పరి మీఁద వెల్లిసూపిన, పరుసునఁ గాశ్మీర వారి పొరులఁ గప్పెన్. కు సం. 9. 255

**వెల్లుల్లి** వి (వెల్ల+ఉల్లి.) తెల్ల ఉల్లిగడ్డ, లశునము.

సీ వగిలి బీటలువారి తగఁజెక్కితెఁ గుబుసంబుతో రంపు వెల్లుల్లి తునుకలట్ల...భీమ 4. 130.

సీ ఉటజాంగణమునఁ గాపునిచిరి తవుటతో వెల్లుల్లి పొగయిచ్చి వీతిహోత్రు పి. శకుం 4. 62.

**వెల్లువ** వి. 1. ప్రవాహము.

క...అతఁ డతని యరదము, మునుఁగంగాఁ జేసె బాణముల వెల్లువలన్.

క ఆ వెల్లువ శరజిహ్వలఁ, ద్రావి ధనంజయ మహాగ్ని దరికొని కవియం,గా వెగడొందెడు కురుబల, దావము శాంతవపుఁ డంబుదము క్రియఁగాచెన్ భార భీష్మ 2 44 45.

సీ అమృతంబు వెల్లువయని నిలింపాదులు మును గొని దోసిళ్ళ ముంచి క్రోల ... ఇట్టలంబుగ వెన్నెల నిట్ల నొడిచె విక్ర 6. 69.

చ. ఉడుగక తేరు చన్న దెస నూనిక చూడ్కులఁ గన్గెలంకులన్, విడువక పాలు నక్షువుల వెల్లువ లూఅట లేని యూర్పులున్...గలిగి కుందెడు బానసిఁగాంచి కూరిమిన్. ఉ. రా. 6 309

2. వాహిని, సేన.

చ అలఘుమతిన్ మహా వనచరావళి దెబ్బది రెండు వెల్లువల్, గొలువఁగ నేగి వారిధిఁ గొండల చేతను గట్టి లంకపై, బలువిడిసేనతో విడిసి బాహుపరాక్రములైన దైత్యులంగల హములోఁ గులక్షయముగా నొనరించె మహామహుఁడై. వి. పు 5. 325

ఉ. కొమ్మ మెకంపు వెల్లువలు గొల్వఁగ వేగిరమేఁగుదెంచి సంద్రమ్ము కడన్ దగన్విడిసి రావణు తమ్ముఁడు కేగవచ్చినన్, రమ్మని ... యయా. 3. 28

3 పరంపర

క. బడలు వడి యసురబలములు, పొడవడఁగెన్విభుని బాణముల వెల్లువలన్...కవిక 2. 207

సీ చెక్కుటద్దములందు జిగి వెల్లువలు చిందు రమణీయమణి కుండలములతోడ...మనుచ. 3 71.

4. బృందము, మంద

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువలన్నియును లేచి విచ్చలవిడితో, జెల్లా చెదరై పాఱెను, బెల్లుగనంబే యటంచు బెబ్బులి గాలిన్. భాగ. 9. 36.

5. ఇటిక గోడల యింటిచూరు. (శ ర, వా.)

**వెల్లువగట్టు = వెల్లువపెట్టు** అ. క్రి. (వెల్లువ+కట్టు)

1. ధారారూపముగా స్రవించు.

సీ. కలయ వెల్లువగట్టి జలజల ప్రవహించు శశి కాంతకాంత నిర్ఝరము జలకు ... మనుచ 5. 88.

సీ ... చెక్కులన్, వెల్లువ గట్ట నశ్రువులు వెల్వెలఁ బోవ మొగంబు .... దశా. 5. 128.

2. మడుఁగు కట్టు

సీ. నీళ్ళు వెల్లువగట్ట నికటాగ్రహార ధరాసురుల్ నారికేళములు గొట్ట ... శుక. 3 438.

చ వికచ సరోజ మధ్యమున వెల్లువగట్టు మరంద బృందముల్, ప్రకట వినోదకేళి నొక పంకజ గంధి విదిల్చి ... భాను. 2 60

వెల్లువపెట్టు = వెల్లువకట్టు అ. క్రి. ధారారూపముగా ప్రవించు

చ కనఁ గలిగె న్విలాసములు కమ్మని చక్కెర లొల్కు పల్కులున్, వినఁగలిగెన్ సుధారసము వెల్లువపెట్టెడు మోవియాన నిం,పున నునుతెక్కు టద్దములు ముద్దుగొనన్ .. దశా. 2 308

వెల్లెకి వి వృక్షవిశేషము, ఒకానొక చెట్టు

వెల్లెడ్లు వి బ. (వెల్ల + ఎడ్లు) తెల్లని యాడుపశువులు. (మేకలు, గొఱ్ఱెలు, మొ ఈ యర్థము ప్రాచీన శాసనములందే కానవచ్చుచున్నది చూ. ఎడ్డు)

చేబ్రోలు. శా...5 ... వెలనాంటి గొంకయ శ్రీ మూలస్థాన మహాదేవరకు మాఘమాసమున పున్నమయు సుక్రవారమున సోమగ్రహణ నిమిత్తమున నఖణ్డవర్తిన్ దివియ యొక్కొంటికిం బెట్టిన వెల్లెడ యెంభదియు ఇనిమిత్తమునన వీం శ్రీ కుమారస్వామి దేవరకు నఖణ్డవర్తిన్ దివియలు రెంటికిం బెట్టిన వెల్లెడ్లు నూఱును వీరం జేకొని ... ద శా 9 109.

1 స్వస్తిశ్రీ శకవర్షంబులు 1078 ణ్డగు నేంటి ఉత్తరాయణ సంక్రాన్తి నాండు కొంప్పి చెఱువుల ప్రోలినాయకు కొడుకు మల్లినాయకు ముదిపెలిచేతన్న 2 బోయుణ్డు తమతల్లి దండ్రులకు ధర్మువుగా కొట్యదొన త్రిభువన మల్ల శ్రీ కేశవదేవరకు అఖణ్డ దీవమునకు బెట్టిన వెల్లెడ్లు పంభ్భయేను పెద్దనన్నె బోయిని కొడుకు పిన్నన్నన్నె వీనింజేకొని ... ద. శా. 6, కాణిదెవ. 686-(2.)

వెల్వ వి. సంఖ్యావిశేషము? ఒకానొక లెక్క?

చ. మలయ నగంబు ను డి పలుమాఱును రాముని౯ జేరుకొంచు వెల్వలు దశసంఖ్య దన్నుఁ గోలు వంగ రణోచిత ఘోరవాక్యముల్, నలువుమ పార్శ్వటంబుల దిశావలయంబులు దల్లడిల్లఁగాఁ, జెలఁగుచు వచ్చెనప్పుడు సుషేణుఁడు భాను సుతుండు మెచ్చఁగన్. సీతావి. 2 32.

వెల్వడము = వెలువడము వి సస్యవిశేషము

సీ బడఁతి నివ్వంటి వెల్వడము కోర్కి ఫలించెనన రాజభోగమే యతిశయిల్లు . రసిక 1 48

వెల్వడు = వెలువడు అ క్రి. 1 (క) నిర్గమించు, బయలువడు, బయటపడు

సీ... అతిక్రమింప, కుఁదగఁ బోక యెల్లొడఁ గూడు నిన్నాగభవన మెప్పాట వెల్వడఁగఁ బోలు. భార ఆది 1 114

సీ వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞ కోలాహలం బాలకించి .. వరాహ 7 38

చ ఉవిద తదుక్తికంత చెవి యొగ్గక పోఁ బెనఁగ న్విభుండు కేల్దవిలిచి చుట్టు ని చుకయెడన్ భుజముల్ వలగొల్పి పొమ్మనన్, సువదన వెల్వడం దిరుగ శ్రోణి భుజ స్తన వేణికాభర, శ్రవణ కపోలముల్ వతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్ ప్రభా 5 41

(చ.) బయటకు వచ్చు.

ఉ విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్... భార. ఆది 2 63.

చ అనుపమ దివ్య శస్త్రధరులైన యమర్త్యుల కాహవంబులో. మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి దినంబులెల్ల న వ్వనధి నడంగి యుండి బలవంతులు వెల్వడి రాత్రు లెల్ల భూ,జనులకు బాధసేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై భార. అర 3 8.

చ. ఇలుకలనైన వెల్వడని యాలుపుటాత్రిడకుఁ దాఁపిక తైవై .. అము 5 70

2 బయలుదేఱు, వెడలు

మ .. వరవైతాళిక వందిబృంద జయ జీవస్ఫార శబ్దంబులున్, వెరవై వేర్చి చెలంగ వెల్వడియె వంప్రీతి న్నిజావాసమున్. హరి. ఉ. 4. 117.

మ. కలుచం గోళబిలంబు వెల్వడి యదః ఖడ్గా
హిపై వచ్చుచో. నైష 5 157

సీ. విడుఁడని వీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ డా
దాఱఁ గనుఁగొని గారవమున... ఆము 3 60

3. గాంభీర్యము విడుచు

క బలవంతుఁడుఁ బగవాఁడును, ఖలుఁడనఁగాఁ
జాలువాఁడుఁ గనటోక్తులఁ దాఁ, గలయఁగ
వచ్చిన వెల్వడి, కలవికొనిర యేనిఁ గీడుగాకుండ
దిలన్. కేయూర. 3 7

వెల్వరించు = వెలువరించు, వెలువఱుచు స క్రి

1 వెలువడఁజేయు, బయలుపడఁజేయు
(ఒక శాసనమునందు శకటరేఫ యుక్తముగా గాన
వచ్చుచున్నది)

ఉ. నిగ్రహ మేది నన్ను ధరణీవరరూపము వెల్వ
రించు నాఁడు... భార. ఆది 3 160

గీ ఒక్కఁడడుగెత్తి గొరక వేయుచును దాఁచి,
నట్టళిగి చెంకిగని వీఁకఁ బట్టుటయును, మృగయు
ల దఱుఁ జని వెల్వరించి నిశిత, కాండముంఁ
జెండి రొక పెద్ద కాఱుపోతు మనుచ 4 49

2 బయలుదేఱఁజేయు

మ. ..వేశ్య నన్ను జెలువొందన్ బ్రీతిఁ గైసేసి
యంత నిజావాసము వెల్వరించిన నరేంద్రా
వచ్చి వేచిచ్చటన్ మార్క 8 181.

3. బయటికి బోఁజేయు వెడల నడఁచు

పంచచామరము ఇసీ యిసీ మొగంబు నూఁద కిల్లు
వెల్వరించినన్, వెనవ్విసింగి పోవు సిగ్గు వీసమంత
లేదు నీ, దెసం బవల్ ఘటించె దేర త్రిమ్మరి
మఱిట్లు వచ్చి పారె పారె నన్నుఁ గెర్లఁజేయ
రాక పొమ్మికన్ విప్ర. 4 58

మత్తేభ్యాక్కర... గలతాన పతులును రాజు పట్టంబు
గట్టిన పతియు నలియం బయ్యావఱల వెల్వరించిన
నశ్వమేధంబు ఫలంబు.. యుద్ధ బెజ శాస

వెల్వఱ(ఱు)చు = వెలువఱుచు స. క్రి. వెలువడఁ
జేయు, బయలుపఱుచు.

పి ...ఎన్ని నేర్పులనైనఁ బట్టదీగంటి వెల్వఱచుట
కును, గీ. దతవు మల్లాడ మీకింకఁ దగదు...
పరమ. 5. 23.

వెల్వుచ్చు = వెలిపుచ్చు స క్రి (వెలి + పుచ్చు)
బయలుసేయు

ఉ వచ్చి తదీయ మందిరము వర్తనలెల్ల నెఱింగి
యక్కటా, సచ్చరితంబు గల్గు పతి చాడ్పున
ముద్దటికంబు చూపుచు, బ్రమ్మచ్చిలి రాత్రు లీ
బఱభి మూఁడుజగంబులు ద్రిమ్మరుచుండె, వెల్వు
చ్చక యున్న నా కొడుకు బోదఁ డెఱుంగునె
దీని చెయ్దిముల్. కేయూర 3 223

వెల్వెల = వెలవెల

చూ వెల్వెలఁబాఱు.

వెల్వెలఁజేయు స క్రి (వెల్వెల + చేయు) వెల వెలఁ
బోవఁజేయు, తెల్లఁబోవఁజేయు.

చ విఱిగినఁజూచి నివ్వెఱఁగు వెల్వెలఁజేయఁగ
కుత్థుఁ డేటు నేమఱక యిదేమొకో కులిశ
మంత్రము తప్పు గొడంగినాఁడనో ... కకు
5 130

వెల్వెలఁబాఱు అ. క్రి (వెల్వెల + పాఱు.) 1 వెల
వెలఁ బోవు, వివర్ణమగు

సీ అని యుల్లసము దోఁప నాడు మాటలకు
వెల్వెలఁ బాఱుచును దైత్యవిభు తనూజ, కలఁగి
రహస్య భంగ భయంబుచేతఁ బ్రత్యుత్తరం
బేమియుఁదోఁపకునికి, నిట్టటు గ్రుక్కుచున్నట్టి
లా గరసి . ప్రభా 5 33

సీ ప్రాలేయ కిరణ బింబంబు వెల్వెలఁబాఱి యస్తా
చలంబుపై నత్తమిల్ల ... కాశీ. 1 122

మ . . మోము వెల్వెలఁ బాఱన్ దనుఁగన్న తండ్రి
గనిపల్కెంబలుక దొట్రిల్లఁగన్. ఉ రా. 1 101.

2 తెల్లపడు, వెల్లనగు.

ఉ ... ముచ్చట నూనెనల్ల చను ముక్కులు
వెల్వెలఁబాఱు చెక్కులున్. ఉ. హరి 4 9.

మ ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁడే తేర
నద్దీప్తి నంజన సంబంధజ బాంధవంబున రతి
శ్రాంతాంగనా నేత్రకోణ ని కాయంబుల
డాఁచి తద్దవళిమన్ దాఁబూనెనో చొప్పు
మార్పననన్ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు
శాతోదరి మనుచ 3. 56

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ బాఱు
ముఖేందు బింబంబు తోడ ... శశా, 3. 146.

**వెల్వెలఁబోవు** అ క్రి (వెల్వెల+పోవు) 1 వివర్ణమగు
చ. కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ
బోవ బాంధవావలి దలవంప.. ఉ రా 1.180
ఉ ... చెక్కులన్, వెల్లన కట్ట వస్త్రువులు వెల్వెలఁ
బోవ మొగంబు... దశా 5 128
2. తగ్గు, క్షీణించు.
సీ ... ఖండ విజ్ఞాన శతపత్ర శతులు.
గీ. తెలివి వెల్వెలఁబోవ నిర్మలమవళ్ళ, కోర
తృష్ణావలంబు చల్లార వంత, వనితరముగ
హృదాకాశమున వెలుంగు, మండితా ఖండ
చిచ్చంద్ర మండలంబు సీతారా 1. 147.

**వెల్వెలన** వి (వెలన + వెలన) మిక్కిలి తెలుపు, అధిక ధావళ్యము
చూ: వెల్వెలనగు

**వెల్వెలనగు** అ. క్రి. (√వెల్వెలన) వెలవెలఁబోవు, తెల్లఁబోవు.
క కావున నీవును వగ వక, భావమ్మున సంతసిల్లి
వనువు కుమారిన్, నావుడు వెల్వెల నగుచున్,
హేవేరియు ముద్దుకూఁతు దినత తోడన్.చంద్రా
6. 55.
శ త్రిదశుల కేమి చేటొ యని దీనత వెల్వెల నౌ
పురిందిరా, సుదతి వివర్ణభావ మనుచుం గన
వయ్యెడు నాదు చూడ్కికిన్...ఉ.రా 4. 262

**వెల్వెలుకఁబాఱు** అ క్రి (వెల్వెలుక + పాఱు,) మిక్కిలి వెల్లఁబాఱు, మిక్కిలి తెల్లవడు
సీ. విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమ
లాన్య మోము వెల్వెలుకఁబాఱె ... భాగ.10
పూ. 71.
సీ అలమి నెమ్మది మన్న యతివ లేవవ్వుచేఁ బలె
నాడతెల్ల వెల్వెలుకఁబాఱె...యయా 5 92

**వెల్వెల్ల** విశే (వెల్ల+వెల్ల.) మిగుల వివర్ణము
మ .. కురు భూనాయకుసేన ... న,త్వరతన్
నల్లడఁ బాఱె నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్ల
గన్. భార కల్య. 1 302.
.. ఈ రాత్రి నీ, వింధ్యారణ్యమునందు
వత్తిలి తగన్ వెల్వెల్లగా వేగినన్. భా. రా.
రాల 261

వెల్వెల్లఁబాటు వి. (√వెల్వెల్ల.)మిక్కిలి వైవర్ణ్యము.

శా తాపంబుం బెడఁబాపి దుర్దమ విషాదంబుం
దిగం ద్రావి నిర్వ్యాపారత్వముఁ బోవఁద్రోచి
వగలుద్వాసించి వెల్వెల్లఁ బా,టే పొంతన్
మెలఁగంగ నీక మదికం దెల్లందెగం బుచ్చఁగా,
నీ పెంపార్య జనంబు మెచ్చధృతి కున్మేషంబు
గావింపవే. నిర్వ 9 78

**వెల్పొడుచు** అ. క్రి (వెల్లి+పొడుచు) పొంగు.
సీ పదపల్లవంబునఁ బ్రకటిల్లు చదలేఱు కడలెత్తి
ధాత్రి వెల్పొడిచి పాఱ . కాశీ 5 112.

**వెళలు=వెళ్లు** అ క్రి వెడలు
సీ. దడదడ మన గుండె తాళి బొట్టదర గుబ్బలిపట్టి
పడుక యిల్వెళల దయ్యె ... కువల 2. 116

**వెళుకు** వి (సం విలాసః.) విలాసము
సీ చిత్తిరము కులుకు బెడఁగు వెళుకు గునుపు .
హొయ లనఁగ విలాస మొప్పుచుండు. అం భా.
1. 189.

**వెళుపు=వెలుపు** వి వెడలుపు.
సీ వెడఁద వెన్నుదుటిపై వెదురాకు వెళుపుతోదిద్ది
తీర్చిన పట్టె తిరుమణియును . వైజ? 186
సీ అల శేష్ఠ కిరవగు వెళుపు మొగంబును బోడ
కంత తలకాయ కుడితిగూనఁ, బోలెడు
బొజ్జయు .. చంద్ర వి 1. 90

**వెళ్లఁగొట్టు** స. క్రి (వెళ్ళన్+కొట్టు.) పోవునట్లు చేయు, విడిపించు
గీ పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి, భూతముల
వెళ్ళఁగొట్ట భూభుజుఁడు మెచ్చి దన పరి
ష్కార వస్త్రము లొనకొసంగి, యంపకము
సేయఁ దనయింటి కరుగుదెంచి హంస 3 104.

**వెళ్ళఁగ్రక్కు** స క్రి (వెళ్ళన్+క్రక్కు) వెడలఁ గ్రక్కు, బయటికిఁ బ్రసరింపఁజేయు
సీ సుడిగాడ్పు తేరి నల్పుట్టుఁ జట్టలు వెట్టఁ
గడిఁది మటలు వెళ్ళఁగ్రక్కె నక్క ... ఉ.
రా 6 285

**వెళ్లఁజల్లు** స క్రి (వెళ్లన్+చల్లు) పాఱఁజల్లు
మ ... మణిప్రాప్తిక, న్నినముద్రంబులు వెళ్ళఁ
జల్లఁ దలచున్ మేఘానురూపంబుగన్ దశా
3. 172

**వెళ్లఁదన్ను** స. క్రి. (వెళ్ళన్+తన్ను) వెళ్లఁగొట్టు, తఱిమివేయు

గీ ... వెడలించె రొప్పెప, పిచ్చెఁ దటిమెను దోలెను వెళ్ళఁదన్నె, ననఁగ నుచ్చాటనముఁజేసె ననఁ దగుభవ. ఆం భా 3 119

**వెళ్ళఁబడు** అ క్రి. (వెళ్లన్+పడు.) 1 (కష్టము నుండి) బయటపడు.

క బడలితి నెంతయు నేను, బడుచులు నేఁడెల్ల వెళ్ళఁ బడుదుము దానిం, బోడగంటి వేని నీకుం, గడుపుణ్యము చూపుమనినఁ గరుణా పరతన్. వరాహ 12 95.

2. (పశ్వాదులు,) ప్రసవించు

(వ్యవ) నిన్నరాత్రి మా బఱ్ఱె వెళ్ళఁబడినది.

**వెళ్ళఁబెట్టు** స క్రి (వెళ్ళన్+పెట్టు) పైకి ప్రసరింపఁ జేయు.

సీ. వెళ్ళఁబెట్టునో పూర్ణ విధుకాంతి మొగమున దిగఁజాఱునో పైఁడి తెలివి మేన నిరం. 4 91.

**వెళ్లఁబొడుచు** స క్రి (వెళ్లన్+పొడుచు.) ఈవల నుండి యావలకు దూసిపోవునట్టు పొడుచు

గీ ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మె, వెంటనే యాతఁ డీఁటెచే వెళ్ళఁబొడువ, వెలసె నిద్దఱు నిల్చిన నిలువు కదన, శాలికై కావడించిన కాను కనఁగ కువల 2 176.

**వెళ్ళనాడు** అ, క్రి (వెళ్ళన్+ఆడు) స్పష్టముగాఁ జెప్పు.

చూ వెళ్ళనాడించు.

**వెళ్ళనాడించు** స క్రి (√ వెళ్ళనాడు) స్పష్టముగాఁ బలికించు.

వ. తాను మాట పట్టు పుచ్చుకొని తన కార్య రహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీదాన నగుట మీచేత వెళ్ళనాడించుకొని మీ కుపకారం బొక్కించి విడుచుటకు వచ్చినదని చెప్పి ... ప్రభా. 4. 31.

**వెళ్ళించు** స. క్రి. (√వెళ్ళు) 1 వెడలఁజేయు, వెడలఁగ్రక్కు.

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన యన్నంబు న,య్యన వెళ్ళించి పవిత్రుఁడైన గతి ... భాగ. 4 92

2. పోఁజేయు, తీర్చుకొను

ద్వి ఇల్లు సేరిన మీఁద నీ పగ యెల్ల, వెళ్ళింప కున్న నే విప్రుండ నటవె ... ద్వి హరిశ్చ ఉ. 990. సం.

**వెళ్ళు=వెడలు, వెలలు** అ క్రి. 1. బయలువెడలు

శా లావణ్యాంబులు నాభికూపమున వెళ్లందోడి ముద్భుజవ, ద్భావ క్షేత్రమునందు వంచు ఘట యంత్రంబో యనంగా జప,వ్యావృత్త స్ఫటికాక్షదామకము హస్తాబ్జంబునం దాల్చు వా,ణీ వామేక్షణ నారసింహునికి సంధించున్ వచో వైఖరుల్ వరాహ. 1 6.

ద్వి తివిరి పుట్టలువెళ్లి తిరిగె సర్పములు ... ద్వి హరిశ్చ. 1846.

ఉ .. ఒల్లిదపున్ వరాహముల భద్రగజంబుల మీఁద నాదికోఁ, జెల్లగ నెక్కువాని కొన వెంద్రుక యొక్కటి రెమ్మ తీసినన్, జల్లున వెళ్లుఁబో చమురు చిమ్మిన గ్రోవిని జిమ్మ కైవడిన్ సారంగ 1 71

2. బయలుదేరు.

చ సమధిక బాహు శౌర్యజిత చండవిరోధులు వెళ్లి రున్నత,తమ . భాగ 10 ఉ 844

శా. కల్లెంబుల్ సవరింప కళ్వములు నెక్కంబూను రాహుత్తులున్. బల్లెంబుల్ గొని యర్థభోజనము లజ్జన్ లేచు యోధాగ్రణుల్, కల్లన్ ఒల్కుచు నొంటిఁ బంచలనగళ్ళన్ వెళ్లు భూవల్లభుల్, బల్లింపం దలపోయు కూటమి దొరల్ జవ్వాడిఁ వ్వాడకిన్ రా వి. 50 4.

మ కుయివెంటన్ వెళ్లు కూన్యోరు కూ,వ విశానంబన . ఆము. 2 48

3. పోవు

మ ఘనతాపంబు హరింప నోవ మనుచుం గానీ క్రియా ద్వేష మేఁచినఁ గానీ హృదయేశుఁ జన్నులపయిం జిత్రింపఁగా నీతమున్, వనజాక్షుల్ నిరసింపఁగాఁ జనుట హైన్యంబుంచు మున్మున్న వెళ్లిన రీతిం బడుఁ బ్రేలి మౌక్తిక మణుల్ మెట్టించి దూరంబునన్ వరాహ. 4 35

చ. ఉరమున నేగుఁ గుండలి పయోధర ధారల నాను నెప్పుడున్, గిరులు కరుల్ రజో విహ్వ లికిం జను వెళ్లఁడు వేల కూర్మ శే,ఖరుఁ డిది మేలు చాల జనకల్పిత సౌఖ్య మటంచు ధారుణీ, తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁగుమార మన్మథున్ వసు. 1 72

ఉ. విన్నన నేఁగు తామరల విందుకి లాతపు నీడ లెప్పుడున్, వెన్నెల రాచతాలఁ గని వెళ్లక నీళ్ల మునింగి యున్న వీ, మన్న లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గు వన్ గదలి మెల్లనఁబోవుదు రిండ్లపట్లకున్ యయా. 2 89

4 కడచు, అతిక్రమించు

ఉ. ఇంక శరీరవాయువు ఘనేశ్వరుఁ డైన విధంబు చెప్పెదం, బంకరుహ ప్రమాతికిఁ బ్రపంచ విని ర్మితి వేళ వెళ్ల నా,తంకవిధాయి తీవ్ర సికతల్ వెదచల్లుచు నూర్పుగాడ్పు కూ,లకష సప్త సాగర జలంబులు తువ్వరఁగాఁగ రువ్వఁగన్, వరాహ. 7 7.

సీ. పురుడు వెళ్లక మున్న పూతన విషదిగ్ధ కుచ దుగ్ధముల నెల్లఁ గ్రోలి చంపె ... చిత్ర భా. 5. 172.

5 పుట్టు, మొలచు.

క మానిని యొఱుఁగవుగా కీ,ఙ్మానాయకు ప్రతము మాన్పఁగా నీతరమా, పసుఁగకు కొమ్ములువెళ్లి న, నే టాఁటదు మగుడఁ ద్రోయ నెవ్వండోపున్. రుక్మాం 5. 128

6. పైకి వచ్చు.

చ మొలక లోకింత గానఁబడి మోసులు మెల్లన వెళ్లి పోగలై, నెలకొని వ్రేళ్లు గోళ్లను జనించి చో కారములై మిటారి కెం,దలి రుకు కొమ్మ కట్టి ... సారంగ. 3. 257.

చ.... ఆ యన్నతోదరి రాజుచేత నుం,డిన బెడి దంపుఁ జాయల పిశెం బొరవెళ్ల జరిన దూసి గొ,బ్బున మెడమీఁదఁ బెట్టుకొన... సారంగ. 2. 233

వెవ్వేఁతలాడు అ క్రి. వెవె యని యధిక్షేపించు ద్వి. కన్ను లార్పుచుఁ జెపుల్ గత్తరించుచును. వెవ్వేఁతలాడుచు వెక్కిరించుచును .. పండితా. పర్వ 571. పా

వెస వి (సం వాజః) వేగము.

వ. మనము వెసగల కాలరుల వేగంబ వుచ్చి. భార. ఉద్యో 1 37

ఉ వాయుజుమై వెసన్ జెకలి, వాయుగ తింజని కూలెసాలముల్. సమీర. 4. 58

చ. . ఎ, క్కుడు వెస రాహు మస్తకము గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ఆము. 1. 9.

క్రి. విశ క్రియ. శీఘ్రముగా, వేగముగా.

శా. వేమాఱు న్నలయానిలుం డడరి యా వీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెసముట్టి యందలి యలివ్రాతంబుఁ బోబోపి ... విక్ర 1 86

ఉ ఆ దనుజాపహ ర్తయు భుజాగ్రశరముల్ వెసఁ జాచి యంచితా, మోద వికాసవన్నయవ ముగ్ధ సరోరుహ పంక్తిఁ బూజల, త్యాదర లీలఁ జేయునమరాధిపుఁ గాగిటఁ జేర్చె . . పారి 3. 6.

మ పవనాశ్వంబు హరింపఁగా ముని జటా పాళిం జగత్ప్రాణ మూ, ర్తి వరోధించి తదశ్వముం గొనియె నీరే ప్రొద్దు దాని న్మెడన్, దవులం గట్టి ఖవీధి ద్రిప్పి వడి నాతం డద్దిఁ ద్రోయింప వి,ని వెసన్ వచ్చెనొ కాక రాకెటుల దీంద్రించు న్నభ్రగాంకంబునన్ చంద్రా. 5 87

వెసనము వి (సం.వ్యసనం). వ్యసనము, కామక్రోధా దుల వలన కలుగు దోషము

క. తన కంటికిఁ బ్రియమయ్యెడు, ఘను నొక్కని వెంటవంటి కౌతుక మొప్పన్, మదనంటి కోఁగి లింపక, చన దింటికి దాని బల్వెసన మేమందున్. హంస. 1. 218

గీ. కంతు మాయల నుమ్మెత్త కాయఁ దినిన, వెఱ్ఱి తెఱఁగున వెసనంపు వెఱపువొడమి, చికిలి నెఱ వన్నె కాంద్రకు నివము లెత్త, వెసనిచరియించు వీఁట నా హేమరేఖ. హంస. 1 220.

వెసల వి. వంటపాత్రము, పాత్రము.

క. వడ్డింపఁగ నెంగిలి దోడిఁ, జడ్డ వెసల వంటకంబు పాయ విడఁ దగున్, వడ్డించు నతని సోఁకిన, వడ్డింపక డించి వార్చి వడ్డింపఁ దగున్. విజ్ఞా. 1. 78.

క వెసలలనామణి బంగరు, వెసలంబు దోఁతలు
డించి వినయము మదికిం, బోసఁగఁగఁ గంకణ
రవములు, బోసఁగఁగ నారసి రసాన్నములు
వడ్డింపన్ 2 152

సీ. పాటించి యా గడపకు వెలపట, బోదికిల్లఁ
దవుడు నిప్పును బ్రత్తిగింజలు నిడి యడ్డముగఁ
జీట్టు బడిసి వైచి, వేపరెమ్మల పీళ్లు వెసల లోపల
నుంచి గాషలు పురిటింటఁ గట్టి చేసి హ్వా
3 45

సీ వెసలలో మూనాళ్ల వెన్నలుండఁగ నాఁడు
కాఁచి డించిన నెయ్యిఁ గరంగఁ బెట్టు...శుక
561.

సీ ఏమిరా తాఁజెడ్డకోమటి వెనకయ్య చేతికి వెసల
యిచ్చిన విధమున, మమ్ము మీ మతముఁ
గైకొమ్మని చెప్పెదు ప్రాణికి మీ మతం బర్హ
మగునె, స్వర్గవైభవము విసర్జించి యెవ్వఁడు
జన దూష్యమైన పైశాచ వృత్తి, నీవలెఁ
దాల్చురా నిర్భాగ్య. ప్రబోధ 3.29.

సా. తాఁజెడ్డ కోమటి వెనకయ్య చేతికి వెసల
యిచ్చు = తాను చెడి యితరునిఁ గూడఁ జెఱు
చుట

# వే

వే1 న వేయి, సహస్రము, అనేకము, పెక్కు.

సీ విష్ణునామంబులు వేయును నిత్యంబు వినినఁ
బఠించిన మనుజుఁ డిహము, పందు. భార
అను. 5 326.

క. వేసేతుల నిడుపగు బాణాసనము గుణస్వనోగ్ర
మగునట్లుగ నుల్లాసమునఁ ద్రిప్పుచు మ...
హరి పూ 4 66.

(బాణాసురుఁ డీశ్వరునితో.) శా. దేవా కయ్యము
తోడి వేడుక మదిం దట్టాడు మర్త్యుండు వే,
ల్త్రోవం జేతుల తీఁట వుత్తునని కోరుదు దానవుం
డైన నాకీవే చేతులు చేసితి కసిమి తీం కెట్లో
ర్తు(న్) ... హరి. 5. 21.

క .. పతిస్నేహము కామినులకు బలవం,తము పెఱ
నెయ్యములు వేయుఁ దత్సదృశములే. భార.
ఆది. 6. 190.

క కలిగె నొక జాంబవతి వెన్నెలవడఁ బడెదేల
వలపు నీతలవేగెన్, బలియకు వే సవతులుగల,
బాలతులచే పాటువడక పోరాదనినన్ ఉ.హరి
3 116.

శా ... ఈ కంథచే, వేలకుల్ కనకంబు రాలు
విద్రుపన్ విశ్వంభరా ధీశ్వరా విక్ర. 2. 7.

(దీని యామ్రేడితరూపము ('వేవేలు'.)

క ఏవేళఁ జూచి నందన, శ్రీవాకిటఁ బగటివేళ
శివయోగివరుల్, వేవేల సంఖ్యలుండెదరు ...
హర 2 38

వేవెలుంగులదొర. వి (వేయి + వెలుంగులు +
దొర) సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు

సీ ...తే... వేవెలుంగులదొర తోడు రేవెలుంగు.
ఆము. 1 19.

వే2 క్రి. విశ. (సం వేగః.) 1 వేగముగ, త్వరగా

ఉ వెండియు నేఁడు బాణములు వే తొడిధర్మజు
నొవ్వనేయ .. భార భీష్మ 3 40.

ఉ. ఓరోఁ ఎక యింత లేని వికచోత్పల లోచన చిత్త
వీథిఁ బల్లారపఁగ నీల నీరద శుభాంగుఁడు వే
సముదెంచె ... పారి 1 112.

చ చతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వేచని
యాడి రమ్మనన్. ఉ. రా 2 284.

2. శీఘ్రముగా, వెంటనే

క ప్రముచ్చుల మూర్ధత్వమునం, బచ్చి నరకవాస
మునకుఁ జనిన తనయు నేఁ,డెచ్చెర మగుడఁగ
వే నీ, కిచ్చెద వగపుడుగు మింక వేనియు నధిపా.
భార. ద్రోణ 2 219.

క. ... ఈ యర్భకుపై, వే పడిన ఖలులు దహనుని,
పైపున శలభములు వగిదిఁ బడిరి ధరిత్రిన్
భాగ 10 పూ. 462

మ .. పెలుచన్ గంటు పుటుక్కునం దునిసి వే
పృథ్విం బడెం జాలె. ఆము 4. 8.

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీ
గతిన్ వింధ్య గహ్వరముల్ దూఱఁగఁ జూచి
తారచటఁ గాపై యుండుటం జాల నచ్చె
రువై యొజ్జని వింత చీకటులు వచ్చెంజూడరే
యంచు వేసారిదిం జూతురు పీర రుద్రగజరా
ట్పుద్ధాంత ముగ్ధాంగనల్ మను. 1. 89.

**వేంకటము** సం. వి. అ పుం పర్వత విశేషము, ఒకా నొక పర్వతము, తిరుమల

**వేంకటాచలము** సం. వి. అ. పుం. తిరుపతి కొండ

క. శ్రీ నయన కువల యుగళా, నూనకోట్యశ్వా యితస్మితోజ్జ్వల ముఖుడై, త్యాగిత సురశ్రీపు న,రా నయనక్రమణ వేంకటాచల రమణా. ఆము 2 1

**వేంకటేశుడు** సం వి అ పుం 1 తిరుమలకుc బ్రభు వగు విష్ణువి యర్చావతారము, వేంకటరమణ మూర్తి.

సీ. ... గీ ఇల్లు విడనాడి శ్రీ వేంకటేశుడుండు, పర్వతశ్రేష్ఠమున కథో భాగమునను, దనరు చుండెడు కపిల తీర్థంబుచెంతc, జేరి స్నానంబు చేసి త త్తరమునకు వేం. మా 1. 169.

2. వేదాంత దేశికుడను విశిష్టాద్వైత మతప్రవక్తకుని మతియొక పేరు.

వ. ... మఱియు హయవదన పదారాధకుండై వేంకటేశుం డను నింకొక్క మనిషి . ఆము. 6 66.

**వేంకి** = వేకి వి. జ్వరము

ద్వి. చిచ్చుకు వేంకియు సీతుకు జలియు, వచ్చిన తూవ్వంగ వచ్చునే యనఘ ... నవ 4 133 పా 20 పం.

**వేంచేపు** వి. (దేవతలు, ప్రభువులు మొ. వారి) ప్రవేశము.

సీ హరికి భూమికి నీళ కధికవ్యయ నూతనాంబరా భరణంబు లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్న దీధితు లొప్పిన తిరుచయందు, వేంచేపు చేయించి వివిధ మంగళవాద్యములు భూనభోంతరంబు నెనంగ . వేం మా 2 112

మ. ... దరాం చన్నురజానకాధి రవముల్ చెన్నొందcదిర్వీథులన్ క. వేంచేపుచేసి వేశ్యా, పంచానన మధ్య లాడ బ్రాహ్మణవర్గం, బంచిత వేదధ్వనితోc, జంచద్గతి నడువనిల్పి జనపతి యంతన్ భార్గవ పురాణ. 5. 282

**వంచేయు** = విజయంచేయు అ. క్రి. 1 (దేవతలు, ప్రభువులు మొ వారు) వచ్చు

సీ. వింధ్య వాసినిగల వేంచేసి సీవుత్తున్ నేను సింహాకృతి నెక్కలేని, గొనిపోయి దాcచితి...ననియె. దశకు. 12. 25.

గీ ఆకసంబున వేంచేయు హరికి సిద్ధ,సాధ్య చారణ గంధర్వ సంయమీంద్ర, వివిధ సంస్తుతుల్ చెవుల పండువులు చేసె, జయజయా రావములతోడ సకల దిశల. ఉ హరి 6 17.

క. వేంచేయుము నాయింటికిc, బంచ శరాకార యనుచు . భాగ. 10 పూ 1278

2. (దేవతలు, ప్రభువులు మొ వారు) వెళ్ళు, పోవు

మ నలునిం బంచి నగంబులం బరపుగా నా మీదc గట్టించ వే, వెలయన్ సేతువు లంక కా తెరువు నన్ వేంచేయవే ... రామా 7. 020.

గీ శివుడు మందాననగిరి తుంగ శృంగవీథిc, జెలువు మీఱంగ స్వారి వేంచేయు నపుడు ... ఉ రా 1. 260

క జననాయకుc డంతట నతి, వినయతc దిరు మాళిగలకు వేంచేసెద రో, యని కేలొగ్గుచుచు వైష్ణవ, జనులన్ వీడ్కొలిపి చనియె జలకంబు లకున్. పరమ 3 51.

3 (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) కూర్చుండు

గీ ఉరగ రిపు వాహనమున నొక్కొక్క వేళ, వేడ్క వేంచేసి మెఱయుc దిర్వీథులందు, ... విట్ఠలయ్య పాండు. 4 134.

4. (దేవతలు, ప్రభువులు మొ॥వారు) వసించు

సీ పీఠంబుపైc దీర్ఘ పెరుమాళ్లు వేంచేసి యున్న వా రవతార మోనరిల్లు . విప్ర 3 77,

వ ఔద్దాలక ఋష్యాశ్రమంబున వేంచేసి యున్న వాcడు శేష. 4 ఆ. (శ. ర.)

**వేంద్రపడు** అ. క్రి. (వేంద్రము + పడు ) కోపించు.

సీ తల్లికిc గలదైన దయలేదు నా మీదc దండ్రి యెప్పుడు చూచి వేంద్రపడును ... హంస 3 150

**వేంద్రము** వి వేడిమి.

క జడనుం దాపము నిద్రయు, తిడువేంద్రము తోడ నగయు నిట్టూర్పులు సందడిగొని వడి గొని మదితోc, జిడి ముడిపడి కన్నుc గవయుc జిడిముడి పడగాన్. ఉ హరి 6 78

క. ... ఎటువలె, వే వచ్చితి రిటకు నెండ వేంద్రము చూపన్. మథ 2 23.

విశ 1. అత్యుష్ణము, మిక్కిలి వేఁడిమియైనది
ద్వి. తండ్రి వాక్యములకై దారుణ శిఖల, వేంద్ర మౌ నగ్నిలో విషధి లోనైనఁ, బడియెద విష మైన భక్షించువాఁడ ... రం రా. అయో. 96 పా 23 పం
సీ. తిలకింప ద్వాదశార్కుల కన్న వేంద్రమై జల జారి పండు వెన్నెలలు గాయ . దశా 8 44.
2 తీక్ష్ణము, వాఁడియైనది.
క ఉంద్రా యథాథమనీ, తండ్రింగని తాళుకొంటిఁ దగఁగాకున్నన్. వేంద్రం బగు కత్తి నిఁకన్, జీంద్రంబునఁ బట్టి నిన్ను ఛేదింతు సుమీ. అహల్యా 1 97.
3. పరుషము
క. వేంద్రముగఁ దిట్టుటయు జవ,శాంద్రెవ్వరు మున్నెఱుఁగని యంగద యొదవన్, గుంద్రాతి రూపుఁ గైకొని, తండ్రీ పెక్కేఁడు లిందుఁ దరలకయుంటిన్ అచ్చ రా కాల 148.
4. శౌర్యవంతము
శా. వాంద్రుడున్ పీంద్రుడును రాజులే యనుచు గర్వ ప్రౌఢితో యాదవుల్, వేంద్రంబైన బలంబుతో మధురకున్ వేవచ్చి . భాగ. 10 పూ 1522.

**వేంపద్రూను** వి (వేము+ద్రూమ.) ఒకానొక చెట్టు, నింబము.

**వేఁకటి**=ద్రేఁకటి వి గర్భము, చూలు.
మ. . కాంత యొుక్కట సంద్రాసనమునొందుఁ ఇన్నుఁగవ యాకంపింపఁగా నిండు వేఁకటి భారంబునఁ జేసి . కాశీ. 4 213
సీ. గొంతి మూఁడవవట్టి కోడలి నిండు వేఁకటిఁ గాచినట్టి చేకత్తివాఁడు ... రా వి 2 71
క. .. వేఁకటి యగు లంజపడుపు విడువని బ్రతుకుం, బ్రాఁకొన్న నూతి యుదకము, మేఁకల పాడియును రోఁత మేదిని సుమతీ. సు. శ. 10.

**వేఁకరము** వి. ఉపద్రవము (శ ర)

**వేఁకరి**=ఏఁకరి వి (ద్రేఁ ము+అరి) కిరాతులలో నొక తెగకుఁ జెందినవాఁడు,
గీ. . కోయచెంచు ... యేనాది యేఁకరి పట్ర యెఱుకు, వేఁక ... యెనకరి యవఁదధ్వేదము లుగఁ, బొల్లును . . ఆం భా 2. 289.

**వేఁకి** (క. బేగె త వెక్కై) వి. 1. జ్వరము
క. బలదేవు మేను సోఁకిన, వెలిమిడిచే వేఁకి పఱచి విటకాటముగా, నిలుగుటతో ములుగుటతో, నలమటతో నావుతింత లంతంతకుఁగాన్ ఉ హరి, 6. 77,
గీ . వేఁకి దఁటచూపె దాహ మావిర్భవించె. కాశీ. 3. 121.
సీ. విస్ఫూతియుసు నంధతయు వేఁకియు నవంగ, నట్లు ప్రమాదజలైన యూరుజలకు రయముకఁ దగుఁ బ్రతిక్రియ లొనర్ప. మార్క. 8. 327
2. వేఁడిమి
తే రుచిర శశికాంత రచిత సరోవరంబు, నెలఁత సొచ్చిన మెయివేఁకి నీరులెల్ల, నింక వదనేందు రుచి శిలలెల్లఁ గరఁగి, నిండెఁ దోడ్తోనఁ గొల నతనుండు విసువ కు సం 5. 596.
క మలయానిలునకుఁ గదళీ, దళముల వీచిరొక వేఁకి దనుకఁగ నా మై, నలమెదు మలయజ కర్దమ, మలఁదిరొకో యుతుకులేవ నమ్ము శాంకుపయిన్ కు సం. 5. 640.
3 అగ్ని.
క. చక్కని ప్రకోష్ఠ పీడన, మిక్కిలి కనువేఁకి నుటికె మినుమినుకు మనన్ . హర 8 74.

**వేఁగఁబడు** అ క్రి (వేఁగన్+పడు – స్వార్థమున.) వేఁగు, పరితాపము నొందు.
గీ నమ్మఁ దగదు మొదల నమ్మి శారాత్మ కార్య మున కొరులఁ బనిచి యందు వార, లరయ నేసిరేని యడియాల మెఱుఁగక, వేఁగఁబడుట యెల్ల వెట్టితనము కేయూర 3. 184.

**వేఁగారు** అ క్రి. (వేఁగు+అరు) భారమగు ఇరు వగు.
ద్వి వేఁగారు గుబ్బల ద్రేఁకంబుతోడ, తేఁగామ దీవియ లివలివ లాడ . . ద్వి. పరమ. 2. 56. పా 11 పం.

**వేఁగి**[1] వి (సం వ్యాఘ్రః.) 1 పులి
సీ. వేఁగి సాహ్యాళి మెసఁగు ఆం భా 2.82
2.=వేఁగీ దేశవిశేషము, ఆంధ్రదేశములో నంత ర్భాగము.
సీ. అటసాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించె ... ఆము. 1. 36.

వేఁగి² = వేఁగిస వి పీతసాలము, ఒకజాతి మద్దిచెట్టు (వృ. వి.)

సీ. .. వేఁగి వేఁగిస యన వెలయుఁ బీత,సాలాఖ్యగా అం భా 2 47.

ఆ. ... వేఁగి వేము మొదలుగాఁ గల ద్రుమాళులఁ, గావనగుచు నొక్క కానవెలయు వేం. పంచ 4 522

సీ. . దేవ,దారు గుమ్మ్రదుమోవి తపసియుఁ గుమ్మర పోల్కి గుగ్గిలమెట్టి పోల్కి వేఁగి హంస. 4. 11

వేఁగినాఁడు వి. (వేఁగి¹ + నాఁడు ) వేఁగిదేశము.

క వెలనాఁడు వేఁగినాఁడును, బులుఁగుల నాఁడ్పాకనాఁడు పొత్తపినాఁడున్, గల మురికినాఁడు రేనాఁ,డలయక గనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్ హంస 1 63

వేఁగిస = వేఁగి² వి పీతసాలము, ఒకానొక చెట్టు. (వృ. వి.)

వ ఇప్పకప్పుర మద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కు తెఱంగుల ద్రుమాఁకులు...పి శకుం 2 14

వేఁగు = ద్రేఁగు అ క్రి. 1 (కాయధావ్యము మొ॥) తప్తమగు, భర్జితమగు.

(వ్యవ ) కందులు సరిగా వేఁగక పప్పు బాగుగా లేదు.

2. తపించు, తాపము నొందు.

సీ తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు విరహ సంతాపాగ్ని వేఁగుచుండె.. కాశీ. 4 248.

3 పరితపించు, దుఃఖపడు.

ఉ.... విశాల నరేశ్వరుండు పు,త్రోద్భవ కౌతుకాను భవ మొక్కటి లేమికి వేఁగి వాక్యసం,పద్భుజగేంద్ర సన్నిభుల బ్రాహ్మణులం బిలిపించి వారితోన్. వరాహ. 2. 90.

సీ ...అవయముఁ బ్రతి,

ఆ వె కోటిలేనివాడు కొమరుడ కిప్పాటు, వలసె నకట యిది యవార్య మనుచు, వేఁగె వాని చావు వినియంత జిష్ణుండు, ఖండితారి పంక్తికంధరుండు. రాఘవ. 4. 143.

ద్వి రాముని సతి దశరథరాజు కోడ,లిమ్మగ జనక మహీపాలుపుత్రి, వివిధ సంకటముల వేఁగుచున్నదియు. .రం. రా. అయో. 139. పా. 11. పం.

4 కాలము గడపు

చ. .బానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచెమట్టులు, స్వన నలుమూడె నేమిగతి వేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా. హరి పూ 5 214.

5 కాలు, దగ్ధమగు

ఉ ఏల మృగాక్షి నాకులుకు లేఁటికి నమ్మవు కూలి కొండరా, చూలి వివాహమైన యెడశోభన మంగళ వృత్తి నున్నచో, వేలుపు లెల్ల నంగజుఁడు వేఁగుటఁ జెప్పినఁ గామునిచ్చునా నీలగళాంకుఁ డీవిధము నిక్కమటంచు నభంబు మ్రోయఁగన్ వీర. 2 155

6 చచ్చు, నశించు.

ఆ బ రుణాత్మకుండు తారక దైత్యుండు వేఁగువనుచుఁ జెప్పి వీడుకొలిపె వీర 2 70.

7. క్షీణించు.

సీ మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి వెచ్చువారును మూఁక విచ్చువారు.. వరాహ 3 47

వి. భారము, బరువు

చ గొరగొర లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్వెర తోడ నోటగాఁ, బిటదికిఁ జూచుచుం గడుపు వేఁగున వంకర గాఁగఁ బోవుచున్ ... చెన్న. 2. 20

వేఁచిపోఁత వి (√వేఁచిపోయు ) వేఁగించుట, తపింపఁజేయుట

క. వారలకు వగ్రగణ్యుం, డై రవి సంవర్త సమయ హావ్యవహ శిఖా,దారుణ కరముల భువనము, లీరేడును వేఁచిపోఁత నెఱిఁగి సభయులై వరాహ. 6 108

వేఁచిపోయు స. క్రి (వేఁచు + పోయు) వేఁగఁజేయు, తపింపఁజేయు.

చూ వేఁచిపోఁత

వేఁచు స క్రి (√వేఁగు ) 1. వేఁగఁజేయు, భర్జించు.

గీ. బిట్టుగాలిన పెనములఁ బెట్టవేఁప, మిట్టిపడి యుక్కుమూర్ఛిల్లునట్టివారఁ...ఉ. రా. 3. 328.

సీ. ఒనర వేఁపఁగ నెండు సెనఁగ లెత్తఁగఁబోవు నూంకిఁ బొమ్మన్న మలుకుఁ బెండు .. శుక. 2. 208

2 తపింపఁ జేయు

ఉ. పూఁత పసిండి వంటి వలపుం బచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యి త్తెఱఁగు లేమ సురాంగన లెల్ల నిట్టిసీ, చేఁతకు మెత్తురమ్మ దయ సేయక తిన్నని మేను వెన్నెలన్, వేఁతురటమ్మ యింత కనువేఁదులు సెల్లు నటమ్మ యింతికిన్ మనుచ 3 33

ఉ ...మున్న వారి ను,ద్వేజక తీవ్రతేజమున వేఁచిన సాహసిగావ వేగ నం,భోజ విరోధి సేరెఁ బరభూధర కందర కోటరాంతమున్ వసు 6. 40

ఉ...దురంత నిరంతర తాప మెంతయున్, మెండయి సర్వ జంతువుల మేనులు వేఁచఁ దొడంగె న త్తరిన్ ఇందు. 3. 95

3. పరితపింపఁ జేయు.

మ. ప్రాణసఖవై సొంపీ తుదన్ యుక్తమే, విరసంబైన వచః ప్రపంచవముచే వేఁపంగ నిందాకనిన్, సరసత్వంబున నఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్ ప్రభా. 3. 97

వేఁట వి (క. బేఁటె త. మ. వేట్టై.) 1 మృగయ, అడవిలో మృగ పక్షులను సంహరించుట (ఇది మృగముల వేఁట, పరువేఁగ, గంటవేఁట తెరవేఁట సివంగి వేఁట మొదలగు పలు విధములు గలది )

చూ గంటవేఁట, పక్షులఁవేఁట రెండు విధములు- పాదివేఁట, విడివేఁట

ఉ. వేఁటకి నొప్పుఁగాక రజనీచరు వి డెటులైన నెల్లిపో, దాఁటు కవాటముల్ విఱుఁగఁ దాఁచుచుఁ జేతుల తీఁటవోవ మై,తీఁటలు పుచ్చి రక్కసులఁ దీర్చుట రాముఁడొనర్చ నున్న వె, వ్వేఁటకు రావణాది మృగ బృందముఁ దార్చుటటంచు నార్చివన్ భా రా యు. 455

గీ.. లగుడు సాళ్వంబు దేగలోమగను గద్ద, వేఁట పులుఁగుల విడిచిన వింటికెగసి. యయా. 2 28.

తే వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము నిష్ప్రయోజనముగ నమ్ము సేత,యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల భార. ఉద్యో 2 44

2 మేఁకపోతు, దేవతకు బలి యిచ్చుటకై యేర్పఱుపఁబడిన మేఁకపోతు.

గీ శశము పిశితంబు పక్షి మాంసంబు పంది, యామిషము వేఁట పలలంబు నధికమైన, తృప్తి యొనరించు నొగిఁ బితృదేవతలకు, నెలమి నాలుగు నేను నాఱేడు నెలలు. మార్కం. 3. 200

ఉ ...ఈ, వెక్కసి చెంచుసింగముల వేఁటుల వేఁటల తీలఁ ద్రుంచుచున్ చంద్రా. 2 50

మ. కొలిచెం గాటమ రాజులన్ పతులు చేకూర్చెన్ మహా వీర్లకున్, బాలమున్ రాజుల నెంత భక్తి పరతం బూజించె నాగంగకున్, వెలయన్ వేఁటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై, చెలి యాలాగున నల్ప దైవము కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. హంస.291.

3 తగరు పొట్టేలు.

గీ. వేఁట యన మేష మృగయలు వెలయుచుండు ... ఆం. భా. 3. 58

వేఁటకరి వి (√వేఁట ) వేఁటకాఁడు

క . అధిపుకై పట్టరి తెఱువరి మహిమ మెలుఁగుఁ గిటిఁ,డెలు మొదలగు వానిఁగొన్నిఁటిని వేఁటకరుల్ మనుచ 4. 50

వేఁటకాఁడు వి. (వేఁట+కాఁడు ) మృగయుఁడు, వేఁటాడువాఁడు.

బ వేఁటకాఱు, వేఁటకాండ్రు, వేఁటకాండ్రురు.

ఆ వె నల్లగ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి, నోరి బింకఁ దివియు నేరుపొదవు, వేఁటకాఁడు నోలె ... ఆము. 4 198

ఆ వేఁటకాఱు ముట్టి వెనుకొనఁగా శ్వేత, వగము చతికిఁ దారు నమిలి పోలె ...

వ. అప్పు డనిలసుతుని వేఁటకాఱులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతులై .. భార శల్య 2. 36.

ఆ. దాని వాడ వారు తవిలి చంపించిరి, కుక్క నంతఁ గిరిసి కుక్క వేట, కాంద్రుడు రండఁజేరి కత సవిస్తారం నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి. కేయూర. 114

విశ. సంహారకుఁడు, వశింపఁ జేయువాఁడు

తే. నిడుద శ్రాత్ర్యాని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బోనఁగ ముబ్బెద్దు ముప్పేవములఁ జెలఁగుచు, వెలుఁగు తెల్లెడఁ గంచుచు నలరు నిర్ల వేఁటకాఁ డప్పుడెంతయుఁ దేటమితె. అచ్చ రా అయో. 42

లోకోక్తి - వేఁటకాఁడు మెత్త నగునపుడు లేఁడి మూఁడు కాళ్ళను నడుచుట.

అధికారి యనమర్థుఁడైన సేవకులు స్వేచ్ఛగాఁ బ్రవర్తింతురనుట.

తే. పౌరుషంబున దురకలఁ బాలఁదలుము, వేట కాఁడిల మెత్తనౌ వేళ లేడి, మూడు కాళ్ళను నడుచు నిర్మూలితాంహ .. సిం నార శ 9

**వేఁటకుక్క** వి. (వేఁట+కుక్క) వేఁటాడుటయందు నేర్పుగల కుక్క, విశ్వకద్రువు (శ ర., బ్రౌ.)

**వేఁటగిరి** వి. (√వేఁట) వేఁటాడి జీవించెడి బోయ, వ్యాధుఁడు.

క. ... వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొంకు విడివడి యంతన్. రా. వి 3 57 (శ. ర. పా)

(వేటసిరు శీటకరుల్, వేఁటమరుల్ దొరకుఁ గొలువ నిడివడి యంతన్ ముద్రి పా.

**వేఁటచాళ్లు** వి ఒక దినును వస్త్రములు

సీ. పంపంగి కావులు చందురు కావులు జెలిపట్టు జీబులు వేఁటచాళ్ళు .. ప్రబంధ 272

వ. వరకంచులును బొమ్మంచులును ముయ్యంచులును వేఁటచాళ్ళును తిందు వన్నెలును సురవన్నెలును ... ద్వి. శి. 206

**వేఁటపట్టు** వి. (వేఁట+పట్టు,) మృగయాస్థానము, వేఁటాడుచోటు.

చ. తలఁపుల తిట్ట భావముల తావక మానల పుట్టి నిల్లు గో,ర్కుల నెలవీడు వల్వగల కూట మవ స్థల జన్మదేశ ము,మ్మలికల వెంటవేదవలమందు మనోభవు వేఁటపట్టుమూర్ఛల సహావానమన్వి రహా సంతతతాపము పొందెఁ బార్వతిన్ కు. సం. 5 584

**వేఁటపల్లె** వి. (వేఁట+పల్లె) బోయగూడెము, పక్కణము

సీ వింధ్యాద్రి నడుమ నిర్వింధ్యాతటంబునఁ గానలో నొక్క పక్కణము గలదు, పింగాక్షుఁ డనియెడు పేరివాఁడా వేఁట పల్లె యేలెడు భిల్ల పరివృఢుండు . కాశీ, 4 60

**వేఁటపిట్ట** వి (వేఁట+పిట్ట) దీమపు పిట్ట,పక్షులను పట్టుకొనుటకై వేఁటగానిచేఁ బెంపబడు పక్షి. (శ ర.)

**వేఁటమ్ము** వి (వేఁట+అమ్ము) వేఁటకుఁ బనికివచ్చు బాణము

సీ కంగు కఁగునవేలఁ గై దప్పగాఁ బడువేఁటమ్ము లేఱక దాఁటిదాఁటి . మనుచ 4 103

**వేఁటయిట్టి** వి. (వేఁట+ఇట్టి.) ఇట్టులను వేఁటాడుటకై పెంచఁబడిన యిట్టి. (లేడి)

గి కొమ్ముటురులఁ గాలి గుండులు చిలుమోర, లఱుత గవ్వదండ లలఁతిగంట, లమరసారెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁట యిట్టు లురుగుదెంచె. చంద్ర. 2 22.

**వేఁటరి** వి (వేఁట+అరి³) వేఁటకాఁడు.

చ నృపాల నందనుం, డలరుచు వేఁటకై చన రయంబున వేఁటరు లెల్ల నత్తరిన్. ఇందు. 2 57

ఉ. అతమగంబుపై నరవరాగ్రణి నమ్ముఖవర్తి మానవ, వ్రాతముతోడ నెక్కి విదు వాలిక తూఁపులు చాపతండమున్, జేతులఁ బూని వేఁటరులఁ జేరి మృగంబులఁ బోవఁబంపి ని,ర్భీత కిరాతులన్ వలల బ్రేవల గొందలనిల్పెఁ జాలుపగన్. చిత్రభా 3. 137.

**వేఁటలాడు=వేఁటాడు** స. క్రి (వేఁటలు+ఆడు)

1 వధించు, చంపు

ఉ ఓ వరవర్య రాముఁ డసురోత్కరమున్ మును వేఁటలాడుచుం, దా నచటన్ వసించుట శ్రుతం బగు రామ వియత్పురంబనన్ ... వరమ 5 74.

2. వేయు, (బాణములను) ప్రయోగించు.

తే. అనుదినంబును రాజన్యనుల మీఁద, వేఁట లాడుచు నున్నాఁడు విషమశరుఁడు నైష. 3 26

**వేఁటలుపట్టు** వ. క్రి (√ వేఁట) మేఁకపోతులు పొట్టేళ్లు మొదలగు వానిని బలియిచ్చు

తే గీ తల్లిదండ్రులు దాము నద్వైతమునకుఁ, బ్రణతు లొనరించి వేఁటలుపట్టి పిదపఁ, బక్కణము లోని శబర దంపతులతోడ, నన్నపానాను లొనరించు నవసరమున కాళ 3 40

**వేఁటాడు** స. క్రి (వేఁట+ఆడు.) 1 అడవియందు పులులు దిమ్ములు మొదలగువాని నొగ్గి మృగములను పశువులను వధించు

వ పొలంబునన్ బులుఁగునన్ జోపుచు దేగ వేఁట కాండ్రు వేఱువడి వేఁటాడన్ దొడంగి రందు మనుచ 4 55.

2. వధించు, సంహరించు.

క మీఁటుగల రాజ రథికుల, నాఁటికి వేవుర వధింతు వరుశరములు నో, నాఁటి పదవైచు వంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు వీయల నెల్లన్ భార ఉద్యో 4 407

3 పోఁగొట్టు, నశింపఁ జేయు

ఆ వేఁడివేలు పిడుము వేఁటాడుపోటరి, ప్రొద్దు తూర్పుమలను బొడమె నపుడు...నీలా 3.45

**వేఁడి¹** వి 1 ఉష్ణత, వేఁడిమి

గీ. వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై, భీతి పాత్రుఁ జేసి వీతిహోత్రు నృసిం. 2 118

క వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకు నెల్ల విశ్రాంతికర, శ్రీ సంపాదకరంబై, యాసన్నంబయ్యె నంబుదాగమ మంతన్ విక్ర 4 26

తే...కందువాఁల నిట్టూర్పు గాడ్పు వేఁడి, ముకురములు చారు మోహనమూర్తి యనఁగ, బరఁగు దమయంతిచేతి దర్పణము దక్క. నైష 1.70

2 సంతాపము, విరహ సంతాపము

సీ.. తన పరిపాలనంబున బరమసుఖులఁ,

ఆ గానొనర్చువాఁడు గా నప్పగించిన, వాఁడనేను మీకు వేఁడి దాఁకువట్లుగాఁ జరింప(ను) .. భార. ఆశ్ర. 1. 93,

గీ కుచ్చితం బింత యెఱుఁగక మ్మచ్చెకంటి, కంటి విఖ్యాతి నాతిఁగైకొంటి వనుచు, నచటి జూట లువనగొంటు లతని వేఁడి, వేఁడిమీఁదనె త్రోచిరి వెట్టిఁ తెచ్చి బహు 5. 108

3 తేజము, ప్రతాపము

క అపరిమిత మైన నీ యుగ్రపు వేఁడిం బ్రాణు లెల్లఁ గ్రాఁగెడుఁ దేజం, బుపసంహరింపు సృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వమయాత్మా. మార్క 6 84.

చ దనుజ బలంబుపై నడరి తచ్ఛిఖ వేఁడిన కాన నేర్చు చెన్నున వలితేఁగి కాల్పఁగఁ గనుంగొని యంతకు మున్నె వచ్చియ,య్యని తెఱఁగెల్లఁ జూచు చతురాస్య గిరీశ సురేశ ముఖ్యుల,య్యి నమనుతు రోష శక్తి నుతియించిరి యొంచిరి రాఘ నేంద్రునిన్ ఉ రా 3 355.

క వీఁడే దిలీప భూపతి, వాఁడితనంబునన కాన వచ్చునె మరుచేఁ, బోఁడిమి యటి యున్నప్పుడె, వేఁడి మెయిం బట్టి తెత్తు వేల్పులు తెగడన్. సుద. 5 6.

4 తీక్ష్ణత

ఆ సప్తహాయుఁడు మూర్తి సప్తకంబు ధరించి, కరము వేఁడి మిగులు కరములొప్ప, వడనదీ జలములు నుదధిజలంబులుఁ, బీల్చి జగములెల్లఁ బ్రేల్చుఁ గడఁగి. భార. అర 4. 243

మ తమ భోగార్థ పదార్థ సంతతుల నిత్తన్వంగి కేళీవనిన్, రమణుల్ దానును జూఁబలాడె నిదిగో రాజీవ బాణాయటంచు మదాళిప్రజకి కోకిలము లచ్చో హెచ్చు నుచ్చైస్స్వనం, బమరన్ మ్రోఁగెడి నాదదీయ రవమొప్పాఱెన్ గడున్ వేఁడిమై ఇందు. 3 73.

విశ 1 వెచ్చనిది, ఉష్ణము

సీ ఉశవోని వేఁడి నిట్టూర్పు గాడుపుల ఒల్వడలఁగె బిగిమోవి వాడువాఱ .నీలా. 5. 88.

ఆ భామలార రండు నా ముద్దు తనయుండు, వేఁడివేఁడి యనుచు వేఁడివేఁడి, వేఁడి వేఁడి నీకు వెడఁద కాటుక కంటి, కొలుకులండమాటి కొలుకుచుండ పారంగ. 3 79.

2. తీక్ష్ణము, ఉగ్రము.

సీ ఆయుధ ప్రభఁ గాంచి యలఁగు భీరువుఁబూను వాఁడి ముమ్మొనముల వేఁడియలుఁగు పాండు 1. 101

గీ చూచి యా దివ్యపురుషుండు నూచు వేఁడి, చూపులకు జంకెలకుఁ జెంత నుడియ వెఱచి ఉ. రా 4 11

3 పరుషము, కర్ణకఠోరము.

ఆ ..అట్టిశెట్టి నిన్ని, దినము లట్లు దొడరి పెనఁగియు నీరేత, నేఁడు విన్నఁగ వలసె వేఁడి పలుకు. భార. భీష్మ 3 177

క. ...భరతునిఁ బట్టము, నిలుకుం గట్టుటయు రాము నీరేడబ్దంబులు కానకుఁ బొమ్మనుటయు, నిలువేల్పులు సాక్షిగాఁగ నిక్లే రెండున్

ఉ వేఁడిన వేఁడిమాట నృపవీరుడు సైఁపక కర్ణరంధ్రముల్, నూఁడిన భంగిఁ దాఁకుటయు. . భా. రా. అయో 19.

4. దుఃఖకరము, సంతాపకరము.

చ. అలఘుఁడు వాలి రామ వసుధాధిపు ఘోర శిలీముఖంబుచే, నిలిగిన వేఁడిమాట వినియెంతయు మల్లమల్లనంగఁ గొందలపడి తార భా. రా కిష్కిం 266

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతెనఁ గౌశికు ఋణము...మదిరాక్షి యీ వేఁడి మాట నా చెవులఁ, గదియించి పాపంబు గట్టుకోఁ దగునె ద్వి. హరిశ్చ. ఉత్త. 217

వేఁడి³(డి) వి. (వేఁడు²+ఇ) ఎక్కువ నువ్వవాఁడు (రూ- వఁడి, వఁడీ.)

ఉ. పోఁడిగ నెఁడునుం గలఁడు పొమ్మను దానిని జిహ్వనుండి యో, వేఁడి రమావిభుం డనెడి వీటఁడి దైత్యుని దృష్టి నుండియో, వాఁడిది వ్రేయనింక నని నావిరిఁ గంఠమునందు నుండియో, వాఁడటు లుద్భవించుట యవందగు సర్వగతాత్ముఁడల్వుఁడే. భోజరా 174.

ఎ గీ. పాదఘట్టన మేదినీ భాగమగల, గంధ్రగొడ్డలి భుజమున గ్రాలవేఁడి, వేఁడి రాముఁడటంచును విలయరుద్ర రౌద్రమువ వచ్చె భార్గవ రాముఁడపుడు దశా. 7 298.

క. పార్థుఁడు వేఁడి పొదువుఁడుఁ, బార్థుఁడయొట వోయెదింకఁ బార్థుఁడ రావే...భార ద్రోణ. 3. 46.

ఆ అచటి జనులనడిగె నయ్యో వేఁడియని, గద్దదిక నెలుంగు గడలు కొనఁగ ... భార. ఆశ్ర. 2 31.

వేఁడించు స క్రి (√వేఁడు) వేఁడఁజేయు, ప్రార్థించునట్లు చేయు

సీ ..గీ ఏ ఘనునినైన వేఁడించు నీకుభాంగి, తనువు బంగార మేమె యే ధన్యునైన, మరులుఁ జెందించు నిది మరు మాయయేమొ, యనుచుఁ జూచిన జనములు వినుతిసేయు బిల్హ 1 53.

వేఁడికంటి వి (వేఁడి+కన్ను) శివుఁడు, ఉగ్రాక్షుఁడు

ఉ తొంగలి పువ్వుఁ దేనియలఁ దూకొని మత్తిలి తుమ్మెదల్ వయిన్, బొంగుచు వ్రాల నొప్పె నఁగు పూచిన పొన్నఁ గడంగి కాంచి మున్, మ్రింగిన యా విసంబు వెనమీఁదికిఁ బిచ్చిలు వేఁడి కంటి యా, జంగమటంచు మ్రొక్కెనొక చాన చెలంతలు చూచి నవ్వఁగన్. యయా. 415

వేఁడి(డు)కొను స క్రి (వేఁడు+కొను -స్వార్థమున.) 1 యాచించు

క వేఁడికొని కృపణులై కమ, పోఁడిమి యది యేల రాజపుత్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులుకుదురే భార ఉద్యో 3 197

2 ప్రార్థించు

తే వేఁడికొనియెదఁ జికురాకు బోఁడినిన్ను ... వైష. 3. 129

సీ కపురంపు విడెమిచ్చు కలికి ముచ్చటవిన వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు . ఉ రా. 4 48

వేఁడికోలు వి. (√ వేఁడుకొను) యాచించుట

మత్త వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్, వేఁడికోలుచితంబు కావున వేడ్కతోఁ జని సోమకున్, వేఁడినన్ ... భార ఆది 5. 218

వేఁడిమి వి (√ వేఁడి) 1 ఉష్ణత, తాపము.

క ... రాజపుత్త్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులు కుదురే భార. ఉద్యో 3 197.

చ విలయ కృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమి మారి మను వ. 2 10.

2 సంతాపము

క . ఏ, నేఁడు వధింతును నెవ్వగ, వేఁడిమి బడఁజాల కొక్క వెరపు దలఁచితిన్. భార. సౌప్తి 1 50

3 ప్రతాపము,

క. వీఁ డొక్కఁడు కురుబలంబున, వా కి మగండ నంగఁ జాలు వాఁడిబ్భంగిం, బోఁడిమి సెకియైను ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము విక్రమమునకున్ భార విరా 5 110

ఉ ... నీ, వేఁడిమిచూపి యాభవుల విత్తధరంగం దునుమాడి .. భా రా యుద్ధ 733

4 తీక్ష్ణత, కఱకుఁదనము

క నేఁడీ బ్రాహ్మణుదేశం, బోఁడిమి సెకియేను జిక్కి పోవకయుండన్, వేఁడిమి మెఱయు శరంబుల, వాఁడిమి సొంపెల్లఁ జూపవలయుం జుమ్మీ భార ద్రోణ 1 232

5. చుఱుకుఁదనము

ఉ ... నీ, వేఁడిమి చూపి రూపడంపు వీరిఁ బురందర పుత్త్రి యంతతో, బోఁడిమి మాఱు నాతఁడు ప్రభూత జయోన్నతి నిల్పు నీ కడన్ భార కర్ణ 1 68

క మూఁడవ విల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడిపోవ నసుర పొలుపరి యలుకన్, వాఁడిమి యెసఁగఁగ నొక గద, వేఁడిమితోఁ వైచె వృష్ణి విభు నతి మీఁదన్. హరి. ఉ 4. 157

విణ కఠినము

ద్వి వేఁడిమి హృదయ మీవిప్రున కెపుడు, వీఁడు కొండికవాఁడు విపిన భూములకుఁ, గనికరింపక పంపఁగా నెట్లువచ్చు, నసక కృపాహీనుఁడై నిన్నుఁ బంపె ద్వి హరిశ్చ ఉత్త 1861. పం

వేఁడిమికన్దొర వి (వేఁడిమి+కన్ను+దొర,) శివుఁడు, ఉగ్రాక్షుఁడు

క. ఱేఁడుల రాయఁడ వినుమి, వ్వాఁడిమగల్గ యుద్ధమునకు వచ్చినచో న,వ్వేఁడిమి కన్దొరనైనన్, బోఁడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ. అచ్చ రా కిష్కిం 75,

వేఁడివెలుఁగు వి (వేఁడి+వెలుఁగు) ఉష్ణకిరణుఁడు, సూర్యుఁడు

ఉ వేఁడిననట్లకాక పృథివిం జిరకాల మభీష్ట సౌఖ్యముల్, పోఁడిగ మీరు గాంచి మఱి పొందుఁడు మద్గతియంచుఁ జెప్పియున్, వేఁడి వెలుఁగు లోలిఁ బదివేల సహస్రములున్న భంగి నెవ్వాఁడు వెలుంగునట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై భోజ రా 351.

క కడకడలి వేఁడి వెలుంగను, జడదారి వడి న్నడనుంగఁ జనిజేగురు ప,చ్చడ మాఱఁగట్టె దరి నదఁ, బడమట నెఱసంజవిండె బలువుగ మఱియున్ యయా 3. 69

వేఁడివేలుపు(ల్పు) వి (వేఁడి+వేలుపు) 1. ఉష్ణకరుఁడు, సూర్యుఁడు

ద్వి వేఁడివేలుపుడిగి వెచ్చిద్వీపంబు, నీఁడేర్చు రీతి నింతింతనరాని, పటురౌద్ర రేఖ చొప్పడ... ద్వి హరిశ్చ పూ. 1157

ఆ వె తొగల యెకురుచుక్క ముగురు వేల్పుల యిక్క, జగము వింటు తమ్మి మగుడపొందు, కాఁడు వేఁడి వేల్పుగాములన్ని యెకిమీఁడు, తూర్పు కొండమీఁదఁ దోఁచెనంత అచ్చ రా. అయో 41.

చ ఉదిరి పసిండి చాయగల యొప్పుల కుప్పలు వేఁడి వేలుపుం, గొదమలు దావపావకుని కుఱ్ఱలు చిచ్చఱకంటి నెచ్చెలుల్ ... వానర వీరు లొక్కటన్, బొదివిరి లంకచుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్. రామా. 7 180.

2. అగ్నిదేవుఁడు, జ్వలనుఁడు

ఉ వేఁడి వేలుపినా, నొప్పెడు కప్పుఁద్రోవ దొం యున్ వలి ప్రక్క హసంతికాచలం, బుపవిలింగురాశముల నొందెడు పాపుపల క్రింద వర్తిల్లున్ సమీర. 2 105.

సీ జేజేయనుచు మ్రొక్కు జేజేల రాయఁడు వేఁడి కోలని చూచు వేఁడివేలుపు . దశా 1 238.

గీ. వేఁడివేలుపువ కెనయగు వాఁడి ముల్కి,యొకటి సింగాణిఁ గూర్చి యేయుడుఁ గడింది, మీఱ నదివాని పెన్పోర దూఱిచనిన, వల్లతోఁ దోఁగి కడు సొమ్మసిల్లి తెలిసి అచ్చ. రా యు. 348.

గీ వేయికన్నుల వేల్పుతో విగ్రహించి, వనిత యింకేమి గానున్న వాఁడో మరుఁడు .. నైష 4. 28.

గీ వెలయు నల వేయి గన్నుల వేల్పువోలెఁ, దెంపుతో నిచ్చ కడలేని సొంపు మెఱయఁ, పుడమి నాతోడి సవతిగా నడపవయ్య యయా. 4. 56.

**వేయిచేతులతేఁడు** వి (వేయి+చేతులు+తేఁడు)

1 సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు.

గీ వేయి చేతుల తేఁడు వెలుఁగుల యొకిమీఁడు ... శ వం దేవ 16.

2 కార్తవీర్యార్జునుఁడు

సీ నినుగెల్చుకొని వాఁడి నొవరెడి వేయిచేతుల తేనిఁ గెడపిన బలియు గెలిచె ... అచ్చ రా. సుం. 157.

**వేయిచేతుల యొకిమీఁడు** వి (వేయి+చేతులు+యొకిమీఁడు.) సహస్రబాహుఁడు, కార్తవీర్యార్జునుఁడు.

ఉ. ... చెఱనుబెట్టి వేయిచేతుల యొకిమీఁడు, విడుచుటయును జయము వెల్లి విరిసె అచ్చ. రా. యు 500

**వేయిచేతులవాఁడు** వి. (వేయి+చేతులు+వాఁడు) సహస్రబాహుఁడు, కార్తవీర్యార్జునుఁడు,

సీ అడుగిడి త్రైలోక్య మాక్రమించుట యొక్క వేయిచేతులవాని వేయు టొక్క...సిం నార. 17.

**వేయిచేతులసామి** వి. (వేయి+చేతులు + సామి) సూర్యుఁడు, సహస్రకరుఁడు

గీ. ఇపుడు నీ దొడ్డతన మీవె యొఱఁగికొనుచు, వదరి మీవఁగడంబున కొడయఁడైన, వేయి చేతుల సామిని వేడుకొనుము . అచ్చ రా యు. 528.

**వేయిమోములవాఁడు** వి. (వేయి + మోములు+ వాఁడు) శేషుఁడు, సహస్ర ముఖుఁడు

సీ వేయి మోములవాఁడు విషముక్తుఁడైనను బ్రతియగు నీకు భూ భరణ శక్తి. విక్ర 6. 11

**వేయువేలు** వ. (వేయి+వేలు) పదిలక్షలు

మత్తకోకిల. నేయుఁ జాలును దేనెయుం గుడునిండి పాఱెడు వేఱులున్, వేయివేలు దలిరవ వొప్పెడు విప్రభోజనమున్ ... హరి పూ. 7. 152

**వేయు** స. క్రి 1. క్రింద పడవైచు, పడవైచు

సీ. ఆయుధంబులు వేసి హంకారములు రోసి మ్రొక్కువారును బుట్ట లెక్కువారు, సాహసంబులు మాని సన్యాసములు పూని పఱచు వారును వ్రేళ్లు గఱచువారు వరాహ 3 47.

చ .. పెనంగి లా, వెతలఁగఁ బట్టి వేయుటకు నెత్తెవనం జను మల్లుపోరునన్ ఆము 2 9.

సీ. అమర తిర్యగ్జాతు లందైన వేయక వరజన్మమేల యందఁగ నొవరెచ్చె . . హంస. 5 281

(ఇట 'పుట్టించు' అని భావము.)

2 ఉంచు, నిక్షేపించు

ఉ. చేసె ననేక యాగములు జీవన సౌఖ్యము నెమ్మనంబునన్, రోసె వివస్వదాహ్వయ తనూజునిపై నిజరాజ్య భారమున్, వేసె వివేక నిష్ఠుర లవిత్రముచే నఘపాశ బంధముల్గోసె... వరాహ 2. 37

3 ఉంచు, పెట్టు, చొనుపు.

సీ కడపటఁ జుట్టాల గరితల పైఁటలోఁ జెయివేసి యేమేమొ చేసె ననుచు ...

గీ కృష్ణకథ లందు నిటువంటి వెల్లవినఁడు.. శుక. 2 547

గీ. చంద్ర భీత ఘనధ్వాంత సంచయమున, కభయ మొసఁగి వేణీభరంబను నెపమునఁ, దన వెనుక వేడికొన్నది తరుణి మొగము . ప్రభా 2 67.

(వెనుక వేసికొను = ఒకని కభయమిచ్చి వానిని దన వెనుక నుంచుకొని వాని పక్షమునఁ దాను పోరాడుటకు సిద్ధపడు)

4 తోఁట-మొ. ప్రతిష్ఠించు, మొక్క - మొ నాఁటు

సీ ... సకల మార్గంబులఁ జల్లగా వనములు వేయించె వేమంత్రి వేడ్కమీఱ దశా 1 51

మ. అలమాకందము కుండ్ల దింపఁదగు నియ్యం ట్లొక్కచో వేయఁగా, వలె సంపంగికిఁ ద్రవ్వటం బిడవలెన్ . . వానిఁ జూచి తెలత్యాగత్ విప్ర నారాయణున్. విప్రనా .69 ...

5 మూయు.

గీ. చూచెఁ గనుఱెప్ప వేయక సోమయాజి .. కాశీ. 4. 99

ఉ. .. సవుల కస్తనిహై కనుఱెప్ప వేయక, కాంత మహాశిలామందటకాపడి చూచెఁ గుమార శేఖరున్. సారంగ 2. 37

చ. ఇపుడు గదా తపంబు ఫలియించె నటంచు మహాసురక్తి ఖా, వపరత రేఁబవళ్లు తలవాకిలి వేసిన యట్టు లుండ శుక. 2 218.

6. తెగఁగొట్టు, నఱుకు, ఖండించు

గీ సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను, డాయ వచ్చిన జీవుల వేయు ఖడ్గ, ధారఁ దునియంగ వని చెప్పి కూరె నిద్రఁ, గపియుఁ బనిపూని భూపతిఁ గాచి యుండె కేయూర. 3 199

క. ధర యెల్లను గళ్యపునకు, వరవరమును ధారవోసి నాఁడఁ జరింతున్, బోరిఁ బోతి మహేంద్ర శిఖరిన్, జరణము వేయకుము సుకృత శాలివి తలఁపన్ రామా 4 145.

7. (బాణమును) ప్రయోగించు.

మ కడుగోపించి దశావనుం డతని వక్షః పీఠమున్ జొచ్చి పో, యెడు నట్టుగ్ర శరంబు వేయుటయు ఉ. రా. 3 51.

8. కొట్టు, ప్రహరించు.

మ గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్ .. హర 7. 77.

9. పందెము వైచు, పాచికను దొరలించు.

సీ. నవలయ ధ్వనిగాఁగ సారె వేయు నదల్పు యతినైన గుండె ఝల్లునఁ గలంప ... పాత్ర ముల్ నెత్తమాడు ఆము 1 59.

10. ఎగురవైచు.

సీ. చూపి వేసిన డేగ చోపి లేపినపుల్గు మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగ...కళు 4 98.

11 వఱచు, ఒగ్గు.

గీ. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న, కోటి సంఖ్యల నీర్కావి గోవణములు, విఘ్న మృగములఁ బట్టంగ వేసినట్టి, చీరతెరలను సంస్మృతిఁ జిగురు గొల్ప కాశీ 2. 55.

మ...భూరమణు లత్యంత ప్రమోదమ్మునన్, గనఁగాఁ బల్లకిలోన నిందుమతి శృంగారాంగ సంపత్కళల్, దనరం బంగరుతళ్కు పావడలు చెంత న్నెచ్చెలుల్ వేయఁగన్ ఇదు, 5. 107.

12. విసరు, ప్రక్షేపించు.

చ వసుల వధించియున్ మునల వర్గములంబడ మోఁది వాలుకల్, మసలక వేసి వంచియును మందల తిత్తులు గాల్చి వైచియున్...రా. వి. 5. 30

13 (వింజామరము—మొ.) విసరు, వీచు.

క దురముం గనుఁగొనియెడు నిర్జర వరులకు వేయు చామరంబులవలె నంబరమున నాడె శిలీముఖ, పరిఖండిత విమతకేతు పటపల్లవముల్. వరాహ 5. 57.

14 కప్పు, ఆచ్ఛాదించు

చ భయపడి లేచి వేయదురు పాటునఁగట్టియుఁ గట్టుకున్న నీవియు నెలవంక చన్మొనల వేసియు వేయని పైఁటకొంగు...సారంగ. 3. 154

15. ధరించు.

ద్వి మహిమ తోడను భూతి మైనిండ నలఁది, యరుదైన రుద్రాక్ష హారముత్వేసి .. ద్వి నల. 1, 13.

16 తొడుగు, ధరింపఁజేయు,

చ భళిభళి మెచ్చవచ్చు, నిఁక బ్రహ్మను దీని సృజించినప్పుడే, వెలయఁగఁ జేతికిన్ బిరుదు వేయఁగ వచ్చును...దశా. 2. 305

17 (సిగ) ముడుచు

సీ మందుల ముడిత్రాట మలఁచి వేసిన సిగ పొల్పు గానఁగనీని బోడిమికంబు ... దశా. 1. 260.

18 తాంబూలము నములు.

క సోగలగు వెండితేకుల, లాగునఁ దెలనాకు మడిఁచి లలన యొసంగన్. బాగాలు వేసికొని తన, బాగాలున్నట్టి మేడ వజ్జకు వేఁగెన్. సారంగ. 2 194.

19. మ్రోగించు, కొట్టు. తముకువేయు. తముకు వాయించు.

సీ. తమకు పెసిన వెన్కఁబోఁ జరి చినఁ బట్టియు ను పకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి శుక 4 111.

20 గణించు

సీ. జనుల కర్మకరిం సంఖ్యలెల్ల దినాంతకము పెసి లిఖయించు కంటికులను...దశా 1. 264

**వేరకము** సం. వి అ పుం కర్పూరము

**వేరము¹=వేరిమి** వి (సం వైరం.) 1. విరోధము. పగ

ఉ. పీరును పాండుపుత్రులును వేరము దక్కిపొ సంగి మన్కికై, పోరితమాడి యేసటులు బుద్ధులు సెప్పిన భంగియున్ ... భార. ఉద్యో. 4 8

శా వేరంబెత్తిన రాత చెయ్యి యుడుపన్ వెజ్జెవ్వఁ డూహింపఁగన్.. దశకు. 2. 89

క వారిరుపురు. దమలోపల, వెరము గొని రాజ్య కాంక్ష విజిగీషువులై ...ఆము. 3. 15

2. వేగము.

సీ. వైరవేగములగు వెరమనఁగ ... ఆం భా. 3 48.

**వేరము²** సం. వి అ పుం న 1 శరీరము 2. కుంకుమ పువ్వు. 3 వంగచెట్టు (వృ వి.)

**వేరిమి=వేరము** వి విరోధము, పగ (ఇది నేరిమి వంటిది.)

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న పెన్వారికిఁ బోలదే ... భార ఉద్యో 3. 74

('వేరిమి' అవి శ ర. = గ్రహించిఁది)

**వేరు¹** వి బ వేరులు, వేళులు, వేళ్ళు (క బేరు త. వేర్) వృక్షాదుల మూలములు.

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బందులు నొందులుఁ గూరగాయలుం, గోయుచు...కు సం. 6 692

సీ వానలు సరవితో వర్షించె నస్యముల్ వేళ్ళ గొల్చుగ విఱ్ఱవీఁగి పండె ... మనుచ 6. 121.

చ....కలమములుండ ...తృష్ణలోఁ, దలకొన వంగి మున్ జలముఁ ద్రావెడు క్రిందటి వేళ్ళ మీఁదట, న్నిలిపి...ఆము 1. 67.

**వేరు²** స. బ. వేఁడువకు బహువచన రూపము, ఎవతు.

మ. పరకాంతన్ మదిలోన నైనఁ దలఁపంబాఁపు దుఃఖంబువన్, బరివాదంబును నొంది ఘోర నరక ప్రాప్తవ్యథల్ పెక్కు వత్సరముల్ చెందుదు రట్టి యన్య వనితా సంభోగ దోషంబు దా, నం నాథో త్తమయింత యంతయని యెన్న న్వచ్చునే వేరికిన్. వి. పు. 4 223

**వేరుపనస** వి (వెరు¹+పనస) వేళ్లయందుఁ బండ్లు పండెడు పనస (వృ వి)

సీ పరిపాకమున వేరు పనసపండుల తావి యొందిం దిరములకు విందు సేయ...భీమ. 2. 54

సీ పొదరుఁ బొన్నలరాలు పుప్పొడి యిసుముపైఁ బగిలి యొప్పెడు వేరుపనస పంటి నీటి కాల్వలఁ ద్రోచి చంద్రికా 2 20

సీ వేరుపనస గుత్తి వెట్టినారువ రేల పనస కరక కొమ్మి పలుక రేణి. .హంస 4 11.

**వేరుపురుగు(వు)** వి (వేరు¹ + పురుగు.) 1 కృమి విశేషము. వృక్షలతాదుల మూలమునఁబుట్టి వానిని నశింపఁజేయు పురుగు

ఆ. వేరుపురుగు చేరి వృక్షంబు జెఱుచును, చీడ పురుగు చేరి చెట్టుఁ జెఱుచు, కుత్సితుఁడు చేరి గుణవంతుఁ జెఱుచురా ...వేమన 1 17

గీ గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చొటి పొరగాక చిట్టూట చోటుగాక వెల్లి తలగాక క్రిఁ జెదల్వేరు పురువు, రాతిపోటును లేని బారాటినేల విప్ర 2 18.

2. నాశకము, నాశకుఁడు.

ద్వి బలుగాలియును జుండభాను రశ్మియును, బొలయ లోఁగెడు మత్తపోవనంబునకు...భూప కిటము వేరు పురుగవై తీవు ... ద్వి హరిశ్చ. పూ 1232

**వేరుపాఋ** అ. క్రి (వేరు¹ + పాఋ) వెరుగగు, నాఁటుకొను.

ఉ నీటను దేమయొక్కి నసినిల్చి యొకించుక వాడు దేటి యప్పాటున వేరువాటి ధృతి పాటవ మొప్ప నతఁడొనర్చు నప్పాటునఁ జెన్నుమీటి పరిపాటిగఁ గెంటిగు రెక్కడక్కడన్, మోటిక లెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గలమయ్యె నెయ్యెడన్ విప్ర 2. 28

చ. శితి నుదయంబుఁ జెంది బలిగిమునకున్ వడి వేరువాటి యున్నతమగు రూపుఁ బూనిగగన స్థలిలోఁ గొని యచ్చటం దరు, ప్రతతి చెలంగు ... చం రా. 2 82

**వేరువి(ర్వి)త్తు** విఱ (√వేరు¹.) సమూలముగ నశింపఁ జేయువాఁడు, నశింపఁ జేయునది

క. అనిన విని నన్వి నాతో, వని సేఁతకుఁ దెంపు సేసి యడరెడు రథికుం, గనుట యది నాకుఁ బెండువు,వినవే మీకెల్ల వేరువిత్తని నన్నున్. భార ద్రో. 4 259

గీ విరహి జనముల పాలింటి వేరువిత్తు, దురితముల కేల వాయోడుఁ దహివకరుఁడు ... పి శకుం 3 182.

సీ ...నోరి, వాకట్టు మందు గర్వాలవాలవాలంబు వినయ కృత్యంబుల వేరువిత్తు ... రాజ చ. 3 21

ద్వి చివురుఁబోఁడులు తపస్వుల వృత్తులకు, వివరిం పఁగా వేరువిత్తులు గారె .. ద్వి పరమ. 2 61 పొ.

(వైరాగ్యము.)

సీ. బలవదంతర్విరోధులకును వేర్విత్తు శ్రేయో వధూటికి జీవగఱ్ఱ...విప్ర 1. 84.

**వేరీ** న (వేరు2+ఈ.) ఏరీ, ఎక్కడ నున్నారు.

క ఆ వచ్చిన వారలు వే,రీ వేరీ యనుచు సారెఁ బ్రియ సుత నడుగుం, రావెతఁ బడు వారిని మీ,రే వారం గవరె యనుచు నితరులఁబలుకున్. పర 5. 146

**వేర్పడు= వేఱుపడు** అ. క్రి. భేదపడు, ఏకీభవింపకుండు.

క ...ఈ, పురుషులు గూడిన సృష్టికి, వెరుపరులది సంఘటిలదు వేర్పడిరేనిన్. భా. శాం 5. 61.

మ ...నాభియు న్నిర్విషం,బును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణంబు ల్పాపఁగాఁజూడమే. అము. 2. 67.

**వేర్పఱచు= వేఱుపఱుచు** స. క్రి (√వేర్పడు.) (వేఱు+పఱచు.) వేఱుపడఁ జేయు, వేఱుచేయు, ఎడఁ బెట్టు

సీ. జను నవిశ్వాసంబు గముఁగొని మెలఁగుట విశ్వసనీయుని వేర్పఱచుట...వలదు పతికి ఆము 4. 252

ఉ ఇందునిఁ గందువేర్పఱిచి యిందునిచే సతిమోము చేసి యా,కందును గుంతలంబులుగఁ గంజభవుం డొనరించె ..విప్ర 8. 84.

చ శిరుపతి కొప్పు అందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వే,ర్పఱచిన మించుపట్టి రుదురక్కల పేరులు. గావికోకలున్, హర శివ శబ్దము ల్దగ మృగాంక కళాధరు గేహ సీమ కై,గిరి గుడిమేళము ల్పొదలఁ గిన్నర కంరియు దాని తల్లియున్ శుక. 3 91

**వేర్పాటు** వి (√వేర్పడు) 1. భేదము

క ప్రకృతికి నాకును నుదకమ,నకు మత్స్యమునకుఁ బోలె నైసర్గికమై, ప్రకటంబైనది వేర్పా, టకట యహంకారవశత నదియే నంటిన్. భార శాం 6 60.

సీ. ద్వైపయ్యంబు ప్రియమను వేర్పాటు లేదు భూతముల యందెల్లను సముఁడ . భార. శాం. 4. 242

2 విరోధము

సీ..... అడవికేఁగి, తాపస వాక్యామృతములు వీనులఁ గ్రోలి చెలిమి వేర్పాటను చిరమర లకుఁ, బొరక.. భార. శాం. 1. 58

**వేర్పాయు** అ క్రి (వేరు¹+పాయు) మొదలూడు.

గీ పండ్లు వేర్పాసి కదలఁ జూపకయమున్న.. కాశీ 3 84.

**వేఱగు** అ. క్రి (వేఱు+అగు) 1. తొలఁగు, దూరమగు.

ఉ...వేఱగుం, దామ ప్రకాశసంపదకు ... భార. శాం 5 580

2 మఱియొక విధమగు, మాఱు

క. ఉల్లము వేఱైన మరు, ద్వల్లభుఁ గని రంభ యపుడు దప్పకరామా, పల్లవ కర ముఖవీణా, వెల్లితతాన ప్రతాప వినిమయ ఫణితిన్. కవిక. 6 48.

**వేఱడము** వి (√వేఱు¹) భేదము.

క.. మాయి, శ్రీ్మయిల్లని వేఱడ మిటు, సేయుదురే యిది సఖత్వ శీలము తెఱఁగే. మార్క. 3. 60.

క. ఒక వాఁడై నను మాతో నొక యాలోచనముఁ జేయ కూరక మో, మెత్తి కొనక పోదురు మీ రాం, ద్రకు మగలకు నిట్టి వేఱడంబులు గలవే శో. ఉరా 6 128.

**వేఱఁడి = వీఱఁడి** విశే. (వేఱు + ఇఁడి) అవివేకి.

గీ. అడవిఁ గూరలు దుంపలు గుడుచుచుండు, కూళ మానిసిక ముద్దరాలి వోలిఁ. దగులఁ గట్టిన వేఱఁడి తమ్మిచూలి, చెయ్వులకు నెద్ది యుఁక గుటి సేయవచ్చు. అచ్చ. రా అర. 30

**వేఱఁడించు** స క్రి (√వేఱఁడి.) అవివేకమునఁ జెలుచు.

మ.... పేరు వ.క్క జవుం బెంపును వేఱఁడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్ భార. కర్ణ 1 36,

**వేఱఁడితనము** వి అవివేకము

క. నీకైన వలుని తోడవ, యాఱె మదీయోగ్ర రోష మవనీశ్వర నీ, వేఱఁడి తనమున వచ్చిన, శాఱియ వడకేల పోవఁగా వగు నీకున్. మార్క. 7. 238.

**వేఱిమి** వి. (√వేఱు[1],) భేదము

చ. వానిది గాక జన్మమను వాము నీ రమణీ లలామ య, య్యో వగుబాటుగా వతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం, డానిటురాక వేఱిమి యొవర్చునో నావల పంచు నించు విల్, కానికి లొంగి నెమ్మదిఁ దలంచుకామున్ వలపించె నెవ్వఁడో కువల. 3 38,

**వేఱు[1]** వి (క బేఱ్; త వేఱు, మ. వేఱు)

1. భేదము, అన్యత

మ త్తకోకిల వేఁడు శెంతయుఁ గష్టమైనను వేఱు లేని సుహృజ్జనున్ .. భార ఆది. 5. 218.

గీ. వినుము సత్త్వాది గుణముల నవఘ యాత్మ, తత్త్వమున శివములఁజేయఁ దన్మయత్వ, దర్శ నము దాన నవి మహోదధి నడంగు, నేఱు లట్టుల రూపఱు వేఱు లేక. భార. శాం.4 356.

సీ ... మాలోన నిట్లు.

గీ. వేఱు లేకుంట తెలియక కాఱులాడు, పతు పాతులు నరక కూపానఁ గూలు,దురు ... వరాహ. 10 78.

గీ అర్ధ శశిభూషణుండు స్వయం ప్రభుదుఁ, దున్న తుండు నిత్యోజ్జ్వలత జ్యోతి యతని, స,తతా నంద శక్తియా సంసిజాతి, విశ్వ జనయిత్రి వారికి వేఱు లేదు కాశీ. 5. 99

2 భేదోపాయము

సీ. .. కొలలు నవలఁ,జతురుపాయంబుల సంజ్ఞ యై మంచీగి వేఱుకొట్టన నాల్గు వేఱువేఱ ఆం. భా. 2. 190.

**వేఱు[2]** క్రి విశే ప్రత్యేకముగా (దీని యామ్రేడిత రూపము వేఱువేఱు, వేర్వేఱు)

వ నీ చిత్తంబున వర్తించు మా కృతార్థత్వంబు వేఱె వర్ణింపనేల ... హర 4 45.

పీ. ఇమ్ములై మరుహజారమ్ములై పొదలుండఁ బూజవికెలు వేఱె పూవ వలదు...వసు 1 141.

వేఱువేఱు.

గీ విఘ్న రాజేశ్వరులఁ జూడు వేఱువేఱ ... కాశీ. 5. 179.

ఆ ... శనుమలందు నిలువ వేఱువేఱ యేర్చి విలుమందిఁ బనిచి ... ఆము 3. 27.

వేర్వేఱు.

మ. . . తదాస్థానంబులోఁ బారకుల్, వినుత ప్రౌఢి వసుంధరాధి పతులన్ వేర్వేఱ కీర్తిం చుచో ... నైష. 1 72

ద్వి. ... వారిఁ, గొమరార భూషించుకొలకు భూపాంబనములు జలములుఁ జూర్ణములు మాలికలు, వేర్వేఱఁ బూని సవిస్మయాకృతుల, పర్విన యచ్చర పడఁతు లేనూఱు .. ద్వి. పరమ. 12. పా.

**వేఱు[3]** స. వి అన్యము, ఇతరము, (క బేఱ్, త.వేఱు, ము. వేఱు.)

ఆ. ... అలిగి బకుఁడు, వీనిబాగు నూడవేఱంచు డాసిన, తరువుఁ బెఱికికొనుచు ... భార ఆది. 6. 292.

ఉ. ఆఱు రసంబులం జవులయందుల క్రొత్తలు పుట్ట నిచ్చలున్, వేఱొక తంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ జేసిచేసి ... భార విరా 1. 77.

గీ అతివ యతఁడొండు కోదండ మందికొన్న నఱకె వేఱె విల్లెత్తిన విఱుగనేసె .. ఉ. హరి. 1. 165.

మ నుడి వాల్దాలుపుకన్న వేఱు కలరే చుట్టంబు లేవంకలన్ ... నీలా. 1 95.

**వేఱుప(వ)డు = వేర్పడు** అ. క్రి (వేఱు+పడు)
1. వేఱగు, విడిపోవు.
ఆ. అలిమాటలు విని యన్న దమ్ములఁ బాసి, వేఱుపడెడు వాఁడు వెఱ్ఱివాఁడు వేమ. 2. 138.
వ. పొలంబులన్ బులుగులన్ జోవుచు డేగ వేఁట కాండ్రు వేఱు పడి వేఁటాడన్ దొడంగిరి. మనుచ. 4. 55.
2. దూరమగు.
క వాకం బెట నలినాసన, లోకంబెట నిఖిలమౌని లోకేశ్వర యీ, లోకములలోన భవదవ, లోక మునకు వేఱు వడిన లోకముగలదే కకు 2 52

**వేఱుపాటు = వేర్పాటు** వి (√ వెఱుపడు) వేఱగు.

**వేఱుపెట్టు** స. క్రి (వేఱు²+పెట్టు) వేఱుచేయు, అన్యులఁగాఁ జేయు.
ఆ. ఏక నిశ్చయమున నిట యేగుదెంచితి, మనఘ నీవు నేము నధిపు పనికి, నిట్టి మమ్ము వేఱుపెట్టి యొక్కటి కార్య, మాచరించువాఁడ వగుట దగునె భార. సౌప్తి. 1 88.

**వేఱుపోవు** అ. క్రి (వేఱు¹+పోవు.) వేఱుపడు (శ. ర. వా.)

**వేఱుబందము** వి. (√వేఱు) భేదము, వేఱుపాటు, పక్షపాతము (చి. ని; శ. ర, బ్రౌ. వా.)

**వేఱువాయు** అ క్రి. (వేఱు¹+పాయు.) వేఱుపడు.
క పలువురు యువతులఁ బుత్రులు, పలువురుఁగల యతఁడు వేఱువాయఁ దలఁచివన్, లలనలఁ బుత్రులఁ దానవు, తలఁకొని మెయిపాలు గొనుట ధర్మంబెందున్. విజ్ఞా. వ్య 124.

**వేఱుసేయు** అ. క్రి (వేఱు¹+చేయు.) భేదము నొందు.
క. పాంచాల రాజపుత్రియు, నంచితముగ నిన్నుఁ బొందు నార్వుర వరుసన్, సంచిత పుణ్యుఁడ వీ వొక, యుఁచు నీను వేఱుసేయకే తెమ్మెలమిన్. భార ఉ. 4. 31.
గీ. క్రమము దప్పక యుండ నా రాజవరుఁడు, సకల లౌకిక వైదికాచార సరణిఁ, బ్రియ ముతో విప్రవరునకుఁ బెండ్లిసేసె, వేఱు సేయక ... విక్ర. 1. 160.

ఉ వానిదవంధ్య జీవనము వానిది జన్మము వేఱు సేయకె, వ్వాని గృహాంతరంబున భవాదృశయోగి జనంబు పావన, స్నాన విధాన్న పాన ముల సంతస మందుచుఁ బోవు నిచ్చలున్ .. మనుచ. 1 68.
ఆ శంభు వేఱుసేసి సాగింప వచ్చునే, క్రియలు వెఱ్ఱి వేలయయితి సెప్పుము. కాశీ. 7 72

**వేల** వి (త. వేలై) దాస్యము.
చ అనుపమ రూప యౌవన మహాగుణ వైభవలీల నెవ్వరిం, గనుఁగొని మెచ్చకున్న వర కన్యక గల్గిన దానిఁ జెప్పు నీ, పనిచిన వాని వేల గొని పైఁబడఁ జేసెద. కు, సం 4 399.
సీ హరిఁ దత్తుమే నీకు నమ్మఁడు పడియుండ ... దేవేంద్రుఁ దత్తుమే నీవేల గొనియుండ .. కు సం. 6. 674
ఉ. దండుగు లిచ్చి వేలగొని దానిపయిం జెఱ లిచ్చి .. కు సం. 10 528

సం. వి అ. స్త్రీ 1 చెలియలికట్ట. 2 కాలము, సమయము. 3 అదను, తఱి, యుక్తసమయము. 4. తెఱపి, విశ్రాంతి. 5 సముద్ర జల ప్రవాహము. 6. సముద్రతీరము. 7. మేర, హద్దు 8 వాక్కు. 9 రోగము 10. అనాయాస మరణము 11. బంక, జిగురు. 12. అనురాగము. 13 ఈశ్వర భోజనము. (మే. వి) 14. కాలవిశేషము, హోర. (ఒక గంట కాలము)
శ్లో. చతుర్వింశతి వేలాభి రహోరాత్రం ప్రచక్షతే (వాచ.)

**వేలము¹** వి (సం వేలా) 1. శిబిరము, స్కంధావారము, దండు విడియు చోటు
ద్వి అప్పుడు సుగ్రీవుఁ డాదిగాఁ గపులు, చెప్ప రప్పను లెల్ల శ్రీరాముతోడఁ, జెప్పి వేలము నకుఁ జెచ్చెర నేఁగి, యొప్పెడు సుఖనిద్ర నుండి యారాత్రి, గడపుటయుము ... రం రా యు 314. పా 22. పం.
చ వెనుక నృపాలురంగవుల వేలము చొచ్చివధి గ మున్న య, జ్జనకజఁ ద్రుంతుఁగాక ... శామ. 8. 183.

చ. ... బో్రనఁ గటకంబు వెల్వడి నృపాత్మజు
వేలముఁ జొచ్చి ... దశకు 4 22.

2. విడిది, బస

గీ. అమృత కుంభంబుఁ గైకొని యసుర వరులు,
వేఱ యొకచోట వేలంబు విడిసియుండి, రి .
హర. 6 96.

ద్వి గూడారములు దెంగ్లొల్లవల్ బన్ని, వేరము
ల్దప్పక విడిసె నుత్సుకత ... పండితా. పర్వ
350 పొ, పండితా పర్వ. 386 పొ

3 సేన, సైన్యము

ఉ. ... నికేఁద,న్మూలము లంద నాతప సమూ
హము పేరిటి యిర్లువేలముల్ వసు. 4. 5

చ. ... చ,క్కని వని వేడ్క వేలముడిగన్ ఘటి
యించె జనేంద్రుఁ డయ్యెడన్ చంద్రి.1 168.

(జలచరములు)

ద్వి గాలంబునకు నైనఁ గలఁగక క్రొవ్వి, దూలం
బుల ననతి స్థూలంబులగుచు, వేలంబు విడిసిన
విధమున నెరసి, వాలంబు లల్లార్చి వారి విహార,
శీలంబులై విరసించి యొండొంటి నాలంబులై
డాయు నప్పరంబులును . . వన 5 238.
పొ. 28. పం.

4. గుంపు, సమూహము

చ ... ఓ వయస్య యీ, విడువని వేలమై కురియు
వెన్నెల చిచ్చువ కేమిసేయుదున్.కవిక.4.146.

క. వెడఁగుఁదనంబున నీళ్ల,న్నడు మడఁచిన
రెండుగాని వలువున జలి భి,న్నృడు రెండు వేలు
గారని, విడువని వేలంబు చాటు వేదాంతంబుల్.
వరాహ. 9 57

5 (త. వేలై.) దాస్యము

సీ. విడువని వేలంబు మడిగంబులు గొనంగ నిచ్చలు
నిద్రలే దచ్చరిలకు .. వరాహ. 10. 15.

6. వేగము.

సీ. వేగంబు పాశెంబు వెలయు వేల మవంగ ...
ఆం. భా 3 48.

క. ఈ లీల వెండి మలకడఁ, జాశెముడిగి వేల
ముడిగి పరిసరవర కం,కేళీ వనసాళీఘన, కేళీవన
దర్శనేచ్ఛ గిటికొన మెలఁగెన్. ఉ.రా 4.147.

7. మండలాగ్రము, ఖడ్గము, కత్తి.

చ. చలిమిరి గాడ్పుచే నెగసి సన్నపు మ్రగ్గు చాక
సంపు మం,దల వికసిల్లెఁ బుప్పొడులు దట్ట
ముగా మతిఁ గ్రమ్ము గూర్మిచేఁ, గలిగి విరాలిఁ
గుందు తెఱగంటి నెలంతల మీఁదఁజొన్పు పూ,
విలుతునిపైఁడి చుట్టులఁగు వేలములుం బలె
సొంపు పెంపువన్. యయా 4. 10

వేలము[2] = ఏలము[1] హిం వి. అమ్మకటలో నొక
విధము, విక్రయ భేదము.

సం వి ఆ న. ఉద్యానము, చిన్నతోట

వేలముపట్టు వి (వేలము[1]+పట్టు) శిబిర ప్రదేశము.

చ. చిలుకలు కమ్మ దెమ్మెరలు శీతమయూఖుఁడు
దేఁటు లాదిగాఁ,గల నవవిల్తుసాధన నికాయము
వేలము పట్టనంగ నా,కులమటుగాన దాని విడ
గొట్టక తృటైక దొట్టి పీతరా,గుల మని విల్తు
వీఁగెదరు కొందఱు బోడలు నావగండలై.
పాండు. 5. 182

వేలాటము వి చెర్లాటము,

ద్వి తరులతో నతి శోభితంబగు నందు, హాశిణముల్
పులులు వేలాటంబు లాడు, ముంగుల కెలుకలు
ముద్దులు పెట్టు ... ప్రభు 4 130 పొ.6 పం.

వేలార్చు స క్రి. కుమ్మరించు

గీ. ఘన పయోధర పదవి నక్షత్ర మాశి,కా
రుచులు పర్వ్యాము యొకర్తు చంద్ర, కలిశిఁ
బూని నవామృతమ్ములఁ జకోర, చపలనయ
నకు వేలార్చు నమ్మదమున చంద్రి 6 19

వేలిమి = వేల్మి వి (√వేలుచు) 1. హోమము.

ఉ. వేలిమియన్ మరార్చనయు విప్రనపర్యయుఁ
జిక్కె . మనుచ. 2 53

క. శాలిమి మీఱఁగ నెప్పటి, మాలిమితో దేవ
గురుఁడు మంత్రము దెలుపన్ వేలిమ్మిచేసె ...
దశా. 5. 75. ఆం. భా. 2. 171.

2 హోమకుండము.

వ .. అతని వధంబునకై పాంచాల విభుని వేలిమిం
బుట్టిన వాఁడగుట నప్పార్షతుండు . భార.
ద్రోణ. 5 321.

సీ. అగ్నిదేవు స్వాహా యటంచు వేలిమి యందు
వోఁడైవ నాహుతి నొసఁగఁబోఁడు .. దశా.
1. 257.

3 అగ్ని

సీ వెత్తంబు క్రిందటి నెత్తమ్మి కెంపు జూగని పెంపు వేలిమి కన్నుగాఁగ యయా 2 36.

**వేలిమికట్టి(ట్టె)య** వి (వేలిమి+కట్టియ) సమిధ

సీ విటకచా కృషికి విసువు నొక్క లతాంగి వేలిమి కట్టియ ల్విఱిచి తెచ్చు కవిక 6. 95

**వేలిమిబొట్టు** వి (వేలిమి+బొట్టు) హోమకుండమందలి భస్మముతోఁ బెట్టుకొనిన బొట్టు. రక్ష

సీ తూలాడు సిగయును వ్రేలు మాఱటగోఁచి వేలిమి బొట్టును వ్రేళ్లదర్భ, దనర .. భాగ 10 ఉ 1253.

సీ. నొసటి వేలిమిబొట్టు మసి మీఁద మృగనాభి తిలకఁబు బటువుగాఁ దీర్చవచ్చు రామా 2 110

**వేలిమియొజ్జ** వి (వేలిమి+ఒజ్జ) పురోహితుఁడు

సీ మానితంబైన హోమద్రవ్యములు గొని వేలిమి యొజ్జయై వేధ రాఁగ...కు సం. 9. 227

**వేలు=వ్రేలు** అ. క్రి వ్రేలాడు.

గీ చుఱకఁ గాల్పట్టి యీడ్చిరఁ జూరువట్టి, వేలుదురు గాక తనవారి విడుతురెట్లు కాశీ 5 293

ద్వి ఉడుపంక్తి చెదరె సూర్యుని వేగ మడరె, వడఁకె శేషుఁడు ధరావలయంబు వేలె .. ద్వి. పరమ 2 115 పా.

వి బొ అంగుళి.

సీ.... వేల్ వ్రేలన నంగుళియగు...సాం. ని మాన. 17

సీ. వేల్ వేలునా నంగుళీ సంజ్ఞ లెనంగు వెంక. మాన. 39.

సీ. వాలు డాలును ముగ్గ చేలు ప్రాలును వేల్పు చాలు మేలును గల వేలివాఁడ .. ప్రబంధ. 224

**వేలుచే=వేల్చు** స క్రి (అగ్నిహోత్రము నందు ఆజ్యాది హవిస్సులను) హోమమును చేయు

ఆ ధర్మనఁగరమున ధర్మజుచేఁ జచ్చి, పొలిచెఁ జూడ మద్ర భూవిభుండు, విధియుతంబుగాఁగ వేలిచి విడిచిన, వాఱియున్న యగ్నిననుకరించి భార. శల్య. 1. 287.

ఉ ధర్మరాజులో, దాలి మనోభవాగ్నిఁ దన తాలిమి నాహుతిగాఁ గ్రమఁబునన్, వేలుచు చున్నవాఁడభినివిష్టసుఖైక ఫలాభి కాంక్షయై నైష 4 35.

ద్వి ఒలి శివాగ్ని కాహుతులుగా నిట్లు, వేలుతు నిదియ తా విధి దీనికనుచు పండితా పురా. 109 పా

**వేలుపించే** స క్రి (√ వెలుచే) హోమము చేయించు

ద్వి. సవరని గంధపు సమిధ అమర్చి, జాతిముత్తియపు లాజలు వేలుపించి ... ద్వి పరమ. 5. 380 పా

**వేలుపు=వేల్పు** వి (√వేలుచే) 1 దేవత.

సీ తొలి వేలుపుల వెలుపుల పనుల్ గొనుతేఁడు . మనుచ 5 47.

వ . అక్కక్క మ్రొక్కవే మనపాలి వేలుపని బుజ్జగించియు ఆము 4. 35

2. దేవతా స్త్రీ

చూ వేల్పు.

3 జోస్యము.

ద్వి ఆహికంబులఁ బెట్టి యవ్వులు వార,వృద్ధి కొసంగుదు వేలుపు చెప్పు, పద్ధతి నేర్తు నవ. 3 153 పా 18. వం.

**వేలుపుఁగత్తళాని** వి (వేలుపు + కత్తళాని) దేవ తాశ్వము, ఉచ్చైశ్శ్రవము

ఉ. ఉప సుధర్మాస్థాని నున్న వేలుపుఁ గత్తళానికి బట్టు తలాట మనఁగ... వరాహ 4 155.

**వేలుపుఁగమ్మరి=వేల్పుఁగమ్మరి** వి (వేలుపు + కమ్మరి,) దేవశిల్పి, విశ్వకర్మ.

క వేలుపుఁ గమ్మరి ప్రొద్దుం, బోలె నలుఁ గమిని మేను బొరిఁబొరిఁ దునియల్, ప్రీలఁగ సానవట్టిన, పోలిక.. అచ్చ భా. 5 90.

**వేలుపుఁజాన** వి (వేలుపు+చాన) అప్సర స్త్రీ

క ఆడిరి వేలుపుఁ జానలు, పాడిరి గంధర్వ సతులు ప్రమదం బెసఁగన్, బ్రోడలగు మింటి తెరువ చేడియ లటు రలరు సేసలు పెడ్డన్ జాహ్న 1 188

**వేలుపుఁజెట్టు** వి (వేలుపు+చెట్టు) కల్పవృక్షము, దేవతరువు. (శ ర)

**వేలుపుఁజేడె** వి. (వేలుపు + చేడె.) దేవతా స్త్రీ, అచ్చెర.

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁగుబేరునిఁ జెనకెడు వేశ్యలు... కుచేల 1. 28

**వేలుపుఁదిప్ప** వి (వేలుపు+తిప్ప) మేరుపర్వతము.

ఉ. చెప్పెడి దేమి నవ్విభు రచించిన మాటలు శామ బాణముల్, దప్పెనఁ దవఁ డాశ్రిత కలాపము ముంగిట నున్న వేలుపుం దిప్ప వివేక శాలి యువతీ జన చిత్త విమాత్న దర్పకుం, డప్పన మంత్రి వానిఁ దరమా నుతియింప నిలింప కోటికిన్. రాజ. చ 1 35.

**వేలుపుఁదెరువు** వి. (వేలుపు+తెరువు.) సురపథము, ఆకాశము. (శ ర)

**వేలుపుఁదేజి** వి. (వేలుపు+తేజి) ఉచ్చైశ్శ్రవము

సీ. అనికి వేలుపుఁదేజి నలరుకై జామోరి లల్లార్పు చేఁ జీరు హాయకులముల. చంద్రి. 6. 65.

**వేలుపుఁద్రోవ** వి (వేలుపు+త్రోవ) ఆకాశము.

క...మల్లియు, విరులవఁగారిక్క లెసఁగె వేలుపుఁ ద్రోవన్...నీలా. 3 6.

**వేలుపుఁబెద్ద** వి (వేలుపు + పెద్ద) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

ఉ. బుద్ధుల ప్రోడ నాల్గు మొగముల్గల విశ్రుత మూర్తి తమ్మిపూ, గద్దియ మీఁద నుండి త్రిజ గంబులు నేలుచు నుండు వేలుపుం, బెద్ద వచో వధూటి వలపించిన సర్వగుణైక శాలియు,దద్ద యఁ బ్రోవఁ గాత సుగుణాంబుధిఁ దిమ్మయ మంత్రియప్పనిన్. రాజ. చ. 1. 3.

క. తద్దయుఁ బొగడెద వేలుపుఁ, బెద్దయనన్ జగములెల్లఁ బెంచుచుఁ బలుకుం,ముద్దియతో నెఱితామర, గద్దియఁ గొలువుండు నల్మొగంబుల ప్రోడన్. నీలా. 1. 5.

**వేలుపుఁబొన్న** వి. (వేలుపు+పొన్న.) సురపొన్న. (వృ వి)

వ. బలు వేలుపుఁ బొన్నలం దొలఁగఁ ద్రోయు మిన్నేఁటి నీటి వరదపోటువ ... అచ్చ. శా. 2. 31 పొ.

**వేలుపు గమికాఁడు** = **వేల్పుగమికాఁడు** వి. (వేలుపు + గమికాఁడు) 1. కుమారస్వామి (శ ర) 2. బ్రహ్మదేవుఁడు, సురజ్యేష్ఠుఁడు

వ అంతలోన నజీవు-డు నజీవుఁడైన తెలుఁగున నినిమిది కన్నులుగల వేలుపుగమికాఁడు తేటి తెప్పిటి కాలుఁగేలుఁ గదలించి కన్నులు విచ్చి చూడ సమర్థుండై . భాగ 10. పూ. 542.

**వేలుపుగాణ** = **వేల్పుగాణ** వి (వేలుపు + గాణ) గంధర్వుఁడు (శ. ర)

**వేలుపుగిడ్డి** = **వేల్పుగిడ్డి** వి (వేలుపు+గిడ్డి) కామధేనువు, దేవతల గోవు.

ఉ వేలుపు గిడ్డియుం బరుసవేదియుఁ గల్ప కుజంబుఁ దోడరా .. భీమ 2. 1{8

**వేలుపు జక్కర** వి (వేలుపు+జక్కర.) ఆకాశగంగ, సురదీర్ఘిక, స్వర్ణది.

క జక్కుల దొర చెలికానికిఁ, గొక్కుహులుమాలోదు నయ్యకుం జొక్కపు లేఁ, జక్కల జేనిని వేలుపు, జక్కర నౌదలను చాల్చు జగవేలుపనకున్. అచ్చ రా బాల, 21

**వేలుపుజడదారి** వి. (వేలుపు+జడదారి) సురమౌని, నారదుఁడు.

సీ వేలుపు జడదారి విందారగించుచో నానంద బాష్పంబు లడ్డపడును ఉ హరి 6 139.

**వేలుపుటిల్లు** వి (వేలుపు+ఇల్లు) మేరుపర్వతము

ఉ వేలుపుటిల్లు విల్లు వెడవీకల పోకల నారి రె డుచే,దోల వెలుంగు తూపెచటఁ దోలినఁ బాలని తేరుమాటలై, గ్రాలెడు తేఱులెవ్వనికిఁ గల్గునతఁడు చళుక్య విశ్వభూ,పాలు మనం బునం బర విభంజనుఁడై విహరించుచుండెడిన్. కావ్యా. 5. 98.

**వేలుపుటేఱు** = **వేల్పుటేఱు** వి ఔ. సురదీర్ఘిక, ఆకాశగంగ.

ఉ. వేలుపుటేఱుఁ గప్పురము వెన్నెల లంచలు ముత్తియంబులుం, బోలును మంచు నద్దములుఁ బయ్యెర మేపుడు చేఁడు గల్వ రా, జాలును రేవెలుంగు మగజాలును టెక్కలుఁ దమ్మిచూలి యిల్లాలును జోడుగాఁగఁ దనరారు నసంబునఁ గేరు దయ్యెమా. అచ్చ. రా. బాల 214.

ఉ ... కీలు జాఱువా, మేలిపసిఁడి బొమ్మచను
మిట్టలకున్ దెలిచల్వ సైరిణీ, చేలచెఱంగులై
యచటఁ జెల్వగు వేలుపు టేటిపెందెరల్
ఉ రా 1 58

**వేలుపు(ల్పు)టొజ్జ** వి (వేలుపు+ఒజ్జ) సురాచార్యుఁడు, బృహస్పతి, (శ ర)

**వేలుపుటొడయఁడు** = వేల్పుటొడయఁడు వి. (వేలుపు+ఒడయడు,) దేవేంద్రుఁడు
సీ మును గౌతముఁడు నాఁగ నొకరు పంట వలంతి జేజే నిరాహారి సింగమునకు, గారాబు టిల్లాలఁ జే రహాల్యయటందు రొకనాఁడు వేలుపుటొడయఁ డెమ్మె, ననుఁగోరి పుంజు రూపునఁ జేరి నడురేయి తఱి నిట్టిపలికెఁ బొంచి యఱచుటయును .. అచ్చ రా. బాల 146

**వేలుపుదాయ**=వేల్పుదాయ వి. (వేలుపు+దాయ) సురద్విషుఁడు, అసురుఁడు.
చూ వేల్పుదాయ.

**వేలుపుబానిస**=వేల్పుబానిస వి (వేలుపు + బానిస) వేశ్య (శ. ర.)

**వేలుపుమానికము**=వేల్పుమానికము వి. (వేలుపు+ మానికము) చింతామణి
క దాన సమగ్రత వేలుపు, మానికమును బోలు నమచు మహనీయమణిన్, గానుక యిచ్చి నగేంద్రుని, వేనోళ్ళం బ్రస్తుతించి వీడ్కొని చనియెన్. విక్ర. 2 257

**వేలుపుమావు**=వేల్పుమావు వి (వేలుపు+మావు.) ఉచ్చైశ్శ్రవము, దేవాశ్వము
సీ వింట జివ్వన నేఁగు వివిధాశ్వ కంధరల్ దగిరి వేలుపు మావు నెలుఁగు బూన చంద్రా. 6 92

**వేలుపుమిన్న** వి (వేలుపు+మిన్న) దేవతాశ్రేష్ఠుఁడు
సీ. . . వేలుపు మిన్నల వివిధ భూషణ కాంతి శుక్ర చాప స్ఫూర్తి నవదరింప ... దశా 1. 266

**వేలుపు ముద్దరాలు**=వేల్పు ముద్దరాలు వి (వేలుపు+ ముద్దరాలు.) దేవతాస్త్రీ.

క ఈ విధమున నయ్యిరువురు భావజ తంత్రైక నరత బహుకాలము సౌఖ్యావహ లీలల నుండంగా వేలుపు ముద్దరాలు గర్భము దాల్చెన్. మనుచ. 3 118

**వేలుపు(న్మొ)మొదవు** వి (వేలుపు+మొదవు) కామధేనువు, దేవతల యావు
క ... కోర్కులు, పాలుపొదవఁగఁ బిదుకు వేలుపు న్మొదవునకున్ నీలా. 1 21

**వేలుపురాచిల్కు** = వేలురాచిల్కు(లుకు) వి. (వేలుపు + రా + చిల్కు.) ఐంద్రాస్త్రము, ఇంద్రుఁ డధిదేవతగాఁ గల అస్త్రము
సీ రాచూలి వేలుపు రాచిల్కు నిగిడించి యాచెయ్యి దెగవైచి యపుడె సాము, నెల ముల్కిదోయి నిచ్చలముగాఁ బఱిగించి కాళ్లు రెండును ద్రుంచి ... అచ్చ రా యు 248.

**వేలుపురాపురువు** వి (వేలుపు + రా + పురువు) ఇంద్రగోపము, ఆరుద్ర పురుగు
ఉ. ... జడిగొన్న మంకెనన్, విప్పుగఁ జేయునట్లు దగె వేలుపురాపురువుంగముల్ దటిన్. అచ్చ. భా 3 51.

**వేలుపుఱేడు** వి (వేలుపు+ఱేఁడు) ఇంద్రుఁడు.
ఉ. . వేలుపు ఱేని గెల్చు టొక విక్రమమే బలి దైత్య వల్ల భా. దశా 2. 428.
ఉ. ... జాబిలి రాల మేడలో, వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడు గొల్వఁగ .. నీలా 1 1.
ఇట్లే వేలుపుటేలిక, వేలుపురాయఁడు. మొ.

**వేలుపుచెట్టు** వి. (√వేలుపు) కల్పవృక్షము.
శా ఏఁడీ పేదలపాలి వేలుపులచెట్టు ... అచ్చ రా అయో 88

**వేలుపులదారి** వి. (√వేలుపు) ఆకాశము
చ తడయక వచ్చె వేలుపుల దారిని బాముల వేఁట కాఁ డొగిన్ ... అచ్చ. రా యు 162.

**వేలుపులపెద్ద** వి (√వేలుపు) బ్రహ్మ, సురశ్రేష్ఠుఁడు.
సీ. కెందమ్మి గద్దె యెక్కిన వేలుపుల పెద్ద పలుకుఁ బోఁడికిఁ బ్రాణపదము . . దశా. 2 62.

**వేలుపులపెద్ద కొమరుఁడు** (√వేలుపు.) నారద మహాముని.

క అని పుట్టఁ బుట్టువునకుం, గొనకొని వేలుపుల పెద్ద కొమరుఁ డెఱింగిం,చిన నాలకించి యతఁ డా,యన నవ్వాలి కతియుఁ దెలుపడని వేడుట యున్ అచ్చ. రా బాల 213

వేలుపుల ప్రోలు వి (√వేలుపు) అమరావతి, స్వర్గ పట్టణము

గీ. కూడు నిదురయు నెపుడుం జేకూఱకుండు, వేలుపుల ప్రోలు వమ్మేనటి వీటికెనయె...అచ్చ రా. బాల. 81.

వేలుపువడ్రఁగి వి. (వేలుపు+వడ్రంగి) విశ్వకర్మ, దేవశిల్పి.

క వేలుపు వడ్రఁగి పెట్టిన, కీటనఁ బలుకాట మాట క్రియ గనుపట్టుం, గాలోచితముగఁదద్ది, వ్యాల యరత్న క్షీప్రతిమల కనురూపముగన్. కళా. 2. 10.

వేలుపువెలఁది వి (వేలుపు+వెలఁది) దేవతా స్త్రీ అప్సరస స్త్రీ

అని యాన గలుగఁ బలికిన, విని వేలుపు వెలఁది మోము వికసిల్లంగాఁ, దనచేతి చెఱఁగు విగియన్, బెనచుచుఁ దలవాంచి నగవు బెరయఁగఁ బలికెన్ మనుచ. 3. 106.

వేలుపుసాని = వేల్పు(ల)సాని వి (వేలుపు+సాని.)

1 జ్యోస్యము చెప్పు స్త్రీ, సోదెచెప్పు నాఁడుది, దైవజ్ఞ.

సీ...తగు దైవజ్ఞ సోదకత్తె, యనఁగ వేలుపు సాని యన అం భా 2 110

వేల్చు స క్రి అగ్నిహోత్రమందు ఆజ్యాదికము సమర్పించు, హోమము చేయు

ఆ...ప్రయోగ దక్షుఁడగ్ని, ముఖము సేసి వేల్చి మొనసి వివాహోప, కరణ వస్తుచయము గాచి యుండె. భార. ఆది 7 167

గీ హృదయ వేదికయందు సమిద్ధ మూర్తి, వెలుఁగుచుండు తేజమునందు వేల్చెఁ బ్రాణ,ములను యాజి యట్లంతరమున నొనర్చి, యాగమున వీతకల్మషుఁడై వెలుంగు భార శాం. 5 149

సీ రేపు సూర్యుండును మాపు చుక్కలుఁ దోఁచు నంతదాఁకను జపమాచరించి, యటుమీఁద నాత్మ గృహ్యోక్త రూపంబుగా విహిత తముగ నగ్ని వేల్చవలయు...విజ్ఞా. 1 63

ఉ పంకజనేత్ర గౌతముని పంపున లాజలు దోయిలించి ఘూ,మాంకుని యందు వేల్చె దరహాసము ఱెప్పలలోన దాఁచుచున్...నైష 6 102

ఆ అనిన సాహసాంకుఁ డంబిక నెమ్మేని,ప్రము దితాత్మఁ జేయఁ బ్రతిన వట్టి, మధు నిషిక్త మైన మాలూర సత్ఫల, వితతిఁ దాను వట్ల వేల్వఁ దొణఁగె విక్ర 5. 78

2 కాల్చు, తగులఁ బెట్టు.

గీ అతని ముఖ గహ్వరంబుల నద్భుతముగ, నుగ్ర దహన శిఖావళు లుద్భవించి, వేల్పు మూఁకల నరికట్టి వేల్వఁ దొడఁగె, నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు భార అర. 5 218.

గీ మాడుగులు వేల్చె నొడ్డాది మసి యొనర్చె... ఆము. 1. 66

3 భర్జించు

వ పర సంతాపకారి కటుక వచనుండగు కుటిల బుద్ధిని నిఁగలంబున వేల్వఁడు ... కాశీ. 3. 154.

వేల్పించు స క్రి (వేల్చు) హోమము చేయించు

క వేలుపుల ఱేఁడు గురుచే, వేతిమి వేల్పించి బలిమి వెలయఁగ ..భాగ 9 505

క పోలఁ దొలి మినుకు దెఱఁగున, వేల్పించిన పిదప రాచ విరివింటి దొరన్, వేల్పులకున్ మ్రొక్కించిరి...యయా 4. 113.

వేల్పు¹ = వేలుపు వి (√వెలుచు) 1 దేవత

క...పొలుపుగ ధర్మం, దలఁపుము మఱి యాతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్యమువన్ భార ఆది 5 92.

క...వేంకటపతి యిష్టమయిన వేల్పగుటఁ...ఆము. 1. 16

క వీఁడే దిలీప భూపతి, వాఁడి తపంబునను కాన వచ్చును మరుచేఁ, బోఁడిమి యడియున్నప్పుడె, వేఁడె మెయింబట్టి తత్తు వేల్పులు బెగడన్. సుధ 5 6

ఉ .ఈశుమంత్ర బున వేల్పు వ్రేల్చి ... దశకు. 7 121.

వేల్పు² = వేఁల్పు వి. (√వేలు) వ్రేల వేయుట,

గీ. ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గాదని రాఁడయ్యెఁ దాతవేల్పు...నైష 4 129

వేల్పుఁగన్నియ వి (వేల్పు[1]+కన్నియ) దేవతా స్త్రీ

సీ ముదిమి యొన్నఁడు లేని కౌదమ ప్రాయపుఁ జెల్వు నేర్పులు వేల్పుఁ గన్నియల కమరు... ఉ రా. 4 90.

వేల్పుఁగమ్మరి=వేలుపుఁ గమ్మరి వి (వేల్పు[1]+కమ్మరి) దేవశిల్పి, విశ్వకర్మ

ద్వి బొమ్మర వోయి వేల్పుల మూఁక వేల్పుఁ, గమ్మరిఁ బిలిచి యక్కజము చూచితివే ..ద్వి పరమ. 1. 27. పౌ

వేల్పుఁగలువకంటి వి (వేల్పు[1] + కలువకంటి) దేవతా స్త్రీ.

వ వేల్పుఁ గలువ కంటులు బ్రొమ్ముడులు వీడ... ఉ రా. 3. 78

వేల్పుఁగొండ వి. (వేల్పు[1]+కొండ) వేలుపు కొండ, మేరుపర్వతము

గీ కొండ మరధనమని వేల్పుఁ గొండ మహిౕకిఁ, దెచ్చి దానంబు లొనరించు తెఱఁగుదనర, నాశ్రితుల కర్థమొసఁగెఁ బెదప్పవిభుని, భార్య కొండమ్మ తనదు సంపద వెలయ ఇందు. 1. 70

వేల్పుఁజెట్టు వి (వేల్పు[1]+చెట్టు,) కల్ప వృక్షము, సురతరువు

వ వేల్పుఁజెట్టు పూవండల దండితనంబున . ఉ రా 4 163

వేల్పుఁ(లుపుఁ)దపసి వి (వేల్పు[1] + తపసి ) దేవ ఋషి, నారదముని.

గీ. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి, పల్కె రా చందమామ అప్పగిదిఁ బంప, కడ మెలంగఁగ నద్దరి గట్టుమీఁద, నుండి కన్గొని ప్రొద్దు కుఱ్ఱండు దలఁకి అచ్చ రా కిష్కిం. 2,

వేల్పుఁ(లుపుఁ)దెరవు వి. (వేలుప[1] + తెరవు ) సురవర్త్మము, ఆకాశము

క. పొంగుచు వరదముపైఁ బోలఁ,తిం గూరిమి మునిచి వేల్పు తెరవునఁ బఱచెన్, బంగరు పిచ్చికఁ గొంచున్, నింగికి సాళువపుఁ బులుఁగు నెగయు తెఱఁగునన్ అచ్చ. రా. అర. 62.

వేల్పుఁ(లుపుఁ)దెఱవ వి (వేల్పు+తెఱవ ) దేవతా స్త్రీ

గీ కలికి చూపులఁ జనువంబుగా నొనర్చి, తిల కమునఁ బూవులొక వేల్పుఁ దెఱవగోనె.. పి. శకు 2 138

వేల్పుఁదొయ్యలి వి (వేల్పు[1] + తొయ్యలి,) అప్సర స్త్రీ, అచ్చేర

చ. .. పెన్నిధిగతిన్ వ్రతికిన్ బొడకట్టె వేల్పుఁ దొ,య్యలి చిఱుసాన బట్టిన యనంగుని మోహాన బాణమో యనన్ మనుచ 6 31.

వేల్పుఁబెద్ద వి (వేల్పు+పెద్ద ) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

మ పురుషుం డంచుఁ బరేశ్వరుం డనుచు వేల్పుం బెద్ద యంచున్ ... ఉ రా. 1. 280

రగడ చిలువరాయఁడు ప్రొద్దు చూలియు జింక తాల్పును వేల్పుఁబెద్దయు...అచ్చ.రా.యు.84.

వేల్పుఁబెద్దన=వేల్పుఁబెద్ద వి సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ.

క మనసున సిగ్గును వెఱపుం, బెనఁగొని నిండార వేల్పుఁ బెద్దన యపు డల్లన నేలమీఁద నొలి కిన, తన శుక్లము వామపాద తలమునఁ బమ రెన్. బ్రహ్మపి. 1 166.

వేల్పుకూఁటికుండ వి (వేల్పు+కూఁడు+కుండ.) అమృత కలశము.

సీ కొని పోవు నావేల్పు కూఁటికుండ సువర్ణుఁడీ తేనె మావియుం జెఱఁగనేని...రా వి 3 88.

వేల్పుగట్టు వి (వేల్పు[1]+గట్టు,) మేరుపర్వతము.

ఆ అంత వేల్పుగట్టు వలవి మీఱఁగ నొక్కొ, దెసలఁ జూచు నిచ్చ దివుటనొక్కొ, విన్ను దాఁట నొక్కొ గన్నదిపాడవున, నిక్కుమంచు గొండఁ కెక్కె నతఁడు అచ్చ భా 2 26 పౌ.

వేల్పు(లుపు)గాణ వి (వేల్పు+గాణ ) 1 దేవ గాయని, అప్సర స్త్రీ

వ వేల్పుగాణలు పాడు లక్ష్మి నారాయణుల కల్యాణంపుఁ బాటలన్ ... మనుచ 5. 71.

2. గంధర్వుఁడు.

చూ వేల్పుగాణ తూపు

వేల్పుఁగాణతూపు వి (వేల్పుగాణ+తూపు) గంధర్వాస్త్రము.

గీ మయుఁడు దబ్బర మీఱనేమమునఁ జేసి, యిడిన ముళ్ళిక్కగడంక నీరేమతలల, తోడి వేలుపు సిమ్మినఁ దోవ వేల్పు, గాణతూపేసిదాఁ దానిఁ గ్రమ్మరించె అచ్చ. రా. యు, 381.

వేల్పు(లుపు)గిడ్డి వి (వేల్పు[1]+గిడ్డి) కామధేనువు

సీ. దొడ్డఁ బెట్టిన వేల్పుగిడ్డి కాఁపు మనువ 1. 66.

వేల్పు(లుపు)గుబ్బలి వి (వేల్పు[1]+గుబ్బలి) మేరు పర్వతము.

ఉ ముంగు పసిండి తమ్మి జలు మొగ్గలమొగ్గర మావరించు మేల్, చిందెడు వేల్పుగుబ్బలి వజీరుని జీరు వధఃకరింపఁగాఁ, గ్రొందలిరాకు బాకు దొరకున్ దొరఁకించు భవంబు చెల్లరే, చందన గంధి చన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యా యుపేంద్రుఁడో కృ శకుం 2. 12.

వేల్పు(లుపు)గొంగ వి (వేలుప+గొంగ) దేవద్వేషి, రాక్షసుఁడు.

గీ. వేలుపగొంగయుఁ గడలేని వేడ్కతోడ, నపుడె తపదివి సేఁగి చెయ్యమున నింటి, చెంత పూఁదోఁటలోన నచ్చెలున నునిచి, కఱకు రాకాసి కొమ్మలఁ గావుపెట్టె. అచ్చ రా అర 77.

వేల్పుజడదారి=వేలుపుజడదారి వి నారదుఁడు, సురమౌని.

గీ. వినుము కత వేలుపజడదారి విన్నచూలి, మేవరుల నట్టు పుట్టవు మేటితపసిఁ, గాంచి యిట్లను నంత నగ్గట్టు మీఁద దఁటి రాఁగవుల వలికి దాటి చనుచు అచ్చ రా అర 2.

వేల్పు(లుపు)టావు వి (వేలుప[1]+ఆవు. కామధేనువు

సీ వేదాది విద్యలు విశ్రమించిన తావు విబుధ కోటి బంతి వేలుపటావు ... రాజ చ. 8 7.

శా పాల్యన్ మెచ్చి కొమాళ్లు గన్నఁగఁ దదీయ గ్రాంతి యొతో మనస్కోద్యైకై కనిపింప ల పట్టడెన్ స తాన బాహుళ్య మా ,గల్యం కొందియు వేలుపటావనఁగ నింకం బుత్రశోకంబు కౌసల్యా దేవికి నేకపుత్రకుఁ దరించన్ శక్యమా యక్కటా చం. రా 4. 94

వేల్పు(లుపు)టూరు వి (వేలుప[1]+ఊరు.) దేవపురి, అమరావతి.

ద్వి. ధారుణీ స్థలి సంపదలచేత వేలుప,టూరు గేలించు కోడూరు నా వెలయు ... ద్వి పరమ 3. 168. పా.

వేల్పు(లుపు)టేనిక వి (వేలుప[1]+ఏనిక.) ఐరావతము.

సీ. వేలుప టేనికలయ్యెఁ బోలప నేనుఁగులెల్లఁ గొండలన్నియు వెండి కొండలయ్యె .. అచ్చ. రా అయో. 20

వేల్పుటేఱు=వేలుపుటేఱు వి బొ (వేలుప[1]+ఏఱు) దేవనది, ఆకాశగంగ.

మ కినుకం బుట్టిన యట్టి మౌని హృదయక్లేశంబు శాంతంబుగాఁ, ముని శిష్య ప్రకరంబుతోడ గమనౌన్ముఖ్యంబునన్ ముచ్చటల్, తనియం జెప్పుచు వేలుపటేటి నికటస్థానంబు నందుండఁగాఁ, వనజాతాప్తుని మండలంబుదిగియె న్వారాశి దిక్సీమకున్ భీమ. 2 23

ద్వి శ్రమము దీరఁగ నిల్చి జననాథ తిలకుఁ,డటఁ జని ముందట నా వేలుపటేటి, తటమున .. ద్వి మారిశ్చ ఉ 47 పం

వేల్పు(లుపు)టొడయఁడు వి (వేలుప[1]+ఒడయఁడు) దేవేంద్రుఁడు

ఉ అత్తఱి జోగి వేలుపటొడయండెద నాతని మెచ్చి కూర్మితో, నెత్తి కవుంగిలించుకొని హెచ్చగ వేలుపులెల్ల సొంపు దళుక్కత్తఁగఁ జేరి ప్రేలుముల నోరెపుఁ బాళ్లగొనంగ గిత్తరా, శత్తడి ఱేఁడెదం దనియఁ దప్పక జన్న మొనర్చి యంతటన్ అచ్చ. రా బాల. 128

వేల్పు(లుపు)డిగ్గియ వి (వేలుప[1]+డిగ్గియ) సురదీర్ఘిక, గంగానది.

క వేఁమి యగ్గి పొగల్దగు, వేలుపుడిగ్గియ మునింగి వెలువడు నమరీజాలము తిన్నని పెన్నెఱి, వాలుఁగురుల కగరు ధూపవైఖరి యగుచున్. కువల 2. 67.

**వేల్పుడు** వి (√వేల్పు) పూజ

గీ .. క్రూర మృగంబులఁ గార్ముక ప్రముక్త నారాచములఁ గూల్చి భక్తితోడ, జనకునకు వేలుపు డొవరించి సకలలోక,సమ్మతము లగు కార్యముల్ సలుపుచుండ. అధ్యా బాల 12 పొ.

**వేల్పుఁ(లుపు)దపసి** వి (వేలుపు$^{1}$+తపసి.) దేవ ఋషి, నారదముని

గీ వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి, పల్కె రా చందమామ లప్పగిదిఁ బంప, కడ మెఱంగఁగ నద్దరి గట్టుమీఁద నుండి కన్గొని ప్రొద్దు కుట్టుండు దలఁకి అచ్చ రా కిష్కిం 2.

**వేల్పు(లుపు)దొర** వి. (వేల్పు$^{1}$ + దొర) దేవేంద్రుండు.

సీ. మిగులఁ గుసపసము పన్నగ లోకభర్తకు వేఱొక్క వెరిమావు వేల్పుదొరకు .. రామా 1 47.

గీ సూర నిఘఁడై నపింగళి సూరవిభుని, దొరయ. లోఁ డొరుఁడల వేలుపు దొరయకాని . ప్రభా. 1 26

**వేల్పు(లుపు)దొరగౌరు** వి (వేలుపుదొర + గౌరు) ఐరావతము

చ కనఁదగు తెల్లమాలికపుఁ గప్పుల నొప్పెడు చప్పరాలలో., దన పాడమైన నీకఁగని తాళక యేనుఁగటంచుఁ గొమ్ములన్, ఔనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిన్, గనుఁగొని పాలువేలుపు దొర గౌరతఁ డౌదల మన్నరింపగన్ యయా 1 5

**వేల్పు(లుపు)దొరమానికము** వి. (వేలుపుదొర+మానికము.)

గీ.. కోట, కొమ్మలం చాడు తెఱగంటి కొమ్మలి డెడు, వేలుపుదొరమానికములు నవ్వీటఁ దనరు నీలా. 1 31.

**వేల్పు(లుపు)దొరవిల్లు** వి బొ. (వేలుపుదొర+విల్లు) ఇంద్ర ధనుస్సు.

వ. కొంత వడికి మెల్లన వల్లుట తునకలగు వేలుపు దొరవిల్లు నీ వెండికొండ తుదల బలువన్నె రత నంబుల...అచ్చ ఖా 2. ౬౦ పొ

**వేల్పు(లుపు)ప్రోయాలు** వి. (వేలుపు$^{1}$+ప్రోయాలు) దేవతా స్త్రీ, అచ్చర.

ఉ హోళి సువర్ణ వేత్రకరు లంతకమున్న పరాకు దేవ నీ, పాలికవంగ రాజ్యరమ కౌఁగి వెలుంగుచు వచ్చె వేలుపు ప్రోయాలు...పె కకుం. 1. 224

**వేల్పు(లుపు)ప్రోలు** వి. (వేలుపు+ప్రోలు) స్వర్గము

ఆ అపుడు ముసలి వేలుపు ఁటతివయై తనతోంటి కతయు నచటనున్న కల్లతపసి, తెఱఁగు నతని తోడ సెఱిఁగించి పసిఁడి తే,రెక్కి వేలుపు ప్రోలి కేఁగె నంత అచ్చ రా యు. 418

**వేల్పుఁ(లుపు)బడవాలు** వి (వేలుపు$^{1}$ + బడవాలు. కుమారస్వామి, దేవతల సేనానాయకుఁడు

గీ తపసి యిల్లాండ్ర చెలువంబు దలచి తలఁచి, మున్ను మచ్చిచ్చును విరాళి గొన్న చోటు, కనుపపులు వేల్పుఁ బడవాలుఁ గన్నచోటు, హర్ష మునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన మనుచ. 2 9.

సీ అలవేలుపుఁ బడవాలు నఱరు పొందొగడాలు ఖాసిల్లు కెందమ్మి కేసరాలు...ఇందు 1 130

**వేల్పు(లుపు)బాస** వి (వేలుపు$^{1}$+బాస.) దేవభాష సంస్కృతము

ఆ. పుట్టఁ బుట్టినట్టి దిట్టయు దీనిని, బోడమినట్టి పున్నెములగనియును, మొదలుగాఁగఁ గబ్బములు వేలుపుబాసను, గూర్చినట్టి వారిఁగోరి తలఁతు. నీలా 1 8.

**వేల్పు(లుపు)బువ్వ** వి (వేలుపు$^{1}$ + బువ్వ) చంద్రుఁడు, అమృతము

గీ భోగముల కండ యలవేలుపు బువ్వదండ, పతితులకు బొండ పేదలపైఁడికుండ, తమము రేయెండ విబుధామృతంపుటుండ, కొండ మాత్రంబె తిమ్మనపఁ డుండుకొండ రా. వి. 1 31.

**వేల్పు(లుపు)బోనము** = **వేల్పుల బోనము** వి (వేలుపు$^{1}$+బోనము) 1 అమృతము

సీ నెలదాలుపు నోవళఁబులకునై వేలుపుబోనమ్ము దెచ్చిన వారు వమ్మునాఁడు...రా. వి. 1. 71.

2 చంద్రుఁడు.

చ నెల ..జా,బిలి చలివెల్గు చంద్రుఁడు వెన్నెల రాయఁడు చందమామ రే.పొలఁతి మగండు వేలుపుల బోనము...చంద్రుఁడగు మహేశ్వరా. ఆం. భా 1 77

వేల్పు(లుపు) మన్నీఁడు వి (వేలుపు¹+మన్నీఁడు.) దేవేంద్రుఁడు.

గీ. పగలు రేలును బౌలస్త్య భటులొవర్చు, దుడుకుచే వేల్పు మన్నీని కొడుకుఁ గుట్టి, కక్కటక్కట పూవ శక్యంబె వజ్రధరున కిటువంటి యంబేద దొంతనంబు చం రా. 2 25.

సీ. వేల్పు మన్నీనికై వెఱచి పెక్కొదలలోనొదుగు కాటుక కొండ కొదమలనఁగ . యయా 2 13

ఇట్లే వేల్పు మన్నెవాఁడు

వ తలంపు ఊామిన్న గద్దియపై నెలకొన్న వేల్పు మన్నె వాని చెన్నున మన్నతిఁ గని... ఉ రా 6. 159.

వేల్పు(లుపు)మల వి (వేలుపు¹+మల ) మేరు పర్వతము.

చ. కదలి దళానముండు లయకాల ఘనా ఘన గర్జిత భ్రమ, ప్రద భట సింహ గర్జనలపార గుహా కుహరంబులానిసన్, బదులుగ మ్రోయు వేలుపుమల పజ్జకుఁబోయెఁ దదీయ పాదముల్, చిదురుపలై ధరం గలయఁ జేయుచు సేనలు గొల్వ నుద్ధతిన్. ఉ రా 4 256

వేల్పుమల వింటిదేవర వి శివుఁడు, మేరు ధన్వుఁడు.

గీ ఎపుడుఁ బాయకయున్న మిన్నేఱు దనరఁ, బేర్మి గొండల ఱేఁడను పేరుమెఱయ, వేల్పు మల వింటి దేవర పొలుపు దాల్చు, జన్నపుం దీని విడిమట్టు చలువగట్టు యయా 2 36.

వేల్పు(లుపు)మిన్న వి (వేలుపు¹ + మిన్న) సుర శ్రేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు

సీ సృష్టికర్త నటంచుఁ జెలఁగి నిన్ సృజియించి విడిచెనో మీ యన్న వేల్పు మిన్న .. ఇందు. 4 49.

వేల్పు(లుపు)రాతోఁట వి (వేలుపు¹ + రాచ + తోఁట ) నందనవనము

సీ విహరించు నొకపూఁట వేల్పురాతోఁటలఁ బొదలు గొజ్జఁగ పూవుఁ బొదలయందు.. ఉ రా 3. 100.

వేల్పు(లుపు)రాయఁడు వి (వేల్పు¹+రాయఁడు ) దేవేంద్రుఁడు

సీ పౌరుషంబున మించి పౌలోమి నెదనుంచి యలరెడు వేల్పురాయని విలాసము . ఉ. రా 6 159

వేల్పు(లుపు)రారాణి వి (వేలుపు + రాచ + రాణి ) శచీదేవి, ఇంద్రాణి

గీ వేల్పురారాణి సుతునకు వేడ్కసేయ, సంతరించిన వజ్ర పంజరమునందుఁ, దేజరిల్లెడు శారికా రాజమనఁగ, జంద్రబింబాంతరాళ లాంఛనము దనరె. భాను 3 17

వేల్పు(లుపు)రాజాయి వి (వేలుపు + రాచ + ఱాయి.) ఇంద్రనీలము

ఉ . వేల్పు,రాఱాల జయించు వేనలితెఱంగు హొరంగపురయ్య ... రసిక 3 56.

వేల్పుల గమికాఁడు వి (వేలుపులు+గమికాఁడు) ఇంద్రుఁడు

ద్వి నీరధి సురనర నికరశైలాధి, ధారిణియై నయాధారిణి వగచి, కవలి వేల్పులగమికాని చెంగటికిఁ, జని యింద్రునిఁ జూచి వెచ్చని యూర్పునోడ అ. మ క 1. 11 పొ 3 పం.

వేల్పులదొర వి (వేల్పులు+దొర ) ఇంద్రుఁడు

చూ వేల్పుల దొరవాలు

వేల్పుల దొరవాలు వి. (వేల్పులదొర+వాలు.) వజ్రాయుధము

సీ వెన్నుని యన్నన్న వేల్పుల దొరవాలు వటపది మోముల నలరుసామి

గీ..... గెల్పు.. యశము రామ. 213

వేల్పుల బువ్వ వి (వేలుపుల+బువ్వ.) 1 అమృతము

సీ బొడ్డున వెన్నుని బొడ్డు బిడ్డని మెప్పు వలన వేల్పుల బువ్వ గలిగియుఁడు . అచ్చ. రా యు 553

2. చంద్రుఁడు

మ అలరుం బున్నమరేలు మేల్ వ్రాయలుచే నవ్వీటిగాటంపు క్రొన్నెలజూ మేకల నాడు చేడియలు పూని్కన్ జెంతఁ గనవట్టు వేలుపుల బువ్వం డెలి నిల్వుటద్దమని కేలుందమ్ముల బట్ట నిమ్ముల గంధందెను గాకయందుఁ గలదే మున్నిట్టియున్ మట్టియున్ అచ్చ రా బాల 35

**వేల్పుల బోనము** వి (వేలుపులు + బోనము.) అమృతము.

సీ విన్న కేళాకూళి వేలుపుబోనము తడవుల నిడునడు పుడుకు దొడుకు . . అచ్చ రా యు 592

**వేల్పుల వెజ్జు** వి (వేలుపులు + వెజ్జు) దేవవైద్యుఁడు అశ్వినీదేవతలలో నొకఁడు.

సీ సుఖ భోక్తృల యజీర్తి మానవగా వేలుపుల వెజ్జు మందులపారె వెదకసాగె . దశా 8 69

**వేల్పులేగిడ్డా** వి. (వేలుపు + లేఁత + గిడ్డి + రా ) కామధేను క్రేపు

శా. దొడ్డా యీ కులమంచు నెంచఁ దగు సాధు స్తుత్య వంశంబునం, బొద్రత్నంబునఁ దేజరిల్లు జననంబుం బొందినన్ వేలుపు లే, గిడ్డా పోష్ట జన్నాలి కిమెయును సత్కీర్తిం బ్రదీపించినన్, గొడ్డాలైన వధూటి జన్మమది పేరోర్కనిమప్పుం బిమ్మహిన్ వైజ 1 63

**వేల్పువెలచేన** వి (వేలుపు + వెలచేవ) అప్సర స్త్రీ. దేవవేశ్య.

ఉ చక్కని దంచు వేలుపు వెలచావల కన్నను నాటఁకాట బెంపెక్కె నటంచు . ఉ. హరిశ్చ 4. 117.

**వేల్పువెలఁది** వి (వేలుపు + వెలఁది ) దేవతా స్త్రీ. అప్సర స్త్రీ

ఉ పీనుల కంటి తొయ్యలియొ వేలుపువెలందియొ జక్కిమోర లేఁ, జానయొ పక్కిరా చెలియొ జక్కుల వంగడపుం బడంతియో ... అచ్చ రా. బాల 144

**వేల్పువేల్పు** వి (వేలుపు + వేలుపు ) దేవదేవుఁడు.

ద్వి. భువన మోహనమూర్తిఁ బుండరీకాక్షు, నా వేల్పువేలుపు ఔపావపక మటియు, సేవించి... ద్వి పరమ 2 125.

**వేల్పు(ల)సాని = వేలుపుసాని** వి (వేల్పులు + సాని )
1 అప్సర స్త్రీ, రంభ

క .. . సరభసమున వచ్చు వేలుపుసానింగాంచెన్, ఉ రా 4 187.

2 శోస్యము చెప్పు స్త్రీ, సోదె చెప్పు వాఁడుది.

చ మన చరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పుల సాని చెప్పిన,ట్ల నిజముగాఁగ... కళా 3 185

**వేల్మి = వేలిమి** వి (√ వేల్చు.) హోమము.

గీ . . సతియు వాలఠ్కాశాక మంచితము వండ, నిల్మ కుండున కర్పించి వేల్మిదీర్చి . . ఆము 4 190

ద్వి చదువును సంధ్యయు జపమును వేల్మి, మొదలు ముట్టఁగఁ బోయి మోటనై బడలి . ద్వి. హరిశ్చ 1252

క శ్రీ కాళేశ్వరు సన్నిధి, నేకాంతము వేల్మి యీగియు శ్రాద్ధం, బేకైకము ..భీమ 3 118

**వేల్మిబొట్టు = వేలిమిబొట్టు** వి (వేల్మి + బొట్టు ) హోమకుండము నందలి భస్మముతోఁ బెట్టికొనిన బొట్టు, రక్ష

మ గొనబై దండములందుఁ గ్రొం బసుపు నిగ్గుల్ దేలు కాపీన బంధనము లుమ్మంజులు వేల్మి బొట్టుఁ గడు నందంబొందఁ గృష్ణా జినఁబునఁ గీలించిన జన్నిదంబులు మనోమోదంబు సంధింపఁగా, ఘనతం బొల్చు సమిత్కుశా హరణ రింఖత్ బ్రహ్మచారోత్కరముల్ విప్ర 1. 70.

**వేల్లనము** సం వి అ న 1 కంపము, వడఁకుట, కదలుట 2 (గుఱ్ఱములు మొదలగునవి భూమిపై ) దొర్లుట, లుంఠనము.

**వేల్లము** సం వి అ పుం. 1. చలనము, కదలిక. 2 కంపము, వణకు 3 వాయువిళంగము.

**వేల్లహలుఁడు** సం వి అ పుం చెడునడత గలవాఁడు, పోకిరి

**వేల్లి** సం వి ఇ. స్త్రీ పల్లి, తీఁగ, లత

**వేల్లితనము** సం విశే. (అ ఆ. అ.) 1. వడఁకునది, కంపించునది 2 వక్రము, వంకరయైనది

వి అ న 1 గమనము, చలనము, కదలిక 2 కంపము, వణఁకు.

వేళ వి సమయము, కాలము, నాఁడు

వేళము క్రి. విశే. శీఘ్రముగ, త్వరితముగ

గీ. ఒనరఁగ తొడ పేర్పులోఁ గాఁగుచున్న యాలఁ పాలు వడ్డించుటయు మౌనిపాలవేళ, మవలి వారల చేతికి నందియిచ్చు వడువున భుజించె వడు విపుల్యంటకంబు. పాండు 4 174

క. వేళంబె నలిల విహరణ, కేళరతిందేలి యా మృగీలోకనతా, చాల మునమంది యొుండొరు, తేలారుచు రథనమునఁ గేరుచు నగుచున్ ప్రబంధ 268

సీ. వేళంబుగా నభోవీధి దువాళించు గిబ్బతేజీకి నా కృతివాస నిరం 3 12.

వేళవాళిమి వి. (వెళ + వాళి.) జీవిత కాలమున కలుగు నిర్ణయము.

ద్వి చోళ వాళిక కాళ వేళవాళికిని, వత్తురే యన్య దైవంబుల యిండ్లఁ, జొత్తురే బస పు. 6 693. పం

ద్వి చోళవాళిక కాక క్షోణితలేళ, వేళవాళికి గర్తవే యట్టులవిన, స్వార్థ జంగమ పూజ నార్థమై యర్థ,మర్థ సంఘటనార్థ మది నీదు సేవ. పండితా. మహిమ. 297 పా 11 పం.

వేళాకోళము వి 1 పరిహాసము

వ తద్వృత్తాంతంబంతయు నడిగిన భృంగి యిట్లనియె నమ్మా నాకేల, నేనేమి జెప్పిన వేళాకోళంబయి తోఁచుఁ బరిహాసకుని దేలుగొడిచె నటన్న సామెత . మృ వి 3 95

2. చిక్కు (శ గ)

విశే చిక్కులు పడినది

క వేళాకోళపుఁ దిగెలుఁ, బేలి లుఁ గళాసము లను జిలుజడలుఁ దాఁ,దాలుచు పెట్లొకొమి టన్, లీలాహారిఁ దోలి నింత నేరవరి యయ్యెన్ కళా 1 72

వేళావుళి వి (సంగీ) రాగ విశేషము

వ వసంతంబు మాళవి బంగాళి నాట దేవక్రియ మేఘరంజి వేళావుళి మలహరి జాళి మత్స్య పురాణము 5 54

ద్వి సారంగ నాట గుజ్జరి మేఘరంజి వేళావుళియు బసవ పు 3 946. పం.

వేవిలి¹ విశే దుస్సహిది

క దేవార్చనా నిమిత్తము, దావేతోక తోఁట వేయఁ దలఁచి యతం డా తావు గృహస్థుల చేతన్, వేవిలి సుక్షేత్ర భూమి విలువకుఁ గొని యెన్ వైజ. 1. 83.

వేవిలి² వి (బ. వేవిలులు, వేవిళులు, వేవిళ్లు) పొలము.

సీ సస్యకై దార్యమాశ్వచ్ఛటాఖుర పుటీత్రుటితమై వేవిలి దుక్కిగాఁగ... రావి 2 67

క భావంబునఁ బుత్రాలి, ర్భావము గాంక్షించు పరమ పావనకా లీ,లావతికిఁ గోర్కె పంటల, వేవిళ్లన నొప్పు మీఱి వేవిళ్లగు రెన్ పరమ. 2. 169

వేవిళ్లులు(ళులు) వి బ పద్దైనఁ దినవలయు నని గర్భవతికిఁ గలుగు కోరికలు, భక్షణ వస్తు వాంఛాతిశయ రూప గర్భలక్షణ విశేషము.

గీ. అమరెఁ బొప్పడి దిప్పలై యంత నంత, మెట్ట దామరపాకుల మీఁదఁజాటి, పైఁడి చూలాలి వేవిళ్లు వాయఁదోఁట, కలిమి చెలివెట్టుకల వంట కంబు లనఁగ యయా 4 9

శా ఆహా మేఘణ దైవయోగమున గర్భాధానముం బొందినన్, వేవిళ్లయ్యె నరోచికంబు వొడమెన్ వెల్లఁదనం బాస్య రాజీవ వ్యాపకమయ్యె. . కాళ 4 7.

ఉ. మెచ్చితి వేఁడి కొమ్మనుడు మిత్రసహాండు కుమారుఁ గోరె నీ, కిచ్చితి నంచు నచ్యుతుఁడు నేఁగె పరామరుఁ డాత్మకాంతకుం, బెచ్చెరఁ దోఁచు వేవిళులు చెవఁగఁ బల్లటు వచ్చు పోటితో, ముచ్చట నూనె వల్ల చనుముక్కులు పెల్వెలఁ బటు చెక్కులున్ ఉ హరి 4. 9

ఉ చిట్టుము లంకరించె తిని చెక్కులఁ దెలుప నటిచెఁ గోరిల్, మట్టు దొంగె నన్నడల మాంద్యవిధంబు చెలంగెఁ గూర్కులోఁ, బెట్టుగ మించె నన్నడుము పెద్దతనంబు వహించె వేవిళుల్, దట్టములై జనించె నిటు తామరసాక్షికి నాఁడు నాటికిన్ ఇదు 2 185 పర 2 169.

వేవు¹ = వేగు¹ అ. క్రి. తెల్లవాఱు, ప్రభాతమగు.

క. వేవిన యంతకు నలువురు, జావంకంబులును గోలె సైన్యము వాహా, రావములతోడఁ జూడఁగ, దీవన వడయంగఁ దూర్పు తెల తెలవాఱెన్. ఉ హరి. 3 84

క. కావున నీ వీ రాతిరి, వేవెడు నీలోనఁబోయి వెస నౌషధముల్, దేవఱయు. భా రా యు. 1094.

ఉ వేవిన మేడపై నలభి వేడిచఁ జంట వహించి విప్పఁగాఁ, బూవులు.. ఆము 1. 69

వేవు² = వేగు² వి రాజ్య సమాచారము.

సీ జడనిధి బంధించి కడచి వత్తురు మూర్తురి వార్త యరయంగ వేవులేద, రాజు లేమటియున్న రాజనీతిస్థితి సచివు లేమటియుండు టుచితమగునే ..భా రా యు 291.

వేవుజాము వి (వేవు¹ + జాము.) వేకువజాము, వేగుజాము, తెల్లవాఱు జాము

ద్వి వేవుజామున నే గి వేఱొక్క రేవు, గావించి యుదుకుచు ఘట్టనల్ సేసి...బస పు 4. 14 వం.

వేవుర = వేగురు న బ. (వేయి శబ్దమునకు మహన్మహత్త్వర్థక బహువచన రూపము ) వేయిమంది, సహస్ర సంఖ్యగల వారు, అనేకులు, పెక్కండ్రు

ఉ వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొవ్వఁ బాయసా, హారము భక్తి బెట్టి ... భార సభా 1 14.

ఉ వేవురు చంద్రులొకఁ బదివేవురు సూర్యులు లక్ష పావకుల్, ప్రోవయి యున్న యట్టిదగు భూరి తరం బగు తేజము...హరి ఉ. 9. 197

క ఆవేళం బదునాలుగు, వేవురు గోలుపంగ వేఁట వెంబడి నొక భిల్లావని పతి వచ్చుచు.. వరాహ 8 67

చ. విరటుఁడు చూచుచుండ నిను వేవుర ముందట నట్లు ద్రోవ. భార విరా. 2 257.

క వేవురఁదోలెడు వాని మహావీర్య గుణాఢ్యు నొక్క యాత్మజుఁ బడయం,గా వలతునపేత గుణుల్, వేవురు మతులయ్యునొందు విఫలము కాదే. భార ఆర 2. 350.

చ....తన్వరునిగఁ గోరువారి లలనామణులు బది యారు వేవురం, బరిణయమయ్యె . పారి 1. 37

వేవెలుఁగు వి (వే + వెలుఁగు ) వేయి కిరణములు గలవాఁడు, సహస్రాంశువు, సూర్యుఁడు

చ తిరముగ వింట వేవెలుఁగు దేవునిఁ గన్గొని వట్టి యాస నిబ్బరముగ నేఁగి చేఁగడమిఁ ఒట్టిన లావరి నేల చెల్వ కూతురి చలువంపు తేనియెద తుందుడు కెల్లను దీర్చినట్టి యాకరువలివట్టి నాడుమదిఁ గల్గిన కోరికలెల్ల నీవుతన్ బహు. 1. 8

వేవెలుంగుల దొర వి (వే + వెలుఁగులు + దొర ) సహస్రాంశువు, సూర్యుఁడు

గీ వే వెలుంగుల దొర జోడు రే వెలుంగు .. మనుచ 1 18.

ఇచ్చే వేవెలుఁగుల వేల్పు.

క. ఆవేళ దివిజ కానన, దావాగ్ని నభ స్సరోభి ధామఁడు రక్షో, దేవుఁడొక మహారథమున, వేవెలుఁగుల వేల్పు కంటె వెలుఁగుచు నుండెన్. కకు 2. 94.

వేవే క్రి విశ వే యను దాని యామ్రేడిత రూపము. మిక్కిలి శీఘ్రముగా, అతి శీఘ్రముగా.

క ఆ యస్త్రము వలన మహా, సాయకములు శత సహస్ర సంఖ్యంబులు వేవే యుప్పతిల్లి పాదిరెన్, త్రైయంబక మగు రథం బుదగ్రస్ఫూర్తిన్. హరి ఉ 8 137

క ఆ వసుధాధిప నందనను, వేవే దోఁడ్తెమ్ము మాధవీ గృహమునకున్. దశకు 7. 74

క కావేరి దరులు గట్టఁగ, వేవే పల్లవుండు దనదు వెట్టికి రామిన్,దావాని మదుటి కనువాం,గా వడిఁ గరికాల విభుఁడు గాలందుడిచెన్. ద. శా. 628, 1146. శ.

వేవేగ వి (వేగ + వేగ ) అతిత్వర, అతివేగము

క వడముడి యరిగిన తెరు వేర్పడఁ గనివేవేగ రథము వఱపెం గదియన్ ... భార. భీష్మ. 2. 189.

గీ. పిలువఁ బంపుము వేవేగఁ బెండ్లికొడుకు ... నైష. 6. 36.

శా...శమానాయకుల్, వేవేగ న్వినయంబుతోడ
నిజతన్వీ మౌళి రత్నాది నానా వస్తువ్రజ మంపి
నన్ .కళా. 6 116

**వేవేలు** న బ (వే+వేయి) పెక్కువేలు, వేనవేలు, అనేకములు

గీ వేదములు నాల్గు వేవేల నిధులఁ బొగడ...
నైష. 8 129.

గీ వలపు టంగడివీథు లేరవఱచి కొంచె, పాటిన
డగని నెక్కి యా పాతమెల్ల, విడియ నియ
మించి తిరిగి వేవేలు దివ్వటీల వెలుఁగున
సంగీత మేల మమర, కవల 2. 85

శా. కావేరినది మున్నుగా నదుల సంఖ్యల్ విశ్వ
విశ్వంభరన్, వేవే లెవ్వరు గ్రుంకిన దలఁచి
నన్, విన్నన్ మహాపాతక, గ్రావవ్రాతము
వజ్రపాత హతి భగ్నంబౌ గతిన్ బోవుటల్,
శ్రీవిష్ణుస్థల వాససేవనగదా ... శ్రీరం మా
2 6.

**వేశంతము** సం. వి అ పుం 1 చిన్న సరస్సు, పల్వ లము, నీటిగుంట 2 అగ్ని

**వేశదానము** సం వి. అ పుం ప్రొద్దు తిరుగుడు పువ్వు

**వేశనము** సం వి అ. న 1 ప్రవేశించుట, ప్రవేశము. 2 ఇల్లు.

**వేశనారి** సం వి ఈ స్త్రీ. వేశ్య

**వేశము** సం వి. అ పుం 1 ప్రవేశము. చొచ్చుట. 2 మార్గము. 3 గృహము, ఇల్లు. 4 వేశ్యా గృహము. 5 వేషము. 6. వస్త్రభూషణాదులచే రూపాంతరము నొందుట, మారువేషము 7 కూలి, జీతము

**వేశ(శ్వ)రము** సం వి అ పుం. వేసడము, కంచర గాడిద

**వేశ(స)వాసము** సం వి అ పుం వేశ్యా నివాసము, వేశ్యలుండు తావు.

**వేశ్మకర్మము** సం వి చ్. న ఇల్లుకట్టుట, గృహ నిర్మాణము

**వేశ్మభువి** సం వి ఈ స్త్రీ నివేశన స్థలము, ఇల్లు కట్టఁదగిన ప్రదేశము.

**వేశ్మము** సం. వి న్. న ఇల్లు, గృహము, నివాస స్థానము.

**వేశ్య** సం వి ఆ స్త్రీ భోగముది, పణ్యాంగన

**వేశ్యము** సం వి అ న వేశ్యాగృహము, వేశ్యా నివాసము

**వేశ్యాచార్యుఁడు** సం వి అ పుం. 1 వేశ్యలగురువు 2. కుంటెన కాఁడు

**వేశ్యాపణము** సం వి అ పుం. వేశ్యకిచ్చెడి సొమ్ము.

**వేశ్యాశ్రయము** సం వి. అ పుం వేశ్యలవాడ, భోగమువారి వీధి

**వేషణము** సం వి అ. న ప్రాప్తించిన వఱచుకొనుట, భుక్త పఱచుకొనుట

పుం 1. కసివెంద (వృ. వి.) 2 చేఁతిపొట్ల. (వృ వి) 3. ధాన్యము. (వృ వి.)

**వేష(శ)ధారి** సం విశ (న్ జి. న్.) మారు వేషమువాఁడు,

వి న్ పుం 1. వంచకుఁడు, కపట సన్న్యాసి. 2 నటుఁడు, నాటకమున వేషము వేయువాఁడు

**వేషము** సం. వి. అ పుం 1. వస్త్రభూషణాద్యలం కారము.

గీ. తగిన వేషంబు దనుఁదాన పొగడు కొనమి,
నొచ్చియును గీడు పలుకమి యిచ్చి నగవ,
కునికి దనకెంత వడవక యున్నఁ బథము, తప్ప
కుండుట వడవడి కొప్పుసేయు శార చదో్ి.
2. 45

2 వస్త్ర భూషణాదుల చేత నయిన యొప్పిదము, చక్కఁదనము 3. వస్త్రాలంకారాదులచే మారు రూపము నొందుట 4. వేశ్యాశ్రయము, భోగమువారి వీథి.

**వేష్టకము** సం వి అ పుం 1 ఆవరణము, కంచె, వెలుగు. 2. గుమ్మడికాయ, కూష్మాండము.

న. 1 తలపాగ, శిరోవేష్టనము 2 ఉత్తరీయము. పైబట్ట 3 చెట్టుబంక 4 కర్పూర తైలము

**వేష్టనకము** సం వి. అ పుం రతిబంధ విశేషము.

**వేష్టనము** సం వి. అ న 1 ఆవరించుట, వలు వైపులఁ జుట్టుకొనుట 2. చుట్టుకొనుట, చుట్టఁ బెట్టుకొనుట. 3 కప్పు, మూఁత 4. తలపాగ శిరోవేష్టనము 5. ఆవరణము, కంచె, వెలుగు 6 ఒడ్డాణము, నడికట్టు 7. బంధము, కట్టు 8 కర్ణశష్కులి, చెవి. 9 గుగ్గులు వృక్షము, గుగ్గిలము. 10 గ్రహించుట, పట్టుకొనుట.

వేష్టము[1] వి డేగలలో నొకజాతి
సీ. వలచేత మణిముద్రికల కాంతి దిశలందు మొనయ వేష్టవు డేగ ముష్టిఁబట్టి . ప్రబంధ 233

వేష్టము[2] సం. వి. అ పుం 1 ఆవరణము వేయుట 2. ఆవరణము, కంచె. 3 తలపాగ, శిరోవేష్టనము 4. చెట్టుబంక 5 కర్పూర తైలము

వేష్టసారము సం. వి. అ పుం కర్పూర తైలము

వేష్టవంశము సం. వి. అ పుం ఒకజాతి వెదురు

వేష్టించు సం. స. క్రి 1 చుట్టుకొను, చుట్టవాఱు, వేడించు
క. మునులును వేష్టింప భూతములు వినుతింపన్. భార. శాం. 4 452
గీ ఆ విధాత మునీంద్రులు దేవతలును. దన్ను వేష్టింప వచ్చె సత్వరముగాఁగ . భార శాం. 6 444.
2. పరివేష్టించు, చుట్టివచ్చు
మ ... విషధరుల్ వేష్టింపఁ గాలూఁదవో ... వసుచ. 3 30

వేష్టితము సం. విశ (అ ఆ అ) 1 చుట్టు వాఱుకొనఁ బడినది ఆవరింపఁ బడినది. 2. మూయఁబడినది 3 ఆఁపఁబడినది, అడ్డుపెట్టఁబడినది. 4. ముట్టడింపఁ బడినది
వి అ న చుట్టుముట్టుట, ఆవరించుట

వేష్టువ వి (సం. వేష్టనం) ధోవతి
సీ. నీ పుట్టగోచియు నీ కావివేష్టువ ల్వారకాంతకుఁ గట్టు చీరె లౌనె వైజ 103.
సీ. పెన్నులి క్రాటఁ గీల్కొన్న కౌపీనంబు వితతంబు నీర్కావి వేష్టువలును . వైజ. 2 5.

వేష్ప(ష్య)ము సం. వి. అ పుం జలము, నీరు.

వేసఁగి = వేసవి వి (సం. వైశాఖః) 1 ఉష్ణకాలము, గ్రీష్మర్తువు
ఉ వేసఁగి వెట్టఁగ్రాఁగి పృథివీతల మంతయు వేఁడి మంగలం బై సెకలీనఁ బ్రాణి వివహంబులు లాజలు వోలెఁ బ్రేలఁగా ... వైజ. 1. 99

వేసగాఁడు విశ (వేసము+కాఁడు. అన్యుల వేషములను ధరించువాఁడు (గ్రా.) స్త్రీలు మున్నగువారి వేషములు వేయువాఁడు (శ. ర.)

వేసట వి (√వేసరు) శ్రమము, అలయిక, అలసట.
ఉ వేసటలేక భీమ పృథివీపతి నందన యానవాంబుజో,ల్లాస విరక్తి ముద్ర పదిలంబుగఁ గన్గొని ... నైష. 5 163
క ఈ సరణి ధరణి పతియు వి,లాసవతీమణులు బహుకళా నిపుణతలన్, వేసటలేక అత్యాంతశ,యాసన సుఖవార్ధి నోలలాడుచు నుండన్. వరాహ. 4 66.
క. ఇటు లెండకు వానకు ను,త్కట తరమగు చలికి వెఱక కంపింపక వే,సటఁ బడక కుంభకర్ణుఁడు, పటునిష్ఠ ఘటించెఁ దపము పదివేలేడుల్ ఉ. రా 2. 162.
క. అలపున్ సొలుపున్ వేసట, తలఁపున్ జన్మానల నలువు తను మధ్యమువన్, బలుపున్ మై తెలుపున్ జెలి, పొలుపున్ గాంచి గుసగుసలఁ బోవుచు గాంతల్. ఉ. హరిశ్చ. 2 92 పం

వేసటపడు అ క్రి. (వేసట+పడు) శ్రమమునొందు, అలయికఁ జెందు.
చ ... నమ్ము మ,న్నుటకు గురుండ వీవెయని చొచ్చితి నీ యిలుగాన నింక వే,సట పడనీక నా కనులు చల్లన నిన్ గనఁజేయు మ్రొక్కెదన్. చెన్నబ. 371.

వేసడము[1] వి శ్యేనవిశేషము, ఒకజాతి డేగ
గీ మృగయు లంతటఁ దెచ్చిరి లడుగు గిడ్డు, జాలె జలకట్టె కణుజు వేసడము బైరి, కురుజు వారిణ యను డేగ కొలము సాళు, వముల . పి. శకుం. 1. 110.
గీ కఱకు టంఘ్రుల నిఱికించి గజ్జె గదలఁ, గఱికి చెఱినెఱి కోలెమ్ము కయును విఱుగ, విఱిచె వఁడిగైజు నొకపెద్ద వేసడంబు.. మనుచ. 4 58.
క బలువైన వేసడంబులు. జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గి,డ్డులు మొదలుగఁగల విడి వేఁ,టల పులుగులు పదనుతో మిటారింపంగన్. యయా. 1 40

వేసడము[2] వి. (సం వేసరః) కంచరగాడిద, అశ్వతరము.

వ. ఒక్క యింటి మచ్చెకంటి పంచాశద్వర్ష దేశీయ పలిత పాండరంబైన వేణీశాఖరంబు గైవడ ముదుసలి చక్రవాకంబులతో నెక సక్కెంబాడు వీఁగు చన్నుల ప్రేఁగుదవంబునఁ దవ తనూవల్లి జలదరింప. భీమ. 2. 110

**ప్రేఁగుప(వ)డు** అ.క్రి. (ప్రేఁగు+పడు) బరువెక్కు, బఱువు కలవగు.

గీ. ఒంటిఁ బోరువుల లేఁజెమటలు నూసి ప్రేఁగు, వడిన చాడ్పున నవయవ భంగులందుఁ, దగిలి మఱపునఁ దడయు.. భార. విరా. 5. 195.

క. నీవ నిను నెఱుఁగకుండిన, నే వాక్కిఁ దెలుప వచ్చు నిట సకల లో,భావహ మగు నీ యుగ్ర పు, భావమునకుఁ జాల ప్రేఁగు వడినవి జగముల్. హరి. ఉ. 8. 153.

మ. జగతీజంబుల శాఖలెక్కి మురళీ శబ్దామృత స్యందమున్, మిగులన్ వీనులఁ ద్రావి ప్రేఁగు వడి నెమ్మిం గృష్ణు రూపంబు చి,త్తగమై యుండఁగ... భాగ. 10 పూ. 790

**ప్రేఁచు = వేఁచు** స. క్రి (√ప్రేఁగు.) వేఁగఁజేయు. (శ. ర)

**ప్రేఁడు** వి. గొల్లవాఁడు (బ. ప్రేలు)

ఉ. రేపటి పూఁట నెన్నికొని ప్రేఁడు పసింగొని పోయి మేపి తా, మాపటి పూఁట నెన్నిన క్రమంబున నీఁదగుఁ జెచ్చెనేనియుం, గోపరిపాలకుండు చెవిఁ గొమ్ము నిజ బుగఁ జూపి శుద్ధుఁడౌఁ, జేపడి ముచ్చుకొన్న యెడఁ జెచ్చెరఁ జెప్పకయున్నఁ దప్పగున్. విజ్ఞా. 2. 10

ఉ. ప్రేని తమాజుఁ డొక్కరుఁడు వీర్య సమగ్రుఁడ పోలె వచ్చి నా, పూనిన పూన్కి యంతయును బొంకగు నట్లుగఁ జేసె నేను నా. సేనయు దాడి వెట్టెద విశృంఖలతం బ్రతిపక్షువెంట మీ, రి నెఱికిన్ సహాయపడు టిప్పుత మేవిఁ గదంగుఁ డుక్కునన్. హరి. ఉ. 3. 99

గీ. ఆకట యెచ్చోట నున్నవాఁ డతని తండ్రి, వేగ యెఱిఁగింపరే లావు వెంపు గలుగు, ప్రేలు విడిపింపఁ గలయట్టి విధము తెల్లఁ, జేయఁ దగవు రారే యని కూయుటయును, హరి. పూ. 7.28

శా. ఆలాపించుచు ప్రేలు ప్రేఁతలుఁ బ్రభూతాశ్చర్యులై రందఱున్... భాగ. 10. 257.

**ప్రేఁత** వి. (√ప్రేయు) 1 దెబ్బ

క. ఆ సూర్యభానుఁ డీక్రియ, ప్రేసిన యప్పరిఘ దనుజవిభుఁ డధిక బలో,ల్లాసనమునఁ బుచ్చుకొని పొడి, చేసె నసురు లార్వ నతని శిరమొక ప్రేఁతన్. నిర్వ. 4. 56.

2 ప్రేయుట

క. కొండొక సేపునకుఁ దెలిసి, చండ గదా దండమున నసహ్య క్రోధో,ద్దండత బలు ప్రేయఁగ నా,తండా గద విఱుగఁ జేసెఁ దనగద ప్రేఁతన్ హరి. ఉ. 1. 129.

భోగినీ దండకము. తల్లి రాజుల్ బహు వ్యాజులే భోజులే చంచల చ్చిత్తులే మత్తులే ప్రేఁతకాయత్తులే నూతనాసక్తులే లోభ సంయుక్తులే దోష సంసిక్తులే. .

**ప్రేఁపు = వేఁపు** వి. (√ప్రేఁగు) ప్రేఁపుడు, వేగఁ జేయుట (శ. ర)

**ప్రేఁపుడు = వేఁపుడు** (శ. ర)

**ప్రేటు** వి. (√ప్రేయు) 1 (కత్తి మొదలగు వానితో) కొట్టుట, ప్రేయుట.

గీ. పోరి రేటును ప్రేటును బోటు నొక్క,యలవిఁ జెలఁగంగ నుభయ సైన్యముల వారు... భార. భీష్మ. 3. 225

గీ. చలము కోఖిల్ల నొండొరు సమయఁ జేయ, వేగపడి పెల్లుహొంచుచో ప్రేటుఁ బోటు, నాటు నగపాటు నొండొరు బోటుపడక, దారుణంబుగఁ బోరి రవ్వీర వరులు. భా. రా. ఆది, 2. 137.

సీ. వ్రేటున కనువైన రీతిమైఁ దమవారె నన్న
వెంబడిగ నశ్వములు మెలఁగ...కళా 3 68

2. దెబ్బ.

గీ. అలుక యంతంత కెక్కఁగ హలధరుండు, విమతుఁ బోరిగొందు విఁకొక్క వ్రేటువ్రేసి, యని తలంచుచుఁ బెను గద హస్తతలము, నంద మర్చి యుగ్రపు దృష్టి నతనిఁ జూడ వారి. ఉ 2 62.

క దగ్గఱి యేసిన చాంద్రుఁడు, ప్రగ్గక గదఁ గొనుచు వ్రేటు పరగునఁ గొన్నన్, మొగ్గరము లోన నిరువుర, యగ్గలికలు మెఱసె గదలు నాకస మంటన్ ఉ. హరి 3 61

చ. అద విని వ్రేటువడ్డ యురగాంగనయుం బలె నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశన కీల యనంగ లేచి...పారి 1 82

క. నావుడు వరి ఖాళీంచెద, వీవుండుట యెటిఁగి కాదె యిది వ్రేటుగ నేఁ, గావించితిఁ జేరికిఁ దగ, లావించుక గలిగెనేని లటపటలేలా ద్వా 7 29.

ఉ పోటుల వాతఁబోవు భట పుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్, వ్రేటులఁ గ్రీడసలిపి పృథివిం బడు వీరులఁ ద్రొక్కికొంచు నెచ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వట్టు సేయుచున్. భార విరా 3. 168.

వ్రేటుగొను స. క్రి (వ్రేటు+కొను.) కొట్టు.

క అమ్మెయిన వైనతేయుని, గ్రమ్మన నొక వ్రేటు గొని తగఁ దిరుగు నెడన్, నెమ్మది నవ్వుచుఁ బ్రభుఁ డొక, యమ్మునఁ దునుమాడె నతని యాయుధ వరమున్. హరి. ఉ 4 164

గీ తప్పులేకుండ నేల నెత్తమ్మిమొగడ, విసరి వక్షః ప్రదేశంబు వ్రేటుగొంటి... హరి 1 27.

వ్రేటులాడు అ. క్రి. (వ్రేటులు+ఆడు.) దెబ్బలాడు, పోరాడు.

సీ దళము దళంబుతోఁ దాఁకి యగ్గలికమై నీడఁ బోవక వ్రేటులాడు నెడలు .. భార. విరా 3 164.

సీ. ఇరుదెఱంగుల దండు తెరసి యుక్కున వ్రేటులాడుచోఁ జెలరేఁగి యడవి ద్రిమ్మరులు ... అచ్చ. రా యు. 250

వ్రేత వి గొల్లది, గోపిక

ఉ వెన్నలు దిన్న తప్పునకు వ్రేతల మెచ్చుగ నాఁడు రోటితో, నిన్నటుగట్టి త్రోచిన యనీతి దలంచియొ నేఁడు నన్ను నో, వెన్నుఁడ యిట్లు సేసెదవు ... హరి పూ 7 37

క. రా తల్లి రమ్మ తండ్రీ, వ్రేతలు గోపకులు రండు వినుఁడీ గర్త, ఖ్యాతలమున ముందుఁడుగో, వ్రాతతుతో మీరు మీకు వలసిన యెడలన్. భాగ 10 పూ 918.

మ. కినుకన్ వ్రేతలు వచ్చి కొల్లలిడియెన్ గృష్ణుండు పాల్వెన్నలం, చనినన్ ... దశా. 9 196

వ్రేఁతె వి గోపిక, గొల్లది

ద్వి మెఱపుల యెడనెడ మేఘముల్ బోలుచు, తెఱఁగున శౌరి వ్రేతెల యెడనెడను. దన మూర్తి యలర నా తరళ లోచనలు ... అ. మ. క. 2 107. పా 12 పం.

భుజంగ ప్రయాతము వ్రేవ్రేతలన్ బిల్చినం గ్రోవిఁ దేఁ జాలు ప్రోఁడా అచ్చ భా 3 55 పా.

వ్రేపల్లె(ల్లియ) వి. (వ్రే+పల్లె.) గొల్లపల్లె, ఘోషము.

మ యదువంశంబున లోక రక్షణపరుండై పుట్టి వ్రేపల్లె నున్నద బాల్యంబు నటించి . భార. ద్రో 1 97

శా. గోపాలాంగన లెంత జాలిపడిరో కోపించితో దూఱిరో, వ్రేపల్లెన్నిఁట ధర్మగేహములలో విశ్రాంత చైతన్యతై ... భాగ. 10. పూ. 1482.

మ. . కోపముతో యశోద యది యేరా కృష్ణ వ్రేపల్లెలో, నను పాత్వోన్నలు కొల్ల పెట్టి తని యన్నన్ ... దశా 9. 196.

**వ్రేపాప** వి. (వ్రే+పాప.) గొల్ల పిల్లడు.

దండకము. వంపు దీపించు నీ ప్రోపు వ్రేపాపలం గ్రేపుల నైన్వ రీశ్య బుగా౯ జాపి యా పద్మజుం డొక్కచో డాచినన్. పా. 3 68

**వ్రేయించు** స. క్రి (√వ్రేయు) 1 మూయించు, మూయునట్లు చేయు.

గీ. ... అమ్మోయి గురునకుం బరిభవంబు, సేసి యిమ్మోయి బలుకంగ చేయునదియుం, గలదె యీ రాజు సన్నిధిం గాన బలికి, తింకం బలికిన వోరు వ్రేయింతుం జముష్ఠ భా. ద్రో. 5. 365.

2. మ్రోగించు

వ. ... నారాయణు డు వులువాడు

మ. కదంకం బన్నంగ నానతిచ్చె జతుగంగ బల్ రణ క్రీడకు, న్వేడలన్ డిండిమ దుందుభుల్గుభుల వన్ వ్రేయించి ... ఉ హరి 4 212

మ. అనినన్ భోజ మహీవిభు డు ఇయ కలాపం తో గ్ర ధారధర స్తనితాభిల పటుప్రయాణ ముఖ నిస్సాణంబు వ్రేయించినన్ .. జై భా 3. 56

**వ్రేయు = వేయు** స. క్రి 1 కొట్టు, ప్రహరించు

క. ఈ యిరువురుం బంచినపని, సేయుదు రచె ధర్మజునకు జేకుఱని తలం, పే యది యతనిం దొడరుట, వేయేటికి జముని శిరము వ్రేయుట గాదే. భార ఉద్యో 2 122.

చ. విడిలిచియు నొగ్గిల్చియును వ్రేసియుం ద్రుంచె నతండు వ్రేల్మిడిన్ .. హరి ఉ. 10. 255.

సీ ... భూరి శిరము, పుటియలుగా రక్తపూర ముల్ గ్రక్కంగ వేమాఱు సేలతో వ్రేసి వ్రేసి ... శా. రా ము. 402.

సీ శిరములు మేనులం జేప్ప భావించి నిజాస్యముల్ వ్రేసికొంచఱచువారు ... భార స్త్రీ 2. 23

2 నఱకు, ఖండించు

క . వసియు డాసిన మృగముల నెగిచిభుజాసిన్, వ్రేసియుం జంపెను . భార. అది 4. 13.

ఉ వారలు నా సుధర్మ విభు వధ్యశిలా స్థితుంజేసి ఘోర దుర్వార కుఠార ధార నవివారణ వేయంగ నుత్సహించినన్ . విక్ర. 7 163

సీ కడి కండలుగ పీనికలర బు వ్రేయుండు గర సావ బట్టిన ఖడ్గధారం ... కాశీ 3 152

3. చంపు.

శా శిలా నిర్మిత స వ్వజంతు వన బల్మిం జేరు కొన్నట్టి శార్దూల, బొక్క జ న్నప్పగ బు నొకచో దుర్దా తమై వ్రేసి త త్కీలాలంబది మున్ను గ్రోలి యందరో ద్దీవ్య ద్భుభుజానల, జ్వాలల్ తన్నలపంగ దర్పె శితమాంసం బొంది భక్షింపంగన్. కేయూర. 3 114

4 మ్రోగించు.

ఉ దిగ్గన లేచి ప్రయాణ సంభ్రమ, శ్రీ వెల యంగ దుందుభులం వ్రేయుం డటన్నను భృత్యు లబ్ధి సంరావ విడంబి భాంకృతులు రంజిలం జేసిర ది క్కటంబులన్. ఇందుం 1 186.

5 తట్టు, చఱచు

గి అనుచు నా దొరు చెయి వ్రేసి యపహసింప, హరియుం గలకల నవ్వె . ఉ హరి 4 161

6 ఉంచు, పెట్టు.

మ. .. నిలోపమింపై చెలం, గొడియం జేవిర దమ్మి వ్రేయుటకునై యుంకించి బంకించినన్, పారి. 1 129

7 కట్టు.

చ చొరంబడి కాంచ ప్రాంతలును చుట్టియుం గత్తులు వ్రేసి నందిటం, బెరయంగం బట్టి చెక్కు గఱపించి గిరేరడ గీచి నిల్పి, కొక్కెరయగం

జూచి పందియపు టిక్కువ దిద్దుచుఁ జిక్కువేసి స్వైర మరిపో యటంచును ఖళిపెఁ పుంజులు దన్నులాడఁగన్ హంస 3 216

8 పాఁబవైచు

సీ మత్సరగ్రస్త పామరుల కీఁదలఁచిన విడువక నొక మూల వ్రేతు రసుచు ... ఘటికా 1 15

9 నాఁటు, పాఁతు

గీ కవుల పీఠంబు లావంద కావనమునఁ, జెట్టు వ్రేసిన చోట నక్షీణ పుణ్య ... కాశీ 7 9.

**వ్రేఁచేఁడు** వి (వ్రే + చేఁడు) గొల్లల రాజు, శ్రీకృష్ణుఁడు

గీ. జడల క్రొన్నెల మెడఁ జావ సరముఁ దొడలఁ, దొడల తోల్మైన వెలిమిడి పూఁతమించఁ, బొడమె వ్రేఁచేని ముందటఁ బొడవు చూపఁ, బొడవులందెల్లఁ బొడవైన బోటువేలుపు ఉ. హరి 2 171

**వ్రేలఁజూపు** స. క్రి. (వ్రేలన్ + చూపు) చూచిన వారందఱును నింతా గర్వముగా వీఁడిట్టివాఁడని వ్రేలితో నితరులకుఁ జూపు.

క అతఁడు కళింగోద్భవుఁడగు, కతమున నో వ్రేలఁ జూపఁ గనుగందక యోగ్యతమ స్వీకారమునకు, నితరుండై యుండె ముని తులేశ్వర వింతే. పాండు. 3. 17.

వ్రేలఁ జూపించుకొను = చూచిన వారందరు నితఁడిట్టివాఁడని చేతితో చూపునట్లు ప్రవర్తించు

సీ ఎన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ జూపించు కొనక ప్రస్తుతికి నెక్కి ... కళా. 3 228.

**వ్రేలఁబడు** అ. క్రి (వ్రేలన్ + పడు. స్వార్థమున) వ్రేలాడు

ఉ. నాలుక బంతి వ్రేలఁబడి నంజువఁబోఁగ ... మనుచ. 5 50

సీ. కొర్ల వ్రేసిన గ్రుచ్చుకొని వ్రేలఁబడు వారు నుప్పు రొంపులఁ గ్రుక్క నురియువారు ... కవిక. 5 118.

**వ్రేలాడు** అ. క్రి. (వ్రేలి + ఆడు.) వ్రేలఁబడు.

గీ. చిక్కి వ్రేలాడు నంటములు చేతిగోల, కుంటునడకయు నంచూపు కూఁత వినికి, వచ్చువడఁ బెద్ద బ్రాహ్మణుఁడై మహేంద్రు, డడిగె దర్గత రవ మునన న్నమత. శేష 1. 128.

**వ్రేలాడుచు** అ క్రి వ్రేళ్ళ నాడించు.

క పలిన వాని ధనంబులు, జాలురు బంధువులుఁ దారు బ్రదికిన దినముల్, వేలారిచి తింద్రా తని, యోలముగని పిదప క్షితి నొదుగుదు రాజన్. భా. విరా. 4 217

**వ్రేలిమి** = వేలిమి వి హోమము

క నాలుగు దినాలు విప్రుజపాలు విధానాలు భోజనాలును మేలిన్, వ్రేలిమి గలుగఁగ ముదముల, వ్రేలి మిగుల నవల నాగ వ్రేలి మొనరపన్. ముకుంద. శ. 236

**వ్రేలిమిడి** వి (√వ్రేలు) చిటిక, త్రుటి.

గీ...భావజాస్త్రిభి హరి మహా దేవుఁడొక్క, వ్రేలిమిడిఁ బెంపునెడి కడు విరళి గొనియె కు సం. 5 5 4

సీ. హరిఁ దత్తుమే...

గీ ఎట్టివారికైన, నొరుల నొక వ్రేలిమిడిఁ దిరుల్ మరులుగొలిపి, దివియమే దేవి సీయట్ట దీము గలుగ. కు సం 6 674.

**వ్రేలిమి గావించు** స క్రి (వ్రేలిమి + కావించు) (అగ్నికి) ఆహుతి సేయు, కాల్చు

సీ విడిముడి పట్టులు వ్రేలిమి గావించి మల్లెసాలలు బిట్టు మండఁజేసి... అచ్చ రా. సుం 177.

**వ్రేలియాడు** అ క్రి. (వ్రేలి + ఆడు.) వ్రేలు, వ్రేలాడు

ఉ...శా, భాసలి వ్రేలి యాడెడు మహోఫలముల్... నైష 5. 79

**వ్రేలు** = వేలు అ. క్రి 1 వ్రేలాడు, అంబమానమగు.

అ విస్తృత కేశ భరము వ్రేలంగ ద్రౌపది సనియె భార సభా 2 301

గీ విపుల శాఖ నాయుధములు వ్రేలఁగట్టె ... భార. విరా. 1. 174

క. రేలుం బగలును మొగమున, వ్రేలుచుఁ బతి వాయకున్న వ్రేఁగుననో...కు సం. 5. 650

(మొగమున వ్రేలు = కనులకు కట్టినట్లుండు)

2 విడువక ఉండు.

ఉ. మాలని చేఁతనైన వినుమానిని దానములోలిఁ గొందు దు, శ్శీలతచే దురన్నము భుజింతు నబద్ధము లాడుచుందు నే, వేళల నేటి గట్టుకడ వ్రేలుచుఁ జేతులు చాఁతుఁగాసుకై, తాలిమి రెండు మూఁడు విడుతల్ గుడుతుంబురిఁ జైత్ర కాన్నముల్. జాహ్నవి 4. 116

గీ. సోఁకు మూఁకల గొంగ మెచ్చు గనుదాళి, బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగవలుత, వ్రాడు గట్టక సొగసెల్లఁ దటిమి యొడల, వ్రేలు వలరాచ బలు బూచి వీడఁగలదె. నీలా 1. 103

3. మునుఁగు

వ...భీమ మండలంబు దర్శింపుదము, సప్త గోదావరంబున నాడుదము, వృద్ధ గంగాజలంబుల వ్రేలుదము, తుల్యభాగాతోయంబుల మునుఁగుదము.. భీమ 6. 106

(శ ర. పా 'జలంబులఁ దేలుదము' ముద్రి పా)

వి. జొ 1. అంగుళి

(బ • వ్రేళులు, వ్రేళ్లు, వ్రేలులు, వ్రేళ్లులు)

గీ కుడుము నెడ వాని పెనువ్రేలు కూటిలోన, దునిసి పడియున్న వ్రేల్ పుచ్చి తోయజాతు... భార. ఆది 7. 256

ఉ. డపిఎ జనించె వ్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె. .భార. విరా 1 148.

గీ...వేణువుపై వ్రేళ్లు మార్చి మార్చి, మరుబు కొలిపితె.. ఆము. 5. 67

సీ. వ్రేళ్లులు గఱవంగ వెర వల్వరించిరో నోరఁ జేతులు గ్రుక్కి నొల్లునాఁడ...నిర్వ 1 40.

సి. మేనమే నాత్మజా మానినీ రత్నంబుఁ గేలి కురంగంబు గేలి వ్రేల . భీమ. 1. 79.

గీ. వ్రేళ్ళ మహనీయ రత్న ముద్రికలు దాల్చి, పచ్చల కడెంబులును సరపణులు బూని ... కవిజ. 3 11.

2. అంగుళము, అంగుళ ప్రమాణము.

గీ. పసి గాండివి కురుసేన నెగువ నతని, వారువెఱవక భీష్మునిఁ జేరి యొడల, వ్రేలెఁ డెడ లేని యట్లుగ వివిధ భంగి, నిష్ఠురాస్త్ర శస్త్రములని నించి రథిప భార. భీష్మ. 3 411.

క. ఇనుమున నేఁబది పలములు, నెనిమిది వ్రేళ్ళా యితముగ నేర్పడ గుండై, నునుపై యుండఁగఁ జేసిన, మనమున నిది ముద్దునకుఁ బ్రమాణం బయ్యె విజ్ఞా 3 118

వ్రేళ్ళుకఱచు = తమ తప్పు నొప్పుకొనుటను సూచించు

సీ సాహసంబులు మాని సంత్రాసములు బూని పఱచు వారును వ్రేళ్ళు గఱచువారు ... వరాహ 3. 47

వ్రేలు మడచి చెప్పు = లెక్కించి చెప్పు.

క...రాజ్యం బెవిధిఁ గ్రమ్మఱు నావెర, వీవెరవని వ్రేలు మడిగి యేరపడఁ జెపుమా. ఆము 3 44.

వ్రేళ్ళ సందులను జాఱెడువారలు = సులభముగా మోసపోవువారు, తెలివి తక్కువ వారు.

ఉ. ఏల బజాటి అంతులివి యెవ్వరు మెత్తురు నోరి లోపలన్, వ్రేలిడి నప్పుడున్ గఱవ నేరఁడు నీ సుతుఁ డడ్డపాపగాఁ, డేఁ లితాఁగి నీ వనక యేరిక నందురె యాయెఁబోమ్ము చాల్చాలును వ్రేళ్ళ సందులను జాఱెడు వారలు లే రిలెవ్వరున్ సారంగ 3 58

వ్రేలుకాడు అ క్రి. (వ్రేలుక + ఆడు) వ్రేలాడు. (శ. ర)

వ్రేల్చు(లుచు) = వేలుచు స క్రి. 1. హోమము చేయు

క. మనుజులలో నెవ్వఁడు దగ, దనవాఁడను వాఁడు దుష్ట ధరణీశునకున్, దనకై వ్రేలిమి వ్రేల్చెడు, జనుని తనువుగాల్చు వాయు సఖుఁడ దయుండై ... భర్తృ 1. 47.

మ. ... సముద్రగ జ్వాల మౌవహ్ని దుర్భరంబై వ్రేల్చెడి హోతనైన సహింపం గాల్పఁ గాదే ... మల్ల భూ 1 47

2. దహించు, కాలుచు

వ. కుసుమ శరు శరీర భసిత చూర్ణంబు శరీరంబునం దాల్చి నా మేను విభావసు నందు వ్రేల్చెద హర 3. 93.

3. వ్రేలఁజేయు

ఉ వెన్నెల రాకకై మొగము వ్రేల్చు చకోరము భంగి జారుఁ డో, కన్నులఁ గల్గు నిద్ర కడ కన్నులఁ గూర్పక యెప్పుడెప్పు వచ్చునన్నను డాయునం చెదురు చూచు .. వేం పంచ. 1 257.

**వ్రేలుచెవి** వి (వ్రేలు+చెవి.) చెవియొక్క వ్రేలాడు భాగము, తమ్మె.

శా. భామాయోజిత కుండలాభరణముల్ భామావలంబంబులై, భూమీ వల్లభ మూను వ్రేలు చెవులం బొల్పారె ... నైష. 6. 54.

**వ్రేలుడు** విశ. (√వ్రేలు.) వ్రేలాడునది, లంబమానము.

సీ కరము వ్రేలుడులైన కర్ణపాశంబులఁ దోరంపు బోఁగులు దొడిగినారు ... నైష. 7 63.

గీ. .. వ్రేలు డగు బొజ్జగల బూరిగాలి వాని . ఆము 6 19

**వ్రేలుఁగొ(ల్గొ)మ్మ** వి (వ్రేలు+కొమ్మ.) వ్రేలాడు కొమ్మ, లంబమాన శాఖ.

సీ. తప వ్రేలుఁ గొమ్మలు మునులకుఁ గల్పిత పర్ణశాలా కలాపములు గాఁగ కాళ. 3.198.

గీ. చింత వ్రేల్గొమ్మ వంచుక సిగనుగట్టి, విడిచి యుఱికితి నయగారు మిడిసి కూయ ... హంస. 3. 144.

**వ్రేల్మి**=**వ్రేలిమి** వి. 1 హోమము

సీ నాల్గు కన్నుల వేల్పునకు వ్రేల్మి లెన్నేని జేసి మేలేమియు జెందకున్న ... అచ్చ రా. బాల. 54.

2. యజ్ఞము, జన్నము

గీ అనుచు సనిచిన ప్రేముడి వాడ వచటు, గదలి వదలని వేడ్కలఁ బొదలివార, లరిగిరిమ్మల కిమ్మల నంతబంతి, తేర్ల దొర వ్రేల్మి నెఱిఁగడ తేర్చియున్న. అచ్చ. రా బాల. 73.

చ అన విని మేఘనాదుఁడను వట్టిదయేని మహోత్మ వైరితో, నని యొనరింపఁగా వఱసినప్పుడు వ్రేల్మి యొనర్చి హోమవహ్నిని జనియించు దివ్యరథ మెక్కినచో నమరత్వ మొందనిమ్మ.. ఉ రా 5. 17.

**వ్రేలుమి(ల్మి)డి** (వ్రేలు+మిడుకు) (వ్యుత్పత్తివర్ణలోపాదులు) చిటిక, త్రుటికాలము

గీ. కెరలి నెత్తురు గ్రాలుచుఁ గేళి సలిపి, వ్రేలుమిడి నబ్బలము నెల్ల నేలఁ గలిపె ... మార్క 6. 106

ద్వి కడఁగి శ్వేతునకట్టు కాలుని వ్రేలు, మిడిలోనఁ జంపు చెన్నొదియవలలీల .. పండితా. వాద. 225.

చ. విజయుఁడు వారినెల్ల నొక వ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక, వ్రజము నతంచియున్ ... భార. విరా. 5. 174.

చ. ... ప, కొలఁదులఁ బోకకట్లు దలకొన్న హుతాశనుఁ డంతలోనఁ బూవిలుతునిఁ జుట్టుముట్టుకొని వ్రేల్మిడిలో నొనరించె నీఱుగన్. హరి ఉ 6. 65

క వడి మృగరూపముఁ గైకొని, చెడిపాఱెడు యజ్ఞపురుషు శిరముఁ దెగన్ వ్రేల్మిడిలోన నేసి చంపెను, గడు వీరుఁడు వీరభద్ర గణనాథుఁ డజా. శివ సా 313, ఆం. భా. 8 30.

**వ్రేల్మిబొట్టు** వి (వ్రేల్మి+బొట్టు) అగ్నిహోత్ర భస్మముచే నొసట ధరియించు బొట్టు.

సీ. గీ. వ్రేలుసిక దూలు దర్భ పవిత్ర మొప్పఁ, బట్టె వర్ధనము వ్రేల్మిబొట్టు దనర, నల్లనల్లన బలియున్న యాగశాలఁ, జేర జనుదెంచెఁ గపటపుఁ జిన్నివడుగు. పద్మ 7. 167

**వ్రేవంకనామము** వి (వ్రే+వంక+నామము.) గొల్లలు పెట్టుకొను వంకర నామము.

ద్వి తలిరుఁ బోఁడుల మానధనములఁ దివియు, నలినాస్త్రచోరు కన్నపుఁ గత్తి యనఁగ, యామినీ పతిదాల్చునట్టి వ్రేవంక, నామమో యనఁ దోఁచె నలివారి యపుడు. అ. మ శ. 3. 144 పా. 8 పం

**వ్రేవాడ** వి (వ్రే+వాడ) గొల్లపల్లి.

ద్వి వేయేల వ్రేవాడ వెన్న ముచ్చిలఁగ ... బస వు. 6. 880 పం.

## వ్రై

**వ్రైహేయము** సం విశ (అ. ఈ. అ) 1 వరిపంటకుఁ దగినది 2 వరిపైరు పెట్టినది, వరి చల్లిన క్షేత్రము

వి అ న వరిపొలము, వరి పండుటకుఁ దగిన పొలము.